# దేవుడు లేడా?



mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

సత్పురోహిత గ్రంథమాల — ౧౩ వ కుసుమము

# దేవుఁడు లేఁడా?

*

గ్రంథకర్త:

పి. యస్. ఆచార్య

*

ప్రకాశకులు:

అన్నే వెంకట్రామయ్య

తోట్లవల్లూరు - (కృష్ణా)



[వెల రు 2-0-0.

# విషయసూచిక

పుట

ఓమ్

# దేవుఁడు లేడా?

## ప్రవేశము

ఈ సృష్టియం దనేకవిధములయిన మానవు లగపడుచు న్నారు. స్వభావ, ఆచార, విచార, కర్తవ్య, ఆకృతి మొద లుగాగల సమస్తవిషయములందు భిన్నత్వ మగపడుచున్నది. కావున నీప్రపంచమునం దాస్తికులున్నటులే నాస్తిక పంథాను యాయులును గలరు.

ఈశ్వరుడు కలడని కొంద అంతఃకరణ పూర్వకముగా నొప్పుకొనకపోయినను ప్రపంచ లౌకిక వ్యవహారానుసారము నడచుటకై ఒప్పుకొనుచున్నారు. కొందఱు ఈశ్వరు డున్నా డనుటయును లేదు, లేడనుటయును లేదు. ఈశ్వరు డున్నాడని, లేడని వాదవివాదము లొనర్చి, మనస్సున కాందోళన కలుగ జేయుటవలన నేమి ప్రయోజనమని కొందఱనుచున్నారు. ఈశ్వరుడుంటే నేమి, లేకపోతే నేమి ఏది మంచిదని తోస్తే దానిని చేయుటయే మానవకర్తవ్యమని కొంద అంటున్నారు. కొంద అంతఃకరణశుద్ధిగా ఈశ్వరుడు లేడని విశ్వసించకపోయి నను సామాజిక, సాంసారిక వ్యవహారములకొఱ కీశ్వరుడు లేడను చున్నారు. కావున నిట్టి భిన్నాభిప్రాయములు గలిగియున్న యీసమయమున ఈశ్వరునియొక్క అస్తిత్వమునుగూర్చివిచారిం

-చుటకు ముందు వేదములయొక్క అపౌరుషేయత్వమును గూర్చియు పరిణామవాదమును గూర్చియు విచారించుటత్యం తావశ్యకమని తోచుచున్నది. ఏలయన నాస్తికత్వమునకు మూలము వేదములయొక్క అపౌరుషేయత్వము, పరిణామవాద మునైయున్నవి.

ఆర్యుల ప్రాచీనతమ యితిహాసమునందు మానవుల (ఆర్యజాతి, పుట్టుకతోపాటే వేదములుకూడ జనించినట్లు ప్రమాణము లనేకములు లభించుచున్నవి. లోకమాన్యతిలకు, ఉమేశ చంద్రవిద్యారత్న, నారాయణ భగవాన్ రావు పావగి, అవినాశ చంద్రదాసు మున్నగు మహావిద్వాంసులు పాశ్చాత్యులు నిర్ణయించిన వేదకాలనిర్ణయము సరియైనది కాదనియు, వేదములు హిమయుగమునకంటె పూర్వము లక్షలకొలది పురాతనము లనియు, ప్రకరణాంతరముగా నిర్ణయించిరి. కాని ఈవిద్వాంసు లెచట పాశ్చాత్య సభ్యత మాయాజాలమునుండి తప్పించుకొని వేదములు లక్షలకొలది వర్షములు ప్రాచీనములనియు, భారతీయ సభ్యతయే ప్రపంచమంతట వ్యాపించెననియు, సిద్ధాంతపఱచుటలో కృతకృత్యులైరో అచటనే వారు పాశ్చాత్యవిజ్ఞాన పంకిలమున గూలబడిరి. వీరికిట్టి భావములు జనించుట ఆర్యజాతికే కాక మానవజాతి కంతకు మిగుల హానికరము. ఏలయన వేదములయొక్క పౌరుషేయత్వము పరమేశ్వర, పరలోక, ఆత్మలతో సంబంధము గల మిక్కిలిమహత్త్వర సిద్ధాంతములను ఖండించుచున్నది. ఆస్తికత్వమునందు వేదములను అపౌరుషేయ విజ్ఞానమని యెను. అపౌ

రుషేయజ్ఞానము వినా పరలోకవిషయమేదియు విశ్వాసపాత్ర
ము కాజాలదు. పరలోకముపై విశ్వాసము లేకుండుటయే నాస్తి
కత్వము. నాస్తికత్వము మానవున కెంత హానికారియో చెప్ప
శక్యముకాదు. తిలకువంటి విద్వాంసులుకూడ క్రమోన్నతి -
పరిణామ సిద్ధాంతమున బలియగుట మిక్కిలి శోచనీయము.
ఈ దారుణ దుఃఖపరిణామమునకు కారణము పాశ్చాత్యనివృత్తి
పై గల దృఢవిశ్వాసమే. పరిణామవాదము అపౌరుషేయత నొప్పు
కొనదు. అది మానవునియొక్క ప్రతియున్నతిని క్రమోన్నతి
యని విశ్వసించుచున్నది. కావుననే వేదములు కోట్లకొలది సంవ
త్సరములు పురాతనములైనప్పటికిని, మానవుల ప్రాదుర్భా
వముతోపాటు వాని యస్తిత్వ మున్నప్పటికిని అవి అపౌరుషే
యత్వసిద్ధిని బడయజాలకున్నవి. కావున నట్టి వేదవిజ్ఞానము
యొక్క అపౌరుషేయత్వమున కడ్డుతగులుచున్న పరిణామ వాద
మును నాస్తికత్వమును గూర్చి యిక విచారింతము.



# దేవుఁడు లేడా?

## పరిణామవాదము - పాశ్చాత్యులు

పాశ్చాత్యులకు విజ్ఞానము వృద్ధియగుచున్న కొలఁది ఆదిని సృష్టి - మనుష్యాదు లెట్లు కలిగిరను ప్రశ్న బాధింప సాగెను. తత్ఫలితముగా ద్వివిధనిర్ణయము లిపుడు కనబడు చున్నవి.

ఒకటి:— ఈ సృష్టికంతటికి మూలకారణ మీశ్వరుడు.

రెండవది:— పరిణామము జెందుచు ప్రాణులు స్వయముగ నీదశకు వచ్చెను.

రెండవ సిద్ధాంతమువారు పరిణామవాదు లనబడుచున్నారు. డాక్టరు చార్లెస్ డార్విన్ పరిణామవాదబ్రహ్మ. లాయల్, హైగల్ మొదలగు వారెందరో దీనికి పోషకులైరి. వారందఱు మనపూర్వులకంటె క్రమక్రమముగా మన మున్నతిని పొందగలిగితిమని భావించిరి. జార్జి. ఐ - రోమనెస్, ఎం. ఏ. ఎల్. ఎల్. డి. యఫ్. ఆర్. యస్. అనువారు "ఈశ్వరుడు మానవుని బాహ్యపరిస్థితుల కనుకూలముగా అకస్మాత్తుగా నెట్లు సృష్టించ గలిగె" నని ఆస్తికులకు నిర్భాంతిపడుచు ప్రశ్నించెదరు.. కాని వారినే కనీసము పదివేల సంఖ్యల

కిటీవల వర్తమానజాతియందు కలిగిన పరివర్తనమును జూపుడని ప్రశ్నించిన మౌనమువహించియు నూరకొనజాలక ,, జీవనపు వికృతదశల కారణములచే పూర్వము పనిచేయు నంగము నష్టమైపోవుటగాని, నిరుపయోగమగుటగాని, జరుగుచుండు నని ” యనెదరు.

వీరికంటె నింకొక యడుగుముందునకు వైచి టి. హెచ్. హాక్సలేగారు “ కొన్ని ఆకృతులు ( Persistant types ) స్థిరములనియు, సృష్టిమొదలుకొని నేటివఱకు వానిలో మనము చెప్పకొనదగినంతమార్పు లేమియు కలుగలే ” దని చెప్పిరి.

R. Conder D. D. గారు డార్విన్ వాదమును విమర్శించుచు నిట్లు వ్రాసిరి.

“ పశువే మానవుడుగా పరిణమించెననుట భ్రాంతిమూలకమేగాని ప్రమాణ ప్రమితమగు సిద్ధాంతముమాత్రము కాజాలదు. స్వాభావిక స్పర్థాప్రవృత్తులే పరిణామమునకు మూలకారణములని తలచుచో చిన్నచిన్న మొక్కలు ప్రాత కోటలలో, గోడల మధుళ్ళ మీద, సముద్ర తటములలోను నొంటరిగా మొలచుచున్నవిగదా! అక్కడ వానికి స్పర్థ ( Compitetion ) యెవరితో నని యూహించవలసియుండును ? మత్స్యమునుండి మిగతా ప్రాణులు వికాస మొందియుండు నేని నేటి మత్స్యసంతానమున మార్పేమియు గోచరించుటలే దెందులకు ? హోవరు, ప్లేటో, డేవిడ్, పౌలు, షేక్స్పియర్ మున్నగు విద్వాంసుల కాదిపిత మత్స్య మెట్లు కాగలుగును ?

సృష్టికర్తను అంగీకరించు బుద్ధిమంతు లెవరును, ఈ వనస్పతులు, ఈ పశువుల యుపజాతులును శూన్యమునుండి ప్రాదుర్భూతమైనవని విశ్వసించజాలరు. బల్లిగుడ్డునుండి పిట్టను పుట్టించి చూపించినపుడీ పరిణామవాదము స్వీకార యోగ్యము కాజాలదు. నేటి జంతుజాలమునుండి క్రొత్త జాతులు పరిణమించుటను జూపలేకున్నమానె. అట్టి పరిణామము ననుమానించుటకు వీలగు ఉదాహరణములనైనను చూపుడని కేండరుగారు భుజాస్ఫాలన మొనర్చి యడిగిరి.

E. Ray. లేంకెస్టరు, ఎం. ఎ. ఎల్. ఎల్. డి. యఫ్. ఆర్. యస్. గారు, 'వృద్ధియే పరిణామలక్షణ' మనే మూల సిద్ధాంతమును ఖండించుచు, ఉపచయాపచయములూ, వృద్ధి క్షయములూ, జగత్తున చక్రనేమి క్రమముగా వచ్చుననియు, ప్రపంచచరిత్రయే దీనిని బలపరచుచున్న దనియు నుడివిరి. మరియు పాపమునకు నసత్యమునకు ఆకరమైన నేటి లోకస్థితిని ఉపచయలక్షణ మని యెంచుట తగునా యని ప్రశ్నించిరి.

G. Richey. ఎం. ఎ. గారు, డార్విన్ వాదము నందలి దోషముల నెన్నింటినో వెల్లడించిరి.

౧. పరిణామధర్మముచే నెల్లప్పుడు నేదియో యొక యుపజాతి క్రమవికాసము చెందుచున్నదనే నిర్ణయము సిద్ధాంతము కాజాలదు. ఉన్నతితోపాటు సర్వకాలముల యందు నవగతి వెన్నంటియే వచ్చుచున్నది. ఈ ధర్మమువలననే మానవు డధోగతినుండి తప్పించుకొనగలుగును.

౨. దుర్బలునకు నిలువ నీడ లేదనే మత్స్యన్యాయము (Survival of the fittest) డార్విను వాదమున కంగమైయున్నది. కాని స్వభావస్వధర్మనియతము లగు ప్రాణులకు తత్తదుచిత ములగు బ్రతుకుతెరువుల నీశ్వరుడే ఏర్పాటుచేసియుండెను.

3 స్వాభావికవివరణము (Natural Selection) అనే పైన చెప్పబడిన క్రూరవిధిగాదు. నియమపూర్వక రచన యనుటయే సరియైన వివరణము.

౪. డాక్టరు A. Sagray గారికి డార్విన్ద్వార ఒకజాబు వ్రాసెను. అందాతడు సృష్టిరచనయందొక నియతిగాని, పరోపకారముగాని గోచరించక పోవుటయేగాక నరకకుండ ముగా ప్రతీతమగుచున్నదని వ్రాసెను. దీనిని ఖండించుచు వారిట్లు చెప్పిరి.

౫. స్పర్ధ, సంఘర్షణలు రెండును "బలము గలవాడు బలహీనునిపై నత్యాచారమొనర్చునను డార్విను వాదము"ను స్వీకరించినట్లయిన మానవసమాజమున నవి వృద్ధియగును. అనియమితస్పర్ధచే ప్రాణికోటి పరస్పరనిహతమై మొదటికే మోసమువచ్చి సృష్టిస్థితికే హానికలుగును.

Thonas Sunisolen Strange గారు డార్విను వాదమును పూర్తిగా ఖండించిరి. మిక్కిలి శ్రద్ధగా వారు డార్విను వాదమును పరిశీలించి విశ్వసనీయము కాదని నిర్ణయించిరి. డార్విను మతానుసారము సమస్తప్రాణులకు మూలమొక సాధారణ శరీరము. కాని నిత్యము ననేక విధములైన జల

జంతువుల పుట్టుకను మనము గాంచుచున్నారము. అందొకటి దానినుండియే పెక్కుమార్పులు కలుగుచున్నటు లగుపడుటలేదు. వానియం దేమాత్రమును పరస్పరసంబంధము కనబడుటలేదు. భూమిమీద భిన్నభిన్న స్థలములందు పుట్టుచున్న వనస్పతులు కూడ నొకే వస్తువునుండి పరివర్తనము జెందినట్లు ఋజువు చేయుటలేదు. డార్వీను వాదము మిగుల బలహీనమైనది. అదు గడుగన నా పత్తియే కావున పాప మాతడు క్రొత్త క్రొత్త కల్పనల నాధారము జేసికొనవలసి వచ్చెను. వంధ్యాత్వము, భిన్న భిన్న జాతులయొక్క నియమరహిత సంగమము (కలయిక, పోలిక) నం దాటంకమును కలుగజేసి పూర్తిగా ఖండించుచు నానా జాతులను వేఱు వేఱుగా విడదీయుచుండ జాతులయందు భిన్నత్వమును రూపుమాపి ఆ భిన్నత్వమును డార్వీను సాధింప చును.

జాతిభేద ముండుట వలననో, రోతవలననో, భిన్నజాతులు పరస్పర సంభోగమున కియ్యకొనుటలేదు. ఒకవేళ సంగమించి సంతానమును గనినను వానికి మరల సంతానము గలిగి వంశము ముందునకు నడచుట లేదు, నడువజాలదు.

డార్వీను తన పరిణామవాదమును బలపఱచుకొనుటకై రేగుపండ్లవృద్ధి నుదహరించి, పావురములను మార్పుజేయుచు, కాకులుగాగూడ చేయగలమని నుడివెను. ఇటులనే యొక జాతి నుండి యింకొకజాతి పరివర్తనముజెంది యుండవచ్చునని వా రనెదరు. కాని ఆ యా జాతుల మధ్యనుండు లింకులు కనబడుట

లేదు. గాన నవి నశించిపోయి యుండవచ్చునని మిగుల సులభ మైన కల్పనమొకటి చేసికొనెను.

స్వరూపమున సామ్యముగల కోతులు, అడవిమనుష్యులు, మానవులు నొక్కటేయని పరిణామవాదము యొక్క అంతిమసిద్ధాంతమున కాధారము. ఇందు మొదటి ప్రాణిపీత (ఎంద్రిక) ఈవిధముగా ప్రపంచమంతయు నొకే ప్రాణియొక్క రూపాంతరములని తలంచుచో వనస్పతులకు, పశువులతోను ఖనిజములకు వనస్పతులతోను సంబంధము కలుగజేయ వల యునుగదా! వీనియన్నింటి మార్పులకు (Natural Selection)అనే ఇంద్రజాలమును వీరు ఆశ్రయించిరి. అనగా ప్రతిప్రాణియు తన బరిసరముల కనుగుణముగా పరిణామము చెందునని దీని కుదాహరణముగా నీటియం దీదుట కుపయోగించు పరికరమునే స్థలమున నడచుట కుపయోగించు ఫెగ్విన్ అను పక్షివిశేషమును, ఎగురుచేపను చూపెదరు.

వీనివికాసమునకై అసంఖ్యాక రూపాంతరములు కల్పన జేసిరి. ఆ రూపాంతరములయందు పరస్పర సంఘర్షణ మొనర్చుకొని శక్తిమంతములు జయముపొంది నీటియందు శ్వాస దీసికొను నియమము నుల్లంఘించి స్థలవాసులై నిరుపయోగమగుటచే రెక్కలను, తోకలను, వదలిపెట్టి రోమములను ధరింప సాగెనను విచిత్రకల్పనల నాధారము జేసికొనిరి. ముత్యపుచిప్ప పక్షిగా మారెనను కల్పనయు, లేక ఈగ యేనుగుగా మారెనను కల్పనయు మిగుల విచిత్రముగనుండును. మఱియు పరమాద్భుతమగు చక్షురింద్రియ మెట్లు క్రమపరిణామ మొందెనో

గోచరమగుటలేదు! కావుననే యుక్తిశూన్యమైన యీ దోష మును బలపఱచుకొనదలంచి డార్విను అటు లగుటయు సంభ వమే యనెను.

అనేక దృష్టాంతములవలన, వికాసమునొందు సమయ మున కేవల మున్నతినేగాక యవనతిని గూడ పొందుచున్నట్లు తెల్లమగుచున్నది. డార్వినుపీతను ఆరంభమున స్వతంత్ర గతి గలిగిన ప్రాణిగానొప్పుకొనుచు దానినుండియే వనస్పతి అథవా కొండలలోనుండు (Polype) అనేక భుజములుగల జంతువు కలిగె ననెను. కాని యిదియంతయు కేవలము నిరాధార కల్ప నయే. సర్వవ్యక్తు లొకే ఆదిబీజమునుండి వికసించినవను కల్ప నా ప్రపంచమును నిర్మించుకొనెనను బుద్ధివాదముమాత్రము కాజాలదు.

ఆయా భోజనపదార్థములు పుట్టినతరువాతనే వానిని తిను ప్రాణులు రచించబడెనని అందరు అంగీకరించవలసి వచ్చును. అయితే మానవునిపై నాధారపడియుండు జీవము లీపరివర్తన నియమానుసారమే యుత్పన్నమై యుండెనా లేదాయని ప్రశ్నిం చుచో డార్వినుమతానుయాయులు జవాబుచెప్ప సాహసించ గలరా!

డార్వినుమతానుయాయి విద్వాంసులలో (Dr. Straws) గారొకరు. పరికల్పన, వాదన, మరీవిచిత్రము. అదెద్దియన— ఆదిని శృంగశూన్యములును, బలము గల విశాలమైన మెడలు, నొసళ్ళుగల జంతువు లుండెను. ఆ సమూహముమీద పశల ప్రాణులువచ్చి యాక్రమణ మొనర్చెను. అపు డవి యన్నియు

వానితో పోరాడసాగెను. తలతో డీకొనుచు నాత్మరక్షణము జేసికొను చుండెడివి. ఈవిధముగా నాసంఘర్షణవలన నొక దాని నొసలుమీద మురికి పేరుకొనుటచే దానివలన కొమ్ము గుర్తు లేర్పడెను. అంతట నాప్రాణి కాత్మరక్షణ సులభమై పోయెను. చిన్నచిన్న కొమ్ములు గలవన్నియు హింస్రకజాతివలన నాశమొందినను పెద్దపెద్ద కొమ్ములు గలవి మిగులును గాన నవి తమమాదిరి సంతానమునుగని తమజాతిని వృద్ధిజేసికొనెడివి" అనుచు తమ సిద్ధాంతములను నిలబెట్టుకొనుటకై అత్యంత ప్రయాస పడెను. ఈవిధముగ నతడు శరీర పరివర్తనమునకు స్వాభావిక జ్ఞానమును మరియు స్వభావమును కారణములుగా చూపించిరి. కాని యింతమాత్రమున నావాదన ఋజువై సిద్ధాంతము కాగలిగెనా? నొసటియందలి యెముక బలపడి కొమ్ముగా వచ్చెనని తలచినను కొమ్ము ఉన్నతినొందుచు తుదకు రెండుగా నెందుకు నిలచిపోయెను? అందు వాని రెండుకొన లొకానొక శిల్పి తయారుచేసినట్లును చివర సన్నముగా పోతపోసినటు లే విధముగా తయారయ్యెను? నొసలంతటను పొదవలె జనింపక రెండుకొమ్ములే పుట్టనేల?

ఇటులనే స్ప్రింజీగా రీవాదనయందలి దుర్బలత్వమును మిగుల బాగుగా నిరూపించి యుండిరి. John Beatie crozier గారు 'Civilization and progress' అను గ్రంథమున దీనిని ఖండించుచు దీనివలన మానవ సమాజమున సదాచారము లేక న్యాయాచరణ వ్యాపించుట కెంతమాత్రము అవకాశము లేదని మిక్కిలి స్పష్టముగా నిరూపించిరి. వారి వాక్యములనే కొన్నింటి నిచట నుదహరించుచున్నాము.

"పదార్థముల వాస్తవిక స్వరూపము మన కగోచరమనిన భూతకాలగుహాలయందు లీనమై యున్నదనిన నావస్తువు లెట్లు తయారయ్యెను? అని విచారించవలసియే యుండును. గాని పరిణామవాదమునందు సత్యమున్నదని భావించ వీలులేదు. ఏలయన పరిణామవాదము వాస్తవముగా నవి యెట్లు నిర్మించబడెనో చెప్పజాలకున్నది."

పరిణామవాదము నిమ్న శ్రేణిజీవులు వికాసము నొందుచు నుచ్చశ్రేణి శరీరములవరకు తిరుగుడుదారినుండి చేరినవనియు నేచటను ఒకలంకె (లింకు) కూడ ఘారబడలేదనియు చెప్పుచున్నది గాని తుదకు వివశమై ప్రకృతి ఆత్మల మధ్యనున్న మహాదంతరమును కలుపజాలక నిర్విణ్ణ యగుచున్నది. ఏలయన పరిపూర్ణములని తలంచబడు తన ప్రతిజ్ఞలన్నియు మిథ్యలగుచున్నవి. దీనికి వ్యతిరేకముగా న్యాయమైన నియమము సృష్టి సర్వత్ర సామాన్యనియమములద్వారా జరిగెనని ఋజువుచేయుచున్నది. కలియుటకు వీలుగాని స్థలములందు కలుపుటకు గాని, గూఢవ్యాఖ్య లొనర్చుటకుగాని యేమాత్రము తల పెట్టుటలేదు. ఆత్మయొక్క ఉచ్చగుణములను, ప్రాకృతిక గుణములనియే పరిణామవాద మనుచున్నది. ఆత్మప్రకృతుల రెంటికి భేదముచేయక యేకమొనర్చుచున్నది. మానవసమాజానుభవ జన్య విజ్ఞానమునకు విరుద్ధ మిది.

పరిణామవాదమున మానవుని యాశ యేనాటికైనను పూర్తియై సదాచారము, సానుభూతి, ప్రేమ మున్నగు సద్గుణము లుచ్చశిఖరము నధిరోహించ గల వను విశ్వాసమును జనింప

శ్రేయగల విషయ మేమున్నది? కోతుల తుములయుద్ధము
క్రూరత్వసమన్వితప్రేమ తనకంటె నుచ్చజాతిమానవునే
నిర్మించగలిగినదనియు, నిమ్నశ్రేణిని పుట్టించియుండలేదనియు,
చెప్పగల యాధారము పరిణామవాదమునం దెచటనున్నది?
ఉచ్చప్రాణులు స్వాభావికముగనే సదాచారులుగా నుండు నను
టకు ప్రమాణమేమి? సర్వవిధముల నధోగతికి దీసికొనివెళ్ళు
నవేగాని, యున్నతికి దీసికొని పోజాలనివగు నీపోట్లాటలు,
యుద్ధములు, ఇంద్రియలోలత్వములు, క్రూరుడగు మానవుని
సభ్యునిగా నిర్మాణము చేయగలవని నమ్ముటెట్లు? బలనియ
మానుసారము పశువులలో జరుగు సంఘర్షణ యున్నతిజెంది,
మానవ సమాజమున పెంపొందుచున్న ధర్మనియమముగా
మార్పినదనుటకు సభ్యజాతులన్నియు నాకర్షింపబడు నుత్కృష్ట
ధర్మముగా మారగలిగినదనుటకును, పరిణామవాదమునం దేప్ర
మాణము లున్నవి? సంక్షేపముగా చెప్పవలయునని అత్యంత
క్రూరత్వము స్వాతంత్ర్యముగను, దాస్యము స్వచ్ఛందము
గను, స్వార్థము పరోపకారముగను, బలము ధర్మముగను,
భయ మాదరముగను, కామాతురత ప్రేమగను, స్వప్రయో
జనసిద్ధికై జరుగు జగడములు సదాచారములుగను, పుణ్యము
గను తప్పక మారితీరుననుటకు పరిణామవాదమునం దెట్టి ప్రమా
ణములు గలవు? తుదిపరిణామముగా తలంచబడు నీమానవుడు
ముం దెట్టి రూపమును దాల్చునో; ఇపుడితడు క్రూరస్వభావ
మునం దుండెనో లేక సత్స్వభావమునం దుండెనో పరిణామ
వాదము చెప్పజాలకున్నది. కావున నిట్టిదాని నాధారముగ
దీసికొని యున్నతిని గాంచగలుగుదుమని విశ్వసించజాలము.

# విజ్ఞానము - పరిణామవాదము

పరిణామవాదము విజ్ఞానమూలమనబడుచున్నది. విజ్ఞానము "సైన్సు" ఆంగ్లశబ్ద పర్యాయము. ఈసైన్సుకాలము రెండుగా విభజింపబడెను. ఒకటి ౨౦ - ౨౫ సం॥లకు పూర్వపు రెండవది ౧౦ - ౨౫ సం॥ల కిటీవలకాలము. మొదటి భాగ మూడు నాలుగు నవీనతరవిషయములు బయల్పడెను. వానిలో ముఖ్యమైనది డార్విన్ పరిణామవాదము. ఇది ప్రకటితము కాగానే దేశమంతట గొప్పగందరగోళము బయలుదేరెను. పరిణామవాదులు ఈశ్వరుడు, జీవుడు, పునర్జన్మము మున్నగు ప్రాచీన సిద్ధాంతములిపుడే యంతరించునా యన్నంత తీవ్రముగా ప్రచారమొనర్చిరి. కాని వెంటనే విజ్ఞానసిద్ధాంతము నిస్సారమని విదితము కాసాగెను. కావున విజ్ఞానవాదులు - పరిణామవాదులు - మాకు సత్యమని తోచినదానినే మేము చెప్పుచుంటి మనసాగిరి.

౨౦ - ౨౫ సం॥ల కిటీవలనే కొన్ని నూతన విషయములు జాతములయ్యెను. తన్మూలమున పురాతన విజ్ఞాన సిద్ధాంతములు మారవలసివచ్చెను. ప్రపంచమును బాగుగా పరిశీలించి చూచిన సైన్సు నేడొక నూతన ప్రపంచమును నిర్మించినట్లు స్పష్టముగా విదితము కాగలదు. ఇవన్నియు జరిగినను విజ్ఞానము తలక్రిందులయినను, పరిణామవాదము రూపుమాసిపోయినను, అర్థశతాబ్దముయొక్క ప్రచారాందోళనచే జనించిన గొప్ప మానసిక సంస్కారము ప్రజలయొక్క హృదయాంతరాళమునుండి నశించి పోలేదు, పరమేశ్వరుడు, కర్మఫల భోగసిద్ధాంతము , స్వేచ్ఛాచారులకు హాలాహల విషమువంటిదను విషయ మందఱకు తెలి

సియే, యుండును. పరిణామవాదము వీని యన్నింటికి తిలాంజలి నొసంగెను. కాన స్వేచ్ఛాచారులచే లేవదీయబడిన ఈ శతృత్వ తిరిగి సజ్జనులను మితిమీరి కష్టపెట్టసాగెను. యూరోపులో బహిరంగముగను మన దేశమున కొంచెము రహస్యముగను ఇంత వఱకు పరిణామవాదులు స్వకీయ సిద్ధాంతముల ప్రచారమొనర్చుటకై ప్రయత్నించి యున్నారు. కాని విద్వాంసులు నిష్పక్షపాతులై వైజ్ఞానికులయొక్క సత్యసంకల్పముపై స్థిరముగా నుండుటవలన నిపుడు స్వేచ్ఛానువర్తనులయొక్క మనోవాంఛితములు పరిపూర్ణము కాజాలకున్నది.

స్వేచ్ఛానువర్తనులయిన యిచటి నాస్తికులు మొదట నేమియు చదువనివారగుట వలనను పాశ్చాత్యులు నూతనముగా కనిపెట్టిన విషయముల కబురే వీరికి తెలియకపోవుట వలనను ఆస్తికుల యెదుట సిగ్గిలుచు మిగుల యుద్దండతను ప్రదర్శింపలేకపోవుచుండిరి. కాని పాశ్చాత్య వాతావరణమున శోక నీతి నియమము లేకపోవుటచే నచటి స్వేచ్ఛాచారులు ఆస్తికులయిన క్రైస్తవ సోదరీలను మిక్కిలి కష్టపెట్టియుండిరి. అది యిచటి ప్రజలకు బాగుగా కనబడక పోవుటచే సైన్సు విద్వాంసులుద్వారా వర్తమాన సైన్సు ననుసరించి ఈశ్వర, జీవ, ధర్మ, మత, ఉపదేశాదులపై విశ్వాసము కలుగునట్టి విషయములను సిద్ధాంతము చేయించుట యుచితమని తలంచిరి. *

---

The suggestion was assiduously conveyed that religion was an out worn superstition a morbid sentiment or a phase of hysteria all of which had been exposed by modern science. These misleading and harmful impressions need to be dispelled. The best way of dispelling them is to let science herself speak through the lips of her chief exponents - Science and Religion, P. 4 - 5.

తదనుసారముగా సం, ౧౯౧౪ న లండనులో సుప్రసిద్ధ బ్రౌనింగుభవనమున గొప్పగొప్ప విజ్ఞాన వేత్తలయిన ఏడుగురు పండితు లాహ్వానించబడి ఏడురోజులు వాద ప్రతివాదములు చేసిరి. ఈ యేడుగురియొక్క అభిప్రాయములను ( Seicnce and Religion ) "ధర్మము - విజ్ఞానము" అను గ్రంథరూపము గా నచ్చొత్తించిరి. ఆయేడుగురు పండితుల పేర్లనిచట నుదహరించు చున్నారము.

౧ - సర్. ఓలివర్ జోసెఫ్‌లాజ్, ఎఫ్. ఆర్. ఎస్ డి. ఎస్. సీ.ఎల్. ఎల్ డీ. గారు, వీరు వైజ్ఞానిక ప్రపంచమున గొప్ప విద్వాంసులు. వీరు లివర్‌పూల్ యూనివర్సిటీ ప్రొఫెసరును బర్మింగ్‌హామ్ యూనివర్సిటీ ప్రిన్సిపాలును, లండనుఫిజికల్ సొసైటీకిని, రిసర్చిఫిజికల్ సొసైటికిని, బ్రిటిషు అసోసియేషన్ కును ప్రెసిడెంటునై యుండుటయేగాక యనేక గ్రంథముల రచి యించి గొప్పగొప్ప బహుమతులను గూడ బడసిరి. ఇదియును గాక వీరు వైర్లెస్ ఎలెక్ట్రిక్ శాస్త్రములందు విశేష ప్రజ్ఞా వంతులు.

౨ - ప్రొఫె. జాన్. ఎంబ్రోజ్ ఫ్లెమింగు, ఎం. ఎ. డి. ఎస్. సి. ఎఫ్. ఆర్. ఎస్. గారు- వీరురాయల్ కాలేజీయందు కెమిస్ట్రి డిమాన్‌స్ట్రేటరును, కేంబ్రిడ్జ్ హామ్ కాలేజీ సైన్సు మాస్టరును లండను డాక్టర్ ఆఫ్‌సైన్సు యూనివర్సిటీకాలేజీ నోటింఘు హామ్‌లో గణితవిజ్ఞానశాస్త్ర ప్రొఫెసరును, ఎడిసన్ కంపెనీ ఎలె క్ట్రిక్ ఇంజనీయరును, మోర్లేకాలేజీ ప్రమోటరు యూనివ ర్సిటీకాలేజీ (లండను) లోఎలెక్ట్రిక్ ఇంజనీరింగు ప్రొఫెసరును,

మూరోక్కినీకంపెనీ వైజ్ఞానిక సలహాకారులునై యుండిరి. రాయల్ సొసైటిఫెల్లో మఱియు ననేక గ్రంథకర్తలునై యనేక పతకములను పొందిరి. ఇంతియు కాక వీరు విద్యుద్విజ్ఞానమున విశేష ప్రజ్ఞావంతులు.

3 - ప్రొ. డబ్ల్యూ బీ-బాటమలీ, ఎం. ఎ. పి. హెచ్. డీ. ఎఫ్. ఎల్. ఎస్. ఎఫ్. సీ. యస్. గారు - వీరు ప్రాణిశాస్త్ర విజ్ఞానవేత్తలు, బోటానికల్ కింగ్స్ కాలేజీ ప్రొఫెసర్, కృషిశాస్త్రజ్ఞులునై యనేక పతకములను పొందియుండిరి.

౪ - ప్రొ. ఎడ్వర్డుహాల్. ఎల్. ఎల్. డీ. ఎఫ్. ఆర్. ఎస్. గారు - వీరు జియోలాజికల్ సైన్సుమేష్టరు. అయిర్లండు భూగర్భవిభాగ డైరెక్టరు. జ్యాలాజికల్ సొసైటి ప్రెసిడెంటు, సుప్రసిద్ధ లార్డుకిచనర్‌కు ముఖ్యస్నేహితుడునై యుండి అట్లాంటిక్‌లో ద్వీపములను కనుగొనుటయేగాక యనేక భూగర్భ సంబంధకార్యకర్తలునై యుండిరి.

౫. జాన్ ఎలక్ హాకర్, డి. ఎస్‌సీ. ఎఫ్. ఆర్. ఎస్. గారు - వీరు శీతోష్ణవిద్యాశాస్త్రప్రవీణులు. విజ్ఞానమునకు సంబంధించిన యనేక సభలందు సభ్యులును ప్రధానకార్యకర్తలునై యుండిరి.

౬. ప్రొ. జర్మను సిమ్సుబుడ్ హెడ్, ఎం. ఎ., ఎల్ ఎల్, డి., ఎఫ్. ఆర్ సి. పీ. ఎఫ్. ఆర్. ఎస్. ఈ. గారు - వీరు కేంబ్రిడ్జి యూనివర్సిటీలో పాథాల జీ ప్రొఫెసరును, రాయల్ మెడికల్ సొసైటీ ప్రెసిడెంటును, రాయల్ మైక్రోస్కోప్ సొసైటీ ప్రెసిడెంటును, రాయల్ కాలేజీ డైరెక్టరును, మెడికల్ విభాగమున విశేషప్రజ్ఞావంతులునై యుండిరి.

2. ప్రొ. సిల్వేనిస్- ఫిలిప్సుథామన్సు బి. ఎ. ఎం. ఏ. ఎల్. ఎల్. డి. డి. ఎస్‌సీ. ఎఫ్. ఆర్. ఎస్. గారు, వీరు లండనులో ఫిజిక్సు ప్రొఫెసరును, విద్యుత్తు, భౌతికవిజ్ఞానముల యందు విశేషప్రజ్ఞావంతులు నై యుండిరి.

ఈ 2 గురు విద్వాంసు లిపుడు సుప్రసిద్ధ విజ్ఞానవేత్త లనబడుచున్నారు. వీరి సిద్ధాంతములు నూతనవిజ్ఞానప్రపంచము నకు, భారతదేశమునకు ప్రాచీనమహర్షులయొక్క సిద్ధాంతముల వలె మాన్యములై యున్నవి. మఱియు వీరిసిద్ధాంతములు వర్తమానస్థితిసూచకములై యున్నవి.

---

# వర్తమాన విజ్ఞానము

వర్తమాన వైజ్ఞానికులు పురాతన వైజ్ఞానికుల నిపుడు పాతవారని నిరాదరణ జేయుచున్నారు. సుప్రసిద్ధవిద్వాంసుడైన హైగల్ డార్విన్ మతపోషకుడై యుండెను. ఇతనిని - ఈహైగల్‌నుగూర్చి ప్రొఫెసర్ బాట్‌మలీ యిట్లు చెప్పెను.

"హైగల్‌యొక్క పురాతన భౌతికవాదము వర్తమాన యుగమునుండి పూర్తిగా మాయమయ్యెను"

ఇటులనే హైగల్ రచిత "The Riddle of Universe" అను గ్రంథమును ఖండించు పుస్తకమునకు మిక్కిలి పరిహాసక ముగా (The old Riddle and the Newest Answer) "పనికి మాలిన భావము - నూతన ఉత్తరము" అని నామ ముంచ బడెను. "ధర్మము - విజ్ఞానము" అను గ్రంథమున మరియొక

విద్వాంసుడు తన భావములు నూతన మనుచున్నాడు. *

నవీనవైజ్ఞానికులు కొంతకాలమునకు పూర్వమున్న సందేహవాదులను ( Agnostics ) ను ఈకాలమునకు పనికిరాని వారనుచు నూతనాన్వేషకులకు ధన్యవాదములర్పించుచున్నారు.

మఱియు మొదటి యంధప్రకృతికి అధీనులుగాక ప్రకృతినే స్వాధీనమునం దుంచుకొనుటకు నేర్పుచున్నారు. *

స్వేచ్ఛావాదము పరిణామవాద మనబడదనియు పరిణామవాదము నియమబద్ధమనియు నుడువుచున్నారు. *

వారు పరిణామవాదముద్వారా పరమాత్మను దర్శింపుచున్నారు. ఇంతకుపూర్వము చెప్పబడిన ప్రకారము మీయిరువది సంవత్సరములలో విజ్ఞాన సంబంధము నూత్నదర్శనమునకు గుఱి యగుట వలన పూర్వపు పరిణామవాదస్వరూపము పూర్తిగా పరివర్తనము జెందెను. పాపము డార్విన్ హాక్సలె, హైగల్ మున్నగువారు దృఢమైన గొలుసులతో దానిని గట్టిగా బంధించితిమని భావించియుండిరి.

---

That is the old materialistic school - Haeckets School if you like - which, let me tell you is hopelessly out of date and antiquated. —Science and Religion P. 63.

And all the theories of matter advanced during the last twenty years are based on a conception - a postulate of non-material. That is the latest science. —Ibid P. 62.

The science of colloids is quite a new one It has only been worked at really seriously within last dozen years. Ibid P. 65.

Not very long ago, it was to some extent fashionable in scientific circles to be an Agnostic. But today a man who glories in his ignorance is blamed and not lionised. The attitude is quite out of fashion. Thanks to the labours of science. —Science and Religion P. 85—86.

డార్విన్ మతమున ప్రపంచము కేవలము ప్రాకృతమే గాని చిన్మయమగు పరతత్త్వముతో దానికి నిమిత్తము లేకుండెను. కాని ఇప్పుడు పరమేశ్వరునివంటి పరతత్త్వము సమస్త విజ్ఞాన మండలిచే స్వీకృతమయ్యెను. కావున నిక డార్విన్ ప్రకృతి స్వేచ్ఛాచారిగా నుండజాలదు. నవీన విజ్ఞానవేత్త లిప్పుడు రెండవదైన జీవునికూడ నొప్పుకొనుచున్నారు. సైకాలజీ మనో విజ్ఞానశాస్త్రము, మస్తిష్కశాస్త్రము, ఆత్మవిద్య మున్నగు శాస్త్రకర్తలు జీవునియొక్క అస్తిత్వమును దాని జన్మాంతరములను అంగీకరించుచున్నారు. ధార్మిక ప్రపంచమున కివియే మూలాధారములు. విజ్ఞానము వీటినే బలపఱచినది. ఈతత్త్వములనే సైన్సు ఆగ్రహపూర్వకముగా నొప్పుకొను చున్నదని నుడివెను. కావున - నుపర్యుక్త తత్త్వముల నొప్పుకొనుటవలన ప్రకృతియొక్క స్వాతంత్ర్యము నశించి అది నియమబద్ధమై పనిచేయవలసి యుండును. ఇపుడు డార్విన్ యొక్క ఉచ్ఛృంఖల ప్రకృతి వాదముచే ఏప్రాణియైనను ఈగగానుండి పక్షిగా మారుట మధ్యలో సర్పముగను సర్పముగనుండి ఒంటెగను తుదకు నెమలిగను మారుటకు నవకాశము లభింప జాలదు. ఇప్పుడు జీవులయొక్కయు ఈశ్వరుని యొక్కయు వ్యవస్థలయందు బంధింపబడిన ప్రకృతి యీశ్వర నియమానుసారము మంజూరైన దానినే చేయగలదు. చేయవలసి యుండును. గాని మంజూరు కానిదాని నెప్పటికిని చేయజాలదు. అనగా కర్మఫల భాగము ఈశ్వర సంకల్పానుసారము జరుగవలసి యుండునని భావము. కావుననే పరిణామవాదముపై తనసమ్మతి నొసగుచు సర్. ఒలివర్‌లాజ్ ఇట్లుచెప్పెను.

"పరిణామమున మొగ్గనుండి పువ్వు అథవా బీజమునుండి వృక్షమును జనించు నియతియేగాని వేరొండుగాదు."

కావున దేశకాలానుకూలతచే ప్రాణులలో మార్పులు కలుగునను వాద మిక చెల్లనేరదు. నూతన విజ్ఞాన సిద్ధాంతాను సారము ప్రపంచమున తమ ఆది జన్మమునుండి యింతవఱకు ఏ మాత్రము మార్పుచెందని ప్రాణు లనేకము కలవు. ఇవి స్థిరశరీరు లనబడుచున్నవి. ఇవి యిట్లుండగా ప్రొఫెసర్ సోలస్, కీథ్, శింపర్, హైగల్, డాక్టరు చర్చి మున్నగువారి సిద్ధాంతాను సారము "మానవుడు జన్మించి యెనిమిది లక్షల ౨౦ వేల సంగ లయ్యెను. మఱియు నీయవధిలో నదేడింత యున్నతిని హొందెను." అని స్థిరమయ్యెనని నుడివెదరు.

కాని మి. జాన్. టీ రోడ్ గారికి "నవాదా" యం దఱువది లక్షల సం॥లనాటి పురాతన చెప్పుయొక్క అడుగు అట్ట రాతి వలె కనబడినప్పటినుండియు పరిణామవాద విలాసమంతయు మన్నైపోయెను. పృథివియొక్క ఆయువునుగూర్చి యింతవఱ కెన్నియో మతభేదములు పుట్టెనుగాని వానిలో నేదియు నీచెప్పు అట్టయొక్క పరిణామమును నిర్ణయించుటకు సమర్థముకాదు. అమీబా (ప్రాణి) నుండి మానవుని వర కెన్ని దశలు గడిచెనో తెలియదు. ఒక్కొక్కదశ ఒక్కొక్క కోటివర్షముల (ఏలయన నఱువది లక్షల సం॥లనాటి చెప్పు అడుగు అట్ట ఉపస్థితమై యుండెనుగదా!) కాలము నడచిన దేని పృథివియొక్క ఆయు వెంతదీర్ఘమో కదా! దాని ననుమానించుటకును మన కలవి గాదు.

"మానవుఁడు కోతినుండి పరిణామము నొందలేదు. కాని ప్రస్తుతము మానవులనుండియే కోతులు జన్మించెను" అను నీ సిద్ధాంతముకూడ నిపుడు విదేశములలో ప్రచారమగుచున్నది. ఈ విషయమును సిద్ధాంతపఱచిన విద్వాంసు లిట్లు నుడువు చున్నారు.

"పూర్వాతి పూర్వకాలమున మానవులు జ్ఞానవిజ్ఞానము లందు మిక్కిలి నున్నతిని బడసియుండుటచే వారి శిరస్సులు బల హీనములై కొన్నాళ్ళకు వారు అసభ్యులైన అడవి మనుష్యు లుగా మారిరి. అట్టివారిలో కొందఱు వనమనుష్యులుగను, కొందఱు కోతులుగ నైరి."

ఈ విషయములు ౨౦ సంగిల కిటీవలనే సిద్ధాంతపఱచ బడెను. వీనిని సిద్ధాంతపఱచినవారు విజ్ఞానశాస్త్రమున గొప్ప పండితులు. వీరికి పూర్వులగు విద్వాంసుల యనుభవముగూడ మిక్కిలి బాగుగా లభించుటచే దానితరువాతి మార్గమును వీరు తమజ్ఞానముద్వారా మిక్కిలి చదునుచేసి యుందురు. కావున పురా తనమతముకంటె నవీనమత మధిక విశ్వసనీయము కావలయును గదా! కాబట్టి యిక పై సిద్ధాంతములను దృష్టియందుంచు కొని సృష్ట్యుత్పత్తి క్రమము నించుక విచారింతము.

జీవులయొక్క కర్మానుసారము పరమేశ్వరుడే ప్రాణికెట్టి శరీరము నొసఁగునో దానికట్టి శరీరమును ప్రకృతి నిర్మించవలసి యుండును. మొగ్గనుండి పువ్వు ఏర్పడినటులే యే ప్రాణికెట్లు

కావలయునో ఆ ప్రాణికటులే యేర్పడును. అపరివర్తనశీల ప్రాణులవలెనే ప్రాణియొక్క ఆకృతి మార్పు చెందనేరదు. ఏలయన మానవు డఱువది లక్షల సం॥ల నుండి యెటులున్నవా డటులనే యుండెను. మొదట మానవుకు మహాజ్ఞానిగా నుండెను, కాని తరువాత నడవిమనుష్యు మూర్ఖు డయ్యెను.

"ఇందు పరిణామవాద గంధమెక్కడ? డార్వినిజంయొక్క సంస్కార మెక్కడ? పురాతనవైజ్ఞానికులయొక్క చర్చ యెక్కడ? నవీన విజ్ఞానవాదమునం దిప్పుడు పురాతన పరిణామ వాదమునకు స్థానములేదు. మొగ్గనుండి పువ్వుజనించినటులే పరమేశ్వరుడు పరిణామముద్వారా ప్రాణుల నుత్పన్నము జేయు చున్నాడు" అని యిపుడు పురాతన విజ్ఞానముతో సమన్వయము చేసికొనవలసి వచ్చుచున్నది. ఈ విధముగా నుత్పత్తి జేయుట పరమేశ్వరుని కవసరమా లేదా యను విషయము ప్రస్తుతము కాదు. కాని పూర్వపు పరిణామవాదము నష్టమయ్యెననుట కిదిచాలును.

ఇంతవఱకు విచారించినదానింబట్టియే పరిణామవాద రహస్యమంతయు బట్టబయలగుచున్నను, దాని నెవ రేక్రమము ననుసరించి గ్రహించిరో ఆక్రమప్రకారముగా నది వారి మస్తిష్కములనుండి తొలగిపోనంతవఱకు వారి వ్యాకులము నివృత్తి కాజాలదు. కావున నిక క్రమముగా పరిణామవాదము యొక్క సమసాంగోపాంగములను విచారింతము.

## —* పరిణామవాదుల సృష్టి *—

పరిణామవాదులు సృష్ట్యుత్పత్తి విషయము నీ విధముగ వర్ణించెదరు.

"ప్రాకృత పదార్థముల కెల్ల మూలము ఈథర్" అను నొక పదార్థము. దాని కంపనమువలన విద్యుత్ప్రకాశము, వేడి జనించుచుండెను. ఈథరుయొక్క సూక్ష్మాతి సూక్ష్మకణములను "ఎలక్ట్రోను" లనుచున్నారు. వీని సంఘాతముచే విద్యుత్తు పుట్టి శక్తిరూపముతో స్థూలరూపమున "మేటర్" అనబడుచున్నది. "మేటర్" విరళదశలో నున్నపుడు "గ్యాసు" అనియు, తరళదశయందు "లిక్విడ"నియు, ఘనీభవించినపుడు "సాలిడ్" అనియు ననబడును. ఈ పదార్థము ఆకర్షణాపకర్షణ ధర్మముచే చక్రాకారగతిని పొందెను. కొన్నాళ్ళకా చక్రమే సూర్యుడయ్యెను. సూర్యునియందు వేడి గతి యున్న కారణమున చక్రములు జనించి వేరై యితర గ్రహములయ్యెను. ఆ గ్రహముల కుపగ్రహములు పుట్టినవి. ఈ విధముగా నేర్పడిన గ్రహములలో మన భూమికూడ నొక గ్రహము. కావున దీనిని నిర్మించినవాఁ డొక ఈశ్వరు డున్నాడనుట తప్పు. ఈ భూమి మొదట వేడిగానుండి నెమ్మది నెమ్మదిగా చల్లఁబడి సముద్రమయ్యెను. సముద్రము గట్టిపడి భూమి జనించగా జీవము ప్రారంభమయ్యెను. జడమువలననే చేతనప్రాణులు జనించెను.

భూమియందు చేతనము లుత్పన్నమై క్రమేణా వృద్ధి నొందెను. మొదట వనస్పతులుగాని, చేతనములుగాని లేవు.

కాని రెంటిని పుట్టించెడి చేతన మొకటియుండెను. దాని శాఖ యొకటి ఒక కోష్ఠముగల "అమీబా" అయ్యెను. అట్టి అమీబా చాల పెంపొందుటచే తినుటకు, త్రాగుటకు మిక్కిలి కష్టపడ వలసివచ్చెను. అందువలన నది నానావిధములైన ప్రయత్న ములు చేయసాగెను. దీని సంతతియందు శారీరకముగాఁ గాని మానసికముగాఁగాని బలవంతమైనది. ఈ జీవన సంగ్రామమున జయమునొంది అవి మరల వృద్ధిపొంద సాగెను. అట్లు వృద్ధి యైన వానిలో మరల భోజన సంగ్రామ ముద్భవించెను. యోగ్యములు జయమొందెను. అయోగ్యములు మరణించెను. అప్పుడు మిగిలిన అమీబాలు మొదటివానికంటెఁ గొంచెము భిన్నముగా నుండెను. వీనియందును కాలాంతరమున జీవన సంగ్రామము జరుగుచుండ మరణించుచు, బ్రతుకుచు, పరిస్థితి ననుసరించి యాకార ప్రకారములను మార్చుకొనుచు, మార్చు కొనుచు తుదకు చేప, కప్ప, సర్పము, పక్షి, గోవు, ఎద్దు, కోతి, వనమనుష్యుడు, మనుష్యుడు నయ్యెను.

ప్రకృతి యొక్క కారణములవలననే భారతీయుల యందును, యూరోపియనుల యందును, రెడ్ ఇండియనుల యందును, అబ్సీనియావారి యందును, చైనీజులందును, రూప వర్ణ రేఖాదులలో భేద మేర్పడినది. అటులనే ప్రకృతి కారణ ముల వలన చాలాకాలము గడచినపిమ్మట వనమనుష్యుడు, మనుష్యునిలోను భేదములు కలిగెను. సకల ప్రాణు లొకే తత్త్వమువలన నిర్మాణమగుట అన్నింటియందు జీవనము సంత తిని ధరించు నవయవములు సమానముగానుండుట మున్నగు

విషయములన్నియు మొదట వికృతముగానుండి తరువాత మాఱి నేఁటి రూపమును పొందిన సైకిలు మొదలగు యంత్రములవలె జీవప్రాణులన్నియు నొకదాని పరిణామ రూపములనియే సిద్ధాంతీకరించుచున్నవి. త్రొక్కుఁడు బండ్లన్నియు సైకిలుయొక్క పరిణామ వికారములేకదా! ఈ దేవిధముగా ప్రపంచమునగల సమస్త ప్రాణులు ఉన్నతిని పొందిన ఒక్క "అమీబా" రూపాంతరములై యున్నవి. మోటార్లలో భేదముండినను అన్నియు మోటారులేకదా! అటులనే వందకాళ్లుగల జెర్రియైననేమి, కాళ్లులేని సర్పమైననేమి భిన్నవస్తువులుగావు. మొదటిది యెముకలు లేనిది. రెండవది యెముకలు గలది. మొదటిదానికి జంటలుండును. రెండవది యటులుండదు. భూమిని త్రవ్వి చూచుట వలనను, ప్రాణులయందీ క్రమమే కనబడెను. సరళరచన గలిగి యెముకలు లేనివి యడుగుభాగమందును, క్లిష్టరచనగలిగి యెముకలుగలవి పైభాగమునందును కనబడుచున్నవి. గర్భమునందును నిదే క్రమము కనఁబడుచున్నవి. మనుష్య గర్భము మొదట 'అమీబా'వలె నొక కోష్ఠాకారముగను, తరువాత మత్స్యాకారముగను పిదప మండూకాకృతిగను, తదుపరి సర్ప, పక్ష్యాకారముల పొంది క్రోతి రూపమును ధరించిన పిమ్మట అడవి మనుష్యుఁడై తుదకు మనుష్యుఁడగుచున్నాడు.

ఇట్లు సర్వవిధముల బరిశీలించగా "ప్రాణులన్నియునొకానొక మూలయంత్రము యొక్క పరివరిత—పరివర్తిత రూపములనియే ప్రతీత మచున్నది. నేడునుఒకదాని చిహ్నము లొకదానియందు గనబడుచున్నవి. అనేకములు లుప్తములై ప్రతి

బింబించుచు నుండెను. కొందఱు స్త్రీలకు ర___ల_స్తనములుం డుటనుబట్టియు కొందఱు పురుషులకు తోకలుండుటను బట్టియు జూడ మనుష్యులుకూడ నవేక స్తనములు తోకలుగల ఆయా యోనులనుండి పరిణామము చెంది యుందురనియు చెవులు కదిలించ లేకపోవుటవలనను ఆంత్రము జాతిపోవు రోగమువలనను మానవునియొక్క ఈఅంగములు శక్తిహీనము లయ్యెననియును ప్రతీత మగుచున్నది. ఈవిధముగా ప్రతిమానవుని విచారించుట వలన పరిణామవాదమున కనేక ప్రమాణములు లభించు చున్నవి. అచ్చటచ్చట ద్వివిధ ప్రాణులకుండు నుభయాంగము లోకే ప్రాణియం దగుపడుచున్నవి. ఇవి లుప్తదశల కుదా హారణములును పరిణామ వాదమున కుత్తమప్రమాణములు నై యున్నవి. కావున నిత్యాది ప్రమాణముల వలన పరిణామ వాదము బలపడుచున్నది''

ఇకముందు క్రమముగా సాధక బాధక ప్రమాణముల తోను నవీన విజ్ఞానమువలనను సృష్టిక్రమ సమాలోచనవల నను లభించిన యనుభవ ప్రమాణముల ద్వారా పరిణామవాద సిద్ధాంతముల నిస్సారతను నిరూపింతుము.

ఆస్తికులు దేవుం డున్నాడని చెప్పుటకు ప్రథమ ప్రమా ణము సృష్టిని రచించుకర్త యొక డుండవలయుననియు, నాతడే దేవుం డనియు నుడివెదరు. కాని పరిణామసృష్టివిధాన మటు వంటి సృష్టికర్తను నిరాకరించుచున్నది. ప్రపంచమునకు గోచరించు చైతన్యము శాశ్వతమైనదని ప్రమాణీకరించి ఆస్తి కులు దానిని ఆత్మయనుపేర చెప్పుదురు. కాని పరిణామవాద

మర్థానికికూడ స్వస్తిచెప్పుచున్నది. కావున నీగ్రంథమును కేవలము పరిణామవాద ఖండన – సమాలోచనదృష్టితో వ్రాయుచున్నారము. ఏలయన పరిణామవాదము స్వయముగా నశించుచో ఆస్తికత్వమున కేమాత్రము హానికలుగజాలదు. కావున నాస్తికత్వమునకు మూలకారణమగు పరిణామవాదమును ముందు విమర్శించదలచితిమి. తరువాత " జీవుఁడు, దేవుఁడు * అను వేర్వేఱు గ్రంథములను వ్రాసి సమస్తసందేహనివృత్తి చేయదలంచితిమి. చాలకాలమునుండియు నాస్తికులనేకవిధముల నాత్మ పరమాత్మలపై దండెత్తుచుండిరి. అందు బాగుగా నిలువద్రొక్కుకొన్నవారు బౌద్ధ, జైన, చార్వాకులు. వీరిమతశాస్త్రములు మిగుల గూఢభావములతోను, తర్కముతోను నిండియున్నను, సత్యసిద్ధాంతములు గాకపోవుటచే స్థిరముగా నిల్వబడజాలకపోయెను. సృష్టికర్త దేవుఁడుకాడనియు, కర్తతో నవసరములేదనియు వారు నిర్ణయించుకొని యుండిరి. కాని వారివాదనకును, నేఁటి నాస్తికవాదమగు పరిణామవాదమునకును మహాంతర మున్నది. కావున ప్రత్యేకముగా పరిణామవాదముయొక్క ప్రత్యంగమునుగూర్చి యీగ్రంథమున సవిస్తరముగా వివరించుచున్నారము. గాన పాఠకులు, జిజ్ఞాసువులు శ్రద్ధతో తిలకించెదరుగాక !

---

* " దేవుఁడు " అను విషయమును విపులముగ తెలిసికొనగోరువారు శ్రీ పండిత, గోపదేవుగారి " ఆస్తికవాదము " అను గ్రంథమును చూడుడు. దొరకుచోటు:- " ఆర్యసమాజము " కూచిపూడి, గుంటూరుజిల్లా.

# సంస్థానము - ప్రాణిపరివర్తనము

## పరిణామవాదుల సిద్ధాంతము :—

చేతన ప్రాణి జనించు చేతనకోష్టము ౧౬ భౌతిక పదార్థములవలన జనించెను. ఈచేతన కోష్ఠములవలననే సమస్త ప్రాణము లుత్పన్నము లయ్యెను. ఈ సకల జీవిత ప్రాణులలో సామాన్యవిషయములు మూడు కలవు.

౧ — సమస్త ప్రాణుల శరీరములు సరళమైన యొకేపదార్థముతో నిర్మాణమయ్యెను. కావున పశు, పక్షుల యొక్క శారీరక తత్త్వములయం దెవ్విధమైన భేదములేదు.

౨ — సర్వప్రాణులు తమక్షీణశక్తిని తిరిగి స్వయముగా సంపాదించుకొనుచున్నవి. నిత్యము పనిచేసి తిరిగి స్వస్థత చెందుచున్నవి.

౩ — యంత్రమువలె నున్నతినొందుచు నొక శరీరము నుండి మఱియొక శరీరమును పొందుచున్నవి.

## సమస్త శరీరులకు ౮ సంస్థానములున్నవి

(౧) పోషణ :— వెలుపలనుండి పదార్థములను గ్రహించుట, జీర్ణము చేసికొనుట, శరీరమంతటను వ్యాపింప జేయుట.

(౨) శ్వాసోచ్ఛ్వాసలు :— ప్రాణవాయువును పీల్చుట, ఊపిరితిత్తులను గాలిని వెలుపలకు వదలించుట.

(౩) మలవిసర్జనము :_ లోపలి మలములను, అనవసర పదార్థములను వెలుపలకు నెట్టివేయుట.

(౪) రక్తప్రసారము - శరీరమంతటకు రక్తమును చేర్చుట.

(౫) ప్రేరణ :- గతి నొసగుస్థానము.

(౬) ఆధారస్థానము :_ దీనివలన శరీరమంతయు సన్నద్ధమై యుండును.

(౭) జ్ఞానతంతువులు - వీనివలన శరీరపరిస్థితులన్నియు దెలియుచుండును.

(౮) ప్రసవము ._ సంతానమును కనుట.

(౧) సమస్తప్రాణులయొక్క తత్త్వము లోకేవిధముగా నుండి (౨) పై సంస్థానాష్టకమును గలిగియున్నవి అను రెండు విషయములు తెల్లమగుచున్నది.

ఈ సమస్త శరీరము లోకేవిధమైన తత్త్వముతో నేర్పడినను; మొదటిది మరేమంత నూతన విజ్ఞానవిషయము కాజాలదు. "ఈ అధమశరీరము పంచభూతములతో నేర్పడె"నను నది భారతదేశముయొక్క పురాతనవిషయమేకదా !

రెండవవిషయమందును మఱేమంతగొప్ప విశేషమైన విజ్ఞానములేదు. జీవించుచున్న, తినుచున్న, త్రాగుచున్న, సంతానమును గనుచున్న, వానియన్నింటియం దీ యెనిమిది సంస్థానములు తప్పకయుండి తీరవలసినదే ! తినబడిన పదార్థములు గర్భమునందే యుండుననిగాని రక్తము వాతములో

కేవలము నీటివలె ప్రవహించుచున్నదనిగాని ప్రసవించకుండ సంతానముకలుగుననిగాని తలంచు మూర్ఖుడెవఁడైన నుండునా? ఇవి ప్రపంచమంతయు నొప్పుకొనిన విషయములే కాని యా ప్రాణులు యంత్రముల మార్పువలె నెమ్మది నెమ్మదిగా బాగు పడుచు మఱియొక విధముగా మాఱుచున్న వను విషయము సమాలోచనీయమై యున్నది.

యంత్రములు మానవుని పరిమితిగల బుద్ధిచే నారబ్ధమై యనుభవముద్వారా వృద్ధియగుచున్నవి. కావుననే ఆరంభిక అంతిమ యంత్రములందు భేద మగపడుచున్నది. కాని పర మేశ్వరుని రచనకూడ మానవుని పరిమితి బుద్ధివంటి బుద్ధితో నారంభమగుచున్నదా ? సుఖదుఃఖముల ననుభవించు నిమి త్తమే ప్రాణులను పరమాత్మ సృజించుచున్నాఁడు. కావున నేవిధమైన శరీరముతో నెట్టిసుఖముల ననుభవించుటకు వీలగునో యట్టి శరీరము నొసగుచున్నాఁడేగాని మఱియొక విధమైన శరీరము నొసఁగుటలేదు. కావున యంత్రముల నుదాహరణముగా జూపి ప్రాణులయొక్క శరీర నిర్మాణమును పరివర్తనశీల మని సిద్ధాంత పఱచుట సృష్టి క్రమమునకు విరు ద్ధము. శరీర మేర్పడుట ప్రకృతియొక్క లేక స్వయముగ తన స్వాధీనమేనని విశ్వసించిన యెడల యంత్రముయొక్క దృష్టాం తము సరిపోవునేమో గాని యిచట శరీరము నొసఁగు మూఁడ వది యింకొకటి యుండగా నా దృష్టాంత మెట్లుసరిపోవును ? కావున పూర్వోక్త దృష్టాంతము కేవలము నిరర్థక మగు చున్నది.

వైజ్ఞానికు లింతవఱకు నీపరివర్తనలను పరీక్షలద్వారా సిద్ధాంత పఱచగలిగిన పద్ధతులను కనిపెట్టలేకపోవుటయేగాక అట్టి పరివర్తనల నియమములెవ్వియో యింతవఱకు వారిచే జ్ఞాతము కాలేదని పరిణామ వాదులే తఱచుగా చెప్పుచున్నారు.

వైజ్ఞానికులకు పరివర్తన నియమములేగాక పరివర్తన మెట్లు జరుగునదికూడ నింతవఱకు తెలియలేదు. అనగాఫలానా ప్రాణి ఫలానా ప్రాణిగా మాఱెననునది యింతవఱ కెవ్వరును గనిపెట్టలేదు. చూచియుండను లేదు. కావున పరివర్తనము కేవలము కల్పన. అనుమానము తప్ప మఱేమియుకాదని సిద్ధాంత మగుచున్నది.

పరిణామవాదులు జీవుల, జాతులయొక్క ఉత్పత్తులను బాగుగా సిద్ధాంతపఱచ వలసియుండెను. కాని వా రింతవఱకు పరిణామమును గూర్చి ఒక్కవిషయమునైనను బాగుగా నారోపితము చేయలేదు. విజ్ఞానమున గొప్పపాండిత్యము గలవారే పరిణామరహస్యము మాకు బాగుగా తెలియలేదని యొప్పుకొనుచున్నారు. జీవోత్పత్తి విషయమునందును ప్రాణులయొక్క పరివర్తన విషయమునందును పరిణామ వాదలేఖకులే వైజ్ఞానికులకేమియు తెలియదని నుడువుచున్నారు. భూమిమీఁద ప్రాణులుత్పన్న మగుటనుగూర్చి థామసన్ యిట్లు నుడివెను.

"భూమిమీఁద జీవధారిప్రాణుల సృష్టి యెట్లు జరిగెనను నీవిషయము విజ్ఞానముద్వారా మాకు తెలియలేదు. *

* How did living creatures begin to be upon the Earth? In point of science we do not know - Introduction to Science P. 142 by D A. Thomson, M. A.

మఱియొక విద్వాంసుడుకూడ నిట్లునుడివెను.

" ఈ నిర్మానుష్య భూమిమీఁద ప్రాణులెట్లుత్పన్నము లయ్యెను ? ఈ ప్రశ్నకు మే మొసఁగు సమాధానము. మాకు తెలియదు. " అని. + Evolution P. 70

ఇటులే ప్రొఫెసర్. పెట్రిక్ గేడ్సు అను విద్వాంసుడు కూడ నుడివెను.

"నిజముగా మాకు పరిణామోత్పాదక తత్త్వవిషయ మున బహుతక్కువగా తెలియును. ఒకజాతినుండి మఱియొక యుపజాతిగా మాఱు భిన్నత్వనియమముల విషయమున మాకే మియుఁ దెలియదను డార్విన్ వాక్యములతోనే మేమును నేకీ భవించుచున్నారము .:

పరిణామవాదులకు జీవోత్పత్తి విషయము గాని, ప్రాణుల పుట్టుకగాని, ఒక జాతి మఱియొకజాతిగామాఱు నియమముగాని తెలియనపుడు పరిణామ మే విధముగా నారోపితము చేయబడు చున్నదో గోచరించుటలేదు. ఇంతవఱకు పరిణామవాదమును సాధారణముగా విచారించితిమి. కావున నిఁక పరిణామవాదులు ప్రాణుల పుట్టుకకే యే శాస్త్రములను ప్రమాణములుగా నుప యోగించుచున్నారో ఆ యా శాస్త్రములను గూర్చి విచారిం

---

+ The question is what was the manner of their being upon the previously tenantless Earth? Our answer must be that we do not know. Evolution P. 70 by Prof. Pattrick Geddes.

∴ We know very little that is certain in regard to the originative factors in evolution. We must still confess, with Darwin, Our ignorance of the laws of variation is profound:- Evolution P. 11 by Prof. Geddes.

తమ పరిణామవాదమును సిద్ధాంతపఱచుటకై ప్రమాణము లుపస్థితపఱచబడుచున్న ప్రాణులు ఈక్రిందివిధముగా నైదుభాగములలో విభజింపబడినవి.

౧ – జాతివిభాగశాస్త్రము. Classification

౨ – తులనాత్మక శరీరరచనాశాస్త్రము. Comparative Anatomy

౩ – గర్భవృద్ధిశాస్త్రము. Embryology.

౪ – లుప్తజంతుశాస్త్రము. Palaeontology.

౫ – భూగోళవిభాగశాస్త్రము. Geographical Distribution.

---

# జాతివిభాగశాస్త్రము

సమస్త చేతనపదార్థములను వాని సాధర్మ్య వైధర్మ్యముల ననుసరించి పెద్ద చిన్న జాతులుగా విభజించుటయే ఈ శాస్త్రముయొక్క నిజోద్దేశము. జాతి విభాగ మనేకవిధములుగ నుండును. కాని వైజ్ఞానికులు అంతశ్శరీర రచనమీదనే వర్గీకరణము చేయవలయునని నిర్ణయించిరి. సమస్త చేతన పదార్థములు రెండు పెద్దవర్గములుగ విభజింపఁ బడెను. ఇందొకటి ప్రాణి వర్గము. రెండవది వనస్పతివర్గము. వనస్పతివర్గమును పరిణామ వాదులు విడనాడిరి. కావున మేమును దానిని విడిచిపెట్టుచున్నారము. ఇఁక మిగిలినది ప్రాణివర్గము. ఈ ప్రాణివర్గమునందు రెండు భాగములు గలవు. (౧) వెన్నెముకగల ప్రాణులు (౨) వెన్నెముక లేని ప్రాణులు. వెన్నెముక లేనివానియందు పైదు

విధములు గలవు, పరిణామవాదులు వాని నీవిధముగా విభ జించిరి.

౧ - Protozoa (౨) Caelenter ata (3) Echinodermata (४) Annelida (౫) Mollusca

వెన్నెముక కలవానిలోనున్న ౫ భేదములను క్రమముగా (1) Fishes. (2) Amphibians (3) Reptiles. (4) Birds. (5) Mammals. అనగా మత్స్య, మండూక, సర్పణశీల, పక్షి, స్తనధారులు "అని ౫ విధములు. వీనియందు (1) Class. (2) Order. (3)Family. (4) Genus. (5) Species (1) శ్రేణి (2) సమానత (3) వంశము (4) జాతి, (5) ఉపజాతులును కలవు. ఇచట ఉదాహరణకై లేండీకుక్కను దీసికొని ఈ వర్గీకరణములో దాని స్థానమెద్దియో విచారింతము. ఈ లేండీకుక్క ప్రాణివర్గమునకు చెందినది. వెన్నెముక గలది. స్తనధారి శ్రేణి. మాంసభక్షక తరగతికి చెందినది. శ్వానవంశము. (తోడేలు, నక్క మొదలుగాగల) కుక్కజాతి, లేండీ యుపజాతికి చెందినది. ఇటుల వర్గీకరణమువలననే ప్రాణి యేజాతికి చెందినదీ తెలియుచున్నదని పరిణామవాదు లనెదరు.

పరిణామవాదులు ప్రాణులను జలచరములని, నభశ్చరములని, స్థలచరములని లేక అండజములని, పిండజములని, ఉద్భిజ్జములని, ఊష్మజములని, లేక క్రింది తలగలవని, అడ్డతలగలవని, పైతలగలవని, లేక వృక్షములని, పశువులని, మనుష్యులని వర్గీకరణముచేయక లోపలి రచనవలననే శుద్ధవర్గము లేర్పడు.

వని చెప్పుచున్నారు. కాని యిప్పటి విజ్ఞానవేత్త లిదికూడ సరి కాదని నిర్ణయించిరి. రక్తపరీక్ష చేయసాగినప్పటినుండియు నుపర్యుక్తవర్గ విన్యాసము మిథ్యయని సిద్ధాంతమయ్యెను.

ఇంతవఱకు గినీఫావుల్, కోడిజాతిగా తలంచబడుచుండెను. కాని యిప్పటి రక్తపరీక్షవలన నది శుతుర్మర్గి = ఉష్ట్రపక్షిజాతియని నిర్ణయమయ్యెను. ఎలుగుబంటును నిటులేకుక్కశ్రేణిగా తలచుచుండెడివారు. పరిణామవాదులు కూడ దీనిని కుక్కజాతియందే లెక్కించిరి. కాని రక్తపరీక్ష జరిగిన పిమ్మట నదియును సీల్ మొదలగువానివలె జలజంతువని తేలెను.

రక్తపరీక్ష బయలుదేఱిన నాటినుండియు, పూర్వపు వర్గభేదము నష్టమగుటయే గాక పూర్తిగా పరిణామ వాదము యొక్క మూలమే తెగిపోయెను. పరిణామ వాదుల సిద్ధాంతాను సారము ఒకే మూలప్రాణినుండి భూమండలమునగల సమస్త ప్రాణు లుత్పన్నమైన యెడల, వానియందు తాత్త్వికభేదము లేనియెడల, నన్నింటియొక్క సంస్థాన మొకే విధమైనచో నన్నియు నొకేవిధముగా పరిణామ మొందిన యెడల వీని యన్నింటియొక్క రక్తకణము లొకేవిధముగా నిర్మాణమొందులకు కాలేదు ? ఒక జాతి ప్రాణియొక్క రుధిరకణములు గుండ్రముగను, ఇంకొక జాతియొక్క రక్తకణములు వెడల్పుగను, ఎందులకు నిర్మాణమయ్యెను ? రక్తకణములయొక్క ఈ భిన్నత్వము, ప్రతిజాతిశరీరము వేఱువేఱు విధములయిన రక్తకణములతో నిర్మాణమయ్యెనని సిద్ధాంతపరచుచున్నది. కావున సకలజాతు లొకే ప్రాణినుండి పరిణామ మొందన్న

దనియు, వేలు వేలుగనే జన్మించెననియు నిశ్చయమగు
చున్నది. కావున నిక తులనాత్మక శరీర రచనా శాస్త్ర
మువలన పరిణామవాదమున కెంతబలము లభించుచున్నదియు
ఇంచుక విచారింతము.

---

# తులనాత్మక శరీర రచనా శాస్త్రము

వర్గీకరణమును నిర్ణయించుట కీ శాస్త్రమువలన నధిక
ముగా సామగ్రి లభించుచున్నది. బాహ్యరూపమునం దత్యంత
భిన్నత్వ మున్నప్పటికిని ఈ శాస్త్ర మనేక ప్రాణులయొక్క
జాతివిభాగమును ఒక్క వర్గమునందే చేర్చెను. ఆంతరిక రచనా
సామ్యము మీదనే యిది నిర్ణయము చేయబడుచున్నది.
గబ్బిలము, హ్వేల్, గోవు, ఇవి నభశ్చర, భూచర, జలచరము
లైనప్పటికిని ఈ మూడు నొకే తరగతిలో సమావేశమొనర్పఁ
బడెను. అనేకజాతుల కుక్కలలో సాధర్మ్య, వైధర్మ్యము లను
నవి రెండునుకలవు. సాధర్మ్యమువలన కుక్కలన్నియు నొక్కటే.
వైధర్మ్యము ననుసరించి బుల్‌డాగ్, వేటకుక్క, లేండీకుక్క,
మున్నగునవన్నియు భిన్నభిన్నములై యున్నవి. కాని అన్నియు
నొక్క పూర్వపుకుక్కయొక్క సంతతియే. ఇటులనే గుంట
నక్క, సృగాలము, తోడేలు, వైధర్మ్యముచే భిన్నభిన్నము
లైనప్పటికిని మాంసభక్షణము మొదలగు సాధర్మ్యముల నను
సరించి యొకేపూర్వపురుషుని సంతతియని ప్రతీతమగుచున్నది.

పిల్లి, అడవిపిల్లి వేఱువేఱైనప్పటికిని రెండు నొకేవిధమైన జంతువులై యున్నవి. ఇటులనే చిఱుతపులి, వ్యాఘ్రము. సింహము, భిన్నభిన్నములయినప్పటికి నొక్కవిధమైన జంతువులే. ఇవన్నియు మాంసాహారి తరగతియందును, స్తనధారిశ్రేణి యందును, సమావేశమగుచున్నవి. వీనిలో వ్యాఘ్రసింహము లకును, తోడేలు, కుక్కలకును, సంతతి కలుగుచున్నది. ఎలుగు బంటుకూడ మాంసభక్షకజంతువే. కాని దీని యాంతరిక రచన కుక్క పిల్లులయొక్క రచనలకంటె కొంచెము భిన్నముగ నున్నది. అయినను దీనిపోలిక వానితో కలియుచున్నది. మాంసభక్షక జంతువులలో బిజ్జూ (ఇది పిల్లివంటి యొక జంతువు) ముంగిస, నీటిపిల్లి, భిన్నభిన్నములైనప్పటికి నొకేవిధ ముగ నుండును. హ్వేల్ అను చేపగూడ మాంసభక్షక జంతువే. ఇది మొదట స్థలచరముగ నుండెను. కాని, దీనికిపుడు జలమే గృహమయ్యెను. దీనికాళ్ళు బలహీనమై పడవతెడ్డు వలె నయ్యెను. శారీరికబలముకూడ తగ్గిపోయెను. ఇవి స్తన ధారులు. మాంసభక్షక ప్రాణులు. స్తనధారులలో తీక్ష్ణదంత ములుగల యెలుక, చుంచు, పందికొక్కు, ఉడుత, కుందేలు, పంది ఇవన్నియు నొకే శ్రేణికి చెందిన జంతువులు. ఇవి కొఱికి కొని తినెడువగుటవలన తీక్ష్ణదంతములు గలవనఁబడుచున్నవి. ఎగిరెడి యుడుతకూడ నీ కొఱికికొని తినెడి జంతువులలోనిదే. గబ్బిలముకూడ నీజాతికి చెందినదే. కాని యివి రెండును ఎగి రెడి జంతువులై యున్నవి. వీని పాదముల రచన నేలమీఁద నడచుజంతువులయొక్క ముందుకాళ్లను బోలియున్నది, కావున నివి పరిణామ వాదమునకు సర్వోత్తమమైన ప్రమాణములు,

స్తనధారులలో గోవు, గుఱ్ఱము, ఏనుగు, ఒంటె, లేడి గండకము, పంది, నీటిగుఱ్ఱము మున్నగు వానికి గిట్టలుండును. ఈ గిట్టలకు సంబంధించిన సాధర్మ్యమున కనేక ప్రమాణములు లభించుచున్నవి. ఏనుగున కైదుగిట్టలును, 'టాపీర' మను జంతువునకును, గోవునకును నాలుగు గిట్టలును, గండకమునకు మూడుగిట్టలును, ఒంటెకు రెండు గిట్టలును, గుఱ్ఱమునకొక గిట్టయు నుండును. ఇచట వేళ్ల యొక్క క్రమహ్రాసమువలన పరిణామవాదమున కెంత ప్రబల ప్రమాణము లభించుచున్నది!

ఆస్ట్రేలియా దేశపు కంగారు లేక కాంగరుమూష పరిణామవాదమునకు మిక్కిలి బలమైన ప్రమాణమే. ఆడుకంగారు పొట్టయం దొక సంచియుండును. అది పిల్లలను 2 వారములకు నా సంచిలో నీనును. ఈ సంచియందు స్తనము లుండును. పిల్లలు 2, 5 మాసములకు పెద్దవైన తరువాత నీ సంచినుండి బయటికి వచ్చును.

ఇటువంటిదే మరియొక జంతువు అమెరికా యందును కలదు. దీనిపేరు "ఓపాస్సమ్". దీని పొట్టయందు నొక సంచి యుండును. ఇవిగాక "డకబిల్" "ఈకడనా" అను మఱిరెండు స్తనధారి జంతువులు గలవు. వీనియందుగల విశేష మేమన ఇవి గ్రుడ్లుపెట్టును. కాని యా గ్రుడ్లనుంచు (పొదుగు) టకై వీనికిని పైదానికివలెనే సంచులుండును.

ఈ విధముగా స్తనధారులయం దనేకములు పూర్ణ జరాయుజములును, అనేకములు కంగారువలె నర్ధజరాయుజములును, డకబిల్ వలె ననేకము లండజములునునై కన్పడుచున్నవి.

ఇవి స్తనధారులకు అండజములకు మధ్యవర్తి ప్రాణులు. మొదటి తరగతికి చెందిన స్తనధారు లీ విధముగ నున్నవి.

ఇక ద్వితీయశ్రేణికి చెందిన వెన్నెముకగల పక్షులను గూర్చి విచారింతము.

పక్షులుకూడ ననేక విధములుగ నున్నవి. కొన్ని గింజల నేఱుకొని తినును. మఱికొన్ని మాంసము తినును. కొన్నినీటియం దీదును. పరిస్థితిననుసరించి వీని ముక్కు, కాళ్ళు, పలుచని చర్మముతోఁగూడిన పంజాలు సృష్టించబడినవి. ఆస్ట్రేలియా, ఆఫ్రికా, న్యూజిలాండు, అమెరికా మున్నగు దేశములలోనుండు "ఫెగ్విన్" పక్షికూడ పరిణామవాదమునకు ప్రబలమైన ప్రమాణమే. ఇది నివసించుచోట మఱియొకపక్షి యుండఁజాలదు. అందువలన దీనికిగల యెగిరెడిశక్తి నశించెను. ఇది నీటియం దీఁదుటచే దీని కాళ్ళు పడవతెడ్డువలె నీటిని తెగగొట్టుట కనువుగ నుండును. ఉష్ట్రపక్షికిని, నెమలికి నెగిరెడిశక్తి తగ్గిపోయెను ఏలయన వీని కేపక్షి వలనను భయములేదు. ఇది పరిస్థితిచే లభించిన పరిణామముయొక్క ఉదాహరణము.

వెన్నెముక గలవానిలో మూఁడవశ్రేణి సర్పణశీలములు. ఈ వర్గమున ఉడుము, సర్పము, అజగరము, నక్రమకరములు, తాఁబేలు, మున్నగునవి గలవు. ఉడుముజాతిలోనొక జాతికి ముందుకాళ్ళుండవు. మఱియొకజాతికి వెనుకకాళ్ళుండవు. పామునకు కాళ్ళులేని సంగతి అందఱకు తెలిసినదే. ఇవి కూడ పరిణామవాదమునకు ప్రబలమైన ప్రమాణములే.

## గ్రుడ్లుపెట్టి పొదిగి పిల్లలజేసి పాలిచ్చి పెంచు జంతువులు



ఈకడన



డకబిలు

వెన్నెముకగల జీవులలో కప్పలు నాల్గవతరగతి ప్రాణులు. వీని జీవనచరిత్ర మిక్కిలి విచిత్రము. ఇవి తమపుట్టుక దగ్గఱ నుండి యువావస్థవఱకుగల చరిత్రద్వారా చేపలవలన జనించి నటుల తెలియజేయు చున్నవి. ఇవి మొదట చేపలవలె దవడల తోను, తరువాత నోటితోను, శ్వాసతీసుకొనును. మొదట వీనికి చేపలవలె తోకయేర్పడి తరువాత నశించుచున్నది.

వెన్నెముకగల వానిలో నైదవతరగతి ప్రాణులు చేపలు. చేపలయం దనేక జాతులుకల వను విషయమందఱకు తెలియును. వీని వలనను పరిణామవాదము అనుమానించుటకు తగినంత ప్రమాణము లభించుచున్నది.

ఇఁక నస్థిరహిత ప్రాణులనుగూర్చి విచారింతము.

అస్థిరహిత ప్రాణులయందును పరిణామవాద ప్రమాణ ములు నిండియున్నవి. ఈ ప్రాణుల శరీరములు సంధిపర్వము (పొర)లతో నిర్మాణమయ్యెను. జెఱ్ఱి, తేలు, సాలీఁడు, తుమ్మెద, కణుదురిగ మున్నగు ప్రాణు లీ తరగతికి చెందినవే. వీనియందు భిన్నత్వ మున్నప్పటికిని వీనియన్నిటి శరీరములు చిన్న చిన్న సందులతోను, కణుపులతోను నిర్మాణమగు చున్నవి. ఈ సాధ ర్మ్యమును బట్టి యివన్నియు ఒకే మూలపురుషునినుండి వికసిత మయ్యెనని తెలియుచున్నది. వీని తరువాత నత్యంత సూక్ష్మ మైన అమీబా, హైడ్రా, ప్రాణులు కలవు. వీనికిని పోషణ, శ్వాసోచ్ఛ్వాసలు, మలవిసర్జనము, రక్తప్రసారము, ప్రేరణ, ఆధారస్థానము, జ్ఞానతంతువులు, ప్రసవము మొదలగు ఎనిమిది సంస్థానములు గలవు.

సర్వప్రాణులు వైధర్మ్య యుక్తమైనప్పటికిని సాధర్మ్యమునకు దూరముకావని యింతవఱకు సమస్తప్రాణులయొక్క వంశవృక్షములవలన ఋజువు చేయఁబడెను. ఈ సమస్తప్రాణులను క్రమముగా నుంచినచో మొదట అమీబా; తరువాత, హైడ్రా; తరువాత జెల్లీ, మున్నగు కీటకజాతులయొక్కయు, వెన్నెముకగల చేప, కప్ప, సర్ప, పక్షి, మున్నగువాని యొక్కయు, తుదకు స్తనధారులయొక్కయు స్థానములు గలవని విదితము కాఁగలదు. వీని యాకృతులయందుఁ గల భిన్నత్వమునకు కారణము పరిణామమే. యంత్రము బాగుగానున్నతిని పొందిన పిమ్మట పూర్వపు యంత్రముకంటె భిన్నమగు చున్నటుల, యోగ్యమైనప్రాణి జనించిన పిమ్మట నయోగ్యమైన ప్రాణి వెనుకకు బోవుచుండును. వెనుకటి జాతులయొక్క మిగిలిన యవయవములు దీనికి సాక్ష్య మొసగుచున్నవి. మానవుఁడు కూడ స్తనధారిజంతువుల శ్రేణిలోనివాఁడే. వనమనుష్యుడు, కోతి, లీమర్, మున్నగు జాతు లీశ్రేణిలోనివే. కావున వీని యుత్పత్తి పరిణామముకంటె భిన్నమని తలంచవలసిన యవసరములేదు.

ఈ సమస్త వర్ణనలవలన పరిణామవాదమును, సిద్ధాంతపఱచు విషయము లైదుకలవని తేలుచున్నవి.

౧ – సమస్తప్రాణులు ఆంతరికరచన వలననే కలియుచున్నవి. కాని బాహ్యరచనవలన మాత్రముకాదు.

౨ – చేప, కప్ప, సర్పణశీల ప్రాణి, పక్షి, స్తనధారి, అమీబా, కీటకములు మున్నగు వాని శరీరములను సరిపోల్చి

చూచుటవలన నన్నియు నొకేవిధముగా నిర్మాణము చేయబడి నట్లు ప్రతీతమగుచున్నది.

౩- ఓపాస్సమ్, డకబిల్, ఫెగ్విక్, నెమలి, హ్వేల్, మున్నగు వానివలన, పరిస్థితి కారణమున, వాని శరీరములలో హ్రాసవికాసములు జరిగెను. హ్రాసవికాసములే రెండు భిన్న భిన్న యోగుల నొకదానియందు కలుపుచున్నవని తెలియు చున్నది.

౪- కొన్ని వేఱువేఱు జాతులకు సంతానములు కలుగుటకూడ కనఁబడుచున్నది. కావున నవన్నియు నొకే వంశము నకు జెందినవేయని విదిత మగుచున్నది.

౫- ప్రాణులయొక్క ఉత్పత్తిక్రమము యంత్రమువలెనే మొదట సరళరచనగల, తరువాత క్లిష్టరచనగల ప్రాణులు జనించెనని తెలియజేయు చున్నది. అనగా మొదట నొక కోష ముగల అమీబా, తరువాత రెండు కోష్ఠములుగల హైడ్రా, అనంతరము చిన్న చిన్న క్రిములు, తదనంతరము సంధులుగల కీటకములు, అటుపిమ్మట ఎముకలుగల చేప, ఆతరువాత కప్ప, ఆటుతరువాత సర్పణశీలములు(ప్రాకునవి), ఆ తరువాత పక్షులు, వానికి తరువాత స్తనధారులును జనించెను. నిష్కర్షను వెల్లడిం చుటలో మేము పొరపాటు పడకపోయిన యెడల పూర్వోక్త ద్వివిధ శాస్త్రములయొక్క మతమిదియే. కావున నిక నీ అయిదు విషయములను క్రమముగా విచారింతము.

౧ - శరీరముయొక్క ఆంతరికరచనయే కలయికకు మంచి సాధనము. అయిననగుగాక, ఇందువలన మాకేమియు

నష్టములేదు. కాని యీ శరీర తులనాశాస్త్రమున కేవలము పైకి కనబడువానిని బట్టియే సమస్త శ్రేణులు నిశ్చయించబడె ననుట స్పష్టముగనే యగుపడుచున్నది. స్తనధారిశ్రేణులన్నియు స్తనములనుబట్టియే నిర్ణయించబడెను. ఇది బాహ్యరచనయే గాని ఆంతరికరచనకాదు. మాంసము తినుట, నీళ్ళుత్రాగుట, మైథున సమయమున కొంతసేపు బంధింపబడి యుండుట, చెమట పట్టకపోవుట, చొంగకాఱుట, చీఁకటిలో చూపుకనబడుట మున్నగునవన్నియు వెలుపలి లక్షణములే.

తీక్ష్ణదంతములుగల తరగతికూడ దంతములను బట్టియే నిర్ణయించఁబడెను. ఇది కేవలము వెలుపలి ఘటనయే. సర్పణ శీలము అనగా వడిగా నడచుటకూడ వెలుపలి లక్షణములే.

పక్షు లీఁదుట, మాంసముతినుటకుతగిన వంకరముక్కు మొదలగునవి కూడ వెలుపలి రచనలే. సంధులుగల కీటకముల వఱకు వెలుపలిరచనను బట్టియే వర్గీకరణము చేయఁబడెను. మొదటినుండి తుదివఱకు నీవిధముగా వర్గీకరణ భాగమంతయు బాహ్యరచనపై నవలంబితమై యుండఁగా, నాంతరికరచన మీఁదనే యవలంబితమై యున్నదని యేల చెప్పఁబడుచున్నది?

వేల్, గబ్బిలము, గోవు మున్నగువాని యొక్క స్తనములనుబట్టియే వీనిని స్తనధారులయిన తీక్ష్ణదంతములు గల తరగతిలో లెక్కించఁబడెను.

ఎలుఁగుబంటి, గినీపావుల్, మొదలగువాని శ్రేణి విభాగమందు పొరబాటు జరిగెననియు, నాపొరబాటు నిప్పుడు రక్తశాస్త్రము సత్యమని చెప్పుచున్నదనియు, మొదటనే చెప్పి

యుంటిమి. కావున నీ విధముగా నాంతరిక రచనమీద వర్గ విభాగ మేర్పడజాలదనియే సిద్ధాంతము.

లోపల నెముకలు, నరములు, నాడులు, యకృత్తు, ప్లీహము, గర్భాశయము మున్నగు యాంత్రము లనేకములుగలవు. కాని వీని యన్నింటిని ఎముకలులేని కీటకములయం దెవ రైనను చూపగలరా ? కేవలము కుక్క నాలుకతోను, గోవు గుక్కపట్టియు సిల్లు త్రాగుట మొదలగు ఆంతరిక రచనలనుబట్టి యీ రెండు స్తనధారులని యెన్నటికిని చెప్పజాలరు. ఏలయన నాంతరిక రచన మిక్కిలి జటిలమైనది. కావున నాంతరిక రచనద్వారా వర్గవిభాగ మెన్నటికిని నిర్ణీతము కాజాలదు.

౨ – అమీబానుండి స్తనధారులవఱకు గల రచనా సామ్య సిద్ధాంతముకూడ తప్పే. ఏలయన, నెముకలు లేని వానికిని నెముకలున్నవానికిని మిక్కిలి తారతమ్యము గలదు. ఈ విషయ మింతకు పూర్వము చెప్పబడెను. పరిణామ వాదమైన, నాస్తికత్వము, యూరోపు విజ్ఞాన మంతయు నేకమై భూమ్యాకాశముల నొకటిగా జేసినప్పటికిని వీనికి పరస్పర సంబంధ మున్నదని మాత్రము సిద్ధాంత పఱచజాలదు. అస్థియుక్త ప్రాణులకును అస్థులులేని ప్రాణులకును పరస్పర సంబంధ మేమాత్రమును లేదు. కావున నవి యొకదానినుండి యింకొకటిగ పరిణామమును పొందజాలవు. ఎముకలు లేని వాని కెముక లెటు లుత్పన్నమయ్యెను ? అను నీ ప్రశ్నను విచారించవలసి వచ్చినపుడు గొప్ప గొప్ప పరిణామవాదుల యొక్క మస్తిష్కములుకూడ తల

క్రిందులయ్యెను. అగుచున్నవికూడను, అస్థు లుత్పన్న మగుటకు నాలుగు విధములయిన విధులు చెప్పఁబడుచున్నవి.

(అ) ప్రాణులయొక్క మానసిక ప్రేరణవలన నెముక లేర్పడెను.

(ఆ) కఠినమైన పనిచేయఁగాఁ జేయఁగా మానవుని శరీరమున కాయ లేర్పడుచున్నటుల పరిశ్రమ చేయుటవలన ప్రాణుల శరీరములయం దస్థులు జనించెను.

(ఇ) సున్న మధికముగనున్న పదార్థములు తిన నారంభించినప్పటినుండి యెముక లుత్పన్నమయ్యెను.

(ఈ) శరీరముయొక్క లోపలి అవయవము (నాడు) లే యెముకలయ్యెను.

ఇక నీ నాలుగు విధులయం దెంత విజ్ఞాన మున్నదో యించుక విచారింతము.

(అ) మనస్సుతో సంబంధమున్న, వస్తువుమీఁదనే మనస్సుయొక్క ప్రభావము పడుచున్నది. ఎముకలకు మనస్సుతో నెవ్విధమైన సంబంధము లేదు. పంటికి సూది గుచ్చినను మనస్సుపై నెవ్విధమైన ప్రభావము పడదు. కావున మానసిక ప్రేరణ కారణమున అస్థు లుత్పన్నము కాజాలవు.

(ఆ) పనిచేయుటవలన నేర్పడిన కాయల దృష్టాంతము కూడ సరియైనదికాదు. ఏలయన కాయలు వెలుపలి రాపిడి వలన నేర్పడుచున్నవి. కాని లోపలమాత్ర ముండవు.

(ఇ) ఇటులనే భోజనమువలనకూడ నెముక లేర్పడఁజాలవు. సున్న
ముగల పదార్థముల నటుంచుఁడు. ఎముకలను పుట్టించు పదార్థము
లనే సదా సేవించుచున్నను శరీరమునం దేమాత్రము నెముకలు
జనింపని ప్రాణుల పేరొక్కనెదము. మానవునియొక్కయు పశువుల
యొక్కయు శరీరమున వాని రక్తమే యెముకలను పుట్టించు
చున్నదను విషయ మందఱకు తెలియును. కావున పెను, నల్లి,
గోమారి, యెముకలను జనింపఁజేయు మనుష్యుల యొక్కయు,
పశువులయొక్కయు, రక్తమును త్రాగ నారంభించి లక్షలకొలది
పురుషాంతరములు గడచిపోయినను, నల్లి మొదలగువాని శరీర
ములం దెముక లెందుకు జనియించి యుండలేదు ? చీమలు
మఱుగులకొలఁది యెముకలను తిన్నను. అవి వాని శరీరమునం
దెముకలను పుట్టించుకొనలేక పోయెను. ఇత్యాది ప్రమాణము
లచే నాహారమువలనను, ఎముక లుత్పన్నములు కాఁజాలవనియే
సిద్ధాంత మగుచున్నది.

శరీరమునందలి యితరవస్తువులే - నాడులు మొదలగు
నవియే యెముకలయ్యె ననుటయును యుక్తిరహితమే. ఏలయన
పిల్లలకు మొదట పండ్లుండవు. నెమ్మదిగా కొన్నాళ్ళకు పండ్లు
వచ్చుచున్నవి. కావుననెట్లో నాడులు పండ్లుగా మారెనని యను
కొందమన్నను కొంతకాలమున కా పండ్లూడిపోవుచున్నవి. కాని
పండ్లూడిపోవునప్పుడా పండ్లమూలములం దుండవలసిన నాడు
లేవియు నింతవఱకెవ్వరికి నగుపడలేదు. చూడనులేదు. కాని
అటు లూడిపోయిన పండ్లు మఱల కొన్నాళ్ళకు తిరిగి వచ్చు
చున్నవి. మొదటినాడులు నశించెనని యనుకొనినచో రెండవ

నాడు లెచటనుండి వచ్చెను? మఱియు కొంతకాలమునకు - వృద్ధావస్థ రాఁగానే యీ దంతములు తిరిగి యూడిపోవు చున్నవే? అప్పుడుకూడ నెవ్విధమైన నాడులు బయలు దేఱుట లేదే? వందలకొలఁది మానవుల దంతములను డాక్టర్లు తీసివేయుచున్నారు. కాని వానితోపా టితరవస్తువెద్ది యును వచ్చుటలేదే! దంతములు మేకులువలె వేఱువేఱుగా నిర్మింపఁబడెను. ఇతర శరీరాంగములతో వాని కేవిధమైన సంబంధములేదు. దంతములవలెనే శరీరాస్థి పంజరమంతయు వేఱు వేఱుగనే నిర్మింపఁబడెను. వానికి - అస్థులకు - శరీరముయొక్క- మాంసముతోగాని, నాడులతోగాని, చర్మముతోగాని కించిత్తైనను సంబంధములేదు. కావున నిచట నిపుడు తిరిగి యీ ప్రశ్న జనించుచున్నది. ఇటువంటి విలక్షణమైన వస్తువును ఎముకలు లేని ప్రాణులెట్లు పొందఁగలిగెను?

అస్థి విహీన ప్రాణులలో నెముకలను "పరిస్థితియే" ఉత్పన్న మొనర్చెనని పరిణామవాదులు చెప్పినను జెప్ప వచ్చును. కాని పరిస్థితికూడ నస్థులను నిర్మాణము చేయఁజాల దని చెప్పవలసి వచ్చినందులకు మిక్కిలి చింతిల్లుచున్నారము. స్త్రీ పురుషు లిరువురు ఒకే పరిస్థితియందు జనించి వృద్ధినొందు చున్నారు, కాని స్త్రీలకు గడ్డములుగాని, మీసములుగాని, వచ్చుటలేదు. "హస్తి హస్తినులొకే" పరిస్థితియందు పుట్టి పెరిగి నను ఆఁడు ఏనుఁగునకు దంతము (కొమ్ము)లుండుటలేదు. ఆఁడు నెమిలి, మగనెమిలి, పుంజు, పెట్ట యొకే పరిస్థితియందు జనన మొందినను ఆఁడుకోడికి, ఆఁడునెమిలికి, మగకోడికి, మగనెమిలికి-

వలె వెన్నుమీద సుందరమైన వెంట్రుకలుగాని జుట్టుగాని యుండుట లేదు. కావున నొకే గర్భమునుండి జన్మించిన స్త్రీ పురుషులలో నొకరికి నెముకలను సృష్టించగలిగినట్టియు, రెండవ వారికి నెముకలను నిర్మించ లేనట్టియు భేదమున్నట్లు గోచరించు చున్నది. ఈ విషయము శాస్త్రములం దిట్లు నిర్ణయించబడినది.

యదా నార్యావుపేయాతాం వృషస్యన్త్యౌ కథంచన
ముంచంత్యౌ శుక్రమన్యోన్య మనస్థి స్తత్రజాయతే.

సు|| శా. అ. ౨.

"ఇరువురు స్త్రీలు పరస్పరము మైథునమొనర్చినపుడు స్ఖలితమైన శుక్రము గర్భాశయమున బ్రవేశించినయెడల నెముకలు లేని సంతానము కలుగుచున్నది."

ఋతుస్నాతాతు యానారీ స్వప్నే మైథున మావహేత్
ఆర్తవం వాయు రాదాయ కుక్షౌ గర్భంకరోతిహి
మాసి మాసి వివర్ధేత గర్భిణ్యా గర్భలక్షణం
కలలంజాయతే తస్యావర్జితం పైతృకైర్గుణైః.

సుశ్రు. అ. ౨.

ఋతుస్నాతయైన యేస్త్రీ స్వప్నమున మైథున మొనర్చునో యామె ఋతురక్తమును వాయువుగ్రైకొని కుక్షియందు గర్భము నేర్పఱచుచున్నదో ఆగర్భిణీ గర్భము ప్రతిమాసమునను బెంపొంది తండ్రిగుణములులేని కలల (మాంసపిండ)ము జనించుచున్నది.

తదనంతరము తండ్రిగుణముల నీవిధముగ వర్ణించెను.

కేశ శ్మశ్రు లోమాని నఖాదన్తాః సిరా స్తథా
ధమన్యః స్నాయవః శుక్ర మేతాని పితృజానిహి.

సుశ్రు. అ. ౩.

"కేశములు, లోమములు, గడ్డము, మీసములు, గోళ్ళు, దంతములు, సిరలు, ధమనులు, స్నాయువులు, శుక్రము ఇవి తండ్రి యంశమున జనించు చున్నవి.

కావుననే స్త్రీకి గడ్డము, మీసములు, ఆడునెమిలికిపింఛము, కోడిపెట్టకు జుట్టు, ఆడుఏనుగునకు దంతములును వచ్చుట లేదు. ఈ కఠినపదార్థములు పురుషుల కేందుల కుండును? స్త్రీలకేల యుండుటలేదు? ఒకే కోష్ఠధారియైన అమీబాయందు స్త్రీ యెద్ది? పురుషుఁడెద్ది? ఎట్లు దానివంశము నడచుచున్నది? ముందునకుఁ బోయి యెట్లు, ఎందులకు, ఎప్పుడు- పురుషుఁడు, స్త్రీ అను నీద్వివిధవర్గములు ఏర్పడెను? తరువాత నెట్లు అస్థిహీన ప్రాణులు అస్థిసమన్వితము లగుచున్నవి? ఇత్యాది ప్రశ్నలకు పరిణామవాదులైన నాస్తికులు, సరియైన సమాధానములు చెప్పగలరా? ఏదీ చెప్పమనుఁడు చూతము తడాకా! కావున నెముకలు వానియంతట నవియే ఉత్పన్నము కాఁజాలవనియు, శరీర తులనాత్మకదృష్టితో నెముకలు లేనివానికి, నెముక లున్న వానికి నెట్టిధమైన సంబంధము లేదనియు స్పష్టమగుచున్నది.

ఒకకోష్ఠముగల అమీబా ముందుకు బోయి రెండుకోష్ఠములుగల హైడ్రాగా మాఱెనని చెప్పంబడుచున్నది. అనఁగా

పరిణామ సిద్ధాంతానుసారము, కోష్ఠము సదా ద్విగుణీకృత పరి
ణామముతో (ఒకటి రెండుగను, రెండు నాలుగు, నాలుగు
ఎనిమిది, యెనిమిది పదునారు గను) వృద్ధియగుచున్నదనుట.
ఈ సిద్ధాంతమువలన ప్రతియుత్తరయోనియు ఆకారమునందును
బరువునందును, ఒకటి రెండు, రెండు నాలుగు, నాలుగెనిమిది,
యెనిమిది పదునారుగను కావలసియే యుండును. కాని అట్లు
జరుగుటలేదు.

అమీబా ప్రతిచోటనుండి తనలో రంధ్రము చేసికొను
చున్నది. కావున నది యొకే కోష్ఠముగలదని ఋజువగుటలేదు,
ఒకకోష్ఠము ప్రతిచోటనుండి బ్రద్దలగుచున్నదనిన, లేక బ్రద్దలు
చేసికొనుచున్నదనిన యెడల దానిచే తనరసము (ప్రోటోప్లాజమ్)
ప్రవహింపవలసి యుండును. కాని అట్లుకూడ జరుగుటలేదు.
ఈవిధముగా అమీబానుండి సంధియోనులవఱకును, ఎముకలు
లేనివానినుండి యెముకలు కలవానివఱకు నేవిధమైన శారీరక
సాదృశ్యము కనంబడుటలేదు.

ఇప్పుడే స్తనముల విజ్ఞానమేమనియడుగఁదలంచము. కాని
తులనాత్మకదృష్టితో దీని నవశ్య మడుగఁదలంచితిమి. స్తనధారి
పురుషులలో గుజ్జమునకేల స్తనములు లేవు? దీనికి జవాబు లేనే
లేదుగదా! అమీబాయొక్క ఆకారవికార విషయములుగాని,
అది యొకే కోష్ఠముగలదా? అనేకకోష్ఠములు గలదా యనెడి
విషయముగాని, కోష్ఠవిజ్ఞానముగాని, వానిలో స్త్రీపురుషసిద్ధాంత
మెట్లున్నదనిగాని, సదా రెట్టింపు కోష్ఠములతో నుత్తరోత్తర
యోనులలో పరిణామమొందుట యెట్లుసిద్ధమగుననెడి విషయము

గాని, క్రిముల తరువాత సంధియోనులకును, అస్థులుగల యోనులకును, నడుమ నేవైన ప్రాణులున్నవా? లేవా, యనెడు విషయములుగాని, యింతవఱకుపరిణామవాదులకు తెలియలేదు.

అస్థులయొక్క యుత్పత్తి పరిణామముద్వారా జరుగుట యసంభవము. మగగుఱ్ఱమునకు స్తనములు లేకపోవుటవలన పరిణామవాద క్రమసిద్ధాంత మంతరించు చున్నది. అనగా అమీబానుండి స్తనధారుల వఱకుఁగల శారీరక సాదృశ్యము నం దనేకదోషములును విఘ్నములును కలవు. కావున నీ శాస్త్రము పరిణామవాదమును పోషించుటలేదు.

3. పరిస్థితివలన ప్రాణుల యంగములయొక్క హ్రాస వికాసములు జరుగుచున్నవనియు, పరిస్థితి కారణముననే ఓపాస్సమ్, డకబిల్, ఫెగ్విన్, నెమిలి, హ్వేల్, నిప్పుకోడి మున్నగు వానిశరీరములయందు హ్రాసవికాసములను తెలియజేయు చిహ్నము లగుపడుచున్నవనియు, ప్రాణులను చూచుట వలననే యే విధముగా ప్రాణుల శరీరములందు మార్పుకలిగినది తెలియ గలదనియు, పరిణామవాదులైన నాస్తికు లనుచున్నారు.

నాస్తికు లేప్రమాణముల యాధారముతో పై ప్రాణుల యొక్క అంగములలో పరిస్థితికారణమున హ్రాసవికాసములు జరిగెనని చెప్పగలిగిరి? హ్వేల్ కాళ్ళు, నెమిలి నిప్పుకోడి ఱెక్కలు బలహీనము లయ్యెనని చెప్పుటకెవ్వరి కధికారము కలదు? హ్వేల్ కాళ్ళు నీటియం దీదుటకు సమానముగా పని చేయుచున్నపుడది మొదట స్థలచరమనుటయు,నిపుడది నీటియం దుండుటచే దానికాళ్ళు బలహీనమయ్యె ననుటయును ఘోర

బాటే. మఱియు నది మొదట స్థలచరమనియు, దానికాళ్ళు బల
ముగ నుండెననియు, నెట్లు తెలిసికొనబడెను ? ఇటులనే నెమిలి,
నిప్పుకోడికూడ ఆవి ఒడ్డుపొడుగులందు గొప్పవి. వీనికి నితర
పక్షుల భయ మేమాత్రమును లేదు. విరోధులనుండి తప్పించు
కొనుటకు వానికి నెఱకలు కలవు. కావున పరిస్థితి కారణమున
వానిఱెక్కలు బలహీన మయ్యెననుట కేవలము కల్పనా
మాత్రమేగాని వేఱొండుకాదు. ఇప్పుడుకూడ నెమిలిని కుక్కలు
పట్టుకొను చుండగా "దానికెవ్వగును శత్రువులులేరు, ఎగిరెడి
పనిలేకపోవుట వలన దానిఱెక్కలు బలహీనమయ్యె"నని యెటు
లనుమానించ బడగలుగును ? సెబాస్ ! ఱెక్కలవంటి యుత్తమ
వస్తువుల నెవరైన నూరకే బలహీనము కానిత్తురా ?

ఎగిరెడి విమానవిద్యచే మానవులు కృతార్థులగు
చుండగా ఎగిరెడి ఱెక్కలను ఈశ్వరునివలన పొందికూడ
పక్షిగణము వానినూరకే పోగొట్టుకొనెనా ? ఆహా ! యెంత విప
రీతము ! ఇపుడు పక్షులకు శత్రువులు లేరా ? ఉన్నచో నవి యే
ఆశపై తమఱెక్కలను పాడుజేసికొని పశురూపమును ధరిం
చెను ? ఇట్టికల్పనలు ప్రమాణరహితములు కావా ?

ఇటుల పరిస్థితికారణమున అంగములు అదృశ్యమగుట
లేదనియు నూతనాంగములు స్ఫురితమగుట లేదనియు బుజు
వగుటలేదా ? అంగములు జనించుటకు పరిస్థితియే కారణమైన
మొదలనాఁడు ఏనుగునకుకూడ షద్దదంతములుండవలయునుగదా!
స్థలమైన నాఁడు, మగయేనుగుల యొక్క పరిస్థితి సమానము

గనే యున్నది. కావున పరిస్థితికారణమున హ్రాసవికాసములు జరుగుట సిద్ధమగుటలేదు.

శరీరము పరమేశ్వరుని ద్వారా సుఖదుఃఖముల ననుభవించుటకు లభించుచున్నది. ప్రతిప్రాణి తనకర్మల ననుసరించి సుఖదుఃఖముల ననుభవించుటకుఁ దగిన యోనియందు జనించి కొంతకాల మాశరీరముయొక్క యాధారముతో సుఖదుఃఖములను భోగించుచున్నది.

పరిణామవాదమును సరళిమొనర్చుటకై పరిణామవాదులు వర్గీకరణము చేసిరిగాని అందేమాత్రము జీవశక్తి లేదు. హ్రాసవికాసము లుదాహరణముగా జూపఁబడిన వర్గములయొక్క భేదమును ఇంతకుపూర్వము అమీబా హైడ్రాలకును ఎముకలు గలవానికిని, నెముకలు లేనివానికిని, గుఱ్ఱమునకు నితర స్తనధారులకును నడుమ జూపియుంటిమి. ఆ వర్గములయొక్క ఆభేదమునే వారు పూర్తి జేయుటకు ప్రయత్నించిరి. సమస్తజాతులయొక్క ఆయువు భోగములు వేఱువేఱుగా నియతములై యున్నవి. వాని శరీరములయం దగుపడు హ్రాసవికాసములు పరిస్థితి మొదలగువానిచే నేర్పడక వానివాని పూర్వజన్మకర్మానుసార మీశ్వరవ్యవస్థచే సుఖదుఃఖముల ననుభవించుట కొఱకే యేర్పడినది.

౨ – భిన్నభిన్నము లయిన రెండుజాతులయొక్క మిశ్రణము వలన వంశము నడచు ననెడు సిద్ధాంతముకూడ కల్పనమే. ఏలయన, వేఱు వేఱైన రెండుజాతులయొక్క కలయిక వలన జనించు సంతాన మొకేజాతికి చెందిన రెండు విభక్త

-ప్రాణులు మాత్రమేగాని వేఱువేఱు జాతులుకావు. పూర్తిగా భిన్నములయిన రెండు జాతులయొక్క కలయికవలన సంతానము కలుగుటలేదు. ఒకవేళ నెచ్చటనైన నట్లుజరిగిసంతానముకలిగినను ఆసంతానమునకు మరల సంతానము కలిగి వంశము నడచుట లేదు. అనఁగా కొన్ని జాతులయొక్క మైథునము నిరర్థక మగు చున్నది. కొన్నింటికి సంతానము కలుగుచున్నది. కాని అట్టి వానికి తిరిగి సంతానము కలుగుటలేదు. వానివంశము నడచుట, నింతవఱకు చూడబడలేదు. కాని వ్యాఘ్రము, సింహము, కుక్క, తోఁడేలు, వీనికి పరస్పర సంయోగము వలన సంతానము కలుగుచున్నదని వినుచున్నారము. జంతు ప్రదర్శన శాలలందును మాచుచుంటిమికూడ. తోఁడేలు, కుక్క సంయోగమువలన సంతానము కలుగుచున్నది. వేటగాండ్రిటువంటి కుక్కలనే యధికముగా కోరుచుందురు. ఏలయన నిటువంటి కుక్కలకు కుక్క జాతికి గల విశ్వాసముతోపాటు శూరత్వముకూడ నధికముగ నుండును. కావున నిచట "కేవలము సంతానము మాత్రమే కలుగును గాని ఆజాతి యొక్క వంశము నడచుట లేదనియే" సూచిత మగుచున్నది. ఇది గుఱ్ఱమునకును గాడిదకును జనించిన కంచరగాడిదయందును, అంటుమామిడి యందును మిక్కిలి బాగుగా కనఁబడుచున్నది. గుఱ్ఱమునకును, గాడిదకును ఖచ్చరము జన్మించుచున్నదేగాని తిరిగి యాకంచరగాడిదకు సంతానము కలుగుట లేదు. ఇదే విధముగా బంగినపల్లిటెంక వలన తిరిగి తద్వత్తుగా ఫలించు మొక్క మొలచుటలేదు. కావున నవి పూర్తిగా సజాతీయములు గావని యెఱుంగ వలయును, అంటుమామిడిటెంక మొక్కకు కాయలు కాచినను

అవి నెమ్మది నెమ్మదిగా తగ్గుచు, దేనికి అంటు కట్టబడినదో యామూల బీజముయొక్క ఆకారమును రుచిని పొందుచున్నది.

పరిణామవాద సిద్ధాంతము కేవలము సంతానోత్పత్తిని జేయుటయేగాక వేఱుజాతి నుత్పత్తిజేయుట, వంశమును నడపించుట, కూడ నై యున్నది. ఇరువురుస్త్రీలు సంయోగమొనర్చి కూడ సంతానమును గనుచున్నారు. కాని యది నిజమైనబిడ్డ యనఁబడునా? అట్టి సంతానమునకు ఎముకలుగాని ప్రాణము గాని వంశమును నడపించు శక్తిగాని లేనపుడు దేనినో యొక దానిని పుట్టించుటవలన నేమి ప్రయోజనము?

అమెరికాలో లూథర్ బర్ బ్యాంకు అను విద్వాంసు డనేక విధములయిన వృక్షములయొక్క విత్తనములచే ననేకవిధము లైన ఫలపుష్పముల నుత్పత్తి జేసెనని వినుచున్నారము. కాని సజాతీయ మిశ్రణము వలననే సంతానము జనించి వంశము నడచునుగాని అన్యథా వంశము నడవఁజాలదు. కావున బర్ బ్యాంకుకూడ నటులే యొనర్చి యుండవచ్చును. శాస్త్రములు కూడ నటులే చెప్పుచున్నవి. "సమాన ప్రసవాత్మికా జాతిః" అనగా సమాన ప్రసూతి ప్రతిపత్తులు కలిగినటువంటిదే జాతి. ఈప్రసవసామ్యము శాస్త్రములయందిటుల చెప్పబడియున్నది.

"సతిమూలే తద్విపాకో జాత్యాయుర్భోగః"

అనగా పూర్వజన్మ కర్మలయొక్క ఫలము, జాతి, భోగము, ఆయువులద్వారా లభించుచున్నది. పరస్పర సంయోగమువలన సంతానము కలుగజేయునదే జాతిభోగము. ఆయు

వులు సమానముగా నున్నవానియందే ఈ సంతానము కలుగును. మాంసాహారిప్రాణికి శాకాహారిప్రాణితో సంయోగము జరిగి సంతానము జనించి వాటివంశము నడచుటయు, నొకదాని యాయువు 30 సం॥లు, మరియొకదాని యాయువు ౧౬ సం॥లు గల భిన్నజాతులకు సంతానము కలిగి వాని వంశము నడచుటయు నెన్నటికిని జరుగఁజాలదు. అనఁగా దేని ప్రసవము సమానముగ నుండునో, దానిభోగము ఆయువు సమానములుగా నుండును. ఏలయన, శరీరము కర్మఫలమును భోగించు నిమిత్తమే లభించుచున్నది. ఇంతియకాక ఇన్ని సం॥ల వఱకు నీ శరీరముతో ఫలానాభోగము ననుభవించవలయు ననెడు నిష్కర్ష కూడ కలదు.

భోగముల విషయమున పరిస్థితి యను సాకుతో నొకజాతికి జీవించుటకు దాని నియమితాహారము దొరకకపోయినపుడది మాంసము తినసాగెనని చెప్పవచ్చును. కాని ప్రతిజాతికి నాయువు భిన్న భిన్నముగ నేల నిశ్చయించఁబడెనో పరిణామవాదులగు నాస్తికు లెవరైనను కారణము చెప్పఁగలరా ? అధిక పరిచయములేని కారణమున నేప్రాణి యెంతకాలము జీవించ గలుగునదియుఁ జెప్పఁజాలము. కాని మానవుఁడు, క్రోతి, మేక, ఆవు, ఒంటె, గాడ్దిద, చిన్న చిన్న కీటకములు మున్నగు వానియొక్క ఆయుస్సులలో గొప్ప భేదము కలదు. కావుననే

"మానవుఁ డెందుకు నూఱు సం॥లు జీవించెడుప్రాణి యయ్యెను? ఇతరప్రాణులుకూడ ఫలానా ఫలానా కాలమువఱకు నెందులకు జీవించుచున్నవి?" యను ప్రశ్న స్వయముగ నుపస్థితమగు చున్నది. * దీనికి సమాధానము పరిణామవాదులైన నాస్తికుల విజ్ఞానమునందు లేదు. ఇంతియకాక దీనికి పరిణామవాదులైన నాస్తికు లెప్పటికైనను సమాధానము చెప్పుటకు ప్రయత్నించు నెడల వారు తమ సిద్ధాంతములను దప్పక మార్చుకొనవలసి యుండును. ఏలయన, ప్రపంచమునఁగల ప్రాణులయొక్క ఆయుఃక్రమము మిగుల విలక్షణముగ నున్నది.

వెన్నెముక గలవానిలో సర్పణశీలముల శ్రేణియును కలదు. అందే పాము, తాఁబేలును కలవు ఆయుర్ విజ్ఞాన వేత్తలు తాఁబేలు ౧౫౦ సం॥లును, సర్పము ౧౨౦ సం॥లును జీవించునని చెప్పుచున్నారు. సర్పణశీలమే పక్షులుగా పరిణామ మొందెనని పరిణామవాదులైన నాస్తికు లనుచున్నారు. అట్టి పక్షులలో పావురము ఎనిమిది సం॥లు జీవించుచున్నది. ఈపక్షుల యొక్క పరిణామమే స్తనధారులని చెప్పబడుచున్నది. వీని యందాయుశ్శాస్త్రానుసారము కుందేలు ౮ సం॥లును, కుక్క—

* శతమాయుర్మనుష్యాణాం గజానాం పరమం స్మృతం
చతుస్త్రింశత్తు వర్షాయా మశ్వస్యాయుః పరం స్మృతం
పంచవింశతివర్షాహి పరమాయుర్వృషేష్వపి. (శుక్రనీతి)

౧౪ సం॥లును, గుఱ్ఱము ౩౨ సం॥లును, కోఁతి ౨౧ సం॥లును, మనుష్యుఁడు ౧౦౦ సం॥లును జీవించుచున్నాఁరు. *

పరిణామమునం దాయుఃప్రమాణము తగ్గిపోవునని యిందుమూలమున నిచట స్పష్టముగా నగుపడుచున్నది. తాఁబేలు ౧౫౦ సం॥లును, సర్పము ౧౨౦ సం॥లును జీవించుచున్నవి. కాని జీవన సంగ్రామమున వీనిని పరాజితమొనర్చ గల యోగ్యమైన పావురము ౮ సం॥లు మాత్రమే జీవించుచున్నది. దీనికంటె నధికయోగ్యమైన స్తనధారి శశకము, కుక్క, గుఱ్ఱము కూడ క్రమముగా ౮-౧౪-౩౨ సం॥లే జీవించుచున్నవి. మానవునికంటె తక్కువయును, అన్ని ప్రాణులకంటె, శ్రేష్ఠమునైన కోఁతి కూడ ౨౧ సం॥మే జీవించుచున్నది.

| * ప్రాణులు | కుందేలు, | పావురము | కోతి | కుక్క | మేక | పిల్లి |
|---|---|---|---|---|---|---|
| ఒక నిమిషములో శ్వాస. | ౩౮ | ౩౬ | ౩౨ | ౨౯ | ౨౪ | ౨౫ |
| ఆయుర్వత్సరములు | ౮ | ౮ | ౨౧ | ౧౪ | ౧౩ | ౧౩ |

| | గుఱ్ఱము | మనుష్యుడు | యేనుగు | సర్పము | తాబేలు |
|---|---|---|---|---|---|
| ఒక నిమిషములో శ్వాస. | ౧౯ | ౧౩ | ౧౨ | ౮ | ౫ |
| ఆయుర్వత్సరములు | ౩౨ | ౧౦౦ | ౧౦౦ | ౧౨౦ | ౧౫౦ |

మరియూ వైజ్ఞానిక పరీక్షణలద్వారా యీ క్రిందివి ఈ విధముగ జీవింప గలుగుచున్నవని సిద్ధాంతీకరించబడెను.

వేల్ ౪౦౦, ఖాద్య కూర్మము ౩౦౦, పాయిక్ చేప, ౨౦౦, జోగ ౧౦౦, రాజహంస ౧౦౦, కాకి ౧౦౦, వామర్ చేప ౧౦౦, కొంగ ౬౦, చిలుక ౬౦, బార్ చేప ౬౦, హంస ౫౦, గద్ద ౫౦, సింహము ౪౦ చింపాంజీ ౪౦, ఒంటె ౪౦, ఓరాంగు ౪౦, పిచ్చుక ౪౦ చక్రవాకము ౩౦, సెమలి ౨౪, సారసము ౨౪, బుల్‌బుల్ ౧౮, తిత్తిరి ౧౫, కోడి ౧౪, [illegible] ౧౨ చూరెలుక ౨.

కాని యింత యోగ్యతను, ఇంత యున్నతిని పొందినప్పటికిని మానవుఁడు నూఱు సం॥లు మాత్రమే జీవించఁగలుగుచున్నాఁడు. కాని సర్పము, తాఁబేలుయొక్క ఆయువువరకు కూడ చేరలేక పోయెను!

"జీవన సంగ్రామమున యోగ్యములైనవే యుండును. వానివలననే నూతనజాతు లుత్పన్నమగు"నని పరిణామవాదులైన నాస్తికు లనుచున్నారు. కాని పరిణామమొంది ప్రాణులెట్టి లాభమును, ఎట్టి యోగ్యతను, సంపాదించుకొనెనో విదిత మగుటలేదు. జీవించుటకై సంగ్రామమొనర్చి యోగ్యతను బడసెను. రూపమును మార్చుకొనెను. కాని మృత్యువును మాత్రము సమీపించెను. సరళరచనగల ప్రాణు లధిక కాల మును, క్లిష్టరచనతో తరువాత వచ్చిన ప్రాణులు తక్కువ కాలమును జీవించుచున్నవి. మొదటియంత్రము ౧౫౦ సం॥లు జీవించగలుగుటయు, నాయంత్రమే తరువాత బాగుపడి ౮ సం॥లు జీవించుటయునా? ఆహా! యెంత బాగున్నది పరిణామ వాదులైన నాస్తికులయొక్క యాంత్రిక వికాసము?

సర్పణశీలములే పక్షులు కావచ్చునని యనుకొందము. కాని సంధులుగల కీటకములకు (తుమ్మెద, సీతాకోకచిలుక, ఈగ మొదలగు వానికి) ఱెక్కలెటుల వచ్చెను? ఎగిరెడు చేపల కెట్లు ఱెక్కలు గలిగెను? వీనితో పక్షుల శరీరములెట్లు సరిపోల్చ బడును? ఈ కీటకములతో, చేపలతో, పక్షులకెట్టి సంబంధము కుదురును? ఏ పక్షివంశమైనను ఱెక్కలుగల యా కీటకముల వలన మఱియు, చేపలవలన, స్థాపించ బడగలదా? కోతి మఱియు

మానవునివలన వంశము స్థాపించబడగలదా? అదిముందుకు నడవ
గలదా ? అటు లెప్పటికిని జరుగజాలదు.

౫– సరళమైన రచననుండి క్లిష్టరచన క్రిమముగా జరు
గుచున్నదని చెప్పబడుచున్నది. మొదట సరళములైన ప్రాణు
లును, తరువాత క్లిష్టరచన ప్రాణులును, జనించెననుట విశ్వసింప
దగిన విషయమే. కాని యీ సరళరచన ప్రాణులే క్లిష్టరచన
ప్రాణులుగా మారెననుట సర్వథా మాన్యము కాజాలదు. ఏల
యన, కీటావస్థయందే యెగిరెడు పక్షులవంటి క్లిష్టరచనగల కీట
కములు, చేపలు కనఁబడుచున్నవి. జెఱ్ఱివంటి క్లిష్టరచన, పాము
నందుగాని, సీతాకోకచిలుకయం దున్నటువంటి శిల్ప చాతు
ర్యము కాకియందుగాని, యగుపడుట లేదు. కాని సీతాకోక
చిలుక, జెఱ్ఱి, సర్పములకంటె పూర్వమే జనించెనని పరిణామ
వాదులే యనుచున్నారు. కావున సరళరచనయందుఁగాని
క్లిష్ట రచనయందుగాని కించిత్తైనను విలువ లేదు.

పరిణామవాదులు సీతాకోకచిలుక మొదలగు వానిరచన
క్లిష్టరచనయునక కేవలము అస్థులుగల మానవాదులరచనయే క్లిష్ట
రచనయని చెప్పినను జెప్పవచ్చును. కాని అస్థులుగల మాన
వాదుల రచనకంటె చెట్లరచన మిక్కిలి యధికక్లిష్టముగనున్నట్లు
ప్రతీతమగుచున్నది. ఏలయన వృక్షములలో నెముకల స్థానము
నం దనేక కొమ్మలు, శాఖలు, ఆకులు, పుష్పములు, ఫలములు;
చూచెడి, గాలిపీల్చెడి, యంగములు మిగుల నద్భుతముగా
నిర్మాణ మొనర్చబడియున్నవి. వానిరచనా చాతుర్యము
ముందఱ మానవుని శరీరమెందులకును కొఱగాని దగుచున్నది

ఒక పుష్పమునుగూర్చి రంగు రూపము, వాసన మున్నగు వానిని విచారించినచో సర్వము విదితము కాఁగలదు. కావున మానవుఁడు వృక్షములరచనతో కించిత్తైనను పోటీచేయజాలఁడు. కాని పశువులకును, పక్షులకునుగల స్వాతంత్ర్యముగాని, మానవున కున్నటువంటి జ్ఞాన విజ్ఞానములుగాని వృక్షములకు లేవు. కావున మేము వానిని సరళరచనము లనుచు, భోగ్యములని నిరూపించు చున్నారము.

మొదట భోగ్యము, తరువాత భోక్త జనించుట సృష్టి నియమము. కర్మానుసారము ప్రాణియే భోగ్యము, భోక్తయునగు చున్నది. ఎట్లన సరళరచన భోగ్యము. క్లిష్టరచన భోక్త. వనస్పతులు పాఱిపోయినచో పశువు లెట్లుజీవించును? గుఱ్ఱము మానవునికంటె నెక్కుడు తెలివిగలదైన యెడల నెవరు దానికి సవారీ పని యొసఁగుదురు? ఈ వ్యవస్థానుసారము మొదట వనస్పతులును, తరువాత పశువులును, ఆతరువాత మానవులును జన్మించిరి. ఇట్టి యుత్పత్తి క్రమము సర్వదా మాన్యము. ఇదికొత్తది కాదు, వేద ప్రతిపాదిత మగుటచే నతి ప్రాచీనము. ఎట్లన?

సంభృతం పృషదాజ్యం పశూగ్ స్తాగ్శ్చక్రే...
వాయవ్యా నారణ్యాన్ గ్రామ్యాశ్చయే
తేన దేవా అయజన్త సాధ్యా ఋషయశ్చయే॥

యజు. అ. 3౧. ౬.

పరిణామవాద, నాస్తికత్వ పోషక మగు తుల నాత్మక శరీర శాస్త్రముతోనే యింతవఱకు విస్తృతముగా సమాలోచ

చేసి సిద్ధాంతీకరించిన విషయములన్నింటిని పాఠక మహాశయులు చదివితిరి. పరిణామవాద మింత దౌర్బల్యము గలదగుట వలననే పరిణామ వాదులుకూడ—

"శరీర రచనాశాస్త్రమున ప్రాణుల రచనాసంబంధము నందే సామాన్యతత్త్వము జ్ఞాతమయ్యెనో దానిని తెలిసికొనుటకు అనుమాన ప్రమాణములతోనే యధికముగా పనిచేయ వలసివచ్చెను. ఏలయన భిన్నభిన్న ప్రాణుల రచనయందే సమానత్వము, భేదము, ప్రతీతమయ్యెనో, దానిపై విచారణ సలిపి శాస్త్రీయ, తార్కిక శైలితో ననుమానము మీఁదనే పరిస్థితి కనుకూలించు వికాసమును సిద్ధాంతపఱచ వలసి వచ్చెను. ప్రత్యక్ష ప్రమాణము లచట నెందులకును పనికిరాలేదు." అని తెఱచుగా ననుచున్నారు.

కావున నింతవఱకు పరిణామవాదము సిద్ధించలేదని పరిణామవాదులు చెప్పుచున్నదానివలననే స్పష్టమగుచున్నది.

---

## భూగోళ విభాగశాస్త్రము

ఇదికూడ నొకవిధముగా తులనాత్మక శరీర రచనా శాస్త్రమున నొకయంగమే. దీనివలనను పరిణామవాదముయొక్క స్వరూపము మాత్రమే జ్ఞాతమగుచున్నది. ఈశాస్త్రము పరిణామవాదమున కెటు లుపకరించు ననెడు విషయమునుగూర్చి

అం దీ విధముగ చెప్పబడినది.

"ఏప్రాణు లెచ్చటెచ్చట నుండియుండెడివారు, ఎచ్చెచ్చట వర్తమానమునందుకూడ నున్నవో వానిని విచారించి సాధారణ సిద్ధాంత మొనర్చుటయే ఈశాస్త్రముయొక్క పని. ప్రపంచమునం దిపు డెన్నిరకముల ప్రాణులు విద్యమానమై యున్నవో వానియస్తిత్వము అనాదినుండియు లేదు. ఈభూమి మీాద ప్రాణులు పుట్టుకలు ప్రారంభ మైనపుడు మొదట మిక్కిలి సరళరచనాప్రాణు లుత్పన్న మయ్యెను. తరువాత పరిస్థితి మాత్ర నట్లెల్ల దాని కనుకూలముగ నధిక క్లిష్టరచనగల భిన్నభిన్న ప్రాణు లుత్పన్నమయ్యెను."

సింహము, వ్యాఘ్రము భారత దేశమునం దే కలవు. గాని ఇంగ్లాండునందు పుట్టుట లేదు. వేడివలన జనించు పాము, తేలు మున్నగు నితరప్రాణులుకూడ శీతమైన యూరోపునందు జన్మించుట లేదు జీరాఫీ ఆఫ్రికాయందును నెమిలి భారత దేశము నందును పుట్టుచున్నవి. ఆంగ్లేయులు, జపానులు, సిద్దీలు మున్నగు వారుకూడ తమతమ దేశములయం దే పుట్టుచున్నారు. రంగు లందును రూపములందును భిన్నత్వము కలదు. ప్రాణులయం దును వనస్పతులయందును భిన్నత్వ మున్నటు లే మానవుల యందును భిన్నత్వము కలదు. ఆస్ట్రేలియాకు యూరోపువారు వెళ్ళకపూర్వ మచట కుందేలు లేదు. అచట కుందేలునకు తగిన జలవాయువులుమాత్ర ముండెను. కాని కుందే లచటికి చేరుటకు ప్రతిబంధక రూపముగా సముద్రముండుటచే నది యచటకు చేర లేకపోయెను. ఈప్రతిబంధకమును తొలగించి ఓడద్వారా కుందె లచటకు చేరినపు డవి యచటకూడ నేర్పడెను. అనగా నేప్రాణి

మైనను ఎచటనైనఁజేరియచట తనసంతానమును వెంపొందఁజేయు నంతవఱకు నే ప్రాణియైనను తనంతట తానుగా నెచటనైనను పుట్టఁజాలదని భావము.

చిత్రవిచిత్ర ప్రాణులకు 'గేలాపేగసు' ద్వీపము మిక్కిలి ప్రసిద్ధము. అచట ఉడుము, తొండ, బల్లి, సర్పము, పక్షి, ఈ తరగతి జంతువు లధికముగఁగలవు. ఇట్టి జంతువులు ఆఫ్రికా, అమెరికా, భారతము మున్నగు దేశములయందును విద్యమానమైయున్నవి. కాని అన్నిటికంటె నమెరికా ప్రాణులతో నీ 'గేలాపేగసు' ప్రాణుల కధిక సంబంధముకలదు. ఇవి అమెరికావానియొక్క ఆనువంశజములగుటయే అటులుండుటకు కారణము. ఈ ద్వీపమునకు దగ్గఱ నమెరికా యుండుటచే పూర్వమొకప్పు డీ ద్వీపము, అమెరికా కలసి యుండవచ్చుననియు, నప్పు డమెరికానుండి యీ ప్రాణు లచటకువెళ్ళి యుండవచ్చుననియు, ప్రతీతమగుచున్నది. ఒకద్వీపమునుండి మఱియొక ద్వీపమునకు, నచటనుండి మఱియొక ద్వీపమునకు ప్రవేశించి యుండవచ్చును. కావున పరిస్థితి మాఱిన కారణమున కొద్దిగా భిన్నత్వ మగుపడుచున్న దేకాని అన్నియు నొక్కపూర్వికుని సంతతియే.

ఓజర్సుద్వీపము ఆఫ్రికాకు వాయవ్యముగ నున్నది. అచటి ప్రాణులు ఆఫ్రికాప్రాణుల నధికముగా బోలియున్నవి. పసిఫిక్ మహాసాగరమందును అనేకద్వీపములు గలవు. వీని యందు నత్తగుల్లలజాతు లనేకమున్నవి. పూర్వకాలమునం దీ ద్వీపసముదాయముల భూమి యొకటిగా నుండెనని భూగర్భశాస్త్రవేత్త లనుచున్నారు.

కావుననే యన్నిరకముల నత్తగుల్లలకు కలయిక కలదు. రెండు ప్రదేశముల ప్రాణులయొక్క సమత్వ భిన్నత్వము లా రెండుప్రదేశములకు గల దూరము లేక సమీపముపై నవలంబితమై యుండును. రెండు దేశములకును దూర మధికముగ నున్న యెడల భిన్నత్వ మధికముగను, దూరము తక్కువగ నున్న యెడల సమత్వ మధికముగ నుండును. కాని అచ్చటచ్చట దూరస్థ దేశప్రాణులయం దధిక సమత్వము కనఁబడుటకూడ కలదు. ఎట్లన- బ్రిటనునకును, జపానునకును దూర మధికముగా కలదు, కాని యీ రెండు దేశములయొక్క ప్రాణులయందు సమత్వ మధికముగా కలదు. కాని ఆస్ట్రేలియా, న్యూజిలండు, మిక్కిలిదగ్గఱ దగ్గఱగానున్నవి. అయిననుఅచటి ప్రాణులకు గొప్ప వైషమ్యముగలదు. ఈ రెంటినివేఱువేఱుచేయుటకుప్రకృతియొక్క ప్రతిబంధకమే కారణము. రెండు దగ్గఱ దేశములను కొండలు వేఱుచేసిన యెడల నొక ప్రదేశపు నదుల కాల్వలయం దుండు చేప లెట్లుండునో యితర ప్రదేశములయం దుండెడి వట్లు లుండవు, ఏలయనచేపలు పర్వతములను దాటి పోజాలవు. కావున సమీపమునం దున్నను, నచ్చటచ్చట నేకత్వముండఁ జాలదు, కాని దేశము దూరమునందున్నను, రాకపోక లున్నయెడల సమత్వ మధికముగా నుండగలదు. ఇట్టి ప్రమాణములను గాంచియే భౌతిక వాదులైన నాస్తికులు ముక్త కంఠముతో నిట్లు నుడువుచున్నారు.

"ఇట్టిప్రాణులన్నియు నొకే జాతియొక్క ఆద్యవంశజుల సంతతి, అనుసంతతుల. ద్వారా జనించెను, వర్తమానము

నం దున్న వీని భిన్న భిన్న రూపములు పరిస్థితి కనుకూలముగ నేర్పడెను."

ఈ శాస్త్రము నింతవఱకు విచారించుటవలన నైదు విషయములు పరిణామవాదమున కనుకూలముగ నున్నట్లు ప్రతీతమగుచున్నది.

౧. మొదటి ప్రాణులు సరళముగను, తరువాత ప్రాణులు క్లిష్టముగను నిర్మాణమయ్యెను.

౨. ఏప్రాణియైనను ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు బోనంతవఱకు నది యచట స్వాయముగ నుత్పన్నము కాఁజాలదు.

౩. భిన్న భిన్న దేశముల ప్రాణులయం దున్న సమానత్వము అవి యొకేవంశమునకు చెందినవని సూచించుచున్నవి.

౪. సమానత్వమునకు కారణము దూరముగాని, దగ్గఱగాని కాఁజాలదు. కాని వంశపరిస్థితులు మాత్రమే కారణమై యున్నవి.

౫. పరిస్థితి కారణముననే ఒక్క మూలప్రాణి యనేక శాఖలై అనేక యోనులుగా మాఱెను.

వీనినిబట్టి యీ ప్రకరణముయొక్క సారాంశము తేలెననియే విదితమగుచున్నది.

"స మీ క్ష"

౧. మొదటిప్రాణి సరళముగను, తరువాత ప్రాణులు క్లిష్టముగను నిర్మాణమయ్యె ననెడు విషయమునుగూర్చి లోగడ

సమాలోచనచేసియే యుంటిమి. అచ్చట సమస్తవిషయముల నుదాహరణగాచూపి భోగికంటె భోజ్యము ముందుజన్మించునని నిరూపించితిమి. కావున నీ క్రమము ననుసరించి భోజ్యము సరళమనియు, క్లిష్టము భోక్తయనియు చెప్పవచ్చును. కాని పరిణామవాదులు చెప్పెడి సరళత్వమునందును, క్లిష్టత్వమునందు నేమాత్రము జీవశక్తిలేదని ఋజువైనది.

౨. ఏప్రాణియైనను ఒక స్థానమునుండి మఱియొక స్థానమునకు జేరనంతవఱకు నచట దానియంతట నదియే పుట్టఁ జాలదు. ఏప్రాణియైనను తనంతఁ దానే పుట్టఁగలిగిన యెడల ఆస్ట్రేలియాలో మొదటనే కుందేలుపుట్టి యుండును. ఏలయన నచటి జలవాయువులు కుందేలున కనుకూలముగనే యుండెను గదా! కాని అట్లుజరుగక యెవరో యొకరు కుందేలును ఆస్ట్రేలియాకు తీసికొని వెళ్ళినతరువాతనే యచట కుందేళ్ళు ఉత్పన్నము కాసాగెను. భారతదేశపు నెమిలి యింతవఱకు నితరప్రదేశముల కధికముగా చేర్చబడకపోవుటయే వాని సంతతి యితర ప్రదేశములలో లేకుండుటకు కారణము. కానియెచటకుజేరెనో అచట వానిసంతతికూడ కలదు. ఇంతవఱకు నెచటను ఏనూతనజాతియు తనంతట తాను స్వయముగా పుట్టియుండలేదు. ప్రకృతి ప్రతి చోట విద్యమానమైయుండి ప్రతిచోట ప్రాణులకు జలవాయువు లనుకూలముగనున్నపుడేదోయొక స్థానమున క్రొత్తగా అమీబా జన్మించి అదినెమ్మదినెమ్మదిగా నొకనూతన జాతిని నిర్మించ లేకపోవుట కేమికారణమై యుండును? ఎందులకనగా పురాతన సృష్టియొక్క ప్రాణులలోనే పరిణామవాదముయొక్క స్వచ్ఛంద

ప్రకృతి పెనుగులాడుచుండెను ? కాని ప్రకృతి చైతన్యమును పుట్టించగలదా ? ఎప్పుడును అట్లుచేయజాలదు. కావున ఈప్రకరణము ఆస్తికవాదులకే యెక్కువ ఉపయోగకరమైనది. ప్రాణులన్నియు నొకేమూలప్రాణి నుండి పరిణమించినవని రుజువుగాజాలకపోవుటయేగాక ప్రతిజాతియొక్క వేరువేరు పూర్వజులే ఒకస్థానమునుండి ప్రపంచమంతట వ్యాపించిరని నిరూపించబడుచున్నది.

3. భిన్నభిన్న ప్రాణులయందే సమత్వముకలదో అది అవి ఒకేవంశమునకు చెందినవనెడి విషయమును సూచించుచున్నదనెడు వాదమునందును భేదముకలదు. ఎట్లన — పిల్లి, కుక్క, స్తనధారులును, మాంసభక్షకములునై యున్నవి. కావున నొకదేశపుపిల్లి నింకొకదేశపు కుక్కను గాంచి యివి రెండు నొకే తండ్రిసంతానమని యీవిధముగా భిన్నభిన్న దేశపు ప్రాణులయొక్క సమత్వమును నిర్ణయించినయెడల నది సమత్వమనబడునా ? కాని బుల్‌డాగు, వేటకుక్క, లేండీ. మున్నగు కుక్కలనుగాంచి యివి యొకేజాతి తండ్రిసంతానమని చెప్పిన నదియెంతయోసబబుగానుండును. కేవలము రచననుబట్టియే యవి యొకటియగునని యనుమానించకూడదు. సమానప్రసవము, సమానభోగము, సమానమైన యాయువు మున్నగునవన్నియు పరిపూర్తిగ లభించినపుడే—ఆకృతిలభించినను, లభించకపోయినను – ఇవన్నియు నొకేతండ్రి సంతానమని నిర్ణయించవలెను.

డార్విన్‌కు 'టెర్రాడేల్ఫుగో' (దక్షిణఅమెరికా) లో ఖర్వాకార మనుష్యుడు దొరకినపుడు అతఁడు వానిని మనుష్యుడే

యని గుఱుతించలేకపోయెను. కాని యతఁడు గోరిల్లా,చింపాంజీ మొదలగు వనమనుష్యులను గాంచినపుడు వీరుకూడ నొకవిధమైన మనుష్యులేనని యఱచెను. డార్విను కేవలము ఆకృతి మీఁద నాధారపడి యుండుటవలననే యతఁడీవిధముగా భ్రమపడుటకు కారణమయ్యెను. కాని సృష్టినియమము సమాన ప్రసవాది సిద్ధాంతములను ప్రకాశపఱచి యతనికిగల భ్రమను దూరమొనర్చి ఖర్వాకార, దీర్ఘకాయ మనుష్యులకు పరస్పర సంయోగమువలన సంతానము కలుగుటవలనను, మనుష్య, వనమనుష్యుల సంయోగమువలన సంతానముకలుగక పోవుటవలనను మొదటి రెండు నొకేజాతివనియు, రెండవదిభిన్నజాతియనియు ఋజువు చేసెను.

ఇటులనే గుఱ్ఱమునకు, గాడిదకును, మనుష్య వనమనుష్యులకంటె నధిక సమానత్వము కలదు. కాని యీ రెంటియొక్క యోగమువలన వంశము నడచుటలేదు. కావున నీరెండు నొకేజాతి ప్రాణులు కాజాలవు. ఒక ప్రదేశమునుండి ప్రాణులు వెళ్లి ప్రపంచమంతట వ్యాపించె ననుటయే మాకు మాన్యము గాని, సమస్తజాతు లొకేప్రాణి (అమీబా) యొక్క పరిణామమనుట సర్వథా మాన్యము కాజాలదు, సమస్తజాతులయొక్క పూర్వజులు మొదటనే వేఱువేఱుగా నుత్పన్నమయిరని యనుమటలో నిసుమంతయు నసత్యములేదు.

౪. సమానత్వమునకు కారణము దూరముగాని, దగ్గఱగాని కాజాలదు. కాని వంశము, పరిస్థితియే కారణమగును. సిద్దీలు, చీనీయులు, భారతీయులు పరిస్థితి కారణమువలననే

రంగు రూపు మొదలగువానిలో భిన్నులుగా నున్నారు. కాని యొకే వంశజులగుటచే నొకరికొకరు వేలకొలఁది మైళ్ళదూరము నందున్నను, అందఱియందును సమానప్రసవము, సమాన భోగము,సమానమైన యాయువు కనఁబడుచున్నవి.అటులగుపడు టకు కారణము అందఱు నొకేజాతి యగుటయేకాని వేఱొకటి కాదు సిద్దీ, చీనా, రెడ్ ఇండియనులు, జర్మనులలోనే భేదము కలదో, బుల్‌డాగు, వేటకుక్క, లేండీ మున్నగు కుక్కలలో నేభేదమున్నదో, వెలర్,అరబ్బీ, కచ్ఛీ మున్నగు గుఱ్ఱములలో నేతారతమ్యముకలదో ఆభేదము పరిస్థితివలన నేర్పడెనని చెప్ప బడు చున్నది. కాని పరిస్థితి సర్వమును ఒంటెగా చేయఁజాలదు.

౫. మూలప్రాణి యొకటేమాటి యనేక శాఖలయ్యె ననుటయు సరికాదు. ఏలయన నొకేప్రాణి పరిస్థితి కారణమున యంత్రమువలె ననేకయోనులుగా మాఱె నని విశ్వసించిన యెడల నీ క్రిందిప్రశ్నల నెదుర్కొనవలసి వచ్చును.

౧. ఒకే కోష్ఠముగల ప్రాణి (అమీబా) యందు స్త్రీ పురుషభేదము లెట్లుకలిగెను?

౨. అమీబా తరువాత రెండు కోష్ఠములుగల హైడ్రా జనించిన యెడల క్రమముగా నుత్తరోత్తర యోనులు ద్విగుణీ కృత పరిణామముతో నేలవృద్ధి యగుటలేదు?

౩. రెక్కలుగల ప్రాణులు సర్పణశీలములకు తరువాత జనించవలసి యుండగా క్రిములకు రెక్క లెచనుండి యెట్లు వచ్చెను?

౪. అస్థు లెట్లు జనించెను ? అస్థులులేని వానినుండి అస్థులుగల వెట్లు ఉత్పన్నమయ్యెను ?

౫. పక్షులు, జల జంతువులు, కీటకములు, మాంసాహారులుగా కనబడుచుండి మాంసాహారులు స్తనధారులలోనే యెందుకు లెక్కించఁ బడినవి ?

౬. ఒకే పరిస్థితియందు జనించు జతలలో స్త్రీలకు గడ్డములు, మీసములు, ఆఁడు నెమలికి పింఛము; కోడిపెట్టకు జుట్టు, ఆఁడు ఏనుఁగునకు పొడవైన దంతము లెందులకు వచ్చుటలేదు ?

౭. జంతువులలో పండ్లసంఖ్య యెక్కువ తక్కువ లెందుకు కలవు ? గడ్డిమేయు స్తనధారులలో ఆవు, గేదె మొదలగు వానికి పై పండ్లు ఎందుకు జనించుటలేదు ? గుఱ్ఱమునకు పై పండ్లు ఎందుల కుండును ? కుక్కలకు పాలపండ్లు ఎందుకూడుటలేదు ?

౮. ఎద్దున కండకోశములదగ్గర స్తనము లెందుల కున్నవి ? మగగుఱ్ఱమున కట్టి స్తనము లెందులకు లేవు ? పురుగులకు స్తనము లెందుల కుండెను ? వాని ప్రయోజన మేమి ?

౯. గుఱ్ఱపుకాళ్ళ యందు రెక్కలగురుతు లెందుల కుండును ? గుఱ్ఱ మీనునపుడు నాలుక యెందులకు బయటకు చాచును ? గాడిద సంభోగసమయమునం దేల నోరు తెఱచును? ఇతర జంతువు లేల యట్లు చేయుటలేదు.

౧౦. స్త్రీజాతి అస్థుల నెందు కుత్పన్నము చేయజాలదు?

౧౧. యంత్రసిద్ధాంతముపై జీవములయొక్క పరిణా

మము జరిగినయెడల త్రాఁబేలు, పాముకంటె, పక్షులు, స్తన ధారులు తక్కువకాల మెందులకు జీవించుచున్నవి? తక్కువ కాలము జీవించెడువానికంటె నధికముగా జీవించెడివి తక్కువ కాలము గర్భవాస మెందుకు చేయుచున్నవి?

ఏప్రాణియైనను తన మూలజాతియొక్క సమానప్రసవము, సమానభోగము, సమానమైన ఆయువు మున్నగువానియొక్క వరుసక్రమము మాఱిపోవునంత దూరముగ నుండఁజాలదు. స్త్రీపురుష నిర్మాణ మే పరిస్థితిని ఖండించెను ఇటులే ఉపర్యుక్త పదునొకండు ప్రశ్నలు— విషయములు — కూడ నొక జాతితో నింకొక జాతికిఁ గల సంబంధమును ఖండించుచున్నవి. కావున నొక్క మూలప్రాణి యే పరిస్థితి కారణమున ననేక యోనులుగా - జాతులుగా - విభక్తమగుచున్న దను వాదము సమూలోచ్ఛిన్న మగుచున్నది? ఆయుః ప్రశ్నవలన యంత్రసిద్ధాంతము నామావశిష్టమగుటయే గాక ప్రాణులు యంత్రసిద్ధాంతానుసారము వికాసము నొందలేదని కూడ సిద్ధాంతమగుచున్నవి.

ఈ శాస్త్రమునం దున్న నిరుపయోగ విషయములను విడనాడిన యెడల "పరమాత్మ సమస్తప్రాణులయొక్క పూర్వీకులను వేఱువేఱుగా నొకే స్థానమున సృజించెను. అచట నుండియే సమస్తదేశములకు వ్యాపించెను. పరిస్థితివలన కొంచెము భేదము కలిగెను. కాని సమానప్రసవము, సమానభోగము, సమానమైన ఆయువు మున్నగునవి యిప్పుడుకూడ స్థిరముగ నున్నవి." అను శుద్ధవైదిక సిద్ధాంతమే ఋజువు కాగలదు.

# లుప్తజంతుశాస్త్రము

భూమిక్రింద లుప్తమైయున్న ప్రస్తరమయ ప్రాణులను వెదకి యిపుడున్న ప్రాణులవరకు నొక శృంఖలను నిర్మాణ మొనర్చు కార్య మీశాస్త్రమువలన జరుగుచున్నది. ఈ శృంఖల గొండ్లెములతో గూడి యుండును. కాని దీని గొండ్లెములన్నియు దొరకలేదు. పూర్వ మీ గొండ్లెములను పూర్తిజేయు ప్రాణు లుండెను. కాని యిపు డవిలేవు. గొండ్లెము లెందులకు లోపించె ననుప్రశ్నతో నిచట పనిలేదు. ఈ శాస్త్రముయొక్క పని ముఖ్యముగా లోపించిన యా గొళ్లెములను వెదకి ప్రోవుచేయుటయే. పరిణామవాదసిద్ధాంతమునకు మూలాధార మీశాస్త్రమే. ఈ శాస్త్రము లుప్తమైన గొండ్లెములను పూర్తిజేయక పోయిన మొదల పరిణామముపై విశ్వాసముండదు. ఇది విజ్ఞానవేత్తల నిజోద్దేశము. అయినను లుప్తజంతు శాస్త్రమునకంటె గర్భశాస్త్రము (ఈ విషయము ముందు వివరించబడును.) యొక్క ప్రమాణము లధికబలసమన్వితమై యున్నవి. ఏలయన గర్భమున పరివర్తనలు స్పష్టముగ నగుపడుచున్నవి. మఱియు సమస్తపరివర్తనము లొకేప్రాణియొక్క గర్భమునందు స్పష్టమగుచున్నవి.

ఈలుప్తజంతుశాస్త్ర మొకవంద సంవత్సరములనుండి పనిచేయుచున్నది. ఇంతవఱకిది యధికముగనే పనిచేసెను. ఎల్. మ్యూజియములో గుఱ్ఱము యొక్కయు, సవ్రుక్ కేన్సి గ్లాసులో ఏనుగు దంతముల యొక్కయు, బ్రిసెల్సులో ఇగ్వానోడన్

యొక్కయు, క్రిస్టల్ పేలెస్, న్యూయార్కు, లండను, జెనా (Gena) మున్నగు ప్రదేశములలో వంశపరంపర యొక్కయు ప్రస్తరీభూత అస్థులద్వారా మిక్కిలి స్పష్టముగ నేకత్రిస్థితము చేయఁబడెను. గుఱ్ఱముయొక్క గొండ్లెములన్నియు సరిపోయెను. "ఆర్కిఓప్టెరిక్" అను నొక జంతువు దొరకెను. దీనివలన సర్ప వర్గమునకు, పక్షివర్గమునకు నడుమఁగల గొండ్లెములుకూడ సిద్ధమగుచున్నవి.

ఎముకలు కలవి, ఎముకలు లేనివి యను రెండు రకముల ప్రాణులున్నవి. ఎముకలులేనివి మరణించి మంటిలోఁ గలసి పోవుచున్నవి. కాని యెముకలుగల జంతువులయొక్క యెము కలు మంటిలోఁ గలియుటలేదు. అవి వేలకొలఁది సంవత్సరము లైనప్పటికిని దొరకుచునే యున్నవి. ఈ ప్రాచీన ప్రస్తరీ భూత ములైన యెముకలను "ఫాసిల్సు" అను చున్నారు. ఈ ఫాసి ల్సులయొక్క గొలుసులు నన్నిటిని పూర్తిఁజేసినచో మిక్కిలి సమంజసముగనే యుండెడిది. కాని భూమియం దధిక భాగము సముద్ర ముండుటవలనను, అనేకప్రాణు లత్యంతము క్రింది భాగమునం దుండుట వలనను, త్రివ్వినను వానిని కనుంగొనుట మిక్కిలి కష్టముగ నుండును. ఇదియునుగాక మంచిప్రదేశము నుండికూడ నెముకలను తెఱచుగా కుక్కలు, గ్రద్దలు, నక్కలు మున్నగు జంతువులెత్తుకొని పోవుచున్నవి. భూగర్భ ప్రాణుల విషయ మిటులుండుటచేలు ప్తజంతుశాస్త్రముయొక్క ప్రమాణ ములు పూర్తిగాలభింపఁ జాలకుండెను. ఇంతియగాక ప్రకృతి పరివర్తనలవలన అనఁగా నదులయొక్క కత్తిరింపులవలనను,

ప్రాణుల శరీరములు ప్రవహించు చున్నవి. అగ్నిపరితాపము వలనను కరగిపోవుచున్నవి. భూమి పై భాగముయొక్క వత్తిడి వలన క్రిందిభాగములు కరగిపోవుటచే వానియందున్న ఫాసీల్సు లుకూడ కరగిపోవుచున్నవి. కావున నీకనెముకలు లేనివానిని గూర్చి చెప్పవలసిన యవసరమే లేదు.

భిన్న భిన్నములయిన భూములయొక్క అడుగు భాగములలో జరిగిన యన్వేషణలవలన లభించిన ప్రాణులయొక్క ఆపేక్షిత సమయములను నిశ్చయించుటయు ఉత్తజంతుశాస్త్రము యొక్క ముఖ్యకర్తవ్యమే. కాని పృథ్వియొక్క ఆయువును నిశ్చయించుటకు వైజ్ఞానికులదగ్గఱ కల్పనా సిద్ధాంతములు దక్క ప్రబలమైన సాధనములెవ్వియును లేవు. భూగర్భశాస్త్ర సిద్ధాంతానుసారము ప్రాణులుత్పన్నమై నప్పటినుండి యిప్పటికి ౧౦ కోట్ల సంవత్సరములయ్యెను. సైన్సువారు సూర్యునివేడి మొదలగు వానిచే నిర్ణయించిన సమయము దీనికంటె తక్కువ. కాని పేరీ యను ప్రొఫెసరు రేడియముయొక్క అన్వేషణముచే నిశ్చయించినది దీనికంటె రెక్కరెట్లధికము.

భూగర్భ శాస్త్రానుసారము భూమియొక్క అడుగు పొరలు నాలుగు. మొదటిదానియం దనఁగా నన్నిటికంటె క్రింది భాగమునం దెముకలులేని ప్రాణులుండును. కాని యిపుడట్లు లేవు. రెండవదానియం దున్నప్రాణులు మత్స్యమండూకాది శ్రేణులుమాత్రమే యున్నవి. మూడవదానియం దున్నతి నొందిన ప్రాణులుకూడ నగుపడుచున్నవి. నాల్గవదానియందు వర్తమానకాలిక ప్రాణులన్నియు లభించుచున్నవి. ఈ ప్రమా

ణములుకూడ పూర్వాపుశాస్త్ర ప్రమాణములవలెనే పరిణామ వాదమును పోషించుచున్నవి. మొదట నెముకలు లేనివియు, తరువాత నెముకలుగల మత్స్యమండూకాదులును, అటుతరు వాత సర్పాదులును, అతరువాత పక్షులును, తుదకు స్తనధారు లును జనించె ననువాదము స్థిరమగుచున్నది.

ఆ కాలమునందు గొప్పగొప్ప దీర్ఘకాయ జంతువులుం డెను. వాని యుపజాతులుకూడ విద్యమానమై యుండెను. మత్స్యమున్నపుడు మత్స్యములే యుండెను. సర్పమున్నపుడు సర్పములే యుండెను. అప్పు డెనుబది పక్కా (రైల్వే) మణు గులు బరువుగల బల్లిజాతులనేకముండెను. ఈవిషయములన్నియు వాని యెముకలవలననే సిద్ధాంతము లగుచున్నవి. ఎముక లేగాక మిశ్రిదేశపు మమీ వంటి ప్రాణుల శరీరము లనేకములు కూడ లభ్యమయ్యెను. వాని మాంసము, చర్మము, నరములు, నాడులు మున్నగున వన్నియు నెటులున్న వటులనే యుండెను.

ఎగిరెడు సర్పములు గలవని మత్స్యపురాణములో చెప్ప బడిన కథ అసత్యముకాదు. ఈ రెక్కలుగల సర్పశ్రేణి వలననే పక్షు లుత్పన్నమయ్యెను. జర్మనీలో భిన్నభిన్నము లయిన అడుగుమట్టముల యందు లభించిన ప్రస్తరీభూతములైన నత్త గుల్లలయొక్క కవచముల వలన వికాసముయొక్క క్రమము మిక్కిలి బాగుగా నగుపడుచున్నది. భిన్నభిన్నము లయిన అడుగు మట్టములందు లభించిన ప్రాణుల పంజాలు, గిట్టలు మొదలగు వాని పోలికవలన గుఱ్ఱమే యే ప్రాణులనుండి పరిణామ మొంది యీ రూపమునకు వచ్చినదియు సిద్ధమగుచున్నది.

పై భాగము లందు వర్తమాన ఆకారము గల గుఱ్ఱము లభ్యమగుచున్నది. కాని మధ్యఖండమునం దదియే మూడు నాలుగు వ్రేళ్ళు కలిగియున్నటు లగుపడుచున్నది. మఱియు నత్యంతము క్రిందిభాగము లందు దాని యాకారము శశకమునకు వలె పూర్తిగా నైదువ్రేళ్ళ పంజాగలది దొరకుచున్నది.

ఆవు, ఎనుములకు నైదువ్రేళ్ళ నుండి తగ్గి నాలుగు వ్రేళ్ళు మిగిలినటుల గుఱ్ఱముయొక్క వ్రేళ్ళు కూడ క్రమముగా నదృశ్యమై మధ్యవ్రేలు ఒంటిగిట్ట యయ్యెను. గుఱ్ఱముయొక్క మూలపురుషు డెవరో యింతవరకు తెలియలేదు. కాని గుఱ్ఱము ౫ వ్రేళ్ళు గలదని విదితమగుచున్నది. ఇటులనే యేనుఁగు, లేడి, మొదలగువాని మూలవంశజులనుండి యిప్పటివరకు గల వికాసపరంపరజ్ఞాతమగుచున్నది.

లుప్తములైన గొల్లిముల నింగ్లీషులో మిస్సింగులింక్సు అనుచున్నారు. దీనికి ప్రబలమైన యుదాహరణము "ఓష్టేరిక్సు" ప్రాణి. ఇది రెక్కలుగల యెగిరెడు సర్పము. దీని తల చిన్నది. దవుడలు పెద్దవి. దంతాదులు సర్పమున కున్నటు లుండును. కాని రెక్కలు, రెక్కకైదు వ్రేళ్ళు కలిగి పక్షివలె నుండును. ఇటువంటిదే మరియొక జంతువు "టేరో డెక్టిల్" (Teroductyl) కలదు. దీనిచేతుల వ్రేళ్ళలో నొకొక్కటి పెద్దది. వానివలన రెక్కలకు మిక్కిలి సహాయము లభించుచున్నది. దీనియందు సర్ప, పక్షి, స్తనధారుల పోలికలు కొద్దికొద్దిగా కలవు. ఇటులనే ఈ శాస్త్రాన్వేషణమునకు సహాకారులుగా హెప్పేరోర్నిస్, పూర్వోదాహృతకాంగరు, ఓపాస్సమ్, మున్నగునవియునుకలవు,

ఇంతవరకు వర్ణింపబడిన యీ లుప్తజంతుశాస్త్రము నందు పరిణామవాదమును బలపరచు ముఖ్యవిషయములు ఏడు మాత్రమే యున్నట్లు ప్రతీతమగుచున్నది.

౧. ఈశాస్త్రమే పరిణామ వాదమునకు మూలాధారము. కాని యనేక కారణములచే పృథివియం దంతటను వ్రాడి యున్న ప్రాణులన్నియు లభింపఁజాలవు.

౨. గుఱ్ఱపు గొండ్లెములన్నియు లభించెను.

౩. పశువులయొక్క మయీకూడ దొరకెను.

౪. అడుగుభాగముల యొక్క లెక్కలవలన నొకజాతి నుండి మరియొకజాతి ప్రాణులు జనించు సమయమును తెలియ జేయుటయే ఈశాస్త్రముయొక్క పని. కాని పృథివియొక్క ఆయువిప్పటికిని సందిగ్ధావస్థయందే యున్నది.

౫. అడుగుభాగపు లెక్కలవలననే మొదట నెముకలు లేనివి, తరువాత నెముకలు గలవి లభ్యమగుచున్నవి.

౬. ఏసమయమునం దేప్రాణి యెటులుండెనో అది యట్లేయుండెను. మఱియు భీమకాయములుండెను.

౭. ఎగిరెడు సంధియోనులు, మత్స్యపురాణపు సర్పము కూడ నుండెను.

ఈశాస్త్రములో నీమూడు విషయములే యుపలబ్ధమగు చున్నవనియు నవి వికాసవాదమునకు బాధకములనియు చెప్ప గలుగుచున్నారము. కావున నిక వీనినిగూర్చి క్రమముగ విచారింతము.

౧. ఈశాస్త్రమే పరిణామవాదమునకు మూలాధారము. కాని భూమియంతయు నన్వేషింపఁబడఁజాలదు. పృథివి యంతయు నన్వేషించబడుటకు వీలుకాదనుటయు, లభించిన భూమియంతయు పూర్తిగా త్రవ్వఁబడఁజాలదనుటయు మాకును మాన్యమే. త్రివ్వఁబడినప్పటికిని అచట ప్రాణులు లభించక పోవచ్చును. అథవా కరఁగిపోవుట మొదలగునవికూడ జరిగి యుండవచ్చును. సమస్తప్రాణుల యెముకలు లభ్యముకాజాలక పోవచ్చును. అయినపు డీశాస్త్రమే పరిణామ వాదమునకు మూలాధారమై యున్నదని చెప్పుటకెట్లు వీలగును?

అస్థులపోలికకూడ సరికాదు. ఏలయన గుఱ్ఱము, గాడిద, చారలగుఱ్ఱము మున్నగువాని యస్థిపంజరము లొకచోట దొరకినయెడల పరిణామవాదు లీమూఁడు పంజరము లొక్కటేనని చెప్పుదురు. కాని వాస్తవమున కీమూఁడు నొక్కటిమాత్రము కాదు. అవి భిన్నభిన్నజాతులు. ఏలయన గుఱ్ఱము గాడిద సంయోగమువలన వంశము నడచుటలేదుగదా! కావున కేవలము అస్థులపోలికనుబట్టి గొంఁడ్లెములయొక్క శృంఖలను చూపుట మిక్కిలి తెలివితక్కువపని.

౨. గుఱ్ఱముయొక్క గొంఁడ్లెములన్నియు దొరకెననుటయు సత్యేతరమే. ఏనుఁగు, లేడి మొదలగువాని విషయము కూడ నిటులేయున్నది. పరిణామవాదులకు గుఱ్ఱపు గొంఁడ్లెములపై మిక్కిలి విశ్వాసము కలదు, కావున నది యెంత మిథ్యావాదమై యున్నది! ఆధునికాన్వేషణముచే నిపుడు ఋజువుపఱచెదము. పరిణామవాదులు యూరోపు, అమెరికాలలో

త్రవ్వుటచే లభించిన వేర్వేఱు కాలములకు జెందిన వేర్వేఱు ప్రాణులయొక్క ఒక విచిత్రజాతి అస్థిపంజరమునుబట్టి యివన్నియు నశ్వజాతి పూర్వజములనియు, నశ్వజాతి వికాస గొండ్లములనియు ఋజువుపఱచుటకు ప్రయత్నించిరి. హాక్సలే మహాశయుఁ డొకప్పుడు తన యుపన్యాసమునం దీ జంతువుల గూర్చి చెప్పెను. అప్పటినుండియు నిది యొక సిద్ధాంత మయ్యెను. T కాని వర్తమాన పరీక్షల వలన నది ఖండిత మగుచున్నది.

"సర్. జే. డబ్ల్యూ. డాసన్ తన "మాడర్న్ ఇండియా ఆఫ్ ఇవోల్యూషన్" లో గుఱ్ఱములకు పూర్వజములని చెప్పబడుచున్న అమెరికా, యూరోపులయొక్క ఈ జంతువులకు నెట్టి పరస్పర సంబంధములేదు" * అని సిద్ధాంతీకరించెను.

గుఱ్ఱము మిక్కిలి విచిత్రమైన జంతువు. అయిదు విషయములు దానిని తృణాహారి జంతువులనుండి వేఱుచేయు

---

T Firstly there is true horse. Next we have the American Pliocene from Pliohippus. In the conformation of its limbs it presents some very slight deviation from the ordinary horse. Then comes protohippus which represents the European Hipparion having one large digit and two small ones on each foot. The old Riddle and Newest Answer- P 94.

* In America a series of horse-like animals has been selected beginning with the Eohippus of the Eocene - an animal, the size of a fox and with four toes in front and three behind - and these have been marshalled as the ancestors of the fossil horses of America ... ..... Yet all this is purely arbitrary and the dependent merely on a succession of Genera more and more closely resembling the modern horse, being procurable from successive trritory deposits after widely

చున్నవి. (౧) గుఱ్ఱమునకు పైన, క్రింద పండ్లుండుట. (౨) తినునపుడు ముందు నాలుకను బయటికి చాచుట. (౩) ముందు కాళ్ళ కణుపులయందు జెక్కలగుర్తు లుండుట. (౪) మగగుఱ్ఱమునకు స్తనము లుండకపోవుట. (౫) గిట్టలుండుచోట నొక్క గిట్ట యుండుట.

గుఱ్ఱపు పూర్వీకుల కాళ్ళకుకూడ నైదేసి వ్రేళ్ళుండెనని చెప్పబడుచున్నవి. ఈ ౫ టిలో ౪ మాయమై పోయెను. ౫ వది మధ్యడెక్క యయ్యెను. కాని ఆవు, గేదెలయొక్క వ్రేళ్ళ ప్రశ్నవచ్చినపుడు వాని నైదింటిలో నాలుగు మాత్రమే విద్యమానమై యున్నవనియు, నడుమది యొక్కటి మాత్రిమే అదృశ్యమయ్యెననియు, ఉన్న ౪ టిలో రెండు చీలిన డెక్కలనియు, పైకిలేచి పైనను న్నవి పిల్లగిట్టలనియు చెప్పబడుచున్నవి. ఆవు, గేదెలయొక్క గిట్టలలో మధ్య వ్రేలిస్థానము కాళీగా నున్నదనుచున్నారు. కాని గుఱ్ఱపుప్రశ్న వచ్చినపుడో వ్రేళ్ళన్ని

---

separated in time and place. In Europe on the other hand the ancestry of the horse has been traced back to palaeotherium an entirely different from - by just as likely indications, the truth being that as the group to which the horse belongs culminates in the early Teritory times, the animal has too many imaginary ancestors. Both geneologies can scarcely be true and there is no actual proof of either. The existing American horses which are of European origin are according to the thoery descendants of palaeotherium not of Eohippus; but if we had not known this on historical evidence there would have been nothing to prevent us from tracing them to the latter animal. The simple consideration alone is sufficient to show that such geneologies not of the nature of scientific evidence - Modern Ideals of Evolution P. 119.

యు మాయమై కేవలము మధ్య దొకటి మాత్రమే మిగిలె నని చెప్పబడుచున్నది. కొన్నింటి కన్నియు నదృశ్యమై మధ్య దొకటిమాత్రమే మిగిలి యుండుటయునా? కొన్నింటి కన్నియు మిగిలి మధ్యదొకటి మాత్రమే మాయమగుటయునా? ఆహా! యెంతవిచిత్రముగ నున్నది! దారి, డొంకలేని ఈ పరిణామ వాదము?

గాడిద, కంచరగాడిద, గుఱ్ఱము, (జీబ్రా) చారలగుఱ్ఱము మున్నగు వానియొక్క అస్థిపంజరములను కనుగొనుటలో పొర పాటు జరుగగలదని పూర్వము చెప్పబడినట్లు అడవిపిల్లి, చిఱుత పులి, పిల్లి, మున్నగు జంతువులయొక్క అస్థిపంజరములను కను గొనుటలో మిక్కిలిపొరబాటు కలదు. ఇటు లనేసమస్తపంజరము లను క్రమవికాసమును ప్రమాణీకరించు జాతులను స్థిరపఱచుట లోను మిక్కిలి పొరపాటు జరిగెను, 'మి, డి. క్వాటర్ ఫెగస్' తన "లెస్ అమ్యూలస్ డే డార్విన్" అను గ్రంథమునం దిట్లు వ్రాసెను.

"ఇటువంటి జీవజంతువుల వలనను, ప్రిస్తరీ భూతాస్థి పంజరముల వలనను, గుఱ్ఱపు గొండ్లెములు పూర్తి కాఁజాలవు. ఇటువంటి ప్రాణులయొక్క అస్తిత్వము కేవలము కల్పనా మాత్రమే కాని వేఱొండుకాదు. *

* The first thing to remark is that not one of the creatures exhibited in this pedigree has ever been seen either living or fossil. Their existence is based entirely upon theory. ... All the ancestral groups more or less ill-represented in the actual organic world, do not suffice to fill up the gaps in his pedigree from one stage to another. There is something too broad a gulf. —Les Emules de Darwin ii P. 76.

ఇటులనే మ్యూజియము విషయమును ఖండించుచు సం. ౧౯౨౨ నవంబరు మాసపు 'న్యూయేజ్' అను పత్రిక యందు 'జోన్సు బోనస్' ఇట్లు వ్రాసెను.

“బ్రిటిషు జంతుశాలలో జాతులయందు పరివర్తనము జరిగెనని ఋజువు పఱుపగల విషయ మొక్కటియును లేదు. విశ్వాస విషయమందు పదింటికిఁ దొమ్మిది విషయములు వ్యర్థముగ, నిస్సారముగ నున్నవి. వీని పరీక్షలయొక్క ఆధారము సత్యముమీఁదనవలంబితమై, యుండలేదు, పరిణామ వాదమునకు సాయపడు వస్తువు ప్రపంచమునం దెద్దియును లేదు.”

“లుప్తజంతు శాస్త్రాన్వేషణమువలన ప్రాణుల గొండ్లెము లన్నియు లభ్యమగు ననెడు ననుమాన మిపు డిట్టి ప్రమాణముల వలన రద్దగుచున్నది.”

౩. పశువుల మమ్మీ (ఈజిప్టులోని శవపేటిక)లు కూడ లభించెనను విషయమున వేలకొలది సం. లకు పూర్వము మంచు పడుటచే ననేక ప్రాణు లెటులున్న వటులనే పూడిపోయెననియు, నప్పుడప్పుడు మరణించినను శరీరము మాత్రము చెడ కుండ నుండిన స్థితియందే యిప్పటికిని లభించు చున్నవనియు చెప్పఁబడుచున్నది.

అటు లవి లభ్యము కావచ్చును. కాని గొండ్లెములను ఋజువు పఱుపగల యాకాలపు ప్రాణులెవ్వియును లభ్యమగుట లేదు, కావున నీవిషయ మాసిద్ధాంతమునకు బాధకము కా లేపోవుటయే కాక యొక విధముగా సాధకమే యగుచున్నది.

పృథివి అడుగు పొరలయొక్క లెక్కలవలన ప్రాణుల యుగములు లెక్కింపబడుచున్నవి. కాని విజ్ఞానము యొక్క ఈ అర్థశాఖకూడ వికాసవాదము నెన్నటికిని ఫలవంతము కాని య్యదు. ఏలయన, నింతవఱకు భూమిఅడుగు భాగపు ఆయువు లెక్కయే సరిగా తేలలేదు. భూమియొక్క ఆయువునం దెంత మతభేదమున్నదో చూడుఁడు. భూగర్భశాస్త్రవేత్తలు భూమి యొక్క ఆయువు పరిమితిని బహుతక్కువగను రేడియంవారధి కముగను చెప్పుచున్నారు. మూఁడవవారు మధ్యనే పల్టీలు కొట్టు చున్నారు. కావున నీలెక్క యెప్పటికిని సరిగా తేలకపోవుటయే గాక యేనాటికైన నిశ్చయమైనను అనుమానము మీఁదనే కల్పితమై యుండును గాని సత్యమైన ప్రమాణములతో నిశ్చ యము కాఁజాలదు. ఏలయన నాయువు సదాజన్మకుండలి ఇతి హాసము వలననే తెలిసికొనఁబడు చున్నదిగాని కల్పనలవలనఁ గాని పండ్లు బొచ్చును బట్టిగాని తెలిసికొనఁబడుటలేదు. అట్లు తెలిసికొనుటకు వీలు గాకపోవుటయేకాక ప్రామాణికమును కాఁజాలదు.

అడుగుభాగమున పూడ్చబడియున్న ప్రాణులయొక్క అంతరములను తెలిసికొనుటకు నడుగుభాగపు ఆయువును బాగుగా తెలిసికొనిన పిమ్మట యోగ్యముగ నుండునుగాని పృథివియొక్క ఆయువే నిశ్చయము కానపుడు "ఒక్క అడుగు భాగమునకు తరువాతభాగమునందుండు ప్రాణులెన్నినాళ్ళకు జనించెను" అను నీవిషయమును తెలిసికొనుట కిపుడు సాధన మేది కాఁగలుగును? మానవుఁడెపుడు జనించినదియు. నతనికి

పూర్వము అడవిమానిసి జనించి యెంతకాలమైనదియు విజ్ఞాన వేత్తలు పరిణామవాదులయిన నాస్తికులు స్పష్టముగాఁ జెప్పఁజాలరు. మఱియు పరిణామవాదులయిన నాస్తికులదగ్గఱ గొంగ్లెము లన్నింటియొక్క వర్ష సంఖ్యను కలిపి పృథివియొక్క ఆయువుతో సరిపోల్చు సాధన మెద్దియునులేదు. వైజ్ఞానికులకు, పరిణామవాదులకు జగద్రచనా కారణములు, కారణములగతి శక్తి తెలిసియున్నయెడల భూమియొక్క ఆయువు శీఘ్రాతి శీఘ్రముగా విదితముకాఁగలిగెడిదే. కావునఅనుమానముద్వారా కనుఁగొనబడిన కాలము విశ్వాసయోగ్యము కాఁజాలదు.

౧౯౨౩ సం. రము ఆగష్టులో దివ్యజ్ఞాన సమాజపత్రిక యందు హైన్సక్ యిట్లు వ్రాసెను.

"నెవాడా ( Nevada )యందు జాన్ టీరీడుకు నొకమనిషిపద చిహ్నమును, బాగుగా తయారుకాబడిన చెప్పుక్రిందియట్టయు దొరకెను. వానినాతఁడు తనశిలాఖండవిషయిక భూగర్భసంబంధ విజ్ఞానముచే నా చెప్పు ౬౦ లక్షల సం॥ల నాఁటిదనియు, దానికుట్టుదారపు (వారు) మడుపు, కుట్టుయొక్క పనితనము, దారపు (వారు) కొలత, మున్నగునవన్నియు నిప్పుడు బాగుగా కుదించి తయారు చేయబడిన దానికంటె మిక్కిలి బాగుగను, సూక్ష్మముగ నుండెననియు తెలియజేసెను."

ఇందువలన ౬౦ లక్షల సం॥లకు పూర్వము మానవుఁడు చెప్పులు తొడుగుచుండెననియు, లోహపు సూదిని నిర్మించుట,

సూలు తయారుచేయుట * మున్నగు పనులన్నియు నప్పటి వారికి బాగుగా తెలియుననియు విదితమగుచున్నది.

భౌతికవాద లేఖకులు 'హేడెల్‌బర్గు' మానవుఁడు ౨౫౦ వేల సం॥ల నాఁటివాఁడనియు, 'ప్లిట్డు డౌన్' మానవుఁడు లక్ష, లక్షన్నర సం॥ల నాఁటివాఁడనియు, 'నీండరుథాల్' మానవుఁడు ౫౦ వేల సం॥ల నాఁటివాఁడనియు, 'రెడిసియన్' మనుష్యుఁడు ౩౫ వేల సం॥ల నాఁటివాఁడనియు, ఇతఁడే నిజమైన మనుష్యుడనియు క్రమక్రమముగా నీతఁడు సభ్యతను వృద్ధిజేసికొని యుండెననియు వ్రాయుచు మొదటి (చలి) 'గ్లేషియల్ ఏజ్'లో నెక్కువ చలి ౬ లక్షల సంవత్సరముల క్రితము వచ్చినదనియు అంచనా వేసిరి. కాని పై చెప్పు అట్టి విజ్ఞానమువలన – దాని కాలనిర్ణయమువలన భౌతికవాదులైన నాస్తికులు కల్పనా ప్రపంచములో కలలు గాంచుచున్నారని స్పష్టమగుటలేదా? వీరి సభ్యత – మనుష్యోత్పత్తి ౩౫ వేల సం॥ల నాటిది కూడ కాదు. కావున ౬౦ లక్షల సం॥లకు పూర్వమున్నటువంటి నాగరకతాభివృద్ధిని తెలియజేయుచున్న నిదర్శనములను కాదని త్రోసివేయుట దుస్సాహసముకాదా?

ఇత్యాది ప్రమాణములనుబట్టి మానవులొక కోటిసంవత్సరములకు పూర్వమే జనించిరని భావించవలయునుగదా! హైగల్ తన History of Creation ౯౫ వ పుటలో ప్రాణుల యొక్క ౨౧ గొండ్లెముల తరువాత మానవుఁడు జనించెనని

---

* ఈ విషయము లధికముగ తెలిసికొనగోరువారు మా "వైదికసభ్యత" యను గ్రంథమును చూడుడు.

వ్రాసియుండెను. ప్రతి గ్రాండ్లమున కొక కోటి సం॥ల వ్యవధి గలదని విశ్వసించిన యెడల మొదటిప్రాణి పుట్టుకనుండి మానవుని పుట్టుకవఱకు నిఱువదిరెండు కోట్ల వత్సరములును, ఇప్పటికి సుమారిఱువది మూఁడుకోట్ల వర్షములును కావలసియుండును.

లోకమాన్య తిలకుమహాశయులు తన గీతారహస్యమున డాక్టరు గేడా ( Gadow ) గారి సాక్ష్యముతో నిట్లువ్రాసిరి.

“మత్స్యము మాఱి మానవుఁడగుటకు ౫౩ లక్షల, ౭౫ వేలతరములు గడచెను.”

ఇన్నితరములు అమీబా (ప్రాణి) మాఱి మత్స్యమగుటకుకూడ పట్టియుండ వచ్చును. అమీబానుండి యిప్పటివఱకు సుమా రొకకోటితరములు గడచియుండును. కొన్నిటితరము లొక దినము కొన్నిటితరము లొక వంద వత్సరములు జరుగునని భావించినను, సగటున మొత్తమన్నియు నిరువదైదు సంవత్సరములు జీవించుచున్నవని చెప్పవచ్చును. ఈలెక్క ప్రకారము మూఢ ప్రాణులు జనించి యిప్పటికి ౨౫ కోట్ల సంవత్సరములగుచున్నవి. కావున భూమిపుట్టి కోట్లకొలఁది సంవత్సరములు గడచినపిమ్మట ప్రాణులు జనించె ననుటయే నిశ్చయము. ప్రాణుల యుత్పత్తినుండి యిప్పటికి ౨౩ కోట్ల సంవత్సరములయ్యెను. కావున నీసంఖ్య విజ్ఞానులు, పరిణామవాదులైన నాస్తికులు చెప్పిన సంఖ్యకంటె చాలదూరము ముందునకుఁ బోవుచున్నది

భూగర్భ శాస్త్రవేత్తలు ప్రాణు లున్నటువంటి భూమియొుగు భాగపువయస్సు కేవలము పదికోట్ల సంవత్సరములని వ్రాసిరి. కావున నిది వికాసవాదసమయదృష్టితో నెంత దుర్బలముగ నున్నదియు, స్పష్టముగా విదితమగుచున్నది.

౫. మొదట నెముకలులేనివి, తరువాత నెముకలుగలవి జనించెను. మొదట సరళరచన, తరువాత క్లిష్టరచన జరిగెనని పరిణామవాదులు చెప్పుచున్నారు. కాని మొదట సరళరచన ప్రాణు లుత్పన్న మయ్యెననియు, సరళరచన యన అమీబా గాక వనస్పతులనియు మా కథనము. ఏలయన అమీబా సరళ రచన ప్రాణికాదు. అదిమిక్కిలి క్లిష్టరచనాయుక్తము. తన శరీర మున ప్రతిచోట రంధ్రము జేసికొనుట సామాన్యమైన విష యమా? కావున అమీబా సరళరచనకాదు. సరళరచనా సమ న్వితములయినవి వనస్పతులు. కావుననే యవి మొదట జనిం చెను. అనంతరము పశువులు జనించెను. తరువాత మానవు లుత్పన్నులయిరి. పశువులలో మాంసాహారులకంటె ముందు తృణాహారులు జన్మించెను. మాంసాహారులు జలచరములం దును, నభశ్చరము లందును, స్థలచరము లందును, కీటక ములందును కనబడు చున్నవి. కావున చతుర్విధములయిన పశు వులలో మాంసాహారులు మొదట జనించలేదు. ఇట్టి సరళ క్లిష్ట రచనలు మాకును మాన్యములే. ఏలయన భోగ్యము సరళరచన, భోక్త క్లిష్టరచన యని మాకథనము.

క్రిందిభాగమునం దెముకలు దొరకని కారణమున మొదట నెముకలు లేనివి తరువాత నెముకలుగలవి జనించెనని

చెప్పబడుచున్నది. కాని యీ సిద్ధాంతమునం దిసుమంతయు సత్యములేదు. ఏలయన, పృథివియొక్క ఒత్తిడివలన క్రిందిభాగములు కరగి వానితోపాటు ఎముకలుకూడ కరగిపోవుచున్నవి. కావున క్రిందిభాగమునం దెముకలు లేవనుటయు, నందువలన మొదట నెముకలు లేకుండెననుటయు కూడ తెలివితక్కువనే సూచించుచున్నది. మొదట నెముకలు లేనివే పుట్టెనని విశ్వసించినయెడల నెముకలు లేనివే యెముకలు గలవయ్యెననుట యెప్పుడును సిద్ధాంతము కాఁజాలదు. ఏలయన నెముకలు వాటియంతట నవి పుట్టఁజాలవు. కావున నెముకలు లేనివానినుండి యెముకలు గలవి జనింపనేరవు. ఈ విషయ మనేక ప్రమాణోదాహరణములతో పూర్వము సిద్ధాంతపఱచియే యున్నారము. కావున దీనివలనను పరిణామవాదమున కేమాత్రము లాభముకలుగుటలేదు.

౬. "ఏసమయమునం దేప్రాణియుండెనో తన యుపజాతులతో నదియే యుండెను. భీమకాయములుగా నుండెను." ఇత్యాదివిషయములు సత్యములే యైనయెడల వానికంటెముందు జనించిన ప్రాణు లుండనేయుండకూడదు. కాని అన్నిటికంటె ముందుజనించిన ఒకకోష్ఠముగల ప్రాణులిప్పటికిని విద్యమానమైయున్నవి. అంతిమ ప్రాణులుకూడ మానవులకంటె నధికముగ నున్నవి. కావున పైవిషయము సత్యమని ప్రతీతమగుటలేదు. భూమిని త్రవ్వుటవలనను ఈ విషయము లభ్యమగుటలేదు. ఏ అడుగుభాగమునం దే యెముకలు లభించుచున్నవో ఆయడుగు భాగము పరిణామవాద సిద్ధాంతానుసారము అట్టి జంతువులతో నిండి యుండవలసియుండెను. కాని అట్లులేదు. మిక్కిలి

శ్రమపడి త్రవ్వినప్పటికి నాకేరకపుజంతువులు మిక్కిలి తక్కువగ దొరకుచున్నవి.

దీర్ఘకాయముగల ప్రాణులుండుట విశ్వసించదగిన విషయమే. ఏలయన ప్రారంభిక ప్రాణులలో కొన్నిటి యోనులు మిక్కిలి పెద్దశరీరముగలవి యుండెను. కాని యీసిద్ధాంతము పరిణామవాదమునకు వ్యతిరేకము. ఏలయన ప్రారంభమున మిక్కిలి చిన్నచిన్న ప్రాణులతో సృష్టి ప్రారంభమయ్యెనని పరిణామ వాదులు అయిన నాస్తికులు విశ్వసించెదరు. చిన్నప్రాణి ఒక్కమాటుగా దీర్ఘకాయమై యెనుబది పక్కామణుగుల బల్లి యయ్యెనుగదా! వృక్షములు (గనిద్వారా) బొగ్గులనొసఁగు కొండలయ్యెను! నియమానుసారము ప్రారంభిక మానవ శవములు కనీసము తాటిచెట్లతో సమానముగ నుండవలయును గదా! కాని అట్లు కనబడుటలేదు. అయినపుడు బల్లి యెందులకు వృద్ధినొందెను? ఆదిప్రాణియైన అమీబా యేల వృద్ధి కాలేదు? అంతిమప్రాణియైన మానవుఁడేల వృద్ధిజెందలేఁదు? ఎనుముతో సమానమైన చీమ లెందుల కగుపడుటలేదు? ఇవుడున్న ప్రాణులయందే ప్రాణియు నటువంటి భీమకాయముగల ప్రాణి యేలలేకున్నది? కావున భీమకాయముగల యోనులు సపరివారముగా నశించెనని యనవలయునుగదా! ఇంతియగాక పరిణామవాదులయిన నాస్తికులు భీమకాయముగల ప్రాణులు కూడ అమీబాయొక్క పరిణామమేయనియు, పరిస్థితి ప్రతికూలమగుటచే నష్టమయ్యెననియు నుడువుచున్నారు. కావున నీవిషయము సత్యమేయైన యెడల పరిణామవాదులయొక్క

యాంత్రికసిద్ధాంత మిచట మిథ్యయని ఋజువగుచున్నది. దీర్ఘకాయప్రాణులు నశించి యల్పకాయప్రాణులు జీవించుచుండెనని పరిణామవాదులు స్పష్టముగా నొప్పుకొనుచున్నటులేగదా!

దీర్ఘజీవియైన తాఁబేలు అల్పజీవియైన పావురమును నిర్మించినటులే భీమశరీరియైన బల్లి అల్పశరీరియైన బల్లిని నిర్మించెనుగదా! అయితే అచ్చటచ్చట దీర్ఘ జీవియైన తాఁబేలు మాత్రము కనఁబడుచు నెనుబది పక్కా మణుగుల బల్లి యెందులకు కనఁబడుటలేదు? కావున నీపరిణామవాద సిద్ధాంతముది, యంత్రమువలె నున్నతి యనఁబడునా? లేక యవనతి యనఁబడునా? దీర్ఘ శరీరముగల ప్రాణు లితర ప్రాణుల పరిణామము కావు, వర్తమాన ప్రాణు లితర ప్రాణులయొక్క హ్రాసమును కాఁజాలవు, కావున "కర్మఫలిత కారణమున నెంత పెద్ద శరీర మెన్ని దినములవఱకు నవి పొందియుండెనో ఆ భోగమును భోగించి యవి వెళ్లిపోయెను. ఇప్పుడే శరీరములకు ప్రపంచము యోగ్యముగనున్నదో అవియే మిగిలెను. కర్మ ఫలితము అనుభవించబడుచున్నది. ఇందు హ్రాస వికాసముల విషయము మెచ్చటను లేదు." అని సిద్ధాంతపఱచుకొనుట శ్రేయస్కరము.

౨. సంధియోనుల మత్స్యపురాణ సర్పములయొక్క యుదాహరణము కూడ నిరుపయోగమే, పరిణామ వాదులు సంధియోనుల యాధారము మీఁదనే పరిణామ వాదమును సిద్ధాంత పఱచిరి. కాని యట్టి ప్రాణులను సంధి యోనులనుట మిక్కిలి తెలివి తక్కువయని పూర్వమే ఋజువు చేసియుంటిమి. విచిత్రరచన యెందుకు మధ్య గొండ్లెము (Missing Link) అనఁ

బడుచున్నది? గబ్బిలము, పశువులకు, పక్షులకు మధ్యయోని యని యెందుకు చెప్పఁబడు చున్నది? పక్షి ఒక్కమాటుగా గబ్బిలమై స్తనధారి యయ్యెనా? లేక నెమ్మది నెమ్మదిగా నయ్యెనా? నెమ్మది నెమ్మదిగా నయ్యెనని యనినచో వెనుక, ముందు గొండ్లెము లిట్టి వనేకము చూపవలసి యుండును. అట్లు గాక వెనుక ముందు గొండ్లెములు వేలకొలఁది నష్టమయ్యెనని విశ్వసించిన యెడల పని జరుగఁజాలదు. మొదటి గొండ్లెములు తరువాతగొండ్లెములకంటె బలహీన మైనవిగాన నాశము నొండె నని యనినను తరువాతివి యెందుకు నాశనము నొందవలసి వచ్చెను? అవి వికాసము నొంది గట్టిపడెను గదా? వర్తమాన గబ్బిలముకంటె నుత్తర గొండ్లెములు బలము గలవిగ నుండినను అవియు నాశము నొందెను. కేవలము వర్తమాన గబ్బిలము మాత్రమే పూర్వాపరవంశములను వెనుకకు నెట్టి స్వయముగ మిగిలె ననిన నెవ్వరు స్వీకరించెదరు?

ఎగిరెడు సర్పములు కలవని పురాణములలో వ్రాయఁబడి యున్నది. ఎగిరెడు సర్పముల యెముకలు దొరికెనని పరిణామవాదు లనుచున్నారు. కావున పురాణములు, పరిణామము, రెండు నేకమయ్యెను. "పరస్పరం ప్రశంసన్తి అహోరూప మహోధ్వనిః" కాని పురాణములో గుఱ్ఱములు, పర్వతములు, కూడ నెగిరె నని కలదు. ఆల్హాఖండమున మహోబా నివాసియగు ఊదనసింగుయొక్క "బేందులా" అను గుఱ్ఱ మెగురుచుండె నని వ్రాయఁబడియున్నది. ఇవన్నియు సత్యములేనా? ఇవన్నియు నసత్యములయిన సర్పములెగిరెడు

విషయములు కూడ నసత్యములే కాని యిప్పటికిని కొండఱు సర్పమునకు రెక్కలు వచ్చినపు డది మలయగిరికి వెళ్ళి చందన తరువునకు చుట్టుకొనుననియు, నెగురునపుడు దాని నీడక్రింది కేదియైన వచ్చినచో దానికి పక్షాఘాతము కలుగుననియు నుడువుచున్నారు. కాని యిదియు నసత్యమే.

వేదములందు అశ్వము, సుపర్ణము అన సూర్యకిరణ మని, చెప్పఁబడియున్నది. పక్షికూడ సుపర్ణమనఁబడుచున్నది. ఇదియు నెగురును. ఈఅశ్వ, సుపర్ణములయొక్క కలయిక కారణ మున పురాణములు సుపర్ణమును ఎగిరెడి దని చెప్పినపుడు అశ్వ ములు కూడ నెగురునని చెప్పెను. ఇటులనే వేదములందు మేఘ ములకు, కొండలకు నొకేనామము చెప్పబడి యుండుటవలనను మేఘము లెగురుట వలనను పురాణములలో కొండలుకూడ నెగురునని వ్రాయబడెను. అహిశబ్దముకూడ మేఘముయొక్క పర్యాయపదమే. మేఘ మెగురును కావున అహి-సర్పము-కూడ నెగురునని వ్రాయబడెను. కాని వికాసవాదులైన నాస్తికులు ఎగిరెడు సర్పములకు, పక్షులకు, అనేక స్తనధారులకు తరు వాతనే మానవులు జనించిరని చెప్పుచున్నారు. ఇట్టిస్థితియందు స్వాయముగ నీక్రింది ప్రశ్న జనించుచున్నది. మానవులు ఎగి రెడు సర్పములకంటె లక్షలకొలది సంవత్సరములు వెనుక జన్మించినపుడు సర్పము లెగురుటచూచిన దెవరు? దేనియాధా రముతో పురాణములు వ్రాయఁబడెను?

కావున మధ్యస్థమగు గొండ్లెముల కల్పనయే మిథ్య. సంధి యోనులు పరిణామమునకు మధ్యస్థ గొండ్లెములు కావు. ఏలయన

కర్మఫల భోగమును భోగించు జాతులన్నియు స్వాయముగ స్వాతంత్రజాతి ప్రాణులు. వెనుకటి శాస్త్రముల వలెనే యీలుప్త జంతు శాస్త్రముకూడ కేవలము సరళ క్లిష్టరచనలను మధ్యస్థ గొండ్లెములను చూపి పరిణామవాదము నొప్పుకొనుట కొత్తిడి కలుగచేయు చున్నది. కాని యీరెండు విషయములు కేవ లము నిర్జీవములగు నసత్యకల్పన యొక్క ఆధారము మీదనే తమ యస్తిత్వము నుంచుకొనుచున్నవి. కావున నివి ప్రమాణ కోటిలో చేర్చబడజాలవు. ఈలుప్తజంతు శాస్త్రమువలనను పరిణామవాదలేఖకుడు పరిణామవాద సిద్ధాంతమును కించిత్తైనను ఋజువుపఱచ లేక పోయెను. పరిణామవాద గ్రంథకర్తలలో నొకరు స్వాయముగ నిట్లువ్రాసిరి.

"మేము లుప్తజంతు శాస్త్రముయొక్క ఇతిహాస ప్రద ర్శక పత్రములవంక దృష్టినుంచి చూచునపు డీ శాస్త్రముయొక్క యవస్థ మిక్కిలి శోచనీయముగ నున్నట్లు ప్రతీత మగుచున్నది. లుప్తజంతు శాస్త్రముద్వారా లభ్యమగు పరిణామవాదమునకు సంబంధించిన యితిహాసముయొక్క పుటలకు పుటలే, అధ్యాయ ముల కధ్యాయములే ఎగిరిపోయినవి. లుప్తజంతు శాస్త్రాన్వే షణ... అధికముగా భ్రమలో పడద్రోసెడి దగుటకిదియే కార ణము. కనబడుపరిణామముయొక్కసంక్షిప్తేతిహాసమునకు మూల కారణమగు గర్భవృద్ధిద్వారా, లుప్తజంతు శాస్త్రముద్వారా గోచరమగు పరిణామవాదములం దధిక సయుక్తికము,మాన్యము ఏది? యను వివాదము వచ్చినయెడల గర్భవృద్ధిశాస్త్ర మధిక బలీయమని చెప్పవలసి వచ్చును."

పరిణామవాదులకే స్వయముగ నీ లుప్తజంతుశాస్త్రి ప్రమాణములయం దధికసయుక్తికత, మాన్యత, కనఁబడుట లేదు. కావున నింక నీశాస్త్రవిషయమునం దేమియు చెప్పవలసిన యవసరము కనఁబడుట లేదు.

కావున నింకపరిణామవాదులయిన నాస్తికులకు నధిక విశ్వాసముగల గర్భశాస్త్రమువంకకు మఱలుదము.

# గర్భశాస్త్రము

"గర్భధారణమునుండి జన్మమువఱకును, జన్మించిన తరువాత యవస్థ పూర్తియగువఱకు ప్రాణుల శరీరరచన కెన్ని పరివర్తనలు కలవో వాని యన్నింటి విషయ మీ శాస్త్రము వలన విదితమగుచున్నది. ఒకేప్రాణి అమీబా, హైడ్రా, సంధుల ప్రాణులు; చేప, కప్ప, సర్పము, పక్షియై స్తనధారిగా మాఱినటులే గర్భమునందును ఈ పరివర్తనలన్నియు నగుపడు చున్నవి. అట్టి సమస్త నిరీక్షణ లీ శాస్త్రముద్వారా చూపఁ బడు చున్నవి. మొట్టమొదట కప్పచరిత్రద్వారా పరిణామము యొక్క ప్రమాణముల నుపస్థితపఱచుచున్నారము. నీటియం దుండు ఆకు అలముపై నంటుకొని జిగురుగలిగి, నల్లగ, నున్నగ కనఁబడు పదార్థమే కప్పగుడ్లు. ఈ గుడ్లలో మూఁడు నాలుగు దినములలో తోకయు, వెడల్పు తలయు గల శరీర మేర్పడును. తరువాత వానికి గొంతుకదగ్గఱ చేపనువలె గాలి పీల్చుటకు దవుడ లేర్పడును. ఈ క్రియలన్నియు గుడ్డునందే జరుగును. తదనంతర మా గుడ్డును పగులగొట్టుకొని పిల్ల బయటికివచ్చి నీటియం దీదులాడసాగును. అపుడది దవుడలతోనే గాలిని పీల్చుచు వదలుచుండును. దానికి తోకకూడ నుండును. అదొక విధముగ చేపవలెనుండును. శీతర్తువురాగానే అదిదాగుకొని వర్షా కాలమునబయటికివచ్చివృద్ధియగుచుండును. నెమ్మదిగాతోకయు మాయమగుచు కరచరణములు శ్వాసకోశములు నేర్పడిదవుడ లతో గాలిపీల్చుట వదలుట యాగిపోవును. అపుడది పూర్తిగా

కప్పయగును. ఈచరిత్ర ప్రతిప్రాణి తనయున్నతికి—వికాసమునకు—పూర్తిగా పల్టీలు కొట్టవలసి వచ్చునని చెప్పుచున్నది.

ఏయే జాతియందు తిరుగుచు నాప్రాణియే అంతిమ జాతిని పొందియున్నదో, ఆ యాజాతి సంతతికి కూడ గర్భము నుండి వృద్ధియగునంతవఱకు ఆవికాస చక్రమంతయు తిరుగ వలసి వచ్చుచున్నది. కోడి చరిత్రకూడ నిటులే యున్నది. కోడి గ్రుడ్డుకూడ నొక కోష్ఠమునుండియే ఆరంభమగు చున్నది. దీనికి గ్రుడ్డులోపలనే చేపకువలె దవుడలేర్పడు చున్నవి. ఈగుర్తులు పిల్ల గ్రుడ్డునుండి బయటికివచ్చిన తరువాత కూడ గొంతుక దగ్గఱ నుండును. కావున పక్షికూడ చేపనుండి కప్పనుండి పక్షిగా మారి నటు లనుమానించ వలసి వచ్చుచున్నది. గర్భ పరివర్తనము మిక్కిలి సంక్షిప్తమై నప్పటికిని తన పూర్వ తర ముల చరిత్ర నంతయు తెలియఁజేయు చున్నది.

పంది, ఆవు, కుందేలు, మనుష్యులు మున్నగు స్తన ధారుల గర్భములన్నియు నొకే ప్రణాళికతో వికాసమొందు చున్నవి. మానవగర్భముకూడ మొదట చేప, తరువాత కప్ప, తరువాతపాము, తరువాతపక్షి యొక్క ఆకారమును పొంది అప్పుడు స్తనధారి యవస్థనుపొందుచున్నది. కావున నీ యోనులతో మానవునకు సంబంధమున్నటులే ప్రతీతమగుచున్నది. లక్షల కొలది సంవత్సరములకాలము పట్టియుండినను అమీబా నుండియే మానవుడు పరిణామ మొందియుండెను. ఇది ప్రత్యక్ష ప్రమాణము. ఇంతకంటె నధికబలమైన ప్రమాణములను ప్రకృతి మనకేమి చూపగలదు?

కీటకములయొక్క ప్రథమపిండము లన్నియు నొకే విధముగనుండును. ఇట్టిస్థితిలోని యాకారము సీతాకోకచిలుక, తుమ్మెద, జెఱ్ఱి మున్నగువానిలో ఏదేదైనది గుర్తించ బడజాలదు. సీతాకోకచిలుక, పట్టుపురుగు మొదలగునవి వృద్ధియగుటలో నవిచూపు రూపములన్నియు ప్రాథమికావస్థలో నొకే విధముగనుండును. కావున నివన్నియు నొకే పూర్వీకునిసంతతి యనియు, నందువలన తమపూర్వపు వంశపువంశము లన్నిటి యందును తిరిగి వచ్చుచుండెననియు, ననుమానించ వీలగుచున్నది. ఇది గర్భవృద్ధిక్రమము. ఆదిగర్భము మొదట నొకే కోష్ఠమును గలిగియుండి తరువాత నొకటికి రెండు, రెంటికి నాలుగు, నాలుగింటికి నెనిమిది, యెనిమిదింటికి పదహారు కోష్ఠములగుచున్నవి. అనగా కోష్ఠము సదా ద్విగుణీకృతక్రమముతో వృద్ధియగుచున్నదని చెప్పవలెను. ఇటులనే గ్రుడ్డుకూడ ద్విగుణీకృత క్రమముతో వృద్ధియగుచున్నది.

అమీబా ఒకకోష్ఠముకలది. హైడ్రా రెండుకోష్ఠములు గలది. అనగా ప్రాణులుకూడ ద్విగుణీకృతక్రమముతోనే వృద్ధియగుచుండెను. ఈ శాస్త్రమువలనను మొదటిప్రాణి సరళముగను తరువాత క్లిష్టముగను, నిర్మాణమయ్యెననియే సూచితమగుచున్నది. ఇంతవఱకు చెప్పబడిన యీ శాస్త్రమునందు పరిణామవాదమును బలపఱచు విషయములు రెండుమాత్రమే యగపడుచున్నవి. అవియెవ్వియన—

౧. ఏ నియమమువలన ప్రాణుల వికాసము జరిగి యుండెనో ఆనియమమే గర్భమునకును కలదు. ఒకకోష్ఠముగల

అమీబా వృద్ధియై సమస్త ప్రాణు లయినటులే గర్భముకూడ నొకకోష్ఠమునుండి యారంభమై మత్స్య, మండూక, సర్ప, పక్ష్యాదుల యాకారమునుపొంది తరువాత స్తనధారి యగుచున్నది.

౨. కోడి, కప్ప మొదలగు వానియొక్క చరిత్రలే దీనికి ప్రత్యక్ష ప్రమాణములు. పంది, కుందేలు, ఆవు, మానవుని గర్భముల పోలికవలన నిదియే లభ్యమగుచున్నది. కీటకముల యొక్క ఆరంభికపిండముకూడ దీనినే సూచించుచున్నది. పరివర్తనమునొంది యొకజాతినుండి మరియొకజాతిగా మారుచున్న విధమును, గర్భము తన వెనుకటి వంశములలో చుట్టివచ్చి వర్తమాన ప్రాణియొక్క ఆకృతిని బొందువిధమును గర్భవృద్ధి క్రమము తెలియజేయుచున్నది.

మొదట సరళరచన, తరువాత క్లిష్టరచన జరిగెననుటయు, గర్భావస్థయందే ప్రతిప్రాణి సరళముగనుండి క్లిష్టరచనావస్థను బొందుచుండెననుటయు, నీ రెంటియొక్క సారాంశము. కావున నిచట క్రమముగ నీ రెండు విషయములను విచారింతము.

(అ) మొదట సరళరచన. తరువాత క్లిష్టరచన ప్రాణులు జనించుచున్నవని మొదటినుండియు చెప్పుచునే యుంటిమి. కాని సరళమునుండి క్లిష్టముమాత్రము జనింపలేదు. అవి భిన్న భిన్నములయిన తమ తమ పూర్వజుల నుండియే యుత్పన్నమగుచున్నవి. అటు లుత్పన్నమగుటకు కారణము, భోగ్య భోక్త సంబంధమేగాని వేఱొండుకాదు. గర్భమునందు సరళరచనకు పిమ్మట గోచరించు క్లిష్టరచనకు కారణము వికా

సోత్పత్తియొక్క పునర్దర్శనము మాత్రము కాజాలదు. కాని ప్రస్తుతము యంత్రమును చేయు నొక సాధారణ నియమము మాత్రమే. ఏయంత్రమునైనను నిర్మించుటకు దాని సునిశితములు క్లిష్టములునైన సమస్త పరికరముల సమర్చుటకై సరళమైనట్టియు, దృఢమైనట్టియు నాధారమొకటి తప్పక యుండితీరవలయును. అనగా మొదట సరళమును, దృఢమునైన యొక యాధారము నిర్మింపబడి తరువాత దానిమీద సూక్ష్మము, క్లిష్టమునైన సామానులన్నియు సమర్చబడును. ఎంతగొప్ప యంత్రమైనను ఇదేవిధముగ నిర్మింపబడుచున్నది.

మానవశరీరముకూడ నొక యంత్రమే. ఈ యంత్రముయొక్క సూక్ష్మము, క్లిష్టమునైన సాధనము లన్నింటికి మూలాధారమైన వెన్నెముక మొట్టమొదట తయారుచేయబడుచున్నది. దీనినే, ఈ వెన్నెముకనే, పరిణామవాదులైన నాస్తికులు చేపయని తలంచుచున్నారు. దానికితల, చేతులు, కాళ్ళు, అంటించబడినపు డది మండూక మనబడుచున్నది. శిరస్సు, కాళ్ళు, చేతులు, హృదయము, శ్వాసనాళములు మున్నగు యంత్రములు వెన్నెముక లేకుండ నేవిధముగా నొకదానియందంటించ బడగలవు? యంత్రముయొక్క సూక్ష్మమును, క్లిష్టమునైన సాధనములు ఏ ఆధారముపైన సమర్చబడక యేపని చేయుచున్నటువంటి యంత్రము నెచటనైన పరిణామవాదులు చూపగలరా? మానవ శరీరావయవములను వెన్నెముక లేకుండ వేరు వేరుగానుంచి శరీర పంజరమును పని కుపయోగించునట్లు చేయగలరా? అటులెన్నటికిని చేయజాలరు. చిన్న చిన్న పురుగులు

యందును సంధుల కాధారము నిర్మింపబడియే యున్నది.
ఆయాధారమే వెన్నెముక పనిచేయుచున్నది. కావున గర్భగోళ
మున జరుగుసిర్మాణ కార్యక్రమము వానివానిపూర్వవంశ చక్ర
మునతిరిగివచ్చుట మాత్ర మనబడజాలదు. కాని యంత్రరచనా
నియమములయొక్క తిరుగుడు మాత్రమనియే యనబడ గలు
గును. అట్లుతప్పక జరుగవలసినదే!

ఏ ప్రాణియు సరళరచన కాదని మొదటనే చెప్పితిమి.
కేవలము సరళరచనయనియనబడుచున్న అమీబాకూడ మిక్కిలి
క్లిష్టరచనయే. దానిసమస్త సూక్ష్మావయవములు అంత సూక్ష్మ
స్థానమునం దేవిధముగ నుంచబడి యున్నవి?

ఇదే విషయమును పాశ్చాత్య వైజ్ఞానికులు మఱియొక
విధముగా నిట్లుచెప్పు చున్నారు. "మాన్యుయల్ ఆఫ్ జ్యూలజీ"
అను గ్రంథముయొక్క ౯వ పుటనుండి ౧౨వ పుటవఱకు
మి. నికల్‌సన్ ఇట్లు నుడివెను. "అమీబా" యను క్షుద్రజంతు
వొక అకల్ప్యసూక్ష్మకణమై యున్నది. కాని దానిపాచనశక్తి
అతిక్లిష్టముగా నిర్మింపబడిన ప్రాణులయొక్క పాచనక్రియా
యంత్రములకంటె నేమాత్రమును తక్కువైనదికాదు. ఇది
తినిన యాహారమును ఇతరావయవములతో నిమిత్తము లేకుండ
గనే జీర్ణింపజేసికొను చున్నది. అన్నిటికంటె గొప్పవిషయ
మింకొకటికలదు. "అది తనయాహారమును పసందుజేసికొను
అత్యద్భుతశక్తి కలిగియున్నది. అది తనయాహారమున పోషక
భాగమును మాత్రమే యుంచుకొని నిరుపయోగభాగము నావ
లకు త్రోసివేయుచున్నది."

వెంట్రుకలలో జనించు ఈపు, లేక నల్లి, లేక చీమ, సాదారచనగల ప్రాణియని యెట్లు చెప్పబడుచున్నది? అందు మానవుని శరీరమునందుకంటె నధికమైన నిర్మాణచాతుర్యము, క్లిష్టత కలదు కావున ప్రాణులయందేదియు సరళరచనగాని క్లిష్ట రచనగాని కాదు.

ఇటువంటి సూక్ష్మజంతువుల విషయమున ప్రాణుల వర్గీకరణమొనర్చిన 'హాక్సలే' యిట్లు వ్రాసెను. "గ్రేగారినీడా" వర్గజంతువులకంటె తక్కువతరగతి జంతువులెవ్వియు లేవు. 'కానిరీజోపోడా' వర్గ సూక్ష్మజంతువు వానికంటె నధికసరళరచనా జంతువై యున్నది. దీనికి శరీరరచనయే లేనట్లు సూక్ష్మదర్శకయంత్రముచే చూడబడెను. ఇది పల్చనచేయబడిన సర్వేసుబంకయొక్క ఒక పరమాణువు వంటిది. కాని దీని యందును జీవనశక్తియొక్క సమస్తగుణములు విద్యమానములై యున్నవి. ఇది తనవంటి ప్రాణివలననే జన్మించుచున్నది. ఆహారము తినగలదు, జీర్ణమును జేసికొనగలదు, గందరగోళము చేయగలదు. ఇంతియగాక యిది తాను దూరుటకు కేవలము క్లిష్టరచనాయుక్తమైన బిందువును తయారు చేసికొనుచున్నది. జేవీయొక్క ఒక కణము ప్రాకృతికశక్తుల నీవిధముగా స్వాధీనము జేసికొనగలుగుచున్నది. కాని అది మాత్రము రచనారహితమును అవయవహీనమునై యున్నది. నాకీవిషయము అసాధారణమైన సారయుక్తముగ నున్నది."

ఇత్యాది విషయములనుబట్టి సాదాక్లిష్టరచనల యభిప్రాయము సరిగాలేదు. అసలు సరళరచనయొక్క అర్థము

భోగ్యము. క్లిష్టరచనయొక్క అర్థము భోక్త, భోగ్య, భోక్త లందు జ్ఞానకర్మములయొక్క సిద్ధాంతము పనిచేయుచున్నది. జ్ఞానకర్మలయొక్క సిద్ధాంతానుసారము వృక్షములు జ్ఞాన, కర్మరహితములు. పశువులు జ్ఞానరహితములయినను కర్మ యుక్తములు. మానవులు, జ్ఞాన, కర్మసమన్వితులు. కావున వీనిలో నొకటి మఱియొకదానికి భోగ్యము, మరియొకటి భోక్త. వృక్షములు కర్మజ్ఞానరహితములు కావున కర్మయుక్త పశువు లకు భోగ్యములు. ఇక మానవుఁడన్ననో జ్ఞాన, కర్మల రెంటి యందును శ్రేష్ఠుఁడు. కావున కర్మచే వృక్షములమీఁదను, జ్ఞానముచే పశువులమీఁదను, అధికారముచేయుచు వాని ననుభ వించుచున్నాఁడు. కావున మొదట వృక్షములును, తరువాత పశువులును, తదనంతరము మానవులు నుత్పన్నమయ్యె నను వైదికసృష్టి నియమము బలపఱచఁబడుచున్నది.

మొదట సరళరచన, తరువాత క్లిష్టరచన జరిగెనని పరి ణామవాదుల ముఖ్యవాదము. కాని యీ సృష్టిక్రమమును వారు బాగుగా చెప్పలేకపోవుచున్నారు. వనస్పతులకు పూర్వము పశువులును, వనస్పతులకు పశువులకు పూర్వమే మానవులు జన్మించిరని యెట్టిమూర్ఖుడైనను చెప్పగలఁడా? ఎప్పుడును చెప్పజాలఁడు. కాని వనస్పతులు, పశువులు కలసియే పుట్టినని పరిణామవాదులైన నాస్తికులు చెప్పునదికూడ సరి యైనదికాదు.

ప్రాణుల యుత్పత్తిచక్రము గర్భమునందే తిరుగుచున్న దనిన యెడల మానవుఁడు గర్భమున తలక్రిందుగా నుండు

కుండును ? ఇది వృక్షముల నమూనా కాదా ? ఏలయన జ్ఞాన కర్మ రహితములయిన వృక్షములు అధశ్శిరము కలిగి యున్నవి, బిడ్డ పుట్టి వక్రి (అడ్డ) ముగా కరచరణములతో నడచుచున్నాడు, ఇది కర్మయుక్తమును, జ్ఞానరహితమునైన పశుధర్మము. కాని జ్ఞాన ముదయించఁగనే యతఁడు నిలువఁబడి మానవుఁడగు చున్నాఁడు. వృక్షములు మొదట పుట్టెననుట కిదియే ప్రమాణము. నవీన విజ్ఞానవేత్తలు అన్వేషణాలను విస్తరింపఁజేసినప్పటి నుండియు మొదట వనస్పతులు జన్మించెనని విద్వాంసులు విశ్వసింపసాగిరి. సరళ క్లిష్ట రచనలయొక్క యథార్థ మిదియే.

(ఆ) గర్భమున వెనుక యోనులును తిరిగి వచ్చుననుటయే రెండవ విషయము. వారిచే నుదహరించబడిన కోడి చరిత్రను విచారింతము. కోడి పక్షి జాతిప్రాణి. దీనికి పూర్వము మత్స్య, మండూక, సర్పజాతి ప్రాణులు గడచి పోయినవిగదా ! కోడి దవుడలు చేప యాకారమును, కాళ్లు, తల వేతైన పిమ్మట నది కప్ప యాకారమును చూపినదని తలచుచో మూఁడవదైన సర్ప పుటాకారమునకది యేమి గుర్తుచూపెను ? పక్షి సర్పమునకు చాల దగ్గఱ, కావున దానియందు సర్పణ శీలముయొక్క గుణము లధికముగ నుండవలయును, కాని సర్పముయొక్క కోరలు పక్షులయం దగపడుచున్నవా ? గబ్బిలమునందు గాక నితరయులయం దా పండ్లులేవుకాని గబ్బిలము సర్పణ శీలము నుండి పక్షిగా మాఱక పశువులనుండి మాఱెనుగదా ! ఏలయన గబ్బిలమునకు చెవులు, స్తనములును కలవు. కావున కోడియందు సర్పణ శీలగుణములు లేవనియే, జ్ఞాతమగుచున్నది గదా !

అయినపుడు దానిని పూర్వపు యోనులయందు తిరిగి వచ్చెనని చెప్పుట కెట్లు వీలగును ? కోడికి గొంతుక దగ్గఱనుండు కంతలను గాంచి యింతగొప్ప కల్పనా భవనమును నిర్మాణ మొనర్చ దగునా ?

మండూకము కేవలము యాంత్రిక సిద్ధాంతానుసారమే వృద్ధియగుచున్నది. మండూకమున కాది, మత్స్యమేయైన యెడల దానికి కాళ్లుండజాలవు. అది వృద్ధియగునపుడు మాత్రమే దవుడలతో శ్వాస తీసికొనుచున్నది. ఇది గర్భావస్థయేగాని వేరుకాదు. మానవుఁడు కూడ గర్భావస్థయందు బొడ్డు నాళము ద్వారానే ప్రాణ పోషణమును పొందుచున్నాడు గదా! అయినపుడు మానవుఁడు కూడ చేపయేనా ? అటులయినచో సమస్త జాతుల పిల్ల లన్నియు మొదట దవుడలతోనే గాలి పీల్చవల యునుగదా ? ఏలయన నన్నియు మత్స్యమునుండియే వికాసము నొందెను. కాని మనుష్యులు పశువులు తల్లి గర్భాశయమునకంటి యుండు బొడ్డునాళముద్వారా ప్రాణపోషణమును పొందుచున్నవి. కావున నీవిషయమున వికాసముయొక్క ప్రమాణములు వ్యాపకము కాజాలవు.

పశువుల, మానవుల గర్భముల పోలికకూడ యాంత్రిక సిద్ధాంతమునే తెలియజేయుచున్నది. అన్నియు మొదట వెన్నెముకనుండియే ఆరంభము చేయబడుచున్నవి. దానినే పరిణామవాదులయిన నాస్తికులు మత్స్యావతార మనుచున్నారు. కాళ్లు, శిరస్సు నేర్పడినపుడు దానిని మండూకమనుచున్నారు. కాని సర్పణశీలముయొక్క దంతములుగాని, యెగిరెడు రెక్కలుగాని

మానవుల లేదా పశువుల గర్భమున చూడబడుటలేదు. పరి
ణామవాద చక్రమునం దీరెండుభాగముల లక్షణములు నెందు
కగుపడుటలేదు? కనుక నీ గర్భావృద్ధిచే నిదివాప్రాణుల క్రమపరి
ణామపు పుట్టుక నకలనిగాని, యిది వెనుకటి వంశములనుండి,
జాతులనుండి తిరిగివచ్చులు యనిగాని సిద్ధాంతమగుటలేదు.

తులనాత్మక శరీరరచనా శాస్త్రమునం దాయువుయొక్క
నియమరహిత దృష్టాంతము లున్నటులే ప్రాణుల గర్భవాసావధి
యందు నెవ్విధమైన నియమములేదు. స్తనధారులలో గుఱ్ఱము
పన్నెండుమాసములకును, ఆవు ౯ మాసములకును, గేదె ౧౦
మాసములకును, కోతి ౭ మాసములకును, మనుష్యులు పది
మాసములకును ప్రసవించుచున్నారు. ఈ ప్రసవ నియమము
నాలుగుమాసములనుండి ౧౨ మాసములవఱకు కలదు. ఈనియ
మము శారీరక బలముమీదగాని, ఆయువుమీదగాని యాధార
పడియుండలేదు. గుఱ్ఱము మానవునికంటె బలమైనది. కాని
ఆయువులోతక్కువ. అయినను గర్భవాస మధికము. తాబేలు
ఆయువునందధికము. బలమునందుతక్కువ. గర్భవాసమంత
కంటెనుతక్కువ. కావున పరిణామవాదులైన నాస్తికులెవరై
నను ఈ అవ్యవస్థను కారణముచెప్పగలరా?

గర్భములో శిశువు మూటగాకట్టబడి యున్నప్పటికిని
నే అవయవమైనను ఒకదానికొకటి అంటుకొనుటయుగాని, బల
హీనమగుటయుగాని లేదు. కాని బయట నీ విధముగా జరిగిన
యెడల నవయవములన్నియు నంటుకొనుటయుగాని, బలహీన
మగుటయుగాని తప్పకజరుగును. కావున నీ భేదమునకు గర్భము

యొక్క విచిత్రమహత్త్వమును, ఆశిల్పకారుని శిల్పచాతుర్య
మును అల్పబుద్ధిగల మానవుఁడు తెలిసికొనఁగలఁడా ? ఏ ప్రమా
ణములు గర్భభ్రూ వికాసమును పరిణామవాదమును బలపఱచు
నవియని చెప్పఁబడినవో; వానిమీఁదనే పరిణామవాదులైన నాస్తి
కులకే పూర్తియైన నమ్మకము లేదు. పరిణామవాద లేఖకులయిన
హాక్సలే, హైగల్ మొదలగు వారీ యితిహాసమును గూర్చి
యిట్లు వ్రాసిరి.

"గర్భవృద్ధినిగూర్చి వ్రాయబడిన చరిత్రయం దచ్చ
టచ్చట, పంక్తులు, పేరగ్రాఫులు, పుటలకు పుటలు జారిపోవు
టయేగాక నచ్చటచ్చట ప్రక్షిప్త ప్రకరణములుకూడ నిందు
చేర్చబడినట్లు దృష్టి గోచరమగుచున్నది."

ఇది పరిణామవాదులకు పూర్తిగా విశ్వాసముగల గర్భ
వృద్ధి శాస్త్రముయొక్కదశ. లుప్తజంతుశాస్త్రమునం దధ్యాయ
ముల కధ్యాయములు మాయమయ్యెనని చెప్పబడినటులే దీని
యందును పుటలకు పుటలే మాయమయ్యెను. లుప్తజంతు
శాస్త్రమున భూమియంతయు త్రవ్వబడ లేదని సాకుచెప్పబడెను.
కాని గర్భశాస్త్రమునందు పుటలకు పుటలే యెందుకు మాయ
మయ్యెనో కడు విచిత్రముగ నున్నది. గర్భపరంపర అమీబా
నుండి మానవునివఱకు నడచివచ్చుచున్నదిగదా ! అయినపుడు
మధ్యలో పుటలెందుల కదృశ్యము కావలసివచ్చెను ? హాక్సలే
మహాశయుఁడా యితిహాసమునందు ప్రక్షేపములుకూడ కలవని
నుడివెను. గర్భచరిత్ర ప్రాణుల వికాసక్రమమునకు పాఠమాల
యైనయెడల దీనిలో ప్రక్షేప మెచటనుండివచ్చి కలసెను

మండూకమునుండి సర్పము, సర్పమునుండి పక్షి కావలసి యుండగా; సర్పపుగుర్తే లేకుండ నెందుకు పోయెను? ఈ శాస్త్ర మునం దట్లుజరుగ కూడదుగదా? ఈ భయానకమైన ఆపత్తికి జవాబు వికాసవాదజ్ఞాత లిటు లొసగెదరు.

"ఈ గర్భావస్థ చరిత్రిలో నెచ్చ టెచ్చట సమానపోలికలు సమాప్తమై భిన్న భిన్న మార్గముల నవలంబించినట్లు ప్రతీతమగుచున్నదో, అచ్చట నా యా స్థానములు, ఇక్కడ ప్రాణులు, పరిస్థితి ననుసరించి భిన్న భిన్న మార్గముల నడువ సాగెనని తెలియజేయుచున్నవి."

అనగా గడ్డిమేయు స్తనధారులకు, తరువాత మాంసము తినెడి స్తనధారులకు, మాంసము తినెడు ప్రవృత్తిజనించుటయే ప్రక్షేపముగా ప్రతీతమగుచున్నదని దీని తాత్పర్యము. ఇది మిక్కిలి గొప్పతప్పు. ఏలయన గడ్డితినెడి దొక్కమాటుగా మాంసముతినెడి దయ్యేనా? ఆవుదూడలలోనుండి యొకటి తోడేలయ్యేనా? పరిణామవాదు లయిన నాస్తికు లటులే విశ్వసించిన యెడల దానిని సరియైన ప్రమాణములతో ఋజువు పర్చవలసియుండును. అట్లుగాక నచటకూడ క్రమ క్రమముగ వికాసమునే విశ్వసించినయెడల నిట్టి భేదము కలుగకూడదు, మత్స్యమునుండి మండూకమగుట శాస్త్ర విరుద్ధమైనటులే, ఆవుదూడ తోడేలగుటయు నసంభవమే. పరిణామవాదులగు నాస్తికులు, కప్పగర్భమునుండి చేప పుట్టె నని చూపుటకు యత్నించిరి. కావున నిపు డుపశాఖలలో ప్రవేశించి వేఱుమార్గ మవలంబించవలయుననెడిసాకు చెప్పుట

సరికాదు. ఏలయన నిది ప్రక్షేపమను సాకయ్యెను. సరే! కాని పుటలకు పుటలే యెందులకు మాయమయ్యెను? కోడికి గర్భావస్థలో సర్పణశీల దంతము లేలకనబడుటలేదు? కావున ప్రతిజాతి స్వతంత్రముగ ఫలానాఫలానా సమయమునం దేర్పడు చున్నదనుటయే అసలువిషయము. ఇచట ప్రాణులవంశచక్రము గాని, జాతులయొక్క ఇతిహాసముగాని లేదు. కావునతమఓటమిని స్వీకరించి పరిణామవాదులు చెప్పిన దేమన;

"సకలప్రాణుల గర్భావస్థచరిత్ర మాకు పరిపూర్తిగా తెలియదు. సకలప్రాణులయొక్క గర్భావస్థపరివర్తన లన్నిటిని మేము చూడలేదు. వాని సార్థకకారణములను పరిపూర్తిగా చెప్పఁజాలము"

పాఠకుడా! సెలవయ్యెను. నడువుము, భౌతికవాదు లైన నాస్తికులకు మిక్కిలి విశ్వాసముగల గర్భశాస్త్రము కూడ వెడలిపోయెను. కావున మేముకూడ దీని నింతటితో విరమించి మానవోత్పత్తి శాస్త్రము వైపునకు మఱలు చున్నాము.

# మానవోత్పత్తి

ఇంతవఱకు పరిణామ వాదముయొక్క స్వరూపము దాని ప్రమాణములు సమాలోచించ బడెను. పరిణామవాదులు పొరపాటుపడక సరియైన మార్గమునం దున్నారనితలంచకూడదు. వలయున వారే స్వయముగా "ప్రాణులయొక్క శరీర రచనాదుల ననుసరించి విచారించిన దానిననుసరించి పరిణామవాదమును యథాశక్తి వర్ణించగలిగితిని. ఇంకను దీనివాస్తవికత యెప్పటికైనను బాగుగా ప్రత్యక్షము కాగలదనియే మాయుద్దేశము" అని నుడివెదరు.

డొంకతిరుగుడు మార్గము ననుసరించి వారెల్లప్పుడు తమ వాదమును పోషించుకొనుటకై మాటి మాటికి భూభాగములందు లభించు ప్రాణిసముదాయపు చిహ్నములు, గర్భమునందలి వికాసము, మిస్సింగ్ లింక్సులు, లభించుట మున్నగు ప్రమాణములనిచ్చి సంతుష్టులు కాగోరెదరు. ఇంతకు మించిన సాధనములు వారిదగ్గఱ లేవనియే చెప్పవచ్చును. వాని యన్నింటి నీ గ్రంథమునం దిదివఱకేయథాస్థానమున విమర్శించియుంటిమి. సర్వదృక్పథములతో, నిష్పక్షపాతబుద్ధితో, తిలకించిన సందేహములన్నియు నివృత్తి కాగలవు.

పరిణామవాదపు చైతన్యసృష్టిలో సర్వోత్కృష్టమైనది మానవజాతి. ఇది ప్రాణులపరిస్థితి వలననైననేమి, జీవనసంఘర్షణ ఫలితమువలన నైననేమి, నేటికి పరివర్తనమొందుచు,మానిసివఱకు వచ్చెను. ఇది సర్వోత్తమమైనదని వారు నిస్సంశయ

ముగా చెప్పెదరు. గాని, దీని తరువాత నింకను పరివర్తనము జరుగునా? జరుగదా? యనునది మాత్రము చెప్పరు. ఇటీవల కొందఱు అవసరవాదులు తమ వాదనను ఆస్తిక భావములతో పోషించుకొనలేనివారై మనుష్యోత్పత్తివఱకు డార్విననును, మానవుల యున్నతికై మార్క్సును వివరించెనని యనుచున్నారు. ఈవిధముగా రెండుసిద్ధాంతములను జతపఱచి నచో లోటులేనిమార్గము దొరకునని వారు ప్రచారముచేయు చున్నారు. డార్వినిజము ప్రపంచసుఖశాంతుల కెటుల యుప యోగించనిది వేఱొక యధ్యాయమున విమర్శించెదము. ప్రస్తుత మీగ్రంథము డార్వినిజమునే విమర్శించుట కుద్దేశించ బడినదిగాన మార్క్సిజము నిచట విమర్శించక వైదికవర్ణ వ్యవస్థయను ప్రత్యేకగ్రంథమునందు విమర్శించెదము.

మానవుని ఆచార వ్యవహారపరిస్థితుల ననుసరించి పరి ణామవాదము బలపఱచబడుచున్నదని చెప్పుచుందురు. కావున వారి వాదనలోని యంశములనే పేర్కొనుచు క్రమముగా విమర్శించుటకై యీ యధ్యాయము ప్రత్యేకించబడినది. పాఠకమహాశయులు శ్రద్ధాపూర్వకముగా చదివి మనన మొనర్చుకొని సత్యాసత్యములను నిర్ణయించుకొనెదరుగాక!

౧. తులనాత్మకదృష్టితో మానవుని శరీరరచన, గర్భ పరివర్తనము, లభించిన శిలాఖండవర్తి, మానవుని అవయవ ములు, యంత్రమువలె మానవుడు కూడ నితర ప్రాణులు ప్రాకృతిక నియమములకు లోనై యున్నటులే యుండియున్నాఁడు.

"తులనాత్మకదృష్టితో మానవునిరచన గర్భపరివర్త నము శిలాఖండాంతరములందు లభించిన మానవుని అవయవములు యాంత్రికనియమములతో నితరప్రాణులవలెనే యిదియును తనస్వరూపమున వృద్ధిపొందె ననుట మొదలగు విషయములన్నింటికి సమాధానము పూర్వాధ్యాయములలో నిచ్చియే యుంటిమి. ప్రతిశాస్త్రము కేవలము కల్పన అనుమానముల మీఁదనే ఆధారపడియుండెనుగాని కొంచెమైనను ప్రత్యక్ష ప్రమాణములపై నాధారపడియుండలేదు. పరిస్థితివలనను యంత్రములవలె ప్రాణులు పరివర్తితమగుటకూడ సిద్ధముకాలేదు. కావున మరల నదే విషయమును చర్చించుట చర్వితచర్వణ మగును"

౨. మానవుని శరీరముకూడ నితరప్రాణులే పదార్థములతో నిర్మితములయ్యెనో ఆయా పదార్థములతోనే నిర్మాణమయ్యెను. మానవునకును ఆరువెనిమిది కోష్ఠములే కలవు. శరీరము కోష్ఠములవలనను, కోష్ఠములు ప్రోటోప్లాజమువలనను నిర్మాణమయ్యెను. పృష్ఠవంశధారులు నిర్మింపబడిన తత్త్వమువలననే మానవుడును నిర్మింపఁబడెను. కావున వెన్నెముక గల స్తనధారులలోనే మానవుడుకూడ లెక్కింపఁబడవలయును. స్తనధారి శ్రేణిలో కోతితరగతివనమనుష్యుని యుపజాతియందు మానవుని స్థానమున్నది.

"ఇందనేక విషయముల కింతకుపూర్వమే సమాధానమొసఁగఁబడెను. ఎనిమిది సంస్థానములు లేనిది ప్రాణియనఁబడదు. కోష్ఠము, కోష్ఠాంతర్గత ప్రోటోప్లాజముయొక్క మూల

మునుగూర్చి మొదటనే చెప్పియుంటిమి. అమీబా యొక్క కోష్ఠముగలది. దానియందే – ఆకోష్ఠమునందే – యెనిమిది పనులు జరుగుచున్నవి. కాని యిది యొకటినుండి రెండైనపుడు, దానియందే మఱియొకకోష్ఠము తయారగుచున్నది. అట్లు వేఱగుటకు పూర్వము రెండు కోష్ఠము లొకేదానియం దంటుకొని యుండుచున్నవి. అయినపుడది యొకేకోష్ఠము కలదని యేల చెప్పఁబడుచున్నది? ఇటులనే యనేక కోష్ఠములుగల ప్రాణియొక్క ప్రతికోష్ఠము అమీబావలెనే ఎనిమిదిపనులు వేఱు వేఱుగా చేయుటలేదు. భిన్న భిన్న కోష్ఠముల పనులు భిన్న భిన్నములుగా నుండును. కావున నీ కోష్ఠములుకూడ నమీబా కోష్ఠమువంటి కోష్ఠములని యే ఆధారముతో చెప్పబడుచున్నది?

అనేకకోష్ఠములుగల ప్రాణులయందును తమ్ముతాము చక్కబెట్టుకొనుట యగపడుచున్నది. కావున కోష్ఠములన్నింటిని సంబాళించు కోష్ఠమేదో యొక్కటియై యుండునని విదితమగుచున్నది. అన్యథా కోష్ఠములన్నియు స్వతంత్రించి వేఱువేఱుగా ప్రబంధము చేయసాగినయెడల శరీరమునం దవ్యవస్థ యేర్పడును. కాని మనము ప్రతిశరీరమునందు సువ్యవస్థనే కాంచుచున్నారము. కావున వ్యవస్థాకర్త యేదో యది యొకే కోష్ఠము కావలయును గాని అన్నియు కాఁజాలవని స్పష్టముగా ప్రతీతమగుచుండగా, కోష్ఠములన్నియు చేతనములేయని యెందులకు చెప్పవలయును? కోష్ఠములందుఁగల రస మెన్నటికైన చైతన్యమునకు కారణము కాగలదా? జ్ఞానశక్తి సంయుక్తపదార్థముల వలన నుత్పన్నము కాఁగలదా? ఎప్పటికినిఁగాఁజాలదు. వలయున

అనేకసంయుక్త చైతన్యముల వలన వ్యవస్థకు విఘాతము కలుగు చున్నది. మానవుఁడు వెముకలుగల వానిలో స్తనధారి శ్రేణివై నను వీనిలో దేని సంయోగము వలనను మానవ వంశము నడ చుటలేదు. దేనివలనను ఆయువుగాని, భోగముగాని, గర్భవాస సమయముగాని కలియుటలేదు. కావున నిట్టిస్థితిలో మానవుని పశువులతో కలుపుట ఘోరమగు నన్యాయమని చెప్పబూను చున్నారము.

ప్రపంచమునఁగల సమస్త ప్రాణులయొక్క వెండ్రు కలలో పుట్టినప్పటినుండియు చచ్చువఱకు నెట్టిభేదమైన పరివర్త నము జరుగుటలేదు. ఆవు పుట్టినపు డే రంగుగానుండునో జీవిత పర్యంత మదేరంగుతో నుండును. ఒంటె, గుఱ్ఱము, గాడిద, గేదె, యెద్దు, మేక, గొఱ్ఱె మున్నగువాని స్థితికూడ నింతియే. వనమనుష్యుఁడు, కోతి మొదలగునవికూడ నేరంగుతో పుట్టునో యదే రంగుతో మృత్యుపర్యంత ముండును. కాని మానవుని వెండ్రుకల రంగు పుట్టినపుడు రాగివర్ణముగను, యువావస్థలో నల్లగను, వృద్ధావస్థలో తెల్లగను, మఱియు నత్యంత వృద్ధా వస్థలో పింగళవర్ణముగ నుండును. మానవులకును పశువులకును గల భేదమును తెలియజేయు నీవెండ్రుకల పరివర్తనము రెంటిని వేఱుచేసి యున్నది.

ప్రపంచమునఁగల పశువులన్నియు నేర్చుకొనకుండఁగనే నీటియందీఁదగలవు. తుదకు కోఁతి సహిత మీఁదఁగలదు. కాని, మానవుఁడీఁత నేర్చుకొనకుండ నీటియం దీఁదజాలఁడు. ఇంతియ గాక రెండుకాళ్ళపై నిలువబడుట, మాటలాడుట, నవ్వుట

నేర్చుట, పాడుట మున్నగు విషయము లనేకములు మానవుని యందే కలవు గాని పశువులయందు లేవు. అనగా శిక్షనుపొంద కుండగనే తమతమకార్యములను నెఱవేర్చుకొనుట పశువులయందే కలదుగాని మానవునియందు లేదు. కావున మానవుఁడు పశు శ్రేణిలోనివాఁడు కాఁడనియే స్పష్టమగుచున్నది.

పశువులకును, మానవులకును భేదమున్నటులే వృక్షములకును, పశువులకును భేదము కలదు. పశువులు వక్ర – (అడ్డ) శరీరముకలవి. వృక్షములు తలక్రిందు శరీరముకలవి. అనగా వృక్షములు తలక్రిందుగానుండును. జ్ఞానేంద్రియములఁ భేదము రెండవది. ఆహారభేద మన్నింటికంటెను ప్రబలమైనది. వృక్షములు విషవాయువును – బొగ్గుపులుసుగాలిని – పీల్చి జీవించుచున్నవి. ఇతరప్రాణు లాగాలిని పీల్చి చచ్చిపోవుచున్నవి. అనగా వృక్షములయాహారము ప్రాణనాశకవాయువు. ప్రాణులయాహారము ప్రాణప్రదవాయువు. కావున వనస్పతులకును, పశువులకును, ఏవిధమైన శారీరకసంబంధముగాని, ఉత్పాదకసంబంధముగాని యున్నటు లగుపడుటలేదు. కావున మానవుఁడు పశుశ్రేణిలోనివాఁడుగాని, పశువులు వనస్పతిశ్రేణిలోనివిగాని కారనియు, నీమూటి నొకటిగాఁ జేయుటలో పరిణామవాదులు మిక్కిలిపొరపాటు పడుచున్నారనియు స్పష్టమగుచున్నది.

3 – వానరతరగతిలో నెనిమిది విశేషములుకలవు. (అ) గర్భనాళమునకు పలుచనిచర్మముతో సంబంధము. (ఆ) కరచరణములఁ వ్రేళ్ళు నాలుగువైపులకు తిరుగగలుగుటచే నవి కాళ్ళతోను పట్టుకొనఁగలుగుచున్నవి. (ఇ) ఇవివృక్షములపై నుండును. (ఈ) వీనికి పాలపండ్లు, సిరదంతములును గలవు.

(ఉ) వానరతరగతి యొక్క భిన్నవంశములలో దంతములసంఖ్య నియతముగనుండును. (ఊ) చేతికి ౫ వేళ్ళుమాత్రమే యుండును. గోళ్ళు, పంజా కూడకలదు. (ఋ) నుడుటెముకలు దృఢముగను ఉన్నతముగనుండును. (ౠ) ప్రతిదానికి రెండేసి స్తనములు మాత్రమేయుండును.

"వానరతరగతికిచెప్పబడిన ౮ ఎన్మిదివిశేషములు వాస్తవముగా వానరజాతివిశేషములుకావు. వానిలో సగమునకు పైగా నితరప్రాణులయందుకూడ నగపడుచున్నవి. కాని నిజముగావానరములయం దగపడుచున్న ౨ - 3 విశేషములే స్వయముగా మానవులకు కోతులకు నెట్టిసంబంధము లేదని నుడువుచున్నవి. గర్భనాళము గేదెకునుకలదు. ౫ వేళ్ళు తిప్పగలిగినంతమాత్రమున క్రోఁతి మానవశ్రేణిలోనిది యనఁబడజాలదు. వృక్షములమీఁద పక్షులు, కీటకములు కూడ వసించుచున్నవిగదా! ద్వివిధములయిన దంతములు గోవులకును గేదెలకును కలవు. ఇతర పశువులయందును దంతముల సంఖ్య వేఱు వేఱుగ కలదు. ౫ వ్రేళ్లు ఉడుతకునుగలవు, అసలు గోళ్లు పంజాలే దానిని మానవ శ్రేణి నుండి వేఱుచేయుచున్నవి. నొడ యెముకల దృఢత్వమునకు ఉన్నతితో నిచట నెవ్విధమైన సంబంధములేదు. మేకకు కూడ రెండు స్తనములుండును. ఇట్లు సమ విషమాంగముల రెంటి నాధారముజేసికొని పరిణామ వాదులు విషయము నింతవ్యర్థముగా నెందులకు పొడుగించిరో విదిత మగుట లేదు.

౪. పూర్తిగా నిలువబడి రెండుకాళ్ళమీఁద నడచుట, మస్తిష్కముయొక్క అధికవికాసము, వాక్కుతో మాటలాడుశక్తి, విచారించుశక్తి యీనాలుగునుమానవునియందుగలవిశేషములు.

మొదటి విశేషములు, (నిలువఁబడి రెండుకాళ్ళతో నడచుట, మస్తిష్కముయొక్క అధిక వికాసము,) తాత్త్వికములు కావు. పరిణామములు. అనఁగా చిన్న-పెద్ద తరగతుల యొక్క అంతరము లనుట. నిలువఁబడి నడచుట కూడ మస్తిష్కము యొక్క యున్నతి పరిణామమే.

మాటలాడుటకు, విచారించుటకు, తిన్నగా నిలువఁబడి నడచుటకు కారణము కేవలము మస్తిష్కముయొక్క ఉన్నతియే యని యనబడుచున్న విషయము నిప్పటి వైజ్ఞానికు లొప్పుకొనుట లేదు. మస్తిష్కాభివృద్ధియే మానవత్వము కాజాలదు. ఏలయన చీమ నందఱెఱుంగుదురు. బోలుగానుండుదానితల టోపీనికూడ నందఱును చూచియే యుందురు. అందు మెద డేమాత్రము నుండదు. కాని విజ్ఞానవేత్తలు, మానవుని తరువాత ప్రపంచ మంతటిని బందోబస్తు చేయఁగల ప్రాణి చీమయొక్కటేయని నుడువుచున్నారు. *

---

* Could the ant have ruled the world? Lord Avebury has suggested that in the absence of man the ant might have become master of the earth. Now here do we find the ability to rule so well developed as in these remarkable insects, which enslave other insects - the aphides, into their service. The White ants or termites display an even higher intelligence when the eggs are about to be laid by the queen hiding away the mother for a period. The ants which might have won the race for mastery if man had not been.

Had the ant combined its balance of experience and specialised instinct with greater bodily development involving greater responsibilities and opportunities it might in time have stood forth as certainly a competitor for the master of the earth. —Harmsworth popular science Vol I. P. 54-55.

కావున 'మస్తిష్కము వలననే బుద్ధి విచారముల యం దున్నతికలుగు' నను మొదలగు విషయములు ఋజు వగుటలేదు.

౫. వానరజాతిలో నుపజాతులు, వంశములు అనేకములు కలవు, "లీమర్" ఇది సగము కోతి. ఇది కరచరణముల వలననే కోతియని తెలియఁబడుచున్నది. "మార్మొసెట్" కూడ నాకారమున కోతివలె నుండును. కాని యధికముగా కోతిని బోలియుండును. దీని గోళ్లు పంజాగా నుండును. సామాన్యమైన కోతి నందఱు నెఱింగియే యున్నారు గదా!

"మాంసాహారులలో కుక్క, నక్క, తోడేలు, పిల్లి, పులి, సింహము మున్నగు జాతులున్నటుల వానరములయందు ననేక జాతులుకలవు. కాని దేనిసంయోగమువలన వంశము నడచునో యదియే జాతియనియు, నితరము కాదనియు నిదివఱకే చెప్పితిమి. క్రమవికాసమును చూపునిమిత్తమే యీ "లీమర్, మార్మొసెట్" మొదలగుప్రాణులు వానరములనఁబడెను. కాని లీమరాదులు స్వతంత్రయోనులు. వీనియందు పరస్పర వంశము నడచుటలేదు. కావున నివి వానరజాతికి జెందినవికావు."

౬. వనమనుష్యుడు కూడ వానరతరగతి వంశమే. ఇందు నాలుగువిధములు గలవు. గిబ్బన్, ఓరాంగు (ఔటాంగ్) చింపాంజీ, గోరిల్లా. వీనిదంతములు మనుష్యుని దంతములవలె నుండును. ముక్కుక్రిందకు వంగియుండును. కాని లోపలవైపున రెండు ఛిద్రములుండవు. వీనిచేతులు కాళ్ళకంటె పొడువుగ నుండును. దవుడ సంచులుగాని, తోకగాని యుండవు.

"చతుర్విధమయిన వనమానవజాతి కూడ వానర తరగతిలో చెప్పఁబడెను. కాని వానికి కోఁతులతో చాల కొద్దిసామ్యమే కలదు. ఇవి భిన్న భిన్నములయిన స్వతంత్రప్రాణులు. వీని కింకొకదానితో నెట్టి సంబంధమును లేదు.

౭. "గిబ్బన్ జాతితల్లి తనపిల్లలకు ముఖము కడుగును. చింపాంజి తన శరీరమునుండి కారురక్తము నదిమిపట్టి ఆపుచేయుటకై యత్నించును. చింపాంజిబుద్ధి తొమ్మిదిమాసముల నిసువు బుద్ధివలె నుండు" నని వైజ్ఞానికు లనుచున్నారు.

"గిబ్బన్ తన పిల్లలకు ముఖము కడిగినయెడల నావు, గేదె, మొదలగునవి తమ బిడ్డలనునాకి శుభ్రము చేయుచున్నవి. పక్షులు తమపిల్లలకు గింజల నేరుకొనివచ్చి పెట్టుచున్నవి. వనమనుష్యుఁడదిమిపట్టి కారుచున్న రక్తము నాపుచేయుచున్నచో కుక్క విరేచనౌషధముగా పచ్చిగడ్డి తినుచున్నది. ఏనుఁగు కూడ వైద్యము చేసుకొనుచున్నది. చింపాంజీ కేవలము తొమ్మిది మాసములబిడ్డను బోలుబుద్ధిగలిగి యున్నయెడల చీమ ప్రపంచమంతటిని మానవునివలె బందోబస్తు చేయగలుగు చున్నదే! కావున ఇంతమాత్రమునసే వనమనుష్యుఁడు మానవ శ్రేణిలోనివాఁడు కాజాలడుసుమా!

౮. మానవునకున్న ముఖ్యమైన విశేషములు రెండు. అధికమస్తిష్క వికాసము. నిలువబడి రెండుకాళ్ళమీఁద నడచుట. నిలువఁబడి నడచుటకు, కారణము మస్తిష్క వికాసమే. వనమనుష్యుఁడునిలువబడ గలఁడుకాని వంగఁబడి యుండును.

మానవుఁడు నిలువఁబడి యుండుటవలననే పేగుజారు (ఆంత్రవృద్ధి) రోగము జనించుచున్నది. మానవుని మస్తిష్కమును చింపాంజి మస్తిష్కమును సరిపోల్చి చూచుటచే రెంటిలోను పరిణామము యొక్క భేదమేనని విదితమగుచున్నది. మానవుని మస్తిష్కము స్పష్టమగుచున్నది. కాని చింపాంజి మస్తిష్కము సుస్పష్టమగుటలేదు. కరచరణముల స్థితికూడ నింతియే. కోఁతి కాళ్ళతో వస్తువుల నెత్తగలుగుచున్నది. ఇటులనే యొక యడవిజాతి స్త్రీ కూడ కాళ్ళతో వస్తువుల నెత్తగలుగుచున్నది. గడ్డము మనుష్యునకు నాలస్యముగ వచ్చుటయేగాక పొట్టిగ నుండును. కాని గోరిల్లాకు గడ్డము తొందఱగా వచ్చుటయేగాక పొడవుగను, మిక్కిలి బలముగలిగి యుండును. అసభ్యజాతులయందును గడ్డము తొందఱగా వచ్చుచున్నది. మానవుని శరీరమున రోమములుండవు. కాని కొందఱకు చెవులలోను, భుజముల మీఁద నుండును. జపాను ఇన్యూజాతివారి శరీరములయం దధికముగ రోమము లుండును. 'మిస్. జులి యూపాస్ట్రానా' చాల రోమములు గలదని సుప్రసిద్ధి. అనగా మానవుని యుం డీప్రాణులకంటె నెవ్విధమైన తాత్త్వికభేదమును లేదు. కాని కేవలము పరిణామభేదమే భేదము.

" మస్తిష్క సిద్ధాంతము చీమల ప్రమాణముతో తల క్రిందులయ్యెను. చీమలకు మెదడే లేదు. వానికి మెదడే యున్న మెడల వనమనుష్యుని (చింపాంజీ) మెదడుకంటె చాలతక్కువ యని విశ్వసించవలయును. మెదడులేని చీమయే సమస్తమైన

పనులు చేయుచున్నపుడు మానవుఁడు సర్వ కార్యములను విశాలమైన మెదడుతో చేయుచున్నాఁడనుట సరికాదు. కావున వనమానిసి మెదడు పోలిక నిరువుర నొకటిగా చేయఁజాలదు"

"శరీరరచన స్వభావాదులయందు మానవుడు నితర పశువులు సమానమే అయినను వానియందెట్టి భేదములేదనియు; కోతి, మానవుఁడు నన్ని యంశములలోను పరస్పర సదృశులే యనియు, విశ్వసించకూడదు. ఈవిషయ మసంగతమును వాస్తవిశావస్థను అశుద్ధ కల్పనగా మార్చెడిదియునై యున్నది" అని పరిణామవాదులే యనుచున్నారు.

మానవుడు రెండు కాళ్ళుగలిగి యుండియు ద్విపాదియై రెండుకాళ్ళమీద నిలువఁబడి నడచుటకు ప్రారంభించినప్పటి నుండియే ప్రేఁగు జారెడురోగము జనింపసాగెననుట నిజమే యైనయెడల నీప్రాణి యీభయమువలన నెప్పటికిని నిలువఁబడి యుండునదికాదు. నిలువఁబడియుండుటచే మానవుని ప్రేఁగు జాఱిపోయినచో నాసమయమునందలి ద్విపాదిప్రాణు లన్నియు ప్రేఁగుజారెడు రోగముచే నాక్రందనముచేసి యుండవచ్చును. నిజముగా అట్లు జరిగియున్నయెడల మానవు డెవ్వఁడు నిలువఁబడుట కెన్నఁడును సాహసించఁడు. అసలు విషయమొద్ది యన మానవుడు తిండిపోతగుటచే నతని కీ రోగము వచ్చుచున్నది. కడుపునిండిన తరువాత పశువు తిండితినదు. కాని మానవుఁడు నిండినను తిండి తినును. అందువలన మానవున కీ రోగము పుట్టుచున్నది. సర్వమాన్య శ్రీ డాక్టరు లూఈకూనే ఈవిషయ మునుగూర్చి ఇట్లు వ్రాసెను.

“పేఁగు జాఱుటకు కారణము పొట్టలోపల (అన్యపదార్థము యొక్క బరువు యెక్కువయై కృంగదీయుటయే. ఆమాశయముయొక్క పలుచని చర్మమునందే స్థానమునందైనను, కొంచెమాటంకము అడ్డుకలుగువో నచట పేగుల యంతరీయమగు నొత్తిడికారణమున రంధ్రము జేసికొని వెలుపలకు వచ్చుచున్నవి. ఈ పలుచని చర్మము పగులు స్థానములు భిన్నభిన్నములుగ నుండును. కాని పగులు కారణ మొక్కటే - కావున నీరోగమునకు కారణము దెబ్బతగులుట, క్రిందపడుట లేదా మఱేదైన నని చెప్పుట మిక్కిలి పొరపాటు. ఇతర కారణముల వలనను ఈ చర్మము పగులవచ్చును. కాని ఆంత్రవృద్ధికి కారణము దెబ్బలు మొదలగునవి మాత్రము కాఁజాలవు. ఆ చికిత్సాపద్ధతి నవలంబించి అన్యపదార్థమును శరీరమునుండి తొలగించినచో నిట్టిరోగములు, ఛిద్రములు నయమగును.”

ఈచర్మము భిన్నభిన్న స్థానములందు బ్రద్దలగుచుండుటకు నితరకారణ మొద్దియును లేదు. కూనే చికిత్సవలన నీ చర్మరంధ్రములు బాగుపడుచున్నప్పుడు నాలుగుపాదముల నుండి మానవుఁడు ద్విపాదిగా మారుటచే నీరోగము వచ్చుచున్నదనెడు విషయము పిల్లవాని యాటలవలె హాస్యాస్పదమగుచున్నది. మస్తిష్కము యొక్క యెక్కువ తక్కువలను చీమలు రూపుమాపెను. ఏప్రాణినైనను మానవునితో పోల్చుటకు మస్తిష్క విషయమేమియు విలువ యొసంగఁజాలదు.

కరచరణముల సమత్వమునందును విశేషమేమియును లేదు. నడచుటకును పరుగెత్తుటకును పనికివచ్చుచుండఁగాఁ

చేతులనబడఁజాలవు. అవి పాదములే యనబడును. అడవి మనుష్యుఁడు రెండు కాళ్లపై తిన్నగా నిలువబడి నడువజాల నంతవఱకు నతఁడు చతుష్పాత్తనియే యనఁబడును. ఇట్టి స్థితిలో కాళ్లను చేతులనుట వివేకముగల పనికాదు. మానవునిచేతులు చేతులే. కాని వనమనుష్యుని చేతులు కాళ్లేగాని చేతులు కాజాలవు. కావున చేతులను కాళ్లతో సరిపోల్చుట వివేక లక్షణము కాజాలదు.

ఒక యడవిజాతి స్త్రీ కాళ్లతో వస్తువులను బట్టుకొని యెత్తినంత మాత్రమున నది కోతులగురు తని సిద్ధాంతము కాఁజాలదు. అభ్యాసముచే గారడివాఁడు నేత్రముతో రూపాయ నెత్తగలుగుచున్నాఁడు. అభ్యాసముచే నర్తకి నీటిలో ముఖము నుంచి నాలుకతో ముక్కునకు ముంగర (ముక్కుపుడక) నంటించఁగలుగుచున్నది. ఈపనులు కోతులలో చూపగలరా? మంచి పహిల్వాను కాళ్లతో పేచీలు చేయగలుగుచున్నాఁడు. సర్కసువారు కాళ్లతో నత్యద్భుతమైన పనులు చేయ గలుగుచున్నారు. అయిన నివన్నియు కోఁతిచిహ్నములేనా? బుద్ధి, గడ్డము, మీసాల విషయముకూడ నింతియే. ఆటవికులకు నివి శీఘ్రముగా వచ్చుటకు కారణము వారు కోఁతులనుండి వికాసము పొందిరని యందుమా? వేశ్యా పుత్రికలకు స్తనములు తొందరగా వచ్చుచున్నయెడల వారు తొందరగా బిడ్డలనుగను జంతువుయొక్క పరిణామ మనవలసినదే కదా! అవయవములు తొందరగా స్ఫుటితమగుట ఖాద్య, పేయ, ఆచార, వ్యవహార, జల, వాయువులపై నవలంబితమైయున్నది.

"అడవిమనుష్యులకు గడ్డములు, మీసములు తొందరగా వచ్చి పెద్దవగుటకు కారణము వారు పచ్చితిండి (మాంసము) తినుటయే. కోందఱకు శరీరమున రోమము లధికముగా నుండుటకు కారణము గర్భమున పురుషశక్తి యధికముగ నుండుటయే. గర్భమునం దీశక్తి యుచిత పరిణామముకంటె నధికముగా దాఖలైనపుడే సంతానముయొక్క రోమములపై దానిప్రభావము పడుచున్నది. పురుషశక్తి యధికమగుట వలననే అప్పుడప్పుడు స్త్రీలకుకూడ గడ్డములు, మీసములు వచ్చుటయు, నప్పుడప్పుడు పురుషశక్తి తక్కువగుటచే పురుషులకు మీసములు, గడ్డములు, రాకుండుటయు జరుగుచున్నది. రోమములు, వెండ్రుకలు, ఎముకలు, స్నాయువులు మున్నగు కఠినపదార్థములు పురుషశక్తి వలననే యేర్పడుచున్నవి. కావున కోందఱకు వెండ్రుక లధికముగా నుండుటం గాంచి కోతి వెండ్రుకలని యనుమానించుట విజ్ఞానలక్షణము కాజాలదు. అధికముగా వెండ్రుకలుండుటయే వానర చిహ్నమైనయెడల గడ్డములు మీసములు లేనిపురుషులు, గడ్డములు మీసములుగల స్త్రీలు, దేనిపరిణామమై యుందురు? గడ్డముదగ్గఱ స్త్రీలకువలె వెండ్రుక లేమియు లేని కోతి నెవరైన చూచియున్నారా? వంశపరంపరాగతముగ వెండ్రుకలుండుట, సహజ సిద్ధము. ఎప్పుడైన నొక పర్యాయము సంతానమునకు నధికముగా వెండ్రుకలు వచ్చునో యవి నెమ్మది నెమ్మదిగా ౧౦-౧౨తరముల తరువాతనే పోవుచున్నవి. జపాను ఇన్యూజాతివారి కిపుడు వెండ్రుకలు తగ్గిపోవుచున్నవి. కావున వెండ్రుకల పోలికవలన మానవుడు కోతి తరగతి వాఁడని సిద్ధాంతము కాఁజాలదు"

౬. మానవుని శరీరము నందలి యవశిష్టాంగములు అనగా పూర్వపు యోనులయొక్క అంగము లింతవఱకు నగపడుచున్నవి. మానవుఁడు తన యిష్టము వచ్చినట్లు శరీరమును కదలించలేఁడు. కాని కదలించగలనాడులుమాత్రమున్నవి. కపాల చర్మమును కొందఱు మాత్రమే కదలించగలరు. చెవినికూడ నందరు నల్లలులాడించలేరు కాని. చెవిని నల్లలలాడించువారు కొందఱు కలరు. ముక్కుతో వాసనచూచికూడ నందఱు గుఱుతించలేరు. కానికొందఱు మాత్రము గుఱితించగలరు. మానవుఁడు రోమములను నిలబెట్టఁజాలఁడు. కాని రోమములను నిలువఁజేయఁగల నాడులుమాత్రము శరీరమున విద్యమానములై యున్నవి. ఇట్టి యంగములు పశువులలో బాగుగా పని చేయుచున్నవి. కాని యవి మానవుని శరీరమునుండి నెమ్మది నెమ్మదిగా నదృశ్యములై పోయెను. కానికొందఱిలో మాత్రము కలవు. కనుబొమలు ముడుచుట, నొసలువిఱచుట, పెదవులు, బుగ్గలు కదలించుట నేటివఱకు మానవునకు చేతనగును.

“అంగములను కదలించలేకపోవుట యిపుడవిపనికిరానివై పోయెననుట” యుక్తియుక్తముకాజాలదు. వీఁపుమీఁదవ్రాలు ఈఁగ దోమ మొదలగువానిని తోలుకొనుటకిపుడవసరము లేదా? ఇపుడువీనిని పాఱద్రోలుటకు నితరసాధనములున్నచో నేత్రములు, బొమలు, వెండ్రుకలు, పెదవులు, మున్నగువానికిపుడును కదలించుశక్తియున్నదే! వీనిశక్తి యన్నిటికంటె మొదటనే నశింపవలసియేయుండును. ఏలయన చేయియనుసాధనము వీనికిదగ్గఱనే లభించెనుగదా! బలహీనముకావలసిన యంగములు బలహీనము

కాకుండ నితరములెటులయ్యెను? ఎందులకయ్యెను? కావున పరమాత్మ యెట్టిభోగము భోగించుటకై దేనికెట్టిశరీరమును నిర్మించవలయునో దానికట్టి అవయవములను నిర్మించెననుటయే సమంజసము.

బుగ్గలు, బొమలు, మస్తకము, పెదవులు మున్నగువాని నాడించుట, కదలించుట, బందగుచో నాటకమున నృత్యకారుల భావములెట్లు తెలిసికొనబడును? ద్వివిధ (అపరిచిత) భాషలుగల వారికి పరస్పరమెట్లు పరిచయముకలుగును? వాదవివాదమెట్లు జరుగును? వాసనచూచి గుర్తించగలశక్తి అందఱకునుకలదు. పలువిధములయిన యత్తరుల, నానావిధములయిన పుష్పగంధముల, మలమూత్రస్వేదాదుల, భేదమును, నేయి, నూనె మొదలగువాని తారతమ్యము నందరెఱుంగుదురు. కాని అభ్యాస కారణమున నత్తరుల నమ్మువాఁడు వాసనచూచియత్తరుల భేదమును వివరించి చెప్పగలిగినంత తొందరగాప్రతివాఁడును చెప్పఁజాలడు. అత్తరునమ్మువాఁడు, అత్తరులవాసనను గ్రహించు వానినిమిక్కిలి గొప్పవాఁడని తలంచును, అటవికులు, చదువులేని వారు ప్రాయికముగా స్మరణశక్తినధికముగా పనిచేయుచున్నారు. కావున వారి కాశక్తి బలసమన్వితమగుచున్న దనవలయునేకాని, యవి వారి పూర్వికులచిహ్నములనుట యేమాత్రము విజ్ఞాన యుక్తముకాదు. రాజపుత్ర స్థానమున నితరుల పదచిహ్నములను మిక్కిలి తొందరగాగుఱుతించి దొంగలను తెలుసుకొనుచున్నారు. కావున వారియొక్క యీ యభ్యాసము ఏ పూర్వజాతినుండి వీరికి వచ్చెనో చెప్పగలరా?

"మానవునకు రోమములు నిలుపవలసిన యవసరమే లేదు. ఏలయన నతఁడు రోమముగల ప్రాణికాదు. కాని నిజమైన మానవత్వ సమయమున – ఆనందహర్షాదులందు – అతఁడు రోమాంచి యగుచున్నాఁడు. కావున రోమాంచమును కలుగఁజేయు నాడులు బలహీనమయ్యెనని చెప్ప వీలుకాదు. నాడులు వానివాని పనుల సమయములందు నిత్యము నూతన కార్యముల ననేకపర్యాయములు చేయుచున్నవి. కాని వానిపై నధికారము లేదు. కాని హృదయముమీఁద మాత్రము అధికారము కలదా ? దాని నెవరాఁప గలరు ? తనపద్ధతిప్రకార మది తప్పక పనిచేయును. ఇంతమాత్రమున దానిని బలము లేదని యనవలసినదేనా ? హృదయము బలహీనము కానపుడు రోమాంచమును గలుగఁజేయు నాడు లెట్లు బలహీనములని తలంచబడును ? రోమాంచము మానవుని సహజగుణము, ఇతర పశువుల కిది లభ్యము కాలేదు. కావున మానవు డితరములతో సమానుఁడు కాఁజాలఁడు "

౧౦. అన్ననాళము యొక్క అంతమున (Vermi form Appendix) అనునొక తిత్తికలదు. అది జంతువుల కుపకరించు చున్నదే కాని మానవున కేమాత్రము పనికిరాకపోవుటయే గాక గింజలు మొదలగు కఠినపదార్థములందుఁ బ్రవేశించిన యెడల ప్రాణాపాయముకూడ కలుగుచున్నది. ౬. ఆరవ నెల గర్భమున శిశువు శరీరమంతయు రోమములతో కప్పబడియుండును. ఇది వానరముయొక్క పూర్వరూపము. కోతిపిల్ల కడుపులో నంటు

కొని యుండును. కావుననే శిశువు పుట్టినవెంటనే గుప్పెళ్ళతో త్రాడుపట్టుకొని వ్రేలాడగల బలము గల్గియుంటున్నది.

(Vermiform Appendix) అను పంచి కేవలము మానవుఁడు గింజలను తినకుండ నుండగలందులకు భయమును కలుగఁజేయు నిమిత్తమై యున్నది. రేగు, ఖర్జూరపండు, మామిడి, నేరేడు మున్నగు పండ్లలో గింజలుండును. కావున పిల్లలాఫలములను తినునపుడు పెద్దవారు వారిని జాగ్రత్త!, గింజలు మ్రింగకూడదు. మ్రింగినచో పొట్టలో మొక్కలు మొలచును. అని బెదరించుచున్నారు. గింజయందు హానిని కలుగఁజేయు భయమే లేని యెడల మానవుఁడు సావధానముగ నుండఁజాలఁడు. గింజలయందు గల కఠోరతవలన జీర్ణశక్తి నశించి మానవుఁడు శీఘ్రముగా మరణించును. కావున మానవునియం దీపంచి యీభయము కొఱకే యేర్పరచబడెను. ఏలయన మానవుడు ఫలాహారి. గింజలు తినుట మానవప్రకృతికి సంభవము.

గర్భమున శరీరమంతయు రోమములతో కప్పఁబడి యుండుట, మానవుడు గర్భమున తనపూర్వరూపమైన వానరత్వదృశ్యమును చూపుచుండె ననుటకు ప్రమాణము మాత్రము కాఁజాలదు. గర్భపరివర్తనము కేవలము తన పూర్వరూపదృశ్యమును చూపునిమిత్తమే యైనయెడల మొట్టమొదట నొక సెల్లు (sell) ప్రాణియైన అమీబా, తన యుత్పత్తితో దేనిదృశ్యమును చూపుచుండె? నను ప్రశ్నకు సమాధాన ముండి తీఱవలయును. కావున గర్భమున వెంట్రుకలచే శిశువు కప్పబడి యుండుటయొక్క యుపయోగము మఱేదైన నుండియుండవలెను.

౬ మాసములకు తరువాత శిశువుగర్భమునుండి బయటికి వచ్చు టకు శిశువుచర్మము యోగ్యమగుచున్నది. ఏలయన, నేఁడేసి మాసములకే యనేకశిశువులు జన్మించి పూర్తిగా జీవించుచుండు టంతవఱకు తెలియును. కావున నాచర్మమును, మాయతిత్తి (ఉచ్చబుడ్డ) లో నిండియున్న మురికినీటినుండి కాపాడు నిమి త్తమే గర్భమున రోమములు నిర్మాణము చేయబడియుండ వచ్చును. ఏలయన, రోమములందు నీటినింకనిచ్చు గుణము లేదు. కావున వెంట్రుకలపోలికనుబట్టి మానవుఁడు కోతిశ్రేణి లోనివాఁడగుటయు పొసఁగనేరదు.

కోఁతులతలపై నాలుగేసి యడుగుల పొడవుగల వెంట్రుక లుండుట చూచినవా రెవరైన కలరా ? ఏ కోఁతికి మూఁజేఁడు గడ్డము గలదో చెప్పుఁడు చూతము ! నాలుగడుగులపొడవు తల వెంట్రుకలుగల స్త్రీలును, మూఁజేడు, బాఁజేడు గడ్డములు మీస ములుగల పురుషులెందఱో కలరు. ప్రపంచమునం దిటువంటి వెంట్రుకలుగల ప్రాణి మఱెద్దియును లేదు. అయినపుడు మానవుని రోమములు కోఁతిరోమములను పోలియున్నవని చెప్పుట కెట్లు వీల గును ? శిశువు పుట్టినవెంటనే త్రాడుపట్టుకొని వ్రేలాడఁగలశక్తి గలిగియుండుటకు కారణము కోఁతిపిల్ల తల్లిగర్భమునం దంటు కొనియుండుటమాత్రము కాఁజాలదు. మానవశిశువునందు కూడ నీశక్తి గలదు. ప్రస్తుత మీశక్తికి కారణము శిశువు గర్భ మున గుప్పిలి బిగఁబట్టియుండుటయేగాని వేఱొండు కాదు. అట్లు గుప్పిలి బిగఁబట్టి యుండకపోయినయెడల నాశిశువు గర్భమునందు దేనినైన పట్టుకొనఁగలదు. అందువలన ప్రసవసమయమునం దధిక

కష్టము కలుగఁగలదు. అప్పుడప్పు డట్లు జరుగుచుండుటయు నందఱకుఁ దెలిసియే యుండును. కావున నిట్టి విపత్తు లేవియు సంభవించకుండ నుండగలుగుటకే ప్రతికార్యప్రబంధమును మిగుల బుద్ధిమత్త్వముతో విధాత యేర్పాటుచేసెను. కాని మానవుఁడు తనయహంకారముతో నొకదాని నింకొకటిగా తలంచఁగల మదోన్మత్తుడగుచున్నాఁడు. ఇదియే యాతని అల్పజ్ఞత, అల్పత్వమును.

౧౧. అసకాక్సిక్స్ (os coccyx) అనబడుచున్న మానవుని వెన్నెముకయొక్క చివర పూసతోక చిహ్నమనబడుచున్నది. తోకగల మనుష్యులలో నీపూస ౨. ౧౦ అంగుళముల పొడవు గలిగి కేవల మది మాంసస్నాయుసమన్వితమై యుండునే గాని యెముకలు మాత్రి మందుండవు.

"మానవునకు చెప్పఁబడినతోక తోకయేకాదు. "ఇందెముకలు లేవు. కేవలముమాంసము, నరములుమాత్రిమే కలవని" పరిణామవాదులె చెప్పుచున్నారు. అమెరికాదేశపు అమేజను నదీతీరముననుండు మానవులపెదవులు ఒక్కొక్క అడుగు పొడవుండునట్లు * యీ మనుష్యుల కచటనుండు చర్మము కూడఁ బెరిగియుండినంతమాత్రిమున అమెరికావారు ఏనుగు యొక్క పరిణామముగా విశ్వసించబడనట్లు వీరును కోఁతుల యొక్క పరిణామము కాఁజాలరు. మఱియొక విషయము. అదెద్దియన మానవుఁడు వనమనుష్యుని పరిణామమేయైనచో వన మనుష్యునకు తోకయే లేదుగదా? అయినపుడు మానవునకు

* సరస్వతి. వర్షం. ౧౧. అంక. ౪

తోక యెచటనుండివచ్చును? ఇంతియగాక మనుష్యునకును వనమనుష్యునకు మధ్య మఱియొక నరవానరముకూడ విశ్వసించఁబడుచున్నది. ఉత్తరభారతమున గయాజిల్లాలో బోదకాలు, ఫైజాబాదు జిల్లాలలో నండవృద్ధి, మనప్రాంతములో నర్సాపూరు, రాజోలు తాలూకాలలో బోదకాలు, అండవృద్ధి, జగన్నాథమువైపున, అయోధ్య ప్రాంతమున కంఠవాపు మిగుల వృద్ధిగనున్నవి. మార్వారులలో నుదరవృద్ధియు కలదు. ఇటులనే ఆఫ్రికాదేశపువారి పెదవులు లావగుచున్నవి. కాని వీరియందరి యంగములలో నూతనాంగములు పుట్టుటలేదు. ఉపర్యుక్తబోదకాలు, అండవృద్ధి, మొదలగువానిని రోగమనుచున్నారు. కాని వానియందు రోగవిషయ మేమియును లేదు. వానిలో నొప్పిగాని, బాధగాని,మరణభయముగాని లేదు. కావున స్థానవిశేషమువలన గలుగు నీ మాంసగతవృద్ధి తోకయనుట సరికాదు.

౧౨. మానవుని యెముకలు 3 వ శిలాఖండమునందు మాత్రమే లభించుచున్నవి. మొదట మానవుఁడు ప్రపంచమునం దిపుడు గుఱుతే లేనటువంటి జాతులయందు జనించెను. జావాద్వీపమునందొక పుఱ్ఱె దొరకెను.అది మానవునిపుఱ్ఱెకంటె తక్కువదియు, వనమనుష్యుని పుఱ్ఱెకంటె నున్నతమునైయుండెను. ఇది వనమనుష్యునకు, మనుష్యునకును మధ్యస్థమగు గొండ్లెమని యనుమానించఁబడుచున్నది.

"జావాద్వీపమున దొరకినపుఱ్ఱె యొకబాలునదై యుండవచ్చును. లేక ప్రస్తుతాలో జీవితానుసార మది యొకమూర్ఖునిదై

యుండవచ్చును. లుప్తజంతుశాస్త్రానుసారము కుందేలు. గుఱ్ఱ
ములయొక్క ఆవిష్కారమును అసత్యమని తెలియజేసినట్లే
ఈ పుఱ్ఱెలయొక్క అవయవముల విషయములుకూడ నున్నవి.
పరిణామవాదులే దానికి విరుద్ధముగా 'వర్తమానమనుష్య'
వనమునుల మధ్యస్థమయిన గొండెములయొక్క అన్వేషణ
పూర్తిగాజరుగునని ఆశించుట వ్యర్థమని యనెదరు.

౧౩. మానవునిశరీరమున జన్మించు పేను, ఈరు
మొదలగు ప్రాణులు పశువుల శరీరమునందును పుట్టుచున్నవి.
ఎలుకలరోగములే మానవులకును వచ్చుచున్నవి. మానవులకు
వచ్చి పశువులకు రాని రోగమెద్దియును లేదు. వైద్యముకూడ
రెంటికిని సమానమే. మత్తు రెంటికిని కలుగుచున్నది. కొన్నింటి
రక్తకణములు గుండ్రముగను, కొన్నింటికి పొడవుగను, కొన్నిం
టికి వెడల్పుగ నుండును.

"మానవుడు నిర్మాణమైన తత్వములతోనే పశువులు
కూడ నిర్మించబడెను. అన్నియు పంచభూతములచే నిర్మించ
బడినపుడు, ఈరు, రోగము మందు, మత్తు మున్నగునవి రెంటి
యందును సమానప్రభావము నుంచుననుటలో నాశ్చర్యమేమి
యుండును? ఈ సమానతవలన మానవుడు పశువుగను, పశువు
మానవుడుగ నయ్యెనా? మానవుని వెండ్రుకలరంగు మారుట
వలనను, పశువులు నీటిలో నీదుటవలనను, ఈరెండు నొక
జాతియని సిద్ధాంతమగుట లేదు. రక్తకణముల రూపభేదము భిన్న
భిన్నజాతులను సిద్ధాంతమును బలపఱచునేగాని యొకేజాతి
సంతానమని ఋజువుపఱచ లేదు.

౧౪, పందికి ౧౦, ఎలుకకు, కుక్కకు, ఉడుతకు ౮ ది. పిల్లికి, ఎలుగబంటునకు ౬ రు. తీక్ష్ణదంతములుగల సమస్త తృణాహారులకు ౪ స్తనములుండును. అటులనే యొక జర్మను స్త్రీకి ౪ గు, ఒక జపానుస్త్రీకి ౬, ఒక పోలండుస్త్రీకి ౧౦ స్తనములు కలవు.

“పరిణామవాదసిద్ధాంతానుసారము అనేక స్తనములు గల స్త్రీలుండుటచే మానవుఁడు వెనుకటి తరములయిన పంది, యెలుక, కుక్క, కుందేలు, పిల్లి, యెలుఁగుగొడ్డు, మున్నగు జాతులనుండి పరివర్తన మొందుచు మానవరూపమునకు వచ్చె ననినచో నమెరికా దేశపు పొడవుపెదవులవారు ఏనుఁగునిర్మాణమని యనవలయునుగదా! ఆఫ్రికా దేశపు బుష్‌మెన్లు చాల దూరమువఱకు చీకటిలో చూడఁగలరు. పరుగెత్తికొనిపోయి తమయాహారమును దెచ్చుకోఁగలరు. అంతమాత్రమున మానవుఁడు, గ్రద్ద, గుడ్లగూబ, సర్పము, గుఱ్ఱము మున్నగు యోనుల నుండియు, మఱియు వారియందు తోఁక కనబడిన యెడల వారు కుక్క, పిల్లి, ఒంటె, వానరాది సమస్తమైన తోఁకలు గల యోనులనుండి వచ్చినటుల భావించవలయునుగదా! మానవుని యందితరప్రాణులలక్షణములు కనఁబడినపు డతఁ డాప్రాణుల నుండి వచ్చినాడని యనినచో జాగ్రత్తగా విచారించినయెడల మానవులలో ప్రపంచమునఁగల సమస్తయోనుల చిహ్నములు తప్పక దొరకఁగలవు. ఇంతమాత్రముచేతనే మానవుడు ప్రపంచమునఁగల యోనులన్నిటను తిరిగివచ్చెననెడువిషయమునుపరిణామవాదు లొప్పుకొందురా? అటులైనయెడల హెగెల్, హాక్సలే

మొదలగువారిచే చెప్పబడిన ౨౧ శ్లోకములవిషయ మసత్యమని తలంచినవా రగుచున్నారు. అటులే యైనచో మానవుడు కొన్ని విశేష యోనులతో సంబంధము నుంచక ప్రపంచపు యోను లన్నింటితో సంబంధము కలిగియున్నాడని పరిణామవాదులు నూతన సిద్ధాంతమును నిర్మించుకొనినవా రగుదురు. కాని దురా గ్రహముతో వారు దీని నొప్పుకొనక పోవచ్చును. వాస్తవముగా మానవునకు సమస్తయోనులతోనున్న సంబంధమును తెలిసి కొననిదే సమన్వయించదు. హిందూశాస్త్రము మాత్రము మానవుడు ప్రపంచమునగల యోనులన్నిటినుండి తిరిగి వచ్చె ననియు, నతడు ౮౪ లక్షల యోనులకు తరువాత జనించె ననియు చెప్పుచున్నది. పుట్టగనే పాలు త్రాగుప్రవృత్తి, శబ్ద శ్రవణాసక్తి, హర్ష, శోక, భయాదులయొక్క సంచార మతని యనేక జన్మలసూచనయని వారనుచున్నారు. (పూర్వజన్మ ప్ర మాణములు) పుట్టిననాడే యిన్ని పూర్వజన్మగుర్తు లగపడునెడల గర్భవాసమునందును, దానిజన్మ జన్మాంతర సంస్కారము లుదయమగుచునే యుండవచ్చును. ఎప్పు డే పూర్వజన్మ సంస్కార ముదయించునో. చెప్పజాలము. నిజసంస్కారము లుదయమై దానినిర్మాణమునం దంతరమును కలుగజేయును. తల్లియొక్క ఆచార విచార వ్యవహారములుకూడ గర్భస్థునిపై ననేకవిధము లయిన ప్రభావముల నుంచుచున్నవి, కొన్నిచోట్ల గర్భిణీస్త్రీలు గ్రహణసమయమున నీటియందు కాళ్లుంచి కదలకుండ కూర్చుం డకపోయిన యెడల నామెగర్భమునుండి కుంటి గ్రుడ్డి శిశువు జనించునని వినుచున్నారము. అప్పుడప్పు డటులే జరుగుచున్నది

కూడ. కాని యీవిషయసంస్కారము లేనిచోట అట్లు జరుగుట లేదు. తల్లి ప్రభావమేగాక, దేశ, కాల, జల, వాయు, సుభిక్ష, దుర్భిక్షకాలముల యొక్కయు, పిడుగు, యుద్ధము, అగ్నిదాహము మున్నగువాని యొక్కయు ప్రభావముకూడ గర్భస్థశిశువుపైఁ బడుచున్నది.

(౧) గర్భసంస్కారము వలనను, (౨) తల్లియొక్క ఆచార విచార వ్యవహారముల వలనను, (3) దేశ, పరిస్థితి యందు విశేషము లుత్పన్నమగుట వలనను, (౪) గర్భస్థాపన సమయమునం దనేక వీర్యకణములు పరస్పరము కలియుట వలనను, గర్భస్థునియందు వికృతరూపము లేర్పడుచున్నవి. కాని "మానవునియొక్క విశిష్టావశిష్టాంగములు- మానవుఁడు పరిణామమునొంది వచ్చిన వెనుకజాతి చిహ్నములు" అని పరిణామవాదులనుచున్నారు. కానివారియొక్కయీ ఆరోపణలకు విరుద్ధముగా సృష్టిక్రమము కొన్నివిషయములను ప్రకటించి చూపెను. అవి యెదుటకు వచ్చినతోడనే పరిణామవాద మెన్నటికిని తలయెత్తకుండ నస్తమించుచున్నది. ఉదా :- పురుషులకు స్తనములుండుట, అజాగళస్తనములు, అశ్వమునకు స్తనములు లేకుండుట, గొఱ్ఱెపోతునకు కొమ్ములు వచ్చుట, మానవున కాలువ్రేళ్ళుండుట. ఈ మొదలగు విషయములు పరిణామవాదముయొక్క విశిష్టావశిష్టాంగముల మిథ్యాకల్పనల నంత మొందించెను. ఎద్దు, దున్న, మేకపోతు, ఏనుఁగు, ఒంటె, సింహము, కుక్క, కోతి, మానవుఁడు మున్నగువానికి స్తనము లెప్పుడు, ఎందుకు, ఎట్లు ఉత్పన్నమయ్యెను? మఱి

గుఱ్ఱమునకు స్తనము లెందుల కుత్పన్నముకాలేదు? మేకపోతు మెడలో స్తనము లేల జన్మించెను? గొఱ్ఱెపోతునకు, ఆడగొఱ్ఱెకు లేనికొమ్ము లెచటనుండివచ్చెను? మానవున కాఱువ్రేళ్లెందుకు పుట్టుచున్నవి? అను నీప్రశ్నలకు పరిణామవాదులగు నాస్తికు లేనాటికైనను సమాధానము చెప్పగలరా?

సృష్ట్యారంభమున స్త్రీపురుషులు వేఱువేఱుగా లేరు. అమీబా ఒంటరిగనే స్త్రీపురుషులపని చేయుచుండెను. కాని కొన్నితరములకు తరువాత దోమ, ఈగ, ఈరు, పేను, మున్నగు వాని పుట్టుకతోపాటు స్త్రీ పురుషభేద మేర్పడెను. కాని స్తనములు జనించలేదు. వీనితరువాత సంధియోనులు – ఎముకలు లేనివి – జన్మించెను. అప్పుడుకూడ స్తనములు పుట్టలేదు. సంధియోనులకు తరువాత మత్స్య, మండూక, సర్పణశీలములు జనించెను. కాని యిప్పటికిని స్తనముల యభావమే యుండెను. వీని తరువాత పక్షులు జన్మించెను. కాని పక్షులకును స్తనములు లేకుండెను. కాని మొట్టమొదట గబ్బిలమునకు స్తనములు జనించుట కనఁబడసాగెను. ఇచ్చటనుండియే స్తనధారుల వరుస క్రమము ప్రారంభమయ్యెను. ఇంతవఱకు స్తనములు లేకుండగనే పిల్లలపోషణ జరుగుచుండెను. ఎట్టివిధమైన కష్టనష్టములు కూడ కలుగలేదు. స్త్రీ పురుషభేద మేర్పడుటయు, సంతానము జనించుటయు, వానిపోషణ యెట్టి కష్టనష్టములు లేకుండ జరుగుటయు నేర్పడి లక్షలకొలది తరములు గడచెను. కాని యింతవఱకు నేప్రాణికిని స్తనములు జనించలేదు. కావున నిప్పుడు గబ్బిలమునకు స్తనము లెందులకు? ఎచటనుండి వచ్చెను? అను

కూడ. కాని యీవిషయసంస్కారము లేనిచోట అట్లు జరుగుట లేదు. తల్లి ప్రభావమేగాక, దేశ, కాల, జల, వాయు, సుభిక్ష, దుర్భిక్షకాలముల యొక్కయు, పిడుగు, యుద్ధము, అగ్నిదాహము మున్నగువాని యొక్కయు ప్రభావముకూడ గర్భస్థశిశువుపైఁ బడుచున్నది.

(౧) గర్భసంస్కారము వలనను, (౨) తల్లియొక్క ఆచార విచార వ్యవహారముల వలనను, (౩) దేశ, పరిస్థితి యందు విశేషము లుత్పన్నమగుట వలనను, (౪) గర్భస్థాపన సమయమునం దనేక వీర్యకణములు పరస్పరము కలియుట వలనను, గర్భస్థునియందు వికృతరూపము లేర్పడుచున్నవి. కాని "మానవునియొక్క విశిష్టావశిష్టాంగములు- మానవుఁడు పరిణామమునొంది వచ్చిన వెనుకజాతి చిహ్నములు" అని పరిణామవాదులనుచున్నారు. కానివారియొక్కయీ ఆరోపణలకు విరుద్ధముగా సృష్టిక్రమము కొన్నివిషయములను ప్రకటించి చూపెను. అవి యెదుటకు వచ్చినతోడనే పరిణామవాద మిన్నటికిని తలయెత్తకుండ నస్తమించుచున్నది. ఉదా :- పురుషులకు స్తనములుండుట, అజాగళస్తనములు, అశ్వమునకు స్తనములులేకుండుట, గొఱ్ఱెపోతునకు కొమ్ములు వచ్చుట, మానవున కాఱువ్రేళ్ళుండుట. ఈ మొదలగు విషయములు పరిణామవాదముయొక్క విశిష్టావశిష్టాంగముల మిథ్యాకల్పనల నంతమొందించెను. ఎద్దు, దున్న, మేకపోతు, ఏనుఁగు, ఒంటె. సింహము, కుక్క, కోతి, మానవుఁడు మున్నగువానికి స్తనము లెప్పుడు, ఎందుకు, ఎట్లు ఉత్పన్నమయ్యెను? మగ

గుఱ్ఱమునకు స్తనము లెందుల కుత్పన్నముకాలేదు ? మేకపోతు
మెడలో స్తనము లేల జన్మించెను? గొఱ్ఱెపోతునకు, ఆడగొఱ్ఱెకు
లేనికొమ్ము లెచటనుండివచ్చెను ? మానవుని కాలు వ్రేళ్లెందుకు
పుట్టుచున్నవి ? అను నీప్రశ్నలకు పరిణామవాదులగు నాస్తికు
లేనాటికైనను సమాధానము చెప్పగలరా ?

సృష్ట్యారంభమున స్త్రీపురుషులు వేఱువేఱుగా లేరు. అమీబా ఒంటరిగనే స్త్రీపురుషులపని చేయుచుండెను. కాని కొన్నితరములకు తరువాత దోమ, ఈగ, ఈరు, పేను, మున్నగు వాని పుట్టుకతోపాటు స్త్రీ పురుషభేద మేర్పడెను. కాని స్తనములు జనించలేదు. వీనితరువాత సంధియోనులు – ఎముకలు లేనివి – జన్మించెను. అప్పుడుకూడ స్తనములు పుట్టలేదు. సంధియోనులకు తరువాత మత్స్య, మండూక, సర్పణశీలములు జనించెను. కాని యిప్పటికిని స్తనముల యభావమే యుండెను. వీని తరువాత పక్షులు జన్మించెను. కాని పక్షులకును స్తనములు లేకుండెను. కాని మొట్టమొదట గబ్బిలమునకు స్తనములు జనించుట కనఁబడసాగెను. ఇచ్చటనుండియే స్తనధారుల వరుస క్రమము ప్రారంభమయ్యెను. ఇంతవఱకు స్తనములు లేకుండగనే పిల్లలపోషణ జరుగుచుండెను. ఏవిధమైన కష్టనష్టములు కూడ కలుగలేదు. స్త్రీ పురుషభేద మేర్పడుటయు, సంతానము జనించుటయు, వానిపోషణ యెట్టి కష్టనష్టములు లేకుండ జరుగుటయు నేర్పడి లక్షలకొలది తరములు గడచెను. కాని యింతవఱకు నేప్రాణికిని స్తనములు జనించలేదు. కావున నిపుడు గబ్బిలమునకు స్తనము లెందులకు ? ఎచటనుండి వచ్చెను ? అను

ప్రశ్న పుట్టుచున్నది. మొదట స్త్రీకిమాత్రమే స్తనములు జనిం
చిన కారణమును గాని, తరువాత పురుషులకు వచ్చిన కారణ
మునుగాని పరిణామవాదులు చెప్పఁగలరా? మగగుఱ్ఱమునకు
స్తనములు లేకుండుట భౌతికవాదులగు నాస్తికులను మఱింత
కష్టపెట్టుచున్నది. అజాగళ స్తనములు తలఁపునకు వచ్చినపు డీకష్ట
మధికభీకరాకారమును దాల్చుచున్నది. స్త్రీపురుషులయొక్క
భిన్నత్వము సంధియోనులయిన కీటకములకు పూర్వమే యేర్పడి
యుండెను. కావున స్త్రీపురుషులలో స్తనములయొక్క ఉత్పత్తియు
పూర్వపుదేయని యెవరైనను చెప్పఁగలరా? పురుష స్తనములే
వెనుకటియోనియొక్క అవశిష్టాంగములు? అవి అవశిష్టాంగ
ములే యైనయెడల గుఱ్ఱమునకేల జనించుటలేదు? అను ప్రశ్నలు
జనించుచున్నవి. అట్లుగాక నివి నూతనముగా జనించు విశిష్టాంగ
ములనిన యెడల నవి యెందులకు జనించెను? వాని ప్రయోజన
మేమి? ఆప్రయోజనము గుఱ్ఱమున కెందులకు లేదు? మేక
పోతుమెడలో జనించు స్తనము లేప్రాణియొక్క అవశిష్టాంగ
ములని చెప్పఁగలరు? సకల ప్రాణివర్గములలో అమీబానుండి
మానవునివఱకు నాఱవవ్రేలున్న జాతిని కల్పనచేయుఁగల ప్రాణి
యొక్కటియైనను ఇంతవఱకు నగుపడలేదే. కావున నిట్టి పరి
స్థితిలో నాఱవవ్రేలు ఏప్రాణియొక్క అవశిష్టాంగమని యనఁ
బడఁగలదు? దాని నవశిష్టాంగ మనుటకు వీలులేదు. ఏలయన
నది వంశపరంపరగా వచ్చుటలేదు. మఱియు ముందునకు నడ
చుటయును లేదు. తల్లి కాఱువ్రేళ్ళున్నచో సంతానమునకు
వచ్చుటలేదు. కావున పరిణామవాదము లిది పుట్టుటకు కారణ

మైన చూపఁగలరా? గొఱ్ఱెకొమ్ముల పరిస్థితికూడ నింతియే. పురుష స్తనములు, ఆఱవవ్రేలు. అవశిష్టాంగముల కల్పనను బలపూర్వకముగా ఖండించుచుండ విశ్వాసనీయ మెటులగును? దీనికి జవాబు ఆస్తికులే చెప్పగలరు. కాని నాస్తికులేమియు చెప్పజాలరు. గర్భవాసమున ప్రాణి విచారములు, తల్లియొక్క ఆచారవ్యవహారములు, జలవాయువుల ప్రభావము, వీర్యకణముల సంయోగము ప్రాణులకు వికృతాంగములను కలుగజేయుచున్నవి. ప్రాయికముగా మానవులయందే వికృతాంగములు పుట్టుచున్నవి. ఇతరప్రాణుల కితరప్రాణుల చిహ్నములు పుట్టుటలేదు. మానవులలో ౮. ౧౦. స్తనములు, తోక మొదలగు చిహ్నములు చూడబడినట్లు పశువులలోనే యితర పశుచిహ్నములు చూడబడుటలేదు. కోతులలో ౬. ౧౦ స్తనములుగాని ఒక్క పర్యాయ మొక్కబిడ్డకంటె నధికముగా బిడ్డలను గనుటగాని చూడఁబడలేదు. కాని పరిణామదృష్టిలో నవి మనుష్యులకంటె ననేక స్తనములు, ఒక్క పర్యాయ మనేక సంతానమును కను పశువులకు చాల దగ్గఱగ నున్నవిగదా! అది తనబిడ్డను ఱొమ్మున కంటించుకొని తిరుగవలసి యున్నది. కావున రెండవ బిడ్డ పుట్టినయెడల నట్లుచేయుటకు పోషించుటకు వీలుకాదు. కాని మానవులలో ననేక స్తనము లుండుటయు, బెక్కండ్రు పిల్లలు పుట్టుటయు, గానబడుచున్నది.

కావున వానరము ఇతరపశువులయొక్క పరిణామమనిగాని, మనుష్యులు కోఁతులపరిణామ మనిగాని సిద్ధాంతము కాజాలదు. మానవునం దున్న యున్నతి కారణమున నది జనించు

దివసమున నే హర్ష, శోక, భయాదుల పరిదర్శించునటులే గర్భావస్థ యందుకూడ స్వప్నవత్తుగా ననేకయోనులసంస్కారములను స్మరించుచుండును. ఈసంస్కారములు తల్లియొక్క విశేషవిచార వ్యవహారముల జలవాయువుల, దేశకాలాదిపరిస్థితులయొక్క యేదో యొకవిశేషయోగమును పొంది దానిశరీరమున నెనుబదినాలుగు లక్షలయోనులలో నేదో యొక యోనియొక్క యేదోయొక యంగము నుత్పత్తి జేయుచున్నవి. కాని పశువుల మానసికశక్తి యింతప్రబలముగ నుండుటలేదు. కనుకనే వానికి తమపూర్వ యోనులయొక్క సంస్కారముండదు. అందువలన వానియంగములలో నితరయోనియొక్క అంగచిహ్నము లుత్పన్నమగుట లేదు. ఇది అధ్యాత్మికసిద్ధాంతము. భౌతికసిద్ధాంతముకూడదీనినే పోషించుచున్నది. భౌతికసిద్ధాంతానుసార మనేకవీర్యకణములలో కొన్నివీర్యకణము లొకదానియందేకమైనపుడే విశిష్టాంగములు జనించుచున్నవి. వీర్యమసంఖ్యాకములయిన చిన్నచిన్న కణములతో నేర్పడుచున్నదని చెప్పనవసరములేదు. అట్టివీర్యమునందలి ప్రతిరేణువు ఒక్కొక్కశరీరమును కలుగజేయుబీజమై యున్నది. స్త్రీ గర్భాశయమునందీకణములు ప్రవేశించుచున్నవి. కానికొన్ని కారణములచేప్రాయికముగా నన్నియుకరగిపోయి నష్టమై యేదో యొకటిరెండుమాత్రమే మిగుల గలుగుచున్నవి. కాని అపవాదరూపముగా నెప్పుడో నష్టప్రాయమైన బీజములలో కొన్నియంశములువచ్చి సమస్తబీజములలో సంశ్లిష్టమై మూలాంగములతోపాటు వృద్ధియగుచున్నవి. అట్లుకలసిన యంశములే యొకప్పుడు ఉ వ శేషరూపముగను, ఒకప్పుడు

అనేకస్తనముల రూపముగను ఒకప్పుడు తోకరూపముగను కనబడుచున్నవనియు చెప్పవచ్చును. ఇటులనే గొఱ్ఱెకు కొమ్ములు కూడ పుట్టుచున్నవి. గొఱ్ఱెకెప్పుడైన మేకపోతు కలసిన యానాడే గొఱ్ఱెపోతుకూడ కలసినచో గర్భము స్థిరమై పుట్టినబిడ్డకు కొమ్ములువచ్చును. ఈ కార్యము సహజముగా మందలలో కనబడును. మేకపోతు వీర్యమున కొమ్ములయొక్క ఉపాదానకారణమున్నది. ఈ యంశమే గర్భస్థునిశిరస్సు పైకిలాగబడి యెప్పుడేకమగునో అప్పుడు గొఱ్ఱెకుకూడ కొమ్ములు వచ్చుచున్నవి. ఒకప్రాణియంశ మింకొకప్రాణి శరీరమునం దంటుకొనుట ప్రపంచమున చూచుచునేయున్నాము. ౫ కాళ్ళగోవును చూచియే యుందురు. ౫ వ కాలు మరియొకగోవుది. అది కోసి యింకొక దానికంటించబడును. ఈ విధముగా తయారుచేయబడిన యొక శృంగధారి మానవుని చూచితిమి. విదేశములయం దట్టి నమూనాలనేకమిపుడు గనబడుచునేయున్నవి. ఇచ్చట నొక శరీరాంగము నింకొక శరీరాంగమున కంటించఁబడుచున్నటులే గర్భమునందును అంటుకొను చున్నవి. "ధర్సటన్" అను విద్వాంసుడు తన "వైవాహిక విజ్ఞానము" అను గ్రంథమునం దిట్లు వ్రాసెను.

"గర్భిణియగు గోవు ఆఁబోతు నెన్నడును దగ్గరకు రానీయదు. అయినప్పటికి నాఁబోతు దానిపై నత్యాచార మొనర్చిన యెడల నే బిడ్డపుట్టునో దానికి ౩ లేక ౫ కాళ్ళు, రెండుతోకలు లేక ౨ తలలు నుండును"

సం. ౧౯౨౮ మార్చి ౧౭లో ప్రకటితమైన "హిందీ వంగవాసి" యను పత్రికయం దిట్లు వ్రాయబడెను.

"సర్వియా రాజధాని వెల్‌గ్రేడు ఆసుపత్రియందు ౨౦ సం. ల వయస్సుగల నవయువకుని యుదరమునుండి యిరువురు శిశువులు తీయబడిరి. ఈ ఘటననుగూర్చి విచారించుచు వైజ్ఞానికు లిట్లనుమానించిరి. ఈ యువకుఁడు తన తల్లిగర్భమునం దున్నపుడు గర్భమున మఱిద్దఱు బిడ్డలుండిరి. ఏదోవిధముగా నాయిరువురు వీని గర్భమునఁ బ్రవేశించిరి.

"పరిణామపోషకులు, నితరులు కరవు వచ్చినపుడు కేవలము వృక్షములయొక్క వృద్ధికిమాత్రమే ఆటంకము కలుగక వృక్షములయందు చిత్రవిచిత్రమైన క్రొత్త క్రొత్త యవయవముల వికారములు బయలుదేఱుట చూచియే యుందురు."

ఈ నవజాత వికృతాంగములు వంశపరంపరా వచ్చుట లేదు. కావున నివి యపవాదరూపములుగాక మఱేమగును? ఆవ వ్రేలు, పురుష స్తనములు, గోత్రపోతుకొమ్ములు, అజాగళస్తనములు. అపవాదరూపములైనటులే మనుష్యుని తోకలు, స్త్రీలకు ౮. ౧౦ స్తనములుండుట యపవాద రూపములేగాని పూర్వజాతుల చిహ్నములు మాత్రము కాజాలవు. కావున పరిణామవాదముయొక్క ప్రబలప్రమాణసమన్వితమైన యీ యంతిమకల్పనాయుక్తప్రమాణశైలి కూడ పతితమయ్యెను.

పరిణామవాదముయొక్క యీ మానవోత్పత్తి ప్రకరణమును ధ్యానపూర్వకముగా చూచినయెడల నది ౩ టితో సంబంధము కలిగియున్నట్లు విదితము కాగలదు. ౧. మానవుడు కపివంశముయొక్క ఉపజాతి. ౨. మానవునియొక్క, వనమనుష్యునియొక్క మస్తిష్కమున గలభేదము కేవలము పరిణామము

యొక్క యంతరమే. 3 మానవునియం దిప్పటికిని పూర్వ జాతులయొక్క విశిష్టావశిష్టావయవములు విద్యమానమై యున్నవి.

ఈ మూఁటియందు పోలిక. విశిష్టా వశిష్టావయవముల యొక్క సమావేశము కలదు. తులనాత్మక శాస్త్రప్రమాణము లెంత బలహీనముగ నున్నదియు, పూర్వము పరిణామవాద ప్రమాణములతోనే ఋజువు పరచితిమి. మస్తిష్కముయొక్క పోలికలను వైజ్ఞానికులే చీమలయొక్క నూతనాన్వేషణతో నిరుపయోగమని సిద్ధాంతపఱచిరి. విశిష్టావశిష్టావయవముల యొక్క నిరుపయోగమును, పురుషస్తనములు, అజాగళస్తనములు, అశ్వమునకు స్తనములు లేకుండుట, మానవుని ౬ వ వ్రేలు, ఋజువుపఱచెను. కావున నితరములయిన సకలసంధియోనుల యొక్క ప్రాదుర్భావము వికాసముద్వారా సిద్ధాంతము కాన టులే మానవజాతిప్రాదుర్భావముకూడ పరిణామవాదముద్వారా సిద్ధమగుటలేదు. ఆదినుండి అంతమువఱకు చూచినను పరిణామ వాదులగు నాస్తికులదగ్గఱ విశిష్టావశిష్టావయవములచర్చయు, సంధియోనులను మాటిమాటికి జ్ఞప్తి చేయుటయు, గాక మఱేదియు సాధన సామగ్రికనఁబడుటలేదు. విశిష్టావశిష్టావయవములయొక్క నిరుపయోగతను, వాని యుత్పత్తికి కారణముల నింతవఱకు వివరించితిమి. కావున నిఁక సంధియోనులయుత్పత్తి యొక్క నిజమైన ప్రయోజనమునుగూర్చి విచారింతము.

---

# సంధియోనులు

సంధియోనులను పరిణామవాదులు నడిమిగొండ్లెము (Missing Links) లనుచున్నారు. వర్గీకరణ, తులనాత్మక, లుప్త జంతు, భూగోళాదిశాస్త్రములతో వీనిప్రమాణములు నిరూపింపఁబడుచున్నవి. వీనియందు మూఁడు భాగములు కలవు.

౧. పూర్తిగా రెండుశ్రేణుల యాకారము గలిగి యున్నవి. గబ్బిలము, డక్ బిల్, ఆర్కి-ఓప్టెరిక్స్. ఓపాస్సమ్, కంగారు మున్నగునవి.

౨. కొన్నియంగములు బలహీనములైనవి. హ్వేల్. మయూరము, నిప్పుకోడి, పెగ్విన్ మున్నగునవి.

3. కొన్నియంగము లధికముగా కలవి. అనేకస్తన ములుగల స్త్రీలు, తోకగల మనుష్యులు మొదలగువారు.

ఒకటవ నంబరు ప్రాణులలో రెండు విధములయిన ప్రాణుల చిహ్నములు స్పష్టముగా నగపడుచున్నవి. పరిణామ వాదులు తలంచునటు లివి నడిమి గొండ్లెములుకావు. వీనికి కారణము పునర్జన్మ. వీని యందొకటి యున్నతము. రెండవ దవనతము. ఒకటికిౖంది తరగతినుండి పై తరగతికిఁ బోవు చుండెను. రెండవది పైనుండి పతితమై క్రిందికి వచ్చుచున్నది. అనఁగా మానవుఁడు పాపకర్మ కారణమున పశుపక్ష్యాది జన్మ ములకుఁ బోవుచుండెనని భావము. కావున నతఁడు మొదట వనమనుష్యుఁడై తరువాత కోఁతియై అప్పుడు క్రిందికిఁబోవును. ఇఁక రెండవదియగు నీచప్రాణి పాపముల ననుభవించి యుత్త

రోత్తర ప్రాణులనుండి మానవుఁడగుటకు పోవుచుండెను. కావున నది మొదట కోఁతియై తరువాత వనమనుష్యుఁడై పిదప మానవుఁడగును. పశుయోనినుండి పక్షియోనికిఁ బోవుటకు చాల అంతరము కలదు. కావున నడచుటకూడ నడ్డకట్టువలె గబ్బిలము, ఎగురు తుంబేలు, డక్ బిల్, ఆర్కి-ఓప్టెరిక్స్, ఓపాస్సమ్, మున్నగున జంతువులు సృష్టింపఁబడి యుండెను. ఇవన్నియు నున్నతము, అవనతము, అను ద్వివిధరూపములు. కొన్ని పక్షులనుండి పశువులగుచుండెను. మఱికొన్ని పశువులనుండి పక్షులగుచుండెను. పశుత్వమధికముగా గలది పశువుగానుండి తర్వాత పక్షియగుచుండెను. పక్షిత్వ మధికముగా కలది పశువై తరువాత పక్షియగుచుండెను. సర్వత్ర యిటులే నని యెఱుంగవలయును.

పరిణామవాదుల కిప్పటికిని వనస్పతుల, కీటకములయొక్క భేదము తెలియఁబడలేదు. కావున నాది ప్రాణివనస్పతులకును, ప్రాకు ప్రాణులకును, మధ్యప్రాణియని పరిణామవాదు లనుచున్నారు. కాని యిది సత్యము కాజాలదు. మొదట వనస్పతులు, తరువాత జంతువులు జనించె ననుటయే సత్యము. వనస్పతి కోయుటచే రెండైనప్పటికిని జీవించియుండఁగలదు. కాని జంతువులు కోయఁబడిన తరువాత జీవించియుండజాలవు. ప్రాకెడు కీటకములు కొన్ని కోయఁబడి రెండైనప్పటికిని రెండును జీవముతో నుండఁగలవు. ఇందులకు మానేర్, వానపాము, మొదలగునవి దృష్టాంతములుగ తలంచఁబడుచున్నవి. కాని మానేర్ జాతిక్రిమిని క్రిమియనుటకు వీలులేదు. ఏలయన నది మిగుల సూక్ష్మమైన జంతువు.

ఇంతియకాక యది వనస్పతివర్గమని ప్రతీతమగుచున్నది. కాని వానపాము స్పష్టముగా క్రిమియనియె తెలియుచున్నది. ఏలయన, నిది ప్రత్యక్షముగా ప్రాకుచు నాకారణమునగూడ పెద్దగా నగపడుచున్నది. అయినప్పటికిని సర్పమువలె వెనుకలుగలది గాదు. ఇది వృక్షములకు చుట్టుకొను తిప్పతీగవలె నుండును. దీనికిని తిప్పతీగకును గల చైతన్యతారతమ్యభేదము మిగుల తక్కువ. తిప్పతీగ వృక్షములపై ప్రాకియే వ్యాపించుచున్నది. తిప్పతీగ కోయఁబడి యంకురమున్న ప్రతిచోటనుండి వృద్ధియగుచున్నది. వానపాము ప్రతిచోట కోయబడిన జీవముతో నుండజాలదు. ఏలయన, వానపామునకు మధ్య చిన్నచిన్న రంధ్రములుండు స్థానమొకటి కలదు. ఈ రంధ్రములందే రెండవప్రాణి నుత్పన్నముజేయు బీజము లుండును. వీనిలో క్షేత్రము, బీజము, వేఱువేఱుగానుండక పరస్పరము లిప్తమై యాబీజము లారంధ్రములయందే విస్తరించి వృద్ధియగును. వీనిని మధ్యలో కోసినపు డాబీజ-ఛిద్రము తోకవైపున నున్నయెడల నాభాగము కూడా జీవము గలదగుచున్నదేగాని తోకవైపున బీజ-ఛిద్రము లేనియెడల నామొండెము జీవింపఁజాలదు. కోయఁబడిన మానవుని కాలుసేతులు జీవముతోనుండక తలవైపు మాత్రమే జీవముతో నుండును. అటులే వానపాము శరీరమునందును సర్వత్ర చైతన్యముండక దానిముందుభాగమునందే చైతన్యముండును. ఇందువలన జీవము శరీరమునం దంతటను వ్యాపించి యుండు విభుపదార్థము కాదని స్పష్టమగుచున్నది. వానపాము తోకవైపుముక్కలో బీజ - ఛిద్ర మున్నయెడల నాముక్క

జీవించి యుండఁగలదు. కావున బీజ-ఛిద్రమున జీవముండునని స్పష్టమగుచున్నది. బీజ-ఛిద్రము తోకవైపు నుండుటచే తోక వైపు మొండెము జీవించి యున్నటులే శిరస్సువైపు ముక్క— బీజ - ఛిద్రములతో నిమిత్తము లేకుండగనే కాళ్లు, చేతులు తెగిన మానవుని మొండెమువలె జీవించియుండును. కావున వానపాముయొక్క నిజజీవము శిరస్సువైపుననియు, వాన పామును పుట్టించుబీజము (జీవము) మధ్యనుండుననియు విదిత మగుచున్నది. కోయబడినపుడు బీజము తోకవైపునకు వెళ్లినచో మరణించినతోకను తన మొండెముగాఁ జేసికొనుచు ఛిద్రమును ముఖముగా నిర్మించుకొని క్రొత్తవానపామును తయారుచేయు చున్నది. మనుష్యాది ప్రాణులకును, వీనికిని గలభేదమిదియే. కాని వీనియొక్క యీ ప్రత్యేకత వృక్షములతో కలియుచున్నదిగాన దీనిని వృక్షజాతియందు లెక్కించవలసినదే.

ప్రపంచమునగల వృక్షములవంశవిస్తార మొకేవిధముగ లేదు. కొన్నివృక్షములు ఫలములద్వారా కొన్ని వేళ్ళద్వారా కొన్ని కొమ్మలద్వారా తమవంశముల విస్తరింపఁజేయుచున్నవి. వానపాము కొమ్మలద్వారా వంశవృద్ధిని జేయు వృక్షములను బోలియున్నది. కొమ్మలద్వారా వంశము వృద్ధియగు వృక్షముల కొమ్మలు నఱికినను ఆ వృక్షము మరణించదు. కాని అంకురము బయలుదేరి కొమ్మలే నూతనవృక్షమును నిర్మింపఁజేయగలవు. గాని అంకురములేని కొమ్మ ఎండిపోవును. కావున నంకురమున నూతనవృక్షమును నిర్మించఁగల బీజములున్నవని స్పష్టమగు చున్నది. ఈబీజము లాకొమ్మను తనశరీరముగా తయారుచేసి

కొనుచు తాము వృక్షము కంతటికిని జీవనమై యుండును. తిప్పతీగ, వానపాముల పరిస్థితికూడ నింతియే. కావుననే వానపాము తిప్పతీగజాతియని విశ్వసింపఁబడుచున్నది. కాని యిందువలన చేతనజీవము కోయఁబడెననిగాని, క్రిములు కోయబడినను జీవించి యుండుననిగాని సిద్ధాంతమగుటలేదు. కావున సంధియోనులనుట యపవాదమే గాని సిద్ధాంతముమాత్రము కాఁజాలదు

కోఁతి, వనమనుష్యుఁడు, ఎగిరెడు నుడుత, గబ్బిలము, వానపాము మున్నగు సంధియోనులన్నియు, జీవములు భిన్నభిన్న యోనులయందు తిరుగుటకు (పునర్జన్మయందు) వంతెనవలె నుపయోగపడుచున్నవి. ఇట్టి సంధియోనులు లేనిచో పునర్జన్మకార్యము నడువఁజాలదు. కావున నొకప్రాణియందు రెండు జాతుల శారీరకచిహ్నములను గాంచి పునర్జన్మ రహస్యమును దెలిసికొనఁజాలక దాని నాజాతిపరిణామమని విశ్వసించుట నట్టి భ్రమయై యున్నది.

(౨) అంగములు హ్రాసములైనవనుటకూడ నట్టి భ్రమయే. ఆయాయంగములు పూర్తిగానుపయోగపడుచున్నపుడు హ్వేల్ కాళ్లు, ఫెగ్విన్ రెక్కలు, నీటియందీఁదుట కుపకరించుచున్నపుడు వాని యీ అంగములు నిర్బలము లయ్యెనని యెట్లు విశ్వసించబడును? నెమలిరెక్కలు, కుక్కలు మొదలగు క్రూరజంతువులనుండి తప్పించుకొనుట కుపయోగించుటలేదా? కుక్క మేకను పట్టుకొనునంతసులభముగ నెమలిని పట్టుకొనఁజాలదు గదా? అయినపుడు నెమలిరెక్కలు హ్రాసమయ్యెనని యెట్లు సిద్ధమయ్యెను? కావున పరమాత్మ కర్మానుసారము దేని కేటు

వంటి శరీరము నొసఁగెనో దానిచే నది యిఁకుల బాగుగా తనజీవన నిర్వాహ మొనర్చుకొనుచుండెనని యుచట పరిణామవాదమునకు వ్యతిరేకముగా సిద్ధాంతమగుచున్నది. కాని మానవ్రుడు హస్త క్షేపమొనర్చకూడదని మరియు కట్టుబడియున్నది. అంగములు బల హీనమగుట, బలముగలవగుట, అపేక్షాకృతమై యున్నది. గ్రద్ద కంటె నెమిలి తక్కువగ నెగురును. కాని పరిస్థితికారణమున నెమిలిఱెక్కలు బలహీనమయ్యెననుట మాత్రము దీని తాత్ప ర్యముకాదు. పరిస్థితిచే నెన్నటికి నేపక్షియు తన ఱెక్కలవంటి శీఘ్రగామియగు విమానమును విడనాడి కాళ్ళతో నడచు పశు రూపమును ధరింపజాలదు. కావున నంగముల హ్రాసవికాసమును విశ్వసించి సంధియోనులను కల్పించుట మిగుల పొరపాటని స్పష్టమగుచున్నది.

(3) అపవాదరూపముగా నప్పుడప్పుడు కొన్నియంగము లుత్పన్నమగుటవలన నీచిహ్నములు వాని పూర్వజాతులనియు నవి అప్పుడప్పుడు దర్శనమొసంగుచుండుననియు, భౌతికవాదు లయిన నాస్తికులసిద్ధాంతము. కాని పురుషస్తనములు, ఆఱవ వ్రేలు, అజాగళస్తనములు, పొట్టేలుకొమ్ములు, గుఱ్ఱమునకు స్తనములులేకుండుట మున్నగు విషయములన్నియు నీ సిద్ధాంత మును పూర్వపక్షము చేయుచుండెనని మొదటనే చెప్పితిమి. పురుషస్తనములవరుస యెందులకు నడచుచున్నది? మొదట పురు షులు గర్భము ధరించుచుండిరా? అటులెప్పుడును జరిగియుండలే దనినచో నీచిహ్నములెందుకు? ఎచటినుండివచ్చెను? ఈ గుఱ్ఱ తులు గుఱ్ఱమున కెందులకు లేవు? మేకపోతు, ఎద్దు మొదలగు

వాని కీచిహ్నములు అండకోశములదగ్గఱ నెందుకున్నవి? మేక పోతుగళమున స్తనము లెందులకు జనించెను? సృష్టియం దెప్పు డైనను మెడయందు స్తనములుగల జంతువుండెనా? లేనపు డీ స్తనము లెచటనుండి వచ్చెను? చిన్నచిన్న కీటకములకు, చేప లకు, చెదపురుగులకు ఱెక్కలుండును. అవి సముద్రముమీఁద నెఱకలతో చాలాదూరమువఱకు నెగరగలవు. కాన యీఱె క్కలు వానివాని పూర్వజాతులయొక్క అవశిష్టాంగములని యెవరైన చెప్పగలరా? కీటకములకు పూర్వము అమీబా యుండెను. కాని అది ఱెక్కలుగలదికాదు. అయినపుడు కీటక ములకీ గఱులెచటనుండి వచ్చెను? ముందువచ్చు వంశమునకై యవి పుట్టుచున్నవని యనినచో వీనినుండియే చాలాదూరము వఱకు ముందునకుఁబోయి జనించిన కప్పలకు, పాములకు ఱెక్కలెందుల కుత్పన్నము కాలేదు? ఎముకలుగలవానిలో మొదటిప్రాణియైన చేపకు ఱెక్కలు గలవుగదా! ఇవి యేపూర్వజాతియొక్క అవశిష్టాంగములై యుండెను? ముందు రాగల వంశములకొఱకు జనించెనని యనినచో వానితరువాత వచ్చు కప్పలకు సర్పములకును, గఱు లుండుటలేదు గదా?

ప్రియాగప్రదర్శిని కొక స్త్రీజాతిమత్స్యమువచ్చెను. ఒక చుకందరుదుంపలో మానవాకారమును మఱియొక చెట్టునందు మానవుని చేతియాకారమునుగానఁబడెను. * పెండలమునందును మానవుని పోలిక కనబడుట ప్రసిద్ధము. ఇవి వాని పూర్వజాతుల గుర్తులని యెవరైన చెప్పగలరా? వృక్షములకు, చేపలకు

* "విశ్వ విచిత్రాలు" – [illegible]

పూర్వము మానవు లుండిరా? వృక్షములకును, చేపలకును పూర్వము మానవుని యస్తిత్వము గలదని పరిణామవాదు లయిననాస్తికులుకూడ నొప్పుకొనుట లేదుగదా? అయినపు డీ చిహ్నములకు కారణ మేమైయుండును? ఈచిహ్నములుగల జాతులు వాని తరువాత వచ్చునవి సూచించుచున్నవని విశ్వసించినను యీాగుఱుతులవరుస వంశానుక్రమముగా ముందుకు నడచుట లేదుగదా! కావున నివి యపవాదములనియు, నిట్టి యపవాదములను దీసికొని యొక విద్యా విజ్ఞానసిద్ధాంతమును స్థాపించుట పిచ్చివాని ప్రసంగమువంటి దనియు స్పష్టమగుచున్నది.

ఇంతవఱకు పరిణామవాదలక్షణములు, స్వరూపము, ప్రమాణములు, విమర్శించ బడెను. కావున నిఁక పరిణామవాద విధులను గూర్చి విచారింతము.

---

## పరిణామవాదముయొక్క విధి - ప్రకారము

ఒకప్రాణి మరియొకప్రాణిగా మాఱుచు మత్స్యమునుండి మండూకము, మండూకమునుండి సర్పము, సర్పమునుండి నెమిలి నెమిలినుండి గోవు నెట్లుగా మాఱుచున్నవో విచారింతము.

"ప్రాణుల విభిన్నత్వము సృష్ట్యాదినుండియు లేదు. ప్రాణులవిభిన్నత్వమునకు కారణము — పరిస్థితి—స్వాభావికము. పరివర్తనము. ఈపరివర్తనము యంత్రానుసారము జరుగుచున్నది.

యంత్రదృష్టాంతమునకు మూఁడు విధులు కలవు. (౧) నిర్మాత కనుకూలముగ తయారగుట, (౨) యంత్రముయొక్క అంతిమావస్థవఱకు చేయుటకు పూర్వము పెక్కు మార్పుల నొందుట (౩) సర్వశ్రేష్ఠరచన స్థిరముగ నుండుట, యంత్రవికాసపరిస్థితినిబోలియే ప్రాణుల వికాసపరిస్థితి యున్నదని తులనాత్మక, గర్భ, ప్రస్తరీభూత, ప్రాణిశాస్త్రముల ప్రమాణములచే స్థిరమగుచున్నది" యని పరిణామవాదులు మాటి మాటికి నుడివెదరు.

పరిణామవిధిలో మొట్టమొదటి విషయము అనుకూల పరిస్థితి. ప్రాణులు పరిస్థితి కనుకూలములుగా మాఱిపోవుచున్నవని దీని తాత్పర్యము. అనుకూలములకు రెండు తత్త్వము లున్నవి. (౧) భిన్నభిన్న పరిస్థితుల కారణమున ప్రాణులలో పరివర్తనము జనించుట (౨) అట్టి పరివర్తనలు సంతతికి సంక్రమించుట. పరివర్తనలకును మూఁడు కారణములు కలవు.

౧. పరిస్థితి. (Environment)
౨. కార్యము. (Function)
3. పైతృక సంస్కారములు. (Hereditary influences.)

పరిస్థితియన శీతము, వేడి, వర్షము, నదులు, కాలువలు, వనములు, కొండలు. వానియందు నివసించు వారిప్రేమ, భయము, ఆకలి, దప్పి రోగము మున్నగునవి. చీకటి లేదా [illegible]లో పెరుగు చెట్లుచేమలు పసుపుపచ్చని వగుచున్నవి. [illegible] నక్క మున్న దేశమునుండి [illegible] నివచ్చిన నది [illegible]

యందు నానావిధములయిన యవయవము లుత్పన్నము లగుచు న్నవి. కార్యమువలనను శరీరమున పరివర్తన జరుగుచున్నది. కమ్మరివానిచేయి కఠోరమగుచున్నది. చేతులు పైకెత్తుకొని తిరుగు బిచ్చగాని చేతులు సన్నగిలుచున్నవి. ఇటులనే పైతృక సంస్కారమువలనను శరీరమున పరివర్తన కలుగుచున్నది. కుష్ఠు, సవామేహము మొదలగు రోగములు, సంతతికిని సంక్రమించుచున్నవి. విదేశములందు ప్రాయికముగా గోధుమరంగు వెండ్రుకలు, నల్లని నేత్రములు గల వారికి నల్లని వెండ్రుకలు పిల్లికండ్లు గలవారు పుట్టుచున్నారు. పరిస్థితి, కార్యము, పైతృక సంస్కారముల వలన జరుగు పరివర్తనలయొక్క కొన్ని నమూనా లివి.

పరిణామమునకు రెండవ విధి డార్విన్ ప్రకృతి యెన్నిక. దీని కైదు తత్త్వములు కలవు. ౧. పరివర్తనలు సర్వత్ర విద్యమానమై యుండుట ౨. అత్యుత్పాదనము* ౩. జీవనసంగ్రామము* ౪. అయోగ్యుల నాశనము, * యోగ్యుల రక్షణ. ౫. యోగ్యతలు సంతతికి సంక్రమించుట.

౧. వీనిలో మొదటిదైన పరివర్తనభావమిది. ప్రతిప్రాణి సంతతియందును భేదముండును. ఈభేదమునకు నియమముకలదు.

౨. ౧౨ సం॥ములలో నొక జత పక్షులవలన రెండు అర్బుదములకంటె కొంచెమధికముగ సంతతి కలుగుచున్నది.

---

* Over Production
* The struggle for existence
* Survival of the fittest.

గర్భములోని యొకపురుగు 30 కోట్ల గుడ్లను పెట్టును. వీనిలో కొన్నిపురుగులు దినమునకు ౧ కోటి, ౬౦, ౭౦ లక్షల సంతానోత్పత్తిని చేయగలవు. సుఖము, శాంతి యున్నచో నిరువదైదు సంవత్సరములలో మానవసంఖ్యకూడ రెట్టింపు కాఁగలదు. ఒక యేనుఁగులజతవలన ౭ వందల సం॥లలో సుమారు ౨ కోట్ల సంతానము కలుగవచ్చును. ఇదియే అత్యుత్పాదనము యొక్క తాత్పర్యము.

3. సృష్టియందు ప్రతిచోటను యుద్ధములు జరుగుచునే యున్నవి. యుద్ధకారణమున చీమలలోనే లక్షలకొలఁదిమరణించుచున్నవి. కొన్నిచేప లొక ఋతువులో నొకలక్ష యాభై వేల గ్రుడ్లనుపెట్టును. కాని వానిసత్తిన కూర్చుండియున్న శత్రువులు వానిని నాశనమొనర్చుచున్నారు. ఒక పంటపండు మొక్కవలన ౨౦ సం॥ లలో ౧౦ లక్షలమొక్కలు పుట్టును. కాని వానిగింజలన్నియు మంచిభూమిలో పడకపోవుటచే వానిసంతతి నశించుచున్నది. వర్షము, తుపాను, భూకంపము, సింహము, పులి, సర్పము మున్నగువానివలనను, స్వజాతులవలనను సదా యనేక జీవములు నాశమొందుచున్నవి. ఇటులనే నానావిధములయిన రోగములుకూడ కోట్లకొలఁది ప్రాణులను నాశనము చేయుచున్నవి. ఇదియే జీవనసంగ్రామముయొక్క తాత్పర్యము.

4. ఈసంగ్రామములలో యోగ్యులయినవారు మిగులుచున్నారు. అయోగ్యులు, దుర్బలులు మరణించుచున్నారు. ఇదియే యోగ్యుల మన్నికయొక్క తాత్పర్యము.

ప్రకృతి ప్రవృత్తి రక్షణయందుకంటె నాశనముచేయుట యందే యధికముగా కలదు. ఇదియే యోగ్యులయెన్నిక.

ఈ యోగ్యతల, విశేషతల సంక్రమణము సంతతియందును జరుగుచున్నది. వీనియందే రెండో మూడో పరిస్థితికనుకూలములై మిగిలినచో వానివలన నాజాతియొక్క యస్తిత్వమేర్పడును. ఇదియే డార్విన్ యొక్క వికాసవిధి.

పరిణామముయొక్క మూడవవిధిని గూర్చి 'లామార్క్' ఇట్లు చెప్పెను:-

"కార్యముచే ( Function ) కార్యము లభించిన పరివర్తనము సంతానమునకును వచ్చుచున్నది. జీరాఫ్ ఆకులకై మెడ నెత్తెను. దానిసంతతికూడ నటులే ప్రయత్నమొనర్చెను. అందువలన మెడ ముందునకు సాగెను. తరువాత వచ్చినసంతతి మఱింత ప్రయత్నమొనర్చెను. మెడ కొంచెము సాగెను. ఈ విధముగా కొన్నితరములవఱకు ప్రయత్నముచేయుటచే నా జంతువుమెడ మిగుల పొడవయ్యెను."

పరిణామమునకు "కృత్రిమము, ప్రాకృతికము" అను మఱియొక యెన్నికవిధి కలదు. పశుపాలకులు కృత్రిమమైన యెన్నికవలననే మంచిమంచి యెద్దును గుఱ్ఱముల నుత్పత్తి చేయించుచున్నారు. రైతులు మంచిమంచి పంటలను నధికముగ పండించ గలుగుచున్నారు. ఇట్టి కృత్రిమమైన యెన్నికలవలననే పలువిధములయిన పావురముల నుత్పత్తిచేయుచున్నారు. కృత్రిమోపాయమువలననే జపానుకోళ్ళతోక లిరువది యడుగుల

పాడవు చేయఁబడెను. ఆస్ట్రేలియా కుందేళ్ళకు మొదట చెట్లపై నెక్కుటకు తగిన గోళ్ళు లేవు. కాని యిప్పు డట్టి గోళ్లు వచ్చుచుండెను. ఇది ప్రాకృతికమైన యెన్నికకు నమూనా.

పరిణామమున కార్యకారణభావము గనఁబడుచున్నది. ఇంగ్లండులో గోవులు వితంతువులయధీనమున జీవించుచున్నవి. అచ్చట "క్లవర్" అనునొక గడ్డి కలదు. ఇది పెరుగుటకు నీగలే ముఖ్యకారణము. ఈగలగుడ్లు నెలుకలు తినివేసినపు డాగడ్డి పెరుగుట ఆగిపోవును. కాని ఇంగ్లండువితంతువులుపిల్లులను పెంచు చున్నారు. పిల్లులు ఎలుకలను తినివేయుచున్నవి. ఈగలగుడ్లు రక్షింపబడుచున్నవి. ఈగలు బాగుగా వృద్ధియగుచున్నవి. ఈగల తెక్కలలో కేసరపరాగముండి గడ్డిలో కలియుచున్నది. అందువలన క్లవరు బాగుగా పెంపొందుచున్నది. గోవులు తిని వంశమును విస్తరింపఁజేయుచున్నవి. ఈవిధముగా గోవులకు వితంతువులతో కార్యకారణ సంబంధము గనబడుచున్నది.

ఇచ్చట భారతదేశమునందును పిల్లులున్నచోట నెలుకలుండవు. ఎలుకలులేనిచోట ప్లేగువచ్చుటలేదు. మహమ్మదీయుల యిండ్లలో మాంస మధికముగా వాడబడుచున్నది. మాంసమధికముగ వాడఁబడుచోట పిల్లు లధికముగ నుండును. పిల్లు లధికముగ నుండుచోట నెలుక లుండనేరవు. కావున మహమ్మదీయులలో ప్లేగు చాల తక్కువగా నుండును. ఇదియును కార్యకారణ సిద్ధాంతమునకు నమూనాయే.

అనువంశికపరంపరపై డార్విన్ తనయభిప్రాయము నీ విధముగ వెల్లడించెను. శరీరపు ప్రత్యవయవములోని ప్రతి

శోషమునుండియు నాయాశోషముల గుణములుగల సూక్ష్మ భాగము ( Germinals ) ల నేకము జనించుచున్నవి. ఈసూక్ష్మ భాగములు శరీరమునందు సంతానోత్పాదక రజఃకణములతో కూడియుండును. ఏవిధమైన శరీరములో నివి యేర్పడుచున్నవో అట్టి శరీరమునే నిర్మాణముచేయగలశక్తి వీనియందు కలదు. ఇవి శారీరక ప్రతికృతులు. వీనివలననే శరీరము లుత్పన్నమగు చున్నవి.''

వాయిజమన్ ( Weismann ) యొక్క అభిప్రాయ మీ విధముగ నున్నది:-

"శరీరముయొక్క ప్రతికోష్ఠమునందును క్రోమెటిక్ ( Chromatic ) యుండును. దీనియందే ఆనువంశికగుణము లుండును. ఇందే మాతాపితరులకు సమానమైన గుణము లుండును. గర్భవృద్ధితోపాటు ఇవికూడ వృద్ధియగును. దీని ధారాప్రవాహము సంతతి, అనుసంతానము వఱకును ప్రవ హించును. మధ్యనేదైన పరివర్తనము కలిగినయెడల నది సంత తికి సంక్రమించుటలేదు. ఇది కల్పనకాదు. సూక్ష్మదర్శక యంత్రములో చూడబడినది. మొదట వైజ్ఞానికులు దీనిని విశ్వసించలేదు. కాని యిప్పు డొప్పుకొనుచున్నారు. ఇదిడార్విన్ సిద్ధాంతమును బలపఱచుచున్నది."

"పుత్రునియందు తండ్రికంటె తాతపోలిక యధికముగా గనఁబడుచున్నది." అని మెండల్ అను విద్వాంసుఁడు నిర్ణ యించెను.

డీ-వ్రోయిజ్ ఇట్లు చెప్పెను:—

"క్రొత్తక్రొత్త జాతుల కకస్మాత్తుగా నప్పుడప్పుడు పూర్వికుల గుఱుతులేమియు లేకుండగనే పుట్టుచున్నవి. ఇవి స్వయముగ పరివర్తన మొందిన జాతు లనబడుచున్నవి.

'ఓస్‌బోర్న్, బాల్డ్విన్, లాయడు, మార్గను' మున్నగు వా రిట్లు నుడువుచున్నారు :—

"డార్విన్, లామార్కుల మతమును జతపఱచిన యెడల ప్రాణులవికాసము మిగుల బాగుగా సిద్ధాంతము కాఁగలదు. నెగేలీ (Naegeli), ఐమరు (Eimer) ల సిద్ధాంతములపై విశ్వాస మనేకులకు కలదు. అజ్ఞాత-అజ్ఞేయశక్తులమీద ఆకస్మికఘటనల మీద హేతువాదముమీద కొందఱకు విశ్వాసము కలుగ సాగెను. ఇందువలన వికాసవిధి యధికస్పష్టముగ వివేచనము కావచ్చును. అన్వేషించబడిన వికాసవిధివలన నిది వాస్తవికము, స్వాభావికము అని మేము స్పష్టముగ చెప్పగలుగుచున్నారమని పరిణామవాదుల కథనము.

ఇంతవఱకు చెప్పబడిన పరిణామవిధియందు ముఖ్యమైన విషయములు మూఁడుమాత్రమే యున్నట్లు ప్రతీతమగు చున్నది.

౧ – ఆదియందు భిన్న భిన్నములయిన జత లుత్పన్నము గాక నొక్కే ప్రాణివలన సమస్తము వికాసము నొందెను.

౨ – యంత్రముల వలెనే సమస్తము వికసితమయ్యెను.

3 – సమస్తమున కనుకూలము, పరివర్తనము జరుగుచు నా పరివర్తనలు సంతతికి సంక్రమించుచున్నవి. అనేక విద్వాం

సుల యభిప్రాయములు దీనినే బలపఱచుచున్నవి. ఈపరిణామ వాద సారాంశ నిర్ణయములలో పొరపాటు జరుగలేదనియే మా నిశ్చితాభిప్రాయము. కావున వీనిని క్రమముగా విమర్శింతము.

౧ - పరిణామవాదమును విశ్వసించిన విద్వాంసు లనేకులు వేఱువేఱుగానే యనేకప్రాణు లుత్పన్నమగుచున్నవనియు అనేకప్రాణులాదినుండియు నిప్పటివఱకు కలులనే యున్నవనియు నొప్పుకొనిన విషయము లన్నియు నింతకు పూర్వమే పేర్కొని యుంటిమి. కావున వేఱువేఱుజతలు పుట్టలేదని యెటుల చెప్పగలరు?

౨ - యంత్రదృష్టాంతమునందు కూడ నిసుమంతయు సారములేదు. యంత్రమునకును శరీరమునకును భూమ్యాకాశముల కున్నంత తారతమ్యము కలదు. యంత్రము యంత్రనిర్మాణకర్తకొఱకు లేక యితరులకొఱకు నిర్మింపబడుచున్నదేగాని యంత్రముకొఱకుమాత్రము కాదు. కాని ఈశరీరము శరీరమును నిర్మించువానికొఱకు గాక శరీరముకొఱకే నిర్మించబడుచున్నది. కావున శరీరమును యంత్రముతో సరిపోల్చుట యుక్తియుక్తముగ లేదు. యంత్రములు ఉత్తరోత్తరముగ నెక్కువకాలము మనునవిగా నిర్మాణము చేయబడుచున్నవని మొదటనే నిరూపించితిమి. కాని యిచట సర్పము, తాబేలు, ౧౨౦ - ౧౫౦ సం. లు జీవించుచున్నవి. తదనంతరము జనించు సమస్త ప్రాణులు వానికంటె మిగుల తక్కువ కాలము జీవించుచున్నవి. పక్షినుండి స్తనధారిని చేయుటలో పరిణామ

వాదము మిగుల గొప్ప దెబ్బతినెను. ఎట్లన - పరిణామవాదము పక్షినుండి మనుష్యుని జేసెను. అందువలన నతఁడు (మానవుడు) ఎగిరెడు శక్తిని గోల్పోయి ఇపు డాకాశవిమానముల నిర్మించుటకై తన సర్వశక్తుల నుపయోగించుచున్నాఁడు. కావున నిచట యాంత్రికదృష్టాంతము సరిపోవుటలేదు.

3. అనుకూలవాతావరణమువలన పరివర్తనము కలుగుననియు, పరివర్తనము సంతానమునకును సంక్రమించుననియు చెప్పబడుచున్నది. దీనిమీఁదనే పరిణామపు మేడయు, దానిపై నాస్తికత్వసౌధము నిర్మితములయ్యెను. ఈ సౌధాగ్రముననే భౌతికవాద, పరిణామవాద, నాస్తికత్వాది గ్రంథము లనేకములు వ్రాయఁబడెను. ఇందుఁగల 'అనుకూలము, పరివర్తనము సంక్రమణము' అను నీ మూఁడును మిగుల మహత్తరమైన విషయములు. అనుకూలమన దేశకాలపరిస్థితుల ననుసరించి పరిస్థితిని తన కనుకూలముగ జేసికొనుట లేక దాని కనుకూలముగ నడచుకొనుట. అనుకూలమువలన పరివర్తన జరుగుచున్నది. వేసవికాలపు చర్మమునకును, శీతాకాలపు చర్మమునకును నెంతయో భేదముండును. కసరత్తుచేయువాని శరీరమునకును వ్యాయామము చేయనివాని శరీరమునకును మిగుల తేడా యుండును. ఇటువలెనే ఈ పరివర్తనలయొక్క సంతతి యందును సంక్రమణము జరుగుచున్నది. ఇవన్నియు కొంతవఱకు సత్యములే కావచ్చును. కాని యీకొద్ది అనుకూల పరివర్తన సంక్రమణములవలన సర్పము, దున్నపోతు అగునను విషయము నెట్లు సిద్ధాంతము చేయవచ్చును?

పశువులశరీరములందు వెంట్రుక లెందుల కుండునని ప్రశ్నించినచో నవి శీతమునుండి తప్పించుకొనుటకే యని జవాబు వచ్చును. అయితే ఫేరాడెల్ఫిగో మనుష్యుఁడు శీతము వలన, డార్వినే స్వయముగ వానిని మానవునిగా తలంచలేనంత పొట్టివాఁడైనపుడు అనుకూలముకొఱకు వాని శరీరమున పెద్ద పెద్ద రోమము లెందులకు జనింపలేదు? వాని శరీరముపై నెలుగుగొడ్డునకువలె వెంట్రుకలుపుట్టి లేక యితరావయవములు వేరు వేరుగా మారి నతనికి నితరమనుష్యులతోఁగల సమానప్రస వాదులు చెడిపోయినచో నది మఱియొక జాతిగ నేర్పడగలిగె డిది. కాని పరమేశ్వరున కొకజాతినుండి యింకొక జాతిని నిర్మించుట కిష్టములేదు. కావుననే యతని (ఫేరాడెల్ఫిగో మనుష్యు)ని శరీరమునం దెట్టిదైన మార్పును కలుగజేయలేదు. మఱియు నేప్రాణిరక్షణ కెంత అనుకూల మవసరమో ఆప్రాణి కంతయే జరుగుచున్నదనియు, వ్యతిరేకము జరుగుటలేదనియు, ననుకూలతత్త్వము తెలుపుచున్నది. పరిణామవాద సిద్ధాంతానుసారము పొట్టియగుకంటె వెండ్రుకలువచ్చుట చాల యవసరమై యుండెను. కాని వెండ్రుకలురాక కేవలము శరీరమే పొట్టిదయ్యెను. ఏ యంత్రమైనను మొదటి యంత్రముకంటె చిన్నదిగాఁ గాని, దుర్బలమైనదిగాఁ గాని తయారు చేయబడునా? ఒకమనుష్యుఁ డింకొక దేశముపోయి పొట్టివాఁడుగాగాని లేక దుర్బలుఁడుఁగాగాని, యైనచో నీపరివర్తన మాతని కనుకూల మనఁబడక ప్రతికూలమనియే యనఁబడవలయును. బహుశః అనుకూల ప్రతికూలములు రెండు ననుకూల మనబడవలయునని నాస్తికవాదముయొక్క విచిత్రవ్యాఖ్య కాఁబోలు!

టేరాడెల్ఫిగో మనుష్యులు పరివర్తితులై యెంత పరివర్తనము వారిసంతతి కొసఁగిరో అదియే స్థిరముగనున్నది. వారు వేలకొలఁది సంవత్సరములకు పూర్వమున్నంత పొట్టిగనే యిప్పటికి నుండిరి. కాని ప్రతివర్షము పొట్టివారగుటమాత్రము జరుగుటలేదు. గుణముల సంక్రమణ మిదియే. తండ్రితాతలవలె నగుటయే సంక్రమణము. కాని దానికి భిన్నముగ జరుగుట సంక్రమణ మనబడఁజాలదు.

ఇంతవఱకు పరిణామవాదవిధులయొక్కయు, పరివర్తనము (పరిస్థితి, కార్యము, పైతృకసంస్కారముల) యొక్కయు మర్మముకూడ వివరించితిమి. అయినను వీనియం దింకను మత భేదము కలదు. ఎట్లన – "పైతృకసంస్కార ( Hereditory influences) ప్రశ్నమిగుల మహత్తరమైనది. ఇంతవఱకు నిది బాగుగా విచారింపఁబడలేదు. ఏలయన "బఫన్" అను విద్వాంసుడు పరిస్థితికి ప్రాముఖ్య మిచ్చుచు నిట్లు నుడువుచున్నాఁడు. "వేడిదేశమునం దుండుటచే శరీరము నల్లనై యారంగు సంతానమునకు సంక్రమించుచున్నది"

కాని "లామార్కు" దీనికి కారణము కార్యమని చెప్పుచు, కమ్మరివాని కుడిచేయి యెంత బలముగనుండునో చూడుడు. ఇది యాతని సంతానమునకు జన్మతో వచ్చుచున్నదని యుదాహరించుచున్నాఁడు.

కాని డార్విను యీ యిరువురకు వ్యతిరేకముగ ప్రకృతి కెన్నికకే ప్రాముఖ్యత మొసఁగుచు "సంక్రమణశీలతకు కారణము ప్రకృతి యెన్నిక" యని నిర్వచించినాఁడు!

వీరి యందఱియందును మతభేదము కలదు. కాని పరివర్తనము నందఱు నొప్పుకొన్నదే. పరివర్తనము మాఁనును మాన్యమే. ఒకయింటియందే భిన్నభిన్నము లయిన ఆకృతులు, బలము, బుద్ధులు, గల మనుష్యు లుందురు. దేశదేశాంతరముల వారియందును భేద ముండును. కాని వారందఱు వేరువేరు జాతులవారైరా? మానవులేగదా !

ఇక డార్విను ప్రికృతియెన్నికను గూర్చి విచారింతము.

డార్విను ప్రికృతి యెన్నిక కైదు తత్వములు కలవు. (౧) పరివర్తనలు. సర్వత్రి విద్యమానమై యుండుట, ౨ - అత్యుత్పాదనము. ౩ - జీవన సంగ్రామములు. ౪ - యోగ్యుల యెన్నిక. ౫ - ఆయోగ్యత సంతతికి సంక్రిమించుట.

ఈ యైదింటిలో మొదటిపరివర్తన ప్రికృతియందు పరివర్తనము సర్వత్రి యున్నటుల కనఁబడుటలేదు. సృష్ట్యాది నుండియు నింతవఱకు పరివర్తన జరుగలేదని స్థిరయోనుల ద్వారా ఋజువయ్యెను. 'అమీబా' లక్షలకొలది సంవత్సరములకు పూర్వ మున్నటులే ఇప్పుడును కలదు. హైడ్రికూడ నటులనే యున్నది. ఇటులనే మన కగపడుచున్న ప్రాణులన్నియు, లక్షల కొలఁది సంవత్సరములకు పూర్వ మున్నటులే యిపుడు నున్నవి. ప్రితివస్తువు తన ఆయువులెక్క ప్రికారము పరివర్తన మొందుచుండెను. సమస్తప్రాణులకు గల బాల్య, యౌవన, కౌమార, వృద్ధావస్థలే వృద్ధి క్షయము లనబడుచున్నవి. కాని భూమి నెమ్మది నెమ్మదిగ రైలగుచుండుట గాని, సముద్రిము తోక చుక్క యగుచుండుటగాని జరుగుటలేదు. భూమి, రైలు కాన

టుతే సముద్రము తోఁకచుక్క కానటులే పావురము ఎలు.. గొడ్డగుట గాని, గుఱ్ఱము సర్పమగుటగాని, గాడిద తేలగుట గాని జరుగుటలేదు. జలవాయువుల మాతాపితరుల పూర్వ సంస్కారముల కారణమున కనఁబడుచున్నభిన్నత్వమే పరివర్తనము. కాని ముందునకుఁ బోయియొక దేశీయుఁ డొకపచ్చని వాఁడు కాఁగలఁడని గాని, ఒక దేశపు ఒంటెకు కొమ్ములు రాగల వనిగాని తలంచకూడదు. జలవాయువుల పరిస్థితి తెలిసికొని యుండని సముద్రమునం దెచటనైనను భూమి బయటపడుచో నచట మానవులను నివసింపజేసిన యెడల కొన్నిలక్షల సంవత్సరముల తరువాత గూడ వారిరూపు, రంగు, ఆకారము నిపుడు ప్రపంచమున నున్నటులే కొంచెము భేదముతో నుండుట మాత్రము నిశ్చయము.

కాని “అట్లాంటిక్ సముద్రమెండి యొక ద్వీపమైన యెడల నచట నివసించువారు ౧౦ వేల సం॥ లలో, వంకాయ రంగువంటి రంగుగలవారయ్యెదరు. వారిచెవులు పెరిగి కాళ్ల వఱకువచ్చి వానిని బుద్ధితో నుపయోగించినయెడల పక్షుల ఱెక్కలవలె బాగుగా పనిచేయును.” అను కల్పన చేసికొన వీలులేదు. ఇవియన్నియు మధుశాలలోని గప్పాలుగాక మరేమగును? అట్లెన్నటికైన జరుగగలదా? కదాపి జరుగజాలదు.

పరివర్తనము యొక్క ఉత్తమపు నమూనా యొకటి యిపు డమెరికాలో నిర్మించఁబడుచున్నది. యూరోపునుండి ప్రవాసము వెళ్లి అమెరికాలో వసించుచున్న వారి యాకార

ప్రకారములు క్రమముగా నచటి మూలనివాసులయిన రెడ్ ఇండి
యనులవలె నగుచున్నవి.

ఆంగ్లేయులు అమెరికాకు బోయి యింకను ౪ వందల సంవత్సరములు పూర్తికాలేదు. క్రీ. శ. ౧౪౯౨ లో మొట్ట మొదట కొలంబసు అమెరికాను కనుఁగొనెను. అటుతరువాతనే యూరోపువారు అమెరికాకు వెళ్లసాగిరి. ఇంతియగాక యీయారంభకుని గమనాగమనముల చాలాకాలమునకు తరువాత నాంగ్లేయులచట నివాస మేర్పఱచుకొనిరి. ఈ కొలదికాలమునకే లక్షలకొలది సంవత్సరములకు పూర్వమునుండియు నున్నటువంటి రెడ్ ఇండియనుల రూపు రంగు గలవారైరి. కావున రెడ్ ఇండియనులయొక్క పరివర్తన ఆగిపోయెనని విదితమగుచున్నది. అట్లు గానిచో నాలుగువందల సంవత్సరములలో ఆంగ్లేయులయొక్క మూలనివాసులైనయెడల రెడ్ ఇండియనులు అన్ని సంవత్సరములలో మరియొక విధముగనై పోవలయునుగదా ? కాని యచటి జలవాయువులెంత పరివర్తన చేయవలసి యుండెనో అంతయే వారియందును లక్షలకొలది సంవత్సరములకు పూర్వమే చేసియుండెను. ఇది బహువేగముగా పరుగెత్తుచున్నటువంటి పరిణామవాదము యొక్క పరివర్తనమును మందగింపఁ జేయుచున్నది. ఓరాడేల్ఫిగోల అమెరికనుల యొక్క ఉదాహరణలు, పరివర్తనలకును హద్దు కలదనియు, హద్దుమీఱి పరివర్తనలు జరుగుటలేదనియు ఋజువు పఱచుచున్నవి. జరుగుచున్న పరివర్తనమంతయు నియమిత మర్యాదానుసారము జరుగుచున్నది. దానివలన నొకజాతి యింకొక

జాతిగా మాఱుటగాని, పరస్పర సంబంధము తెగిపోవుటగాని జరుగుటలేదు. కావున మర్యాదాయుతపరివర్తనమే సిద్ధాంత మగుచున్నది. గాని డార్విన్ యొక్క అమర్యాదాయుతపరివర్తనము సిద్ధాంతమగుటలేదు.

౨-అత్యుత్పాదనమునకును, ఉత్పాదనమునకును మిగుల తారతమ్యము కలదు. అత్యుత్పాదనము మానవకృతము. ఉత్పాదన మీశ్వరకృతము. వీనియందు గాఱువిధములు గలవు. ౧ - కర్మానుసారము జాతి, ఆయువు భోగములనుపొంది జన్మించుట. ౨ - తనజాతి, ఆయువు భోగములతో, వేనివలన నెప్పుడైన హానిలాభములను పొందియుండెనో వానికి హానిలాభములను కలుగజేయుట. ౩ - మొదట భోగ్యము, తరువాత భోక్త జనించుట. ౪ - సమస్తప్రాణుల జతలు సరిసమానముగ నుండుట. అనఁగా నేదోయొక స్త్రీలుగాని పురుషులుగాని చంపబడిన యెడలనవి యధికముగా జనించి తరిగిపోయినజతలు పూర్తి యగుట. ౫. ఆయువు పూర్తిగాకముందే మధ్యలో నొకజాతి యందు కొన్నిచంపఁబడిన యెడల నా చంపఁబడినసంఖ్య శీఘ్రముగ నుత్పన్నమగుట. ౬. పుట్టుజంతువు (లింగశరీరులకు) జన్మించుటకై కావలసిన తలిదండ్రులు లభించకపోయినయెడల ఉన్న మాతాపితరులయందే అత్యుత్పాదనముద్వారా జన్మించి సృష్టిని వికృతమొనర్చుట.

ఈ యాఱిటిలో మూఁడు ఐశ్వర్యములు (ఈశ్వరకృతములలో) 3 - అత్యుత్పాదనములునై యున్నవి. ప్రాణులలో నకాలమృత్యువు లేనంతవఱకు నీశ్వర నియమితోత్పాదనము

జరుగుచుండెను. కాని హింస, ఆకలి, యుద్ధము, మఱియు ప్రాకృతిక విప్లవములచే ప్రాణులు అకాలమృత్యువు వాతఁబడ నారంభమైనప్పటినుండియే అత్యుత్పాదనమున కారంభమ య్యెను. ప్రాణుల యకాలమృత్యువునకు కారణము మానవుల కామము, సృష్టివిస్తారములును. కావున మానవుఁడు స్వయముగ తన నియమముల సరిచేసికొననంతవఱకు తక్కువ సంతాన మును కనఁజాలనంతవఱకును మానవసమాజమున కలహములు, యుద్ధములు, రోగములు, పాపకార్యములు తక్కువ కాఁజాలవు. పాపియై ఇతరయోనులలో ప్రవేశించు చున్నాఁడు. మితిలేని సంతానమును గని యకాలమృత్యువునోట బడుచున్నాఁడు. మానవుఁ డితరులను సృజించుటను తగ్గించినయెడల స్వయముగ కూడ జన్మించఁడు. అనగా జననమరణరహితు డగును. మాన వుఁడు మోక్షాభిముఖుఁడు కాఁగానే నియమితవంశము మాత్రమే యుండి భూభారము తగ్గును. నియమిత సంతతియొక్క నియ మితవృద్ధికై ఇంతవఱకు భూమిస్థాన మొసంగుచున్నటులే ముందును కొండలు, సముద్రము, మరుస్థలములు మున్నగునవి నెమ్మది నెమ్మదిగా మాఱి ఆహారమును సృష్టించుటకు యోగ్య మగును. కాని అనియమితమగు నత్యుత్పాదనమునకు భూమి యందు స్థానములేదు. మానవుఁడు మోక్షాభిముఖుఁడైనచో నిచటిగుంపు తగ్గి కలహములు రూపుమాసిపోవునుగదా! పూర్వ మింత వృద్ధియు, నిన్నికలహములును లేవు. కారణమేమన, మానవులు సరళస్వభావులై తక్కువ సంతానమును గనుచు మోక్షాభిముఖులై యుండిరి.

సృష్టియందు గనడుచున్న అత్యుత్పాదనశక్తి నైమిత్తిక మేగాని స్వాభావికముమాత్రముకాదు. ఇదియునుగాక యది కొలది కాలమునుండియే ప్రసరించుచుండెను. మానవులు స్వాభావికజీవన నిర్వాహమును విడనాడినప్పటినుండియే సృష్టియందు వంశవృద్ధి, అకాలమృత్యుపరంపర జారీయయ్యెను. మానవుఁడు తనబుద్ధి స్వాతంత్ర్యముచే సృష్టినియమమును భంగపరచి యధికముగవ్యతిక్రమమొనర్చి సృష్టిని దానిస్వాభావికమార్గమునుండి తొలఁగించెను. కనఁబడుచున్న ప్రాణుల ఆధిక్యమున కనేకకారణములు కలవు. అందు మొదటికారణ మిప్పుడు మోక్షాభిలాష బందగుటయే. ప్రాణులయొక్క నివాసస్థానము అనంతపరమాత్మ. ప్రాణు లచటకు పోవక సంకీర్ణస్థానములయందే జమ యగుటచే నిస్సంశయముగ గుంపు అధికమగుచున్నది. గుంపు అధికమగుటచే రోగములు, దుష్కాలము, యుద్ధములు సంభవించుచున్నవి. అందుచే సమస్తప్రాణులు నల్పాయుష్కములై మరణించి శేష ఫలభోగమునకై ఆ యా యోనులలో తిరిగి ప్రవేశించుచున్నవి. అటు మానవుఁడుకూడ నధికపాపియై ఆ యోనుల సంఖ్యనే వృద్ధిఁజేయుచున్నాఁడు. సృష్టి యధికమగుటచే నన్నింటికి పోషణ, శాంతి, లభించుటలేదు. కావున నకాలమునందే సమస్తము మరణించుచున్నది. మఱల మఱలఁ బుట్టుచున్నది. కొన్నిసమయములందు మరణించిన వానికి పుట్టుటకు చాలినంత మంది తలిదండ్రులు లభించకపోవుటచే నున్న తలిదండ్రుల వలననే అన్నియు నుత్పన్నము కాసాగుచున్నవి. ఇందువలన నొక్కే ప్రాణి యధికసంతానమును గనుచున్నదని ప్రతీతమగుచున్నది.

ప్రాణుల భక్షించి, అడవుల నాశమొనర్చి, ఖనిజ యంత్రాదులచే మానవుడు సృష్టిలో మహావ్యతిక్రమము (disturbance) ను గలిగించినాడు ! మానవుడుమాంసముతినుట మానినచో ప్రాణులన్నియు తమతమ యాయువు పూర్తిగా నిండినతరువాతనే మరణించును. అట్లుమరణించినప్రాణుల మృత శరీరములు మాంసాహారులయిన ప్రాణులకు లభించును. అప్పుడు ప్రాణులొకరిచే నితరప్రాణులు బ్రతికియుండగనే చంపి తినెడు నాచారము రూపు మాయును. అంతట ప్రాణు లకాలమృత్యు వును తప్పించుకొని పూర్తిగా జీవించి తమతమ భోగములను భోగించి యితరయోనులలోఁ ప్రవేశించి యచటకూడ నీసౌక ర్యమువలన కర్మఫలము ననుభవించి మనుష్యుఁడగును. మాన వుఁడై తనకర్తవ్యమును పాలించినచో మోక్షమును పొందును. ఈ విధముగ నీమోక్షమార్గము తెఱువంబడి మానవులందఱు నామార్గమునఁ జరించినయెడల నత్యుత్పాదనము, జీవన సంగ్రా మము, బలవంతులు జయమొందుట మున్నగు వరుస క్రమము లన్నియు నిర్మూలము లగును. మాంసభక్షణము వంటిదే యడవుల నఱకుటకూడ. మానవు లడవుల నఱికి తమస్వాభావి కాహారమైన ఫలముల, పశువుల యాహారముయొక్క స్రోతస్సును రూపుమాపిరి. అడవుల నఱకుటచే వర్షములు తగ్గిపోయి పోషణకు కావలసినంత యాహార ముత్పన్నమగు టలేదు. అందుచే నకాలమృత్యువు లధికమయ్యెను. ఇటులనే యంత్రాగారములు, యంత్రములు, ఖనిజ పదా ర్థము లధికముగ నుత్పన్నమగుట వలనను, మానవుల పశు

వుల కర్మక్షేత్రము లద్దుపఱచబడి ప్రాకృతిక విప్లవము జరిగెను. అడవుల నఱుకుటచే మేఘములలో, భౌగర్భిక ఉత్పాతముల వలన వాయుమండలము విద్యుత్తు మున్నగు వానిలో నెటువంటి యెటువంటి అస్వాభావికత జనించెనో, ప్రాణులు పూర్తిగా జీవించుటకు లోలోన నెన్ని యాటంకములు సంభవించెనో. తెలియుటలేదు. ఇపుడు మానవులే, మనుష్యుల, పశువుల, పక్షుల, క్రిమికీటకముల, తృణపల్లవముల, కొండల, సముద్రముల, నదీనదాదుల నన్నిటిని అస్వాభావికస్థితికి మార్చివైచుటచే ప్రతిప్రాణి అల్పాయుష్కుఁ డయ్యెను. మానవులయందు వృద్ధియైన పాప మిదియే. హింసచే పశువుల యాయువు తగ్గిపోవుచున్నది. కావున నవి కర్మను భోగించకుండఁగనే మరణించి మిగిలిన కర్మను భోగించుటకై ఆయా యోనులలో తిరిగి పుట్టుచున్నవి. ఉత్పాదనము, సంగ్రామములు, కలహములు, నాశము పెంపొందెను. కాని మానవుఁడు తనస్వాభావిక స్థితికి వచ్చి పైన పేర్కొనబడిన సమస్త విప్లవముల నాపుజేసినచో కనీస మసంఖ్యాకప్రాణులయొక్క అకాలమృత్యువులు రూపుమాయుటయేగాక మఱల మఱల పుట్టుటకూడ నాఁగిపోవును. అనగా మానవులు పశువులగుట జరుగకపోయినచో నత్యుత్పాదనముకూడ రూపు మాయగలదు.

అత్యుత్పాదనము, అస్వాభావిక మైనపుడు దానివలన నుత్పన్నమైన జీవన సంగ్రామములు అస్వాభావికములు, కృత్రిమములుగాక మఱేమగును ? అది నియమిత సంతతియం దుండజాలదు. అత్యుత్పాదనమును తగ్గించుట మానవుని చేతిలోని

పని యగుటచే జీవనసంగ్రామములను రూపుమాపుట కూడ మానవునకు స్వాధీనమగును. పరిణామవాదులే యిటు లొకచోట వ్రాసిరి. "రక్షణవైపుకంటె నాశము వైపునకే ప్రాకృతికమయిన యెన్నిక ప్రవృత్తి యధికముగ కలదు." అనినుడువుచు దీని నింకొకచోట తమ వాక్యములతోనే ఖండించుకొనుచు, "ఇందు ప్రకృతి తాత్పర్యమిది, ౨-౩ గాని, ౪-౫ గాని మిగిలినను ఆజాతి యస్తిత్వము నిలిచి యుండును." అని వచించెదరు. ఆహా! నాశ మధికముగ జరుగుచోట నేనాల్గయినో మిగిలినను వంశరక్షణ కేమి ప్రయోజనము? నాశమును కోరువాఁ డెన్నఁడు వంశరక్షణమును కోరఁడు. వాస్తవముగా ప్రకృతి, రక్షణమునే కోరుచున్నదిగాని నాశమును మాత్రము కోరుటలేదు. అట్లుగానిచో ప్రపంచమంతయు నిప్పటికే శూన్యమై యుండెడిది.

(౪) జీవనసంగ్రామములో యోగ్యుల యెన్నిక జరుగునని చెప్పబడుచున్నది. కాని యోగ్యుల యెన్నిక జరుగకపోవుట మనము ప్రపంచమున చూచుచునే యున్నాము. ప్రపంచమున పొడగరి, పొట్టివారిసంఖ్యకంటె నధికసంఖ్య మధ్యమస్థితిపొడవుగలవారిదని స్పష్టమగుచున్నది. చాల పొట్టివారుగాని, చాల పొడుగువారుగాని చాల తక్కువ. యోగ్యుల యెన్నిక సరియైనదేయైన యెడల నందరికంటె నధికసంఖ్య మిక్కిలి పొడవుగలవారిదై యుండవలయును. ఏలయన మానవుని యెత్తుకూడ నొక యోగ్యతయే. కాని యీ యోగ్యుల సంఖ్య మిక్కిలి పొట్టివారికి సరిసమానముగ నున్నది. వీరు

పొడవులెక్క ప్రకారము చాల అయోగ్యులు. ఇచ్చట గొప్ప యయోగ్యత (పొట్టి) మహాయోగ్యత (పొడవు) తో పోటి చేయుచున్నది. వీ రిరువురును తగవులాడుచున్నంతవఱకు నిరువురను వెనుకకు నెట్టి సామాన్యులు ముందుకువచ్చి సంఖ్యాక్షేత్రమున తమ విజయపతాక నెగురవేయుచుందురు.

అమీబా అన్నిటికంటె చిన్నది, దుర్బలమైనది. కాని అన్నిటికంటె సంఖ్యలో నధికముగ నున్నది. మానవునికంటె నేనుగు, సింహము మొదలగు కొన్ని ప్రాణులు తప్ప సమస్త సాధారణప్రాణులు సంఖ్యలో నధికముగా నుండుటచే సంఖ్యలో జయ మొందును. బలములో మానవుని ఏనుఁగు, గుఱ్ఱము, ఒంటె మున్నగునవియును, దీర్ఘజీవనమున పాము, తాఁబేలు మొదలగునవియు జయించెను. బుద్ధియందు చీమ అన్నిటికంటె మిగుల గొప్పది. పరిశ్రమచేయుట, కూడబెట్టుట, బందోబస్తు చేయుట, శిల్పకళ, మున్నగువానియందు తేనటీఁగ మొదటిది. ఈ ప్రాణు లన్నియు దమతమ ఉత్తరవర్తియోగ్యులకంటె నధిక యోగ్యములని సిద్ధాంతమగుచున్నపుడు యోగ్యులే యెన్నుకొనఁబడుచున్నారని చెప్పుట కెట్లు వీలగును? యోగ్యుల యెన్నిక జరుగుచున్నచో గ్రేట్‌వారులో జర్మనీ జయ మొందవలసి యుండెను. కాని యట్లు జరుగలేదు. భారతదేశము పతనమైనపుడు ప్రపంచమునం దన్నిదేశములకంటె మిగుల యోగ్యముగ నుండియు నయోగ్యముగా ఋజువయ్యెను. కావున యోగ్యులు జయ మొందెదరు, అయోగ్యులు పతనమగుదు రనుట మిగుల పొరపాటు కదా!

రోగిగాపడి యెటులనో శత్రువుల మందుకొట్టునకు నిష్పంటించ గలుగుటచే, జయ మొందినయెడల బహుశః పరిణామవాదులయిన నాస్తికులు రోగమునే యోగ్యమని తలంతురేమో! కాని విషయ మది కానేరదు. యోగ్యత యోగ్యతయే. అంతయు యోగ్యత కాఁజాలదు.

జీవన సంగ్రామమున మనము పక్షుల ఱెక్కలను పాముః తాఁబేలుల ఆయువును, చీమబుద్ధిని ఎన్నటికిని మఱవఁగూడదు. ఈమూఁడే జీవితముయొక్క అసలయిన యోగ్యతలు. ఎగురుటయే చాల గొప్పతనము. అధికముగా జీవించు టంతకంటెను గొప్పది. అంతకంటె గొప్పది జ్ఞానము. కాని యేజంతువు చీమకంటె ముందునకుబోయి జెఱ్ఱి మొదలగునవిగా మాఱి యేమి పావుకొనెను? పాము, తాఁబేలు, దీర్ఘాయువులను పోగొట్టుకొని ఱెక్కలను సంపాదించుకొనిన నేమిప్రయోజనము? చీమ జ్ఞానమును, సర్పము ఆయువును, పక్షి యెగిరెడుశక్తిని, పోగొట్టుకొని స్తనధారులై యేమిలాభమును పొందెను? లీమర్, కోతి, ఆవు, గేదె, పంది, కుక్క, మున్నగునవిగా మారి యేమి యోగ్యతను సంపాదించుకొనెను! స్తనధారులలో మానవుఁడే లేకున్న పరిణామముయొక్క సార్థకతకూడ దెలియబడెడిది కాదు. మానవుఁడు లేనంతవఱకు నుత్క్రాంతియం దెటువంటి యోగ్యమైన పరిణామముండెను? కించిత్తైనను లేదు సుమా! కావున యోగ్యులే యుందురనుటయు నయోగ్యులకుఁ దావు లేదనుటయు శుద్ధపొరపాటు.

(౫) యోగ్యత సంతానమునకు సంక్రమించునని యనుట కేవలము తప్పు. అయోగ్యులకే సంతాన మధికముగఁ గలుగుట ప్రపంచమున చూచుచునే యున్నారము. ఏలయన, నయోగ్యుల సంఖ్యయే అధికముగ నున్నది. ప్రపంచమున నిర్ధన, నిర్బల, నిర్బుద్ధులే యధికముగ గనఁబడుచున్నారు. జ్ఞానిసంతానమునకు తనంతట తానుగా జ్ఞానము సంక్రమించుటలేదు. మానవుఁడు తన సంతానమును బాగుజేయుటలో సావధానుఁడు గాకపోయిన యెడల నందఱు నిష్ప్రయోజకులే యగుదురు. కావున నిర్బలుల, అల్పాయుష్కుల, బుద్ధిహీనుల సంఖ్య యధికముగానున్న యిట్టి పరిస్థితులలో యోగ్యులే యెన్నుకొనబడుచున్నారనియు, వారే యుందురనియు, మిగిలిన వారందఱు నశింతురనియు చెప్పుటకు ఏలుకాదు. జపాను ప్రాకృతిక విప్లవమునందుగాని, జర్మను యుద్ధమునందుగాని, మహాభారత యుద్ధమునందుగాని, మొనమొన్న జరిగిన బీహారు ప్రాకృతిక విప్లవమునందుగాని, ప్లేగువ్యాధి యందుగాని, ద్వితీయ మహా సంగ్రామమునందుగాని అందఱు నయోగ్యులే మరణించిరా? లేదులేదు. ద్వివిధములైనవారు మరణించిరి. కాని లెక్కలో యోగ్యులు మిగుల తక్కువగ నుందురు. దీనికి కారణము వారు సంఖ్యలో చాల తక్కువగనుండుటయే. యోగ్యులు ప్రపంచమున చాల తక్కువగనే యుందురు. యోగ్యులు మోక్షమునకు బోవుదురు. ప్రపంచకము అయోగ్యులకే ఉపయోగపడుచున్నది. కావున యోగ్యుల యెన్నికయను సిద్ధాంతమే తప్పు. యోగ్యత సంతానమునందు సంక్రమించుననుట [illegible] తప్పు.

ఈ మతమువలన డార్వినునకుకూడ శాంతి కలుగలేదు. పరిణామవాదులగు నాస్తికులే "పరివర్తనలయొక్క ఉద్గమముల, వానిసంతతిక్రమములయొక్క సరియైన కార్యకారణవాద మింకను నిశ్చయము కాకపోవచ్చును. ప్రాకృతిక యెన్నిక పరిణామమున కొక మార్గము. పరిణామముయొక్క యుక్తాయుక్తమును తెలియజేయుట కది మంచిసహాకారియను మతము డార్విను మహాశయునిదే" యని యనెదరు.

ఇటులనే "నూతనోపజాతుల నుత్పత్తిజేయుటకు పరిస్థితి కార్యము, పైతృక సంసారము" అను నీమూడింటిలో నేది యధికముగా నేది తక్కువగా పనిచేయును? "అను నీవిషయ మింతవఱకును పూర్తిగా నిశ్చయము కాలేదు. ఈవిషయమునం దధికముగ మతభేదమున్నప్పటికి నీ మూడును హెచ్చుతగ్గుల పరిణామముతో వికాసోత్పాదకములై యున్నవని వైజ్ఞానికు లందఱు నొప్పుకొనెదరు."

ఇత్యాది ప్రమాణముల వలన డార్వినునకు నాతని శిష్య ప్రశిష్యులకు పరిణామకారణముల యథార్థజ్ఞాన మింతవఱకు కలుగలేదనియు వారింతవఱకు నేదోయొక పరిపూర్ణసిద్ధాంతము నకు రాలేదనియు ప్రతీతమగుచున్నది.

ప్రాకృతికమైన యెన్నికవిధి పూర్ణముగా విశ్వసింప బడి నదికాదు. ఏలయన ప్రాకృతికమైన యెన్నిక కింతవఱకును కేవల మొక సందిగ్ధ ప్రమాణముమాత్రమే సూచించ బడుచున్నది. "ఆస్ట్రేలియా కుంచేళ్ళకు చెట్లనెక్కుటకు తగిన గోళ్ళు వచ్చు

చున్నవి. ఇది నిజమగుచో కుందేళ్ళలో నొకనూతనజాతి యేర్పడ గలదు'' అని పరిణామవాదులగు నాస్తికు లనెదరు.

గోళ్ళు ఏకొద్దిగనో వృద్ధినొందినంతమాత్రముననే కుందేళ్ళలో నొకనూత్నజాతి యేర్పడునా? ఆకుందేళ్ళకు నితరములైన కుందేళ్ళతోఁగల సమానప్రసవ సంబంధము రూపుమాసెనా? సమానప్రసవసంబంధము తెగిపోనియెడల నది వేరొకజాతి యనఁబడజాలదు. ప్రతివ్యక్తిలో, ప్రతిదేశపు మనుష్యులలో భేదములున్నటులే (అబ్సీనియా, చైనాలలోవలె) ఈకుందెళ్ళలోను కొంచెము భేదమేర్పడి యుండవచ్చును. కాని అబ్సీనియా చైనాలవారు ఒకేజాతిలో రెండురూపములయి నటులే కుందేళ్ళలోను దేశగతభేదము కొంచెము కలుగవచ్చును. అంతమాత్రముచే నది యొకనూతనజాతియనుటకు వీలులేదు. ఏలయన సృష్టిలో ద్వివిధములయిన ప్రాకృతిక ఎన్నికలు కనఁబడుచున్నవి.

౧. దేశగతభేదములచే నొకేజాతియొక్క రూపములలో కొంచెము భేదము కలుగుట, ౨.అకస్మాత్తుగా నొకజాతి యంగములు వృద్ధినొందుట.

మొదటిదనమూనా అందఱియెదుటను కలదు. చీనా అబ్సీనియనుల యాకారములలో కొంచెము భేదము కలదు. కాని జాతిభేదముమాత్రము లేదు.

రెండవది చెద చెదకు నకస్మాత్తుగా పెద్దపెద్ద ఱెక్కలు వచ్చి పక్షులగును. ఆస్ట్రేలియా కుందేళ్ళు, దేశ, జల, వాయువులు మున్నగువాని భేదముచే; చీనా అబ్సీనియనులవలె కొంత

వికాసమొందినను, అది రెండవజాతిమాత్రము కాఁజాలదు. గోళ్ళు కొలదిగనో వృద్ధినొంది యుండవచ్చును. కాని సమాన ప్రసవము, సమానభోగము, ఆయువు మున్నగునవన్నియు సమానముగనే యుండును. కాని వానిగోళ్ళు హద్దుమీఱి వృద్ధినందినచో నది యెట్లు పరిణమించునదియు సృష్టి చెదను దృష్టాంతముగా చూపినది. ఏదో కారణమున అప్పుడప్పుడు చెదకుఱెక్కలువచ్చి పెద్దవై పక్షులు కాఁగానే యవి సర్వనాశ మగుఁ టందఱకు తెలియును. కానివీనిఱెక్కల వంశము నడచుట గాని, వీని నూతనజాతి ప్రపంచమున స్థిరముగనుండుటగాని జరుగుట లేదు. ఆస్ట్రేలియా కుందేళ్ళ స్థితినిగూర్చి, చెట్లనెక్కుటకు తగినగోళ్ళు వచ్చెనను విషయమునుగూర్చియు, విశేషముగ సమాలోచనచేసి పాఠకులకు విసుఁగును కలుగజేయక సృష్టి నియమము నొకదాని నిచట నుదాహరించుచున్నారము.

“పృథివియొక్క ప్రతిభాగము తన ప్రభావముచే ప్రాణుల శరీరమున కొంతమార్పును కలుగఁజేయును. ఈమార్పు మిక్కిలి తొందఱగా స్థిరమగునని యెఱుంగవలయునే కాని ప్రళయపర్యంత మీమార్పు జరుగుచుండునని మాత్రము తలంచ కూడదు. పైన నమెరికా రెడ్ ఇండియనులను వర్ణించి దేశ విశేషమువలన జరుగు పరివర్తనము బహు శీఘ్రముగా స్థిర మగుననియు నా జాతి కితర దేశస్థ జాతివలన సంతానము జనించుట తెగిపోవనియు; ఋజువుపఱచియే యుంటిమి. ఎవ్విధమైన నూతనజాతి యేర్పడజాలదు. కాని యెచ్చటనైనను కారణవశాత్తుగ నే ప్రాణిశరీరమునందైనను మర్యాదకు మించి పరిణా

షము జరిగినయెడల నా ప్రాణి అథవా ఆప్రాణి సమూహము చెడ మారి ఉన్నీలై సర్వనాశ మొందునటులేనాశము నొందును. కాని ఆజాతివంశము నడవదు. అటువంటి నూతనజాతి ప్రపంచమునం దెద్దియును పుట్టజాలదు. కావున ప్రాకృతికమైన యెన్నికవలన నవీనజాతి యొకటి యేర్పడుట యసంభవము, అసత్యము. ప్రకృతి స్వాభావికముగా నెవ్విధమైన నూతనజాతిని నిర్మించుట లేదని పరిణామవాదముయొక్క మూలసిద్ధాంత మింతవఱకు ఖండించబడెను.

# పరిణామము - వృక్షములు

ఇక మానవుఁడు దేనిద్వారా వృక్షములను, పశువులను విలక్షణప్రకారము గలవానినిగా చేయుచున్నాఁడో ఆ శిల్ప కళలయొక్క నియమములనుకూడ తెలిసికొందము. దీనినే కృత్రిమపు ఎన్నిక యనెదరు. అమెరికా యీవిషయములలో మిగుల నున్నతిని బడసెను. జపానువారు కోళ్ళతోకల నిడువ చేసి యడుగులవఱకు పొడవుగను, పెద్దపెద్ద వృక్షములను మిగుల పొట్టిగను చేయఁగలిగిరి. వానిని జూచినవారి కాశ్చర్యము కలుగకమానదు.

అమెరికా నివాసియైన లూథర్ బర్ బ్యాంకు అను తోట మాలి యనేకవిధములయిన ఫలపుష్పములను విచిత్రముగ నొనర్చెను. అనేకములైన తీగలను వృక్షములుగ మార్చివేచెను. ఇటులనే పావురములను పెంచువారుకూడ ననేకవిధములయిన పావురముల నిర్మాణ మొనర్చిరి. ఇదియే కృత్రిమపు ఎన్నిక. ఈ కృత్రిమపు ఎన్నికకు మూఁడునియమములు కలవు.

౧. ఫలానామర్యాదవఱకు కృత్రిమమైనప్పటికని సంతానము కలుగుచు నుండుట. ౨. ఫలానామర్యాదకు తరువాత తనపూర్వీకులరూపము నొందుట. 3. ఫలానామర్యాదకు పిమ్మట వంశము నడవక తెగిపోవుట.

మొదటి నియమము సర్వత్ర కనఁబడుచునే యున్నది. ఈ సిద్ధాంతానుసారమే మానవుఁడు వృక్షములయొక్కయు పశు

వులయొక్కయు నుత్తమబీజము నుత్పన్నముఁ జేయఁగలుగు చున్నాఁడు. ఆరోగ్యవంతులై మంచిబలము గల తలిదండ్రులకు మంచిసంతానము కలుగుచున్నది. తలిదండ్రుల యంశముల రక్షించుచు పరిణామ మొందినయెడల నావంశము నడచును. ఎద్దు వంశము కొమ్ములు, డెక్కలు, ఎముకలు మున్నగునవి. ఆవు వంశము మాంసాదులు. తల్లి యంశమధికమైనచో నెద్దునకు కొమ్ము లుండవు. తండ్రియంశ మధికమైనచో నెద్దునకు పెద్దకొమ్ము లుండును. బోడివానిలో కొమ్ములు లోపించక చెవులదగ్గఱ వెండ్రుకలలో కొమ్ములయొక్క చిహ్నము లుండును. వాని యాధారముతోనే ముందునకుఁబోయి దాని వంశమున తిరిగి కొమ్ములుగలవి పుట్టుచున్నవి. ఈ సిద్ధాంతము తోనే ముండ్లుగల వృక్షములనుండి ముండ్లు తొలగించఁబడు చున్నవి. ముండ్లుగల రక్కసనుండి ముండ్లులేని రక్కస నిర్మాణము చేయఁబడుచున్నది. ముండ్లుగల శృంగాటకమునుండి ముండ్లులేని శృంగాటకము నిర్మాణము చేయఁబడుచున్నది. రక్కస శృంగాటకములనుండి కృత్రిమోపాయములద్వారా పితృశక్తి తగ్గించఁబడుటయే దీనికి కారణము. కాని, వానిలో ముండ్ల గుఱుతులుమాత్రమే శేషించి యుండును. ఆచిహ్నముల వలననే మరల ముండ్లుగలవానిని పుట్టించఁగలుగుచున్నారు. ముండ్లు లేని రక్కస, శృంగాటకములందు అప్పుడప్పుడు కొన్ని చిన్న చిన్న ముండ్లుగలవికూడ కనఁబడుచున్నవి. దానివలననే తిరిగి వారికంటకము పుట్టఁగలుగుచున్నది. ఈసిద్ధాంతముమీఁదనే పావురములపుట్టుకకూడ కలదు. ఇది విశ్వవ్యాపకసిద్ధాంతము.

స్త్రీ, పురుష, నపుంసకుల నిర్మాణముకూడ నీసిద్ధాంతానుసారమే జరుగుచున్నది.

రెండవ నియమమున కుదాహరణము అంటుమామిడి. అంటుమామిడిగింజను పాతిపెట్టిన యెడల దానికి పుట్టినమొక్కకు పూర్వపుచెట్టుకాయలంత పెద్దవికాయవు. ఈవిధముగ ౨ - ౩ తరములు గడచునప్పటికినాయంటుమామిడి పూర్వ మంటు కట్టబడిన చెట్టుకాయలమాదిరి కాయలు కాచును. తోఁడేలు, కుక్క, పులి, సింహములయొక్క సంయోగములవలనను సంతానము కలుగదు. ఒకవేళ కలిగినను ఆసంతానమునకు జనించిన సంతానము కొన్ని తరములకు తరువాత కుక్కకు కుక్కగాను, పులికి పులిగాను మాఱిపోవును. పరిణామము ముందునకు వృద్ధినొంది నూతనజాతిని సృష్టిచేయఁజాలదు. ఈవిషయము మీఁదనే జోన్సుబోనస్ క్రీ. శ. ౧౯౨౨ నవంబరు మాసమున "న్యూయేజ్" అను పత్రికలో నిట్లు వ్రాసెను.

"నాతోటలో నేను తిరుగుచు నంటుగట్టినమొక్కలలో కొన్ని కృత్రిమావస్థనుండి తన యవస్థను పొందుటకై యుద్ధము జరుగుట చూచితిని. పూర్వపు స్వాభావికావస్థ బలశాలినియైనచో నది కృత్రిమావస్థను జయించుట తెఱచుగ నగపడుచున్నది. ఉదాహరణమునకై "హెనరీడమ్మండ్స్" వ్రాసిన (Natural Lavn; the Spritual World) గ్రంథమున నాతఁడు పావురముల, గులాబిచెట్లయొక్క ఉదాహరణములతో నీవిషయమును సిద్ధాంతపఱచిన అధ్యాయమునే యిచట నుదాహరించుచున్నాఁడను"

ఈసిద్ధాంతమే "మెండల్"అను విద్వాంసునకును దెలిసియుం డెను. ఆతఁడిట్లనెను.

"అప్పుడప్పుడు పిల్లలందు తండ్రి పోలికకంటె పితామహునిపోలిక లధికముగ నగపడుచున్నవి.

దీనికి కారణ మిదియే. ఎవఁడైన తన శరీరమున హద్దుమీఱి మార్పు కలుగఁజేసిన యెడల, నాతని కుమారుఁడు తండ్రి యొక్క యీ నూతన గుణములను గ్రహించక తాతగుణములనే గ్రహించిపుట్టుచున్నాఁడు. కావున సృష్టి పురాతనజాతులను రక్షించుటకును, నూతనజాతుల పుట్టుక నాపుటకును మిగుల దృఢమైన ప్రబంధముజేసియున్నదని స్పష్టమగుచున్నది.

ప్రొఫెసర్. డి. వీ్రజ్ శృంగాటక, పొస్త (Shirley Porpies) (నల్లమంకు చెట్టువంటి) చెట్లచే వర్తమానకాలమున నూతనజాతి తనంతటతాను పుట్టుట చూచెననియు, నూతనజాతులీవిధముగా నుత్పన్నమగుచున్నవనియు, నీయుత్పత్తికి ప్రొ. వీ్రజ్ స్వయముగ పరివర్తితజాతి (Spontaneous Modification) యని నామకరణము జేసెననియు కొందఱు పరిణామవాదు లనుచున్నారు. కాని యేప్రాణియైనను ఏదోయొక వెలుపలికారణమున తనసంతతికి మార్పుగలుగు సమయము వచ్చినపుడాసంతానపు ముందుసంతతి తనపితామహుని లేక ప్రపితామహుని వంకకు తిరిగి వచ్చుచున్నదని ప్రొ. మెండల్, ప్రొ. జోన్సు బోనస్‌లయొక్క ప్రమాణములచేతనే ఋజువుపఱచిరి. ప్రొ. డి. వీ్రజ్. యొక్క ఆవిష్కార మిప్పటిది. కావున

పిడ్జ్ చూచిన యానూతనజాతి కొంతకాలమునకు నిస్సంశయముగా తనపూర్వజాతి రూపమును పొందితీరును.

మూడవనియమమును సృష్టి యీవిధముగ నుంచెను. "ఏప్రాణియైనను జబరదస్తీగా పరిణామ మొందుచు ముందునకు నడచుచున్నచో దానివంశము ముందునకు నడచుట ఆపుచేయఁబడును. ఎట్లన - గుఱ్ఱమునకు గాడిదకు జన్మించిన కంచరగాడిదకు సంతానము కలుగుటలేదు.

జపానులోని, చిన్నచిన్న చెట్లు, పెద్దపెద్ద కోడితోకల, పొ కాళ్ళగోవుల, అత్యంత మేధావంతుల వంశములుకూడ రూపుమాసెను. హద్దుమీఱిన వికాసముగాని, హ్రాసముగానిజరుగుట సృష్టి కిష్టములేదు. కృత్రిమపు టెన్నికయందు అమర్యాదిత పరిణామమునకు స్థానమే లేదు. మర్యాదను, (హద్దు) మీరినచో చాలు. ఆవంశమంతటితో నాశము నొందవలసినదే.

"లామార్కు" అను విద్వాంసుడు ఎలుకల తోకలు నఱికి తోకలులేని యెలుకలను నిర్మించతలంచెను. కాని యెన్నితరములవఱకు కాతడట్లు చేసినను తోకలేని యెలుక పుట్టనేలేదు.

"లేసిస్టర్ శాయర్" అను గొల్లఁడు తనగొఱ్ఱెలను గుఱ్ఱములంతేసివానిగాఁ జేయవలయుననియు మఱికొందఱుతమగొఱ్ఱెలను, నెలుకలంతేసివానిగా జేయవలయుననియు ప్రయత్నించిరి. కాని యీరెండు పరిణామవాదసంఘముల ప్రయత్నము లన్నియు నిష్ఫలము లయ్యెను. గొఱ్ఱెలు ఎలుకలంత పొట్టివగుటగాని, గుఱ్ఱములంత పెద్దవగుటగాని జరగలేదు. కాని కొన్ని కొంచెము

పెద్దవయ్యెను. కొన్ని కొంచెము చిన్నవయ్యెను. ఈ చిన్నా పెద్దా రెంటిమధ్యను వంశస్థాపన నియమము పని చేయుచునే యుండెను. కాని వంశస్థాపననియమము తెగునంత చిన్నవియు, పెద్దవియునై రెండుజాతులు కాఁజాలకపోయెను.

మీరు, మేము, సమస్తము ప్రాకృతిక, కృత్రిమపు ఎన్నికలయొక్క నమూనాలము. ప్రాకృతికపు ఎన్నికచే పొందిన వికాసమువలననే మీరు, మేము, సమస్తము గుఱుతింపఁబడు చున్నాము. సమానవయస్సు గల వైనప్పటికిని గుఱ్ఱము, ఆవు, ఎద్దు, కుక్క మున్నగునవన్నియు విడివిడిగా దీనివలననే గుఱు తించఁబడుచున్నవి. ఈ భిన్నత్వమే లేకున్నయెడల ప్రపంచమం తయు చీకటిమయమై యుండును. కావున వ్యక్తి వ్యక్తికి భిన్నత్వ ముండితీరవలసినదే. దేశదేశాంతరములయొక్క భిన్నత్వము కేవలము వివాహబంధనలచే నేర్పడెను. సకలదేశములవారును పరస్పర వివాహసంబంధములు చేసికొన సాగినయెడల భౌగోలిక భిన్నత్వము నశించిపోఁగలదు. కాని వైయక్తిక భిన్నత్వ మీశ్వరదత్తము. అది గుఱుతించుటకొఱకే యేర్పడెను. అది లేనిచో ప్రపంచవ్యవహారములు జరుగనేరవు.

మీకును, మాకును, మధ్యనున్న వ్యక్తిభేదమే ముందు నశించిపోయి ఉడుతను ఎలుగుగొడ్డుగా మార్చునని పరిణామవాదు లగు నాస్తికులు ప్రబలప్రమాణముగా నుదహరించుచున్నారు. కాని విషయము సవ్యముగా గ్రహించఁబడలేదు. ఈ వ్యక్తి భేదమే లేనియెడల ప్రపంచవ్యవస్థయే యుండనేరదు. ఇదియే

ప్రాకృతికపు జెన్నిక. కృత్రిమపు జెన్నిక నూతనజాతిని సృష్టి చేయఁజాలదు ఎట్లన_

హిందూ బాలబాలికలకు లక్షలకొలది సంవత్సరముల నుండియు చెవులు కుట్టించుచున్నప్పటికిని చెవిని రంధ్రముగల బిడ్డలు పుట్టియుండలేదు.

హాజరత్ ఇబ్రహీము నాటినుండియు, సుమారు 3 వేల సం॥ల పైనుండి యూదులు, మహామ్మదీయులు సున్నతి చేయించుచునే యుండిరి. ( పూర్వము స్త్రీలకుకూడ సున్నతిచేయబడు చుండెడిది. ) కాని సున్నతి చేయబడిన సంతాన మిప్పటివఱకు జనించియుండలేదు.

చైనా స్త్రీలపాదము లెప్పటినుండియో చిన్నవిగా చేయఁబడు చున్నప్పటికిని చిన్న చిన్న పాదములుగల బిడ్డ ఒక్కటికూడ నింతవఱకు పుట్టియుండలేదు.

కావున కృత్రిమ పరిణామముకూడ మర్యాదారహిత మగుటలేదని దీనివలనఁ దేటపడుచున్నది. కృత్రిమము, ప్రాకృతిక మను నీద్వివిధములైన యెన్నికలచే నాయువు, భోగము, భిన్నములై వేరిసంయోగమువలన వంశము నడువకుండెనో వానినుండి నూతనజాతి నేటివఱకును ప్రత్యక్షముగ పరిణామ మొందియుండలేదు. అట్లు జరుగుట అనుమానప్రమాణమువలనను బలపడుటలేదు. కావున పరిణామవాదము సత్య సిద్ధాంతముపై నిలువఁబడియుండలేదని గట్టిగాఁ జెప్పసాహసించుచున్నారము.

"తలిదండ్రులయొక్క ప్రత్యంగములసారము ఏకమై సంతానము కలుగుచున్నది" అని డార్విను సిద్ధాంతము.

వాయిజ్ మేన్ సిద్ధాంతము. "ఈ సారము ఏకత్రిస్థమగు నపుడు మధ్యలో నేదైన పరివర్తన ముద్భూతమైనయెడల నది సంతానమునకు ఆనువంశికముగా సంక్రమించదు."

మెండల్ సిద్ధాంతము. "అప్పుడప్పుడు సంతానము తండ్రి గుణములకంటె తాతగుణములనే యధికముగా సంగ్రహించు చున్నది."

డి. వ్రీయిజ్ సిద్ధాంతము. "అప్పుడప్పుడు క్రొత్త క్రొత్తజాతు లకస్మాత్తుగా నుత్పన్న మగుచున్నవి."

మఱియు హేతువాద, అజ్ఞాత, అజ్ఞేయాది సిద్ధాంతము లన్నియు నేకమై పరిణామవాదమునే ఖండించుచున్నవి.

"అంగాదంగాత్సంభవసి" * అనగా సంతానము ప్రత్యంగములయొక్క సారమునుండి కలుగుచున్నదను వైదికసిద్ధాంతమునే డార్విను చెప్పెను. అకస్మాత్తుగా జాతియందు నూతన వికారము ఏదైనను జనించినయెడల నా నూతనత్వమును సంతానము పొందక తాతగుణములనే గ్రహించుచున్నది. ఎవ్విధమైన నూతనజాతిగాని, నూతనాంగముగాని ఉత్పన్న మగుట లేదు. జలక్రిములలో నూతనజాతు లొక్కమాఱుగా జన్మించి ప్రాణులకు శరీరము లేర్పడుటకు పరిణామముతో నిమిత్తము

---

* అంగాదంగాత్సంభవసి హృదయాదధి జాయసే, ప్రాణాంతే ప్రాణేన సంధధామి, జీవమే యావదాయుషమ్॥

లేదని ఋజువు చేయుచున్నవి. "హేతువాదమును, అజ్ఞాత అక్షే యాదిశక్తులును కర్మానుసారము ఈశ్వరుడు ప్రాణుల నిర్మాణము చేయుచున్నా"డని యీ సమస్యను పూర్తి జేయుచున్నవి. కావున క్రమవికాసముతో నిమిత్తము లేదనియే ఋజువగుచున్నది. ఈ విధముగా చేయబడిన నూతనాన్వేషణ లన్నియు పరిణామవాదమునకు వ్యతిరేకముగను విశిష్టోత్పత్తికి ననుకూలముగ నున్నవి. ఇం దిసుమంతయు సందియము లేదు. ఏలయన పరిణామవాదులగు నాస్తికు లింతవఱకు నెట్లు పరిణామ మొందుచున్నదియు విశదపఱచియుండలేదు. వా రొసంగిన యుక్తిప్రయుక్తులన్నింటిపైన వైజ్ఞానికులకే సందేహము కలదు. కావున పరిణామముయొక్క పరిస్థితి, కార్యము, వంశానుక్రమము అను నీమూఁడువిధులును సఫలీకృతములు కాలేవు. పరిణామవాదగ్రంథకారుడగు నాస్తికుఁడే స్వయముగా తన గ్రంథమునం దిటుల వ్రాసెను.

"పరిణామము మూలమున ప్రాణులయొక్క ఉత్పత్తి జరుగుచున్నదా లేదా? ఒకే ప్రాణివలన భిన్నభిన్నప్రాణు లుత్పన్నమగుచున్నవా లేవా? అని ఈ విధముగ నిరీక్షణ చేయుమానవుఁడు కూడ పరిణామక్రియయొక్క అత్యంత సూక్ష్మభాగ మేది ప్రత్యక్షమైనను పూర్తిగా చూడఁజాలడు."
(పుట 155)

"పరిణామవిధిమీఁద ఆలోచించసాగినప్పుడు ఇటువంటివే దీనికి సంబంధించిన యితరతాత్త్విక ప్రశ్న లనేకములు మమ్మెదు రొడ్డుచున్నవి. అట్టి తాత్త్విక ప్రశ్నల కొకొక్కప్పుడు సంపూ

ర్ణమైన సమాధానమును బడయుట మిగుల కఠినము. అసంభవముకూడ నగుచుండెను. ఇంతియకాక యిట్టి ప్రశ్నలకు సంపూర్ణమైన సమాధానమును బడయవలయునని ఆశించుట కూడ నిరుపయోగమే." (పుట 158)

"నిరక్షరకుక్షులైన అజ్ఞానులుమాత్రము వైజ్ఞానికులు తమతమవిభాగములను పూర్తిగా తెలిసికొనుచున్నారని తలంచుచున్నారు. కాని వాస్తవికవిషయ మేమన, పరిపూర్ణ వైజ్ఞానికుఁడుమాత్రము ఏవిషయమునందైనను హాఠము చేయ కూడదని ప్రప్రథమమున జెప్పసాహసించుచున్నాఁడు." (పుట 11)

పరిణామవాదము స్వయముగానే స్పష్టమైయుండినను దీనియంతిమనిశ్చయము చేయుట సాధ్యముకాదని విచారించుటచే తెలియుచున్నది. (పుట 2)

పరిణామము, దానివిధులపై పరిణామవాదులగు నాస్తికుల యంతిమోద్గారము లివి. ఇంతవఱకు మేముచెప్పినదే వారు చెప్పినదికూడ. వారేగాక యూరోపీయవైజ్ఞానికు లెల్లరును చెప్పుచున్నారు. కావున నిట్టి సంధిగ్ధవిషయములపై విశ్వాస ముంచుట యెంత భయావహమో వేఱ చెప్పనవసరము లేదు.

# అమానుషనాస్తిక ప్రేరణ

ఆధునికనాస్తికులీ పరిణామము విజ్ఞానముద్వారా అనుమోదితమనియు, కావున మనము మనభావిజీవన కార్యనిర్ధారణకై దీని నియమములను తెలిసికొనవలయు ననియు, నాకాశపాతాళముల నేకము చేయుటకు నడుములు కట్టుచున్నారు. కాని మేమింతవఱకు దీనిసమస్తశాఖోపశాఖల విమర్శన ద్వారా ఇదియొక కల్పనయేయనియు, సిద్ధాంతము మాత్రము కాజాలదనియు ప్రారంభముననే చెప్పియుంటిమి. కావున నిట్టి స్థితియందు మనజీవితములను పరిణామానుసారము చేసినయెడల, దుర్బలులను చంపుటయే సృష్టినియమమని నిశ్చయించినచో మనధార్మిక, సామాజిక, రాజనైతికాదు లెంత దోషభూయిషము లగునో యెవరు చెప్పగలరు ? దీనికి జవాబుదారు లెవరయ్యెదరు ? రాజ్యము, ధర్మము సమాజమును సుఖముగను, శాంతముగ నుంచునిమిత్త మేర్పడెను. పక్షపాతబుద్ధితో రంగద్దముల కండ్లజోళ్ళవారిదృష్టివలె ఒకవైపున సామ్యవాదమును వేఱొకవంక రాక్షస డార్వినిజమును ప్రచారముచేయుచు దేశాభిమానులమని విఱ్ఱవీఁగు నవయువజను లెందఱో కలరు. వారు రష్యాశిష్యులుగానో, యేజంట్లుగానో యుండిన నుండవచ్చునుగాని మానవత్వమునకు దూరమై నోరుగలవానిదే రాజ్య మను రాక్షసభావమును బలపఱచు డార్వినిజము నెందులకు నెత్తిపై రుద్దుకొనుచున్నారో కదా !

పాపము ! వైదికసాహిత్యానభిజ్ఞులగుటయే ప్రాచీన భారతోత్కర్షమును వారు గుఱుతించి యుండకపోవుటకు కార

ణమై యుండవచ్చును. ఏది యెటులున్నను కాకి చెవి నెత్తుక పోయిన దనిన కాకివెంట పరుగిడువారివలె నుండకూడదుగదా ! చిన్ననాటినుండియు నుగ్గుపాలతోసహా భారతదేశ మనాగరక జాతిదేశమనియు, విద్యావిజ్ఞానశూన్యమై అంధకారకూపమున బడియుండెననియు, పాశ్చాత్యులు సర్వశ్రేష్ఠు లనియు, ధన మును, మెసడును వినియోగించి నేర్చుకొని యున్నారు. కామిల రోగికి జగమంతయు పచ్చగనే కనబడునుగదా ! కావుననే మన పూర్వుల పూజ్యభావము లేకుండ నశించినది. ఆత్మాభిమాన మడుగంటినది. స్వజాతిదేశ ప్రేమలు రూపుమాసినవి. పరజాతి దేశములకు శారీరకముగను, మానసికముగను దాస్యమును స్వీకరించి యుంటిమి ఇట్టి మహాపతనావస్థలో మనపూర్వులను మనుష్యులని భావించక క్రోఁతులని, మృగములని తలంచుట కాటంకమేమి? భర్తృహరి ఆకాశగంగపదచ్యుతిని యుప మానముగా వర్ణించుచు-

శా॥ఆకాశంబుననుండి శంభుని శిరంబందుండి శీతాద్రిసుశ్లోకంబై
న హిమాద్రినుండి భువి భూలోకంబునం దుండి య
స్తోకాంభోధిఁ బయోధినుండి పవనాంధోలోకముం జే
రె గంగాకూలంకష పెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్॥

పతితుఁడైనవాఁడు వేయివిధములుగా నింకను పతితుఁ డగుటకే దారితీయునని యనుభవముతో వ్రాసెను.

సమాజమున దుర్బలులు జీవించుటకు హక్కు లేదని ముఖ్యసిద్ధాంతముగ పెట్టుకొనిన డార్వినిజమువలన మానవ సమాజమున కెట్టిలాభము కలుగగలదు ? నీతి నియమములులేని

సిద్ధాంతము లెంతకాలమువఱకు స్థిరముగ ప్రపంచమునకు సుఖశాంతుల నొసగగలుగును ?

"నీతిధర్మము – ధర్మము నీతి" యను గ్రంథమున మహాత్మాగాంధీజీ యిట్లు వ్రాసెను – "డార్విను చెప్పిన ప్రకారము మానవులకు, ఇతరప్రాణులకు జీవించవలయుననెడి కోరిక గలదు. ఈస్పర్థలో జీవనసంఘర్షణలో నిలువఁగలదే జీవించి యుండఁగలదు. నిలువదగనిది సమూలముగా నాశమగును. కాని యీస్పర్థ కేవలము శారీరకబలమువలననే నెఱవేఱఁజాలదు.

మనుష్యుని, యెలుగుగొడ్డును, దున్నపోతును సరిపోల్చి చూచినయెడల మానవునికంటె శారీరక బలమున యెలుగు గొడ్డు, దున్నపోతు అధికమని తేలఁగలదు. మానవుఁ డీరెంటిలో దేనితో కుస్తీపట్టినను ఓడిపోవును. కాని మానవుఁడు బుద్ధి బలముయొక్క కారణమున నన్నిటికంటె నధిక బలవంతుఁడని సిద్ధమగుచున్నది. మానవుఁ డీవిషయము ననేకజాతులతో పోటీ చేయఁబడవచ్చును. యుద్ధములో నధిక జనసముదాయము అధికయోధు లున్నవారికే జయము కలుగక కళాకౌశలము ఉత్తమమైన కార్యనిర్వాహకు లున్నవారికే జయము కలుగు చున్నది. బుద్ధిబలమున కిది యుదాహరణము.

బుద్ధిబలము శారీరక బలముకంటె మహత్తరమైనది. నీతిబలము ఏలయన, అయోగ్యునికంటె యోగ్యుని నిర్వాహమే యధికము. నీతినియమములులేని జాతులు మొదలంట నశించె నని పురాతన చరిత్రలవలన తెలియుచున్నది. సొదోము, గొమొర్రా, నివాసులు నీతినియమముల మీఱుట వలననే

పేరులేకుండ నశించిరి. ఇప్పుడుకూడ నీతినియమములు లేక వ్యవహారించువారు తఱచుగా నష్టమగుచుండు టందఱికిఁ దెలిసినదే.

సాధారణమైన నీతియే మానవున కెటువంటి యుప కారము చేయుచున్నదో సాధారణమైన నమూనాలనుబట్టి చూచినను విదితము కాగలదు. 'శాంతస్వభావము' నీతి కొక యంగము. పైచూపులకు తీక్ష్ణస్వభావము గలవాఁడు ముందుకు పోఁగలఁడని తెలియుచుండును. కాని సహజముగ విచారించి నచో తీక్ష్ణస్వభావమును "కత్తియే తుదకు తనగొంతుక కోయు" నని తెలియఁగలదు.

"విషయ లంపటుఁడు గాకుండుట" నీతికి ద్వితీయాంగము. విదేశపులెక్కలనుబట్టి ముప్పది సంవత్సరములకు పైవయస్సు గల త్రాగుఁబోతులు ౧౩-౧ర సంవత్సరములకంటె నధిక ముగా జీవించుటలేదనియు దుర్వ్యసన రహితులు డెబ్బది సంవత్సరములకు పైగా జీవించుచున్నారనియు తెలియుచున్నది.

"వ్యభిచరించకుండుట" నీతికి తృతీయాంగము. వ్యభి చారులు మిగుల తొందఱగా నాశమగుట గనఁబడుచునే యున్నది. సామాన్యముగా నట్టివారికి సంతానముకూడ కలు గుటలేదు. ఒకవేళ కలిగినను అత్యంత దుర్బలమైన సంతానమే కలుగుచున్నది. వ్యభిచారులు మనస్సులేనివా రగుటయేగాక రోజులు గడచిన కొలఁది వారిచూపులు పిచ్చివాని చూపుల వంటివై పోవును.

ఇతర జాతులయొక్క ఆచార వ్యవహారములను పరికించి చూచినచో నీస్థితియే దృష్టికి గోచరించును. అండమానుద్వీపము వారు బిడ్డపుట్టి కొంచెము నడువ నారంభించఁగనే యాస్త్రీలను విడదొ్రక్కెదరు. పరమార్థబుద్ధి యధికముగ నుండవలసిన దానికిబదులు స్వార్థబుద్ధి యధికము కలవారగుచున్నారు. అందుచే నాజాతి నెమ్మది నెమ్మదిగా నాశనమగుచున్నది.

మానవుఁడన్నిటికంటె నధిక పారమార్థిక బుద్ధికలవాఁడు. మానవులకును, ఇతర ప్రాణులకును గల ముఖ్యమైనభేద మిదియే. మానవుఁడు నీతిబలము ననుసరించియే ఇతరులకొఱకు తన దేశము కొఱకు పూర్వమునుండియు తనప్రాణములను బలి యొసగుచు వచ్చుచుండెను. కావుననే శారీరక బుద్ధిబలముకంటె నీతిబలము సర్వోత్తమ మనఁబడుచున్నది. ఇందులకు ప్రబలమైన దృష్టాంత మొండుగలదు. గ్రీకులు వర్తమాన ఆంగ్లేయులకన్నను బుద్ధిబలమున చాల గొప్పవారు. కాని వారు నీతిని దిగనాడినవెంటనే వారిబుద్ధియే వారికి ప్రబలశత్రువయ్యెను. ఇప్పుడు వారి అస్తిత్వముగూడ లేకుండబోయెను. ఏ జాతియైనను ధనముతోగాని, సైన్యముతోగాని శక్తిశాలి కాజాలదు. కాని కేవలము నీతితో మాత్రమే శక్తివంతము కాగలుగుచున్నది. కావున సదా యీ విచారముల నాదర్శముగ నుంచుకొని పరమార్థ రూపము పరమనీతి యుక్తాచరణమున నడచువాఁడగుటయే మానవునకు సర్వోత్తమమైన పని.

ఇత్యాది ప్రమాణములచే ప్రపంచమున దయాప్రేమ న్యాయాది సద్గుణములవలననే అస్తిత్వము స్థిరముగ నుండు

వనియు, పరమార్థబుద్ధి వలననే జాతులువృద్ధియగుననియు, స్పష్ట మగుచున్నది. పరమార్థబుద్ధి పశుపత్యాదులందును కనఁబడు చున్నది. ప్రపంచమున పరమార్థబుద్ధియే లేకున్న యెడల గాంధిమహాత్ముఁడు చెప్పినటుల ప్రపంచమున విషవృక్షములు, రాళ్లు, రప్పలుతప్ప మఱేమియు నుండజాలవు. కావున ప్రపంచమున సర్వత్ర వ్యాపించియున్న జీవన సంగ్రామమున బలము కలవారికే జయముకలుగునను పరిణామవాద సిద్ధాంతము నితాంత మనర్థదాయకమే కాని వేఱొండు కాఁజాలదు. కాబట్టి పరిణామవాద సిద్ధాంతానుసారముమనజీవనములగడపుట యోగ్యమనఁబడదు.

పరిణామవాదులయిన నాస్తికులీక్రూరవిషయములను సిద్ధాంతపఱచుటకై పురాణములందు ౮౪ లక్షల యోనులను గూర్చి వర్ణించిన ఆయా శ్లోకములను కూడ నుద్ధృత పఱచిరి. ఇంతియకాక పరిణామముయొక్క వరుసక్రమమును తెలియఁజేయుటకై మత్స్య, కూర్మ, వరహ, నారసింహాద్యయవతార ములనుకూడ నీడ్చుకొనివచ్చి సమన్వయించిరి. కాని యిందిసుమంతయైనను జీవములేదు. ఈ యవతారములకాలము నందును మనుష్యశరీరధారులయిన దేవతలు, దానవులు, మానవులు నుండిరి. కావున అవతారములవలనను పరిణామవాదము సిద్ధాంతమగుట లేదు.

ఇటులనే పరిణామవాదులు "యాఓషధీః పూర్వాజాతా దేవేభ్య స్త్రియుగం పురా మన్యైను బభ్రూణామహం శతం ధామానిస ప్తచ" ఋగ్వే. మం. ౧౦. ౯౭. ౧.

యను వేదమంత్రముచే నీఘృణిత సిద్ధాంతమును బల పఱచ ప్రయత్నించిరి. కాని వీనివలననుక్రమవికాసము బల సమన్వితమగుటలేదు. ఏలయన, నీ మంత్రము జరాయుజ, అండజ, ఊష్మజములకు పూర్వము ఓషధులు పుట్టినను విష యమును తెలియఁజేయుచున్నది. కాని ఓషధులే మానవులయ్యె నని మాత్రము సిద్ధాంతపఱచుటలేదు. వేదములయం దెచ్చటను పరిణామముగాని, పరిణామవాదవిషయముగాని యేమాత్రమును కనఁబడుటలేదు.

ఒకప్పు డిటులనే హక్సలేకూడ "ఆకాశాద్వాయుః" ఇత్యాది వైదిక సిద్ధాంతములఁ దీసికొని పూర్వకాలమున భారత దేశమునందును పరిణామవాదము విశ్వసించఁబడుచుండెనని చెప్పెను. కాని దానియందును డార్విను పరిణామవాద మిసు మంతయును లేదు. భారతదేశము పేరుతో నేసిద్ధాంతమునైనను ప్రచలిత మొనర్చినచో దానియం దెవ్వరికిని సందేహ ముండ దనియే అటు లనుటకు కారణము. ఏలయన ప్రాచీనార్యులు సృష్టిని గూర్చియు ధర్మవిషయమును గూర్చియు సిద్ధాంతపఱ చిన సిద్ధాంతములే స్థిరములని యూరపు దేశస్థులు బాగుగా విశ్వసించి యుండిరి.

పరిణామ వాదమును సమాలోచించుటచే దాని యారో పణ యేదియును సత్యసిద్ధాంతముపై స్థిరముగ లేదనియే విదిత మైనదిగదా! కావుననే యిపుడు పాశ్చాత్య విద్వాంసులుకూడ నెమ్మది నెమ్మదిగా దీనిరూపమును మార్చుచున్నారు. మఱియు వర్తమాన విజ్ఞానము వంకకు విద్వాంసు లనేకులు

మఱలుచుండుటచే నిఁక మిగుల తొందఱగా పరిణామవాదము కల్పితమనియు నధికవిద్వాంసులచే నిది నిరాకరించఁబడు ననియు ప్రతీతమగుచున్నది.

గత మహాయుద్ధసమయమున "క్రిష్టియన్ హెరాల్డులో" బ్రిటీషు సైన్సు సొసైటీ యధినివేశము (మహాసభ) ఆస్ట్రేలియా (వల్బ్యార్న్)యందు జరిగెనని ప్రకటించబడెను. సభాపతియైన ప్రొఫెసర్ విలియం వెట్సన్ తనయుపన్యాసమునందు "డార్విన్" పరిణామవాదము కేవలము కల్పితము విజ్ఞానమునకు విరుద్ధము" అనిచెప్పెను.

ఇతర వక్తలుకూడ నానాఁటియుద్ధమును నిదర్శనముగ చూపి యీయుద్ధము, మానవులు పూర్వమున్నటులే యిపుడు కూడ నుండిరనుటకు ప్రమాణమని నుడివిరి.

అమెరికాలో ననేక సామాన్యపు స్కూళ్ళలో డార్విను సిద్ధాంతపుశిక్ష చట్టవిరుద్ధమనియు, పరిణామవాదచర్య. యపరాధమనియు నిర్ణయించిరి.

౧౯౨౫ ౭-౧౯ నాఁటి వర్తమాన "కాన్పూరు" అను దైనికపత్రికయందు "పరిణామవాదము నుపదేశించిన యపరాధమునకు, అమెరికన్ ప్రొఫెసర్, జాన్స్కోప్సునకు నూఱు పౌనుల జరిమానా విధించఁబడెనని వ్రాయఁబడెను. "అభి

§ The court of Law in reactionary state of Fennessee has decided that it is criminal for a professor in the state to inculcate the principles of Darwinism - Vedic Magazine October 1925.

యుక్తుడు, 'మానవుడు చిన్న చిన్న పశువులయొక్క వికసిత స్వరూప'మని యుపదేశించె"నని జడ్జి తన తీర్పునందు వ్రాసెను.

ఇపుడు నిజమైన విద్వాంసు లెవ్వరును పరిణామ వాదముపై విశ్వాసముంచుటలేదు. ఏలయన, మానవుని వికాస సంబంధమున లభించిన ప్రమాణము లన్నింటి యందును మానవుడు క్రమవికాసము నొందినటు లగపడుట లేదు.

ప్రొఫెసర్ పెట్రిక్ గోడిస్, మానవుడు వికాసము నొందెననెడు ప్రమాణములు సందిగ్ధముగ నున్నవనియు, సైన్సులో దీనికి స్థిరమైనస్థానమెద్దియు లేదనెడు విషయమును విశ్వసించవలయునని యు వ్రాసెను. T

సర్. జె. డబ్ల్యు. డాసక్ యిట్లు వ్రాసెను.

"విజ్ఞానమునకు, కోతికి, మానవునకును మధ్యగల ఆకృతి విషయ మేమాత్రమును తెలియలేదు. మానవుని ప్రాచీనతమములగు వస్తులుగూడ వర్తమాన మానవుని యస్థులవలనే యున్నవి" §

వీనివలన నీమానవ శరీరమునకు పూర్వము వికాసము నొందిన గుఱుతేమియు కనబడుట లేదు.

---

T For it must be admitted that the factors of evolution of man partake largely of the nature of may - lies which has no permanent position in Science - Ideals of Science and Faith.

§ No remains of intermediate form are yet known to Science. The earliest known remains of man are still human and tell us nothing as to the previous stages of development.

ఈనవీన వైజ్ఞానికు లిపుడు పరిణామమును తలక్రిందుగా జేసివైచిరి. నేఁటివఱకును ప్రజలు పరిణామవాదు లింతవఱకు కోఁతినుండి మానవుఁడు వచ్చినట్లు విశ్వసించుచుండిరని తలంచుచున్నారు. కాని సుప్రసిద్ధ విద్వాంసుఁడైన ఉడ్ జోన్సు యిట్లు వ్రాసెను.

"డార్విసువలన మిగుల పొరబాటు జరిగెను. మానవుఁడు కోఁతినుండి పుట్టలేదు. కాని కోఁతియే మానవునినుండి జనించెను. I

సిడనీ క్యాలెట్ యిట్లు వ్రాసెను.

"మానవుఁ డవనతిదశనుండి యున్నతిని బొందుటకు బదులు అవనతివంకకే పోవుచుండెననియు మానవుని ప్రారంభికదశ ఉత్తమముగ నుండెననియు, సైన్సే స్పష్టముగా సాక్ష్యమొసఁగుచున్నది."

ఉత్తరపూర్వ (ఈశాన్య)పు అశ్మకాలపు కపాలమొకటి (Neanderthal skull) దొరకెను. ఈ కపాల మేశిరస్సుదై యుండెనో యది యూరోపులో నన్నిటికంటె మిగుల గొప్పదని తలంచఁబడుచుండెను. ఈపుర్రె ౧౧౪ క్యూబిక్ (ఘన) అంగు

I Meanwhile professor Wood Jones of the University of Adelaide is proclaiming about his own view that Darwin has mistaken and monkey descended from man, not man from monkey - Vedic Magazine, October 1925.

Science is equally explicit in its testimony that instead of man having slowly improved from the lower to the higher. The tendency is exactly in the opposite direction.—That man's earliest state was his best. The scripture of truth

ములు. యూరప్పులో నన్నిటికంటె చిన్నతల ౫౦ ఘనాంగుళ ములును, అన్నిటికంటె పెద్దది ౭౫ క్యూబిక్ అంగుళములును కలిగియుండెను. ఈ శిరస్సు వర్తమానకాలపు యూరప్పునివాసుల మేధాశక్తి పెంపొందుటలేదని తెలియఁజేయుచుండెను.

"Engis skull" యొక్క విషయమున సుప్రసిద్ధ పరిణామ వాదియైన ప్రొఫెసర్ హాక్సలే యిట్లు నుడివెను.

" ఆధునిక యూరోపియనుల శిరస్సులకంటె నీశిరస్సు మిగుల గొప్పది. సం. ౧౮౮3 లో హాలండులో నొకశిరస్సు లభించెను. అదియూరోపు నివాసుల శిరస్సులయొక్క చుట్టు కొలత కంటే మిగులగొప్పది. అది ౧౫౦ ఘనాంగుళముల పరి మాణ ముండెను.

ఇటులనే పురాతత్త్వజ్ఞులు, భూగర్భశాస్త్రవేత్తలు Haling Section ను ౨౫ వేల సం॥ల పురాతన మని. తెలియజేసిరి. దీని చుట్టుకొలతకూడ ౧౫౦ ఘనాంగుళము లుండెను."

ఇత్యాది ప్రమాణములచే నాదిమ మానవులు కపితుల్య హీనమస్తిష్క ప్రాణినుండి వికసితమై ఉన్నతి నొందలేదనియు, వారు పరమాత్మయొక్క విశిష్టరచనయే యనియు, నిప్పటి యుత్తమోత్తమ మస్తిష్కములకంటె ప్రాచీను లధికోన్నతిస్థితి యందుండిరనియు సిద్ధాంతిత మగుచున్నది.

ప్రశ్న-క్రమోన్నతి (పరిణామ) సిద్ధాంతమును విశ్వ సించక పోయినచో దీర్ఘకాయప్రాణు లెటు లుత్పన్నమగుట

సంభవించును? ఇంతపెద్ద మానవుఁడాదియందకస్మాత్తుగా నెట్లు జన్మించెను?

ఉత్త — మీరొక కోశముగల అమీబా అకస్మాత్తుగా పుట్టుటను విశ్వసించుచునేయున్నారు. కాని యనేక కోశసమన్వితమైన మానవప్రాణి తనంతటఁ దాను పుట్టుటను విశ్వసింపలేము. అంతర్వ్యాప్తశక్తియొక్క ప్రభావముచే నొకసేలుగల అమీబా పుట్టగలుగుచున్నచో నాశక్తివలననే అటువంటివి పెక్కుసేలు లుత్పన్నములై యొకటిగాకలసి మానవ శరీర నిర్మాణము కాఁగలుగుచున్నది. ఏశక్తి గొప్పగొప్ప సూర్యచంద్రాదులను, సూక్ష్మాతిసూక్ష్మములయిన అమీబాలను నిర్మించఁగలిగెనో ఆమహాచ్ఛక్తియే ఆవు, ఎద్దు, గేదె, ఏనుఁగు, కోఁతి, మానవుఁడు మున్నగు ప్రాణులయొక్క సాధారణశరీరములనుకూడ నిర్మాణము చేయఁగలుగుచున్నది. ఒక కోశముగల అమీబా తనంతటఁదాను పుట్టఁగలిగినపుడు మానవుఁడుకూడ తనంతటఁదానేల పుట్టఁజాలఁడు? ఈతర్కము వలనను, పరిణామప్రకరణములయొక్క సమస్తసమాలోచనల వలనను, మానవులకు సంబంధించి లభించిన సామగ్రివలనను, క్రమవికాససిద్ధాంతము కేవలము భ్రమాన్వితమనియు, పరమాత్మయొక్క విశిష్టోత్పత్తిసిద్ధాంతమే సత్యమనియు ననుటలో నిపుడిసుమంతయు నతిశయోక్తిలేదు. ఆదిసృష్టిని, నూతన, పురాతన విద్వాంసు లందఱును పరమేశ్వరుని విశిష్టరచనయనియే విశ్వసించి దాని నమైథునసృష్టియనియే చెప్పినారు.

ఈ విషయమునుగూర్చి ప్రొఫెసర్ మ్యాక్స్ముల్లరిట్లు నుడివెను.

"ఆదిసృష్టియందొకే మానవుడుగాక కొందఱు యువతీయువకు లుత్పన్నమైరనియే మే మన్నివిధముల విశ్వసించఁగలుగుచున్నాము." §

మదరాసు హైకోర్టు జడ్జి టి. యల్. స్ట్రేంజ్ మహాశయుఁడు తన "ది డెవలప్మెంటు ఆఫ్ ది క్రియేషన్ ఆన్ ది ఎర్థ్" అనుగ్రంథముయొక్క ౧౭ వ పుటలో "ఆదిసృష్టి అమైథునసృష్టియే. మఱియు నీయమైథున సృష్టియందుత్తమమైనట్టియు, సుందరమైనట్టియు, శరీరములు నిర్మించఁబడెను" అనివ్రాసెను.

ఈ విషయమే వైశేషిక దర్శనము (౪-౨-౫) లో నీవిధముగ చెప్పబడినది. "తత్ర శరీరం ద్వివిధం యోనిజ మయోనిజం చ" అనగా శరీరము ద్వివిధములు. ౧ - యోనిజము. ౨ - అయోనిజము. ఈసూత్రముయొక్క వ్యాఖ్యానమున నయోనిజ విషయమునుగూర్చి ప్రశస్తపాదమునం దిట్లు చెప్పఁబడినది.

"తత్రా యోనిజమనపేక్షిత శుక్రశోణితం దేవర్షీణాం శరీరం ధర్మవిశేష సహితేభ్యోఽణుభ్యో జాయతే" అనగా దేవ

---

§ We have been told of late that there never was a first man, but we may be allowed to suppose at all events, that there were at one time a few first men and a few first women Chips from a German Workshop Vol· I. P. 237,

తులయొక్కయు, ఋషులయొక్కయు, శరీరములు శుక్రశోణిత ములవలన గాక విశేషప్రయోజనమునకై సూక్ష్మ పరమాణు వులద్వారా యుత్పన్నము లగుచున్నవి."

"తేన దేవా అయజంత సాధ్యా ఋషయశ్చ యే" అని యజుర్వేదము చెప్పుచున్నది. అనగా నాపరమాత్మవలన నాది సృష్టియందు దేవతలు, సాధ్యులు, ఋషులు నుత్పన్నులైరి."

ఇత్యాది ప్రమాణములచే నాదిసృష్టియందు మనుష్యాది ప్రాణులు అమైథున సృష్టివలననే జనించెనని స్పష్టమగుచున్నది.

---

# వేదములు

మనువు తనస్మృతియందు "వేదోఽఖిలం ధర్మమూలమ్" అని నిర్ణయించెను. ధర్మమనవ్యాకరణ శాస్త్రానుసారము "ధారణ మొనర్పఁబడునది" యని అర్థము చేయబడును. అగ్నికి దాహగుణము, జలమునకు శీతము, పక్షులకెగురుట మొదలైనవి ధర్మము లనఁబడును. ఆయావస్తువు లాయా గుణముల ధారణ మొనర్పనిచో వాని యస్తిత్వమే యుండదు. ఇటులనే గుణ కర్మ స్వభావముల నాయాధర్మ్మువులకు సంబంధించిన ధర్మమని చెప్పవచ్చును. కావున ధర్మమున కితరభాషలందు సమానమైనశబ్దము లేదని చెప్పవలసివచ్చును. Duty కర్తవ్యమని చేయబడు అర్థముకూడ ౧/౩ వవంతు భావమునే ప్రకటించుచున్నది. ఇటువంటి ధర్మము లన్నిటికిని మూలము వేదము. అది సత్యవిద్యల కాలవాలము.

వేదేతర (గ్రంథ)ములు పుట్టుచు గిట్టుచు నుండునని మనువు వచించెను. అమెరికా,ఇంగ్లండు మొదలగు దేశములలో నేఁడొక క్రొత్తవాద మావిర్భవించుచున్నదన ౨-౩ సం. లకు తరువాత నది పూర్తిగా ఖండించఁబడుచున్నది. మనువాక్యము లావాదములందు, ఆగ్రంథములందు చక్కఁగా వర్తించుచున్నవి. విజ్ఞానవేత్త లొకప్పుడు బంగారము నొకతత్త్వమనిరి. కాని నేఁడు మనతర్కశాస్త్ర సిద్ధాంతమువలె సువర్ణమును పాకజమని తలంపసాగిరి.

ఒకప్పుడు డార్విను క్రమారవాదము ప్రసిద్ధముగ నుండెడిది. కాని యిపు డది నామావశిష్టమయ్యెను. మునుముందు

పూర్తిగా నశించిపోవచ్చును. వేదములకు విరుద్ధముగా వ్రాయఁబడు గ్రంథము లన్నింటియొక్క గతికూడ నింతియే. వేదేతర గ్రంథములు వేదాధారమును గొనినంతవఱకే స్థిరముగా నుండఁగలుగునను నిర్ణయమునకు రాఁగలుగుచున్నారు.

కణాదమహర్షి వైశేషికదర్శనమున "యతోఽభ్యుదయ నిశ్శ్రేయససిద్ధిః సధర్మః" అని నుడివెను. అనగా భోగ, మోక్షముల నొసఁగునదియే ధర్మము. వేదములందు చెప్పఁబడిన కర్మల నాచరించుటవలనను, తత్త్వోపదేశమును గ్రహించుటవలనను, భోగమోక్షములు లభించఁగలవు. వేదములయం దీవిషయములు మిగుల చక్కగా వివరించఁబడెను. కాన "తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యమ్" అని ప్రామాణికగ్రంథములుగా కణాదులు వచించిరి. మీమాంసాశాస్త్రకారుఁడు కూడ వేదముచే ప్రేరేపించఁబడినదే ధర్మమని నుడివెను.

కొందఱు వేదోపదేశము కేవలము తత్త్వోపదేశమని తలంచి జీవులకు సాంసారికవిషయములు స్వయముగానే గోచరమగునని తలచుచున్నారు. కాని యది భ్రమాన్వితసిద్ధాంతము. తత్త్వ మొక్కదానినే గాక సాంసారికవ్యవహారములను, శబ్దములనుకూడ జీవులకు నేర్పుటకై ఐశ్వరీయజ్ఞాన మత్యంతావశ్యకము. వేదములయం దభ్యుదయమోక్షముల రెంటికిని వలయు యజ్ఞానమంతయు బీజరూపముగా వివరించఁబడెను. కాన నొక్కవేదధర్మము (మతము) నే నమ్మినను మానవోన్నతి కాటంకము కలుగఁజాలదు. మనువు వ్రాసిన "అఖిలధర్మమూలమ్మ"ను విశేషణము సకలసత్యవిద్యలు బీజరూపముగా బోధించు

ఇడినవను సిద్ధాంతమును బలపఱచుచున్నది. ఏలయన మూలము, బీజము, కారణము ఇవన్నియు పర్యాయపదములు. వేదజ్ఞాన మనంతము. గాన మహర్షులును, మునులును శోధించి శోధించి వానినుండియే జ్యోతిర్వ్యాకరణాద్యుత్కృష్ట వేదాంగములను, ఆయుర్వేద, ధనుర్వేద, అర్థవేదములను నుపవేదములను, న్యాయమీమాంసాది షడుపాంగములను, వందలకొలఁది శాఖలను విపులముగా వ్రాయఁగలిగిరి.

2. మానవుఁ డల్పజ్ఞుఁడుగాన విశేషమైన సత్యజ్ఞానము యొక్క ఆధారమువినా యెప్పటికి నాతఁడు తర్కించిన సిద్ధాంతము నిర్భ్రాంతమైనదని తెలిసికొనఁజాలఁడు. క్రింది కోర్టులలో జరుగు వేలు వేలు తీర్పులకు తుదినిర్ణయమునకై అంతకంటె విద్యావిజ్ఞానబాధ్యతలు గల హైకోర్టు ఉన్నదిగదా! అట్లు భిన్న భిన్నములుగా వర్ణించఁబడు మానవవాదముల నిర్ణయము చేయఁగల దేదైన యున్నచో నది వేదముతప్ప నితరమేదియు కాఁజాలదు. డార్విన్ మతము నెందఱో విద్వాంసులు స్వీకరించు చున్నారు. ఎందఱో మహాపండితులు తిరస్కరించుచున్నారు. కావున నెవరివాదము ప్రమాణమగును? ఇటువంటి పరిస్థితులలో మనువు మిగుల చక్కగా "ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః" యని జవాబొసఁగెను. పరమ ప్రమాణ మన స్వతఃప్రమాణమని తాత్పర్యము.

ప్రపంచ మింద్రియలోలమై వేదమార్గమును త్యజించి అధోగతిపాలయ్యెను. డాక్టర్ కేలాగ్ బోటివారుకూడ నుత్తమమైన ఆరోగ్యయుక్త సంతానమును బడయుటకు అమెరికా

వారికి నాలుగుతరములు, భారతీయులకు ౫ తరములు పట్టునని నుడివిరి. ప్రస్తుతము మద్యమాంసాదుల సేవనము, బాల్యవివాహాది కురీతులలో జిక్కువడియున్న దీప్రపంచము. కాని వేదాజ్ఞను పాలించునపుడు వారి సదాచారమున కాధార మీవిధముగ నుండెడిది.

ఈశావ్యాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుఞ్జీథా మాగృధః కస్యస్విద్ధనం.
" యజు. అ. ౪౦. ౧॥

(౧) ఈశ్వరుఁడు సర్వవ్యాపకుడు. (౨) అతఁడు సమస్త పదార్థముల మనకొసఁగి యుండెను. (3) పదార్థములను భోగించుము. కాని(౪) యెవరిధనము నాక్రమించకుము. వేదప్రచారము లోపించి వేదములను పరమప్రమాణములుగా నొప్పుకొనని రోజులలో ఈ ౪ వైదికాదర్శములలో మొదటిరెండు నశించిపోయెను. తుది రెండుభోగములను భోగించుము. కాని పరులను హింసించకు మనునవి నిలచిపోయెను. బౌద్ధ జైనులిటు లాచరించెడివారు, సదాచారము స్థిరమైనప్పటికి నిటులెందుల కాచరించవలయు ? నని ప్రశ్న రాఁగా జవాబగు ప్రథమసిద్ధాంతమును మఱచిపోవుటచే మనోవీధుల నశాంతి వ్యాపించసాగెను. ఏలయన నాత్మపరమాత్మల జ్ఞానాభావముచే మనస్సు విచికిత్స యనఁగ సంశయమును పొందసాగును గాన బౌద్ధమతము సమాజమున సదాచారమును వ్యాపింపఁజేయుచుండినను స్వయముగ సంశయగ్రస్తమయ్యెను.

ఇప్పుడు నవీనశిక్షాదక్షులలో డార్వినువాదము వచ్చినది. అది జైనబౌద్ధమతములకంటె బలితమైపోయినది. పరిణామ వాదులగు నాస్తికులు మొదటి మూడునియమములనేకాక నాల్గవదగు "మా గృధః కస్యస్విద్ధనమ్" ను దానిలోకూడ "మా" ను త్యజించిరి. నోరుగలవానిదే రాజ్యమను పాఠమును డార్విను వాదము నేర్పుచున్నది. దీనిని మానవసమాజమున కుపకరించునట్లు చేయవలయుననినచో "మా" ను చేర్చియే యుంచవలసియుండును. ఈవిధముగా "మా గృధఃకస్యస్విద్ధనమ్" ను స్వీకరించి జైనులుగనో, బౌద్ధులుగనో మాఱిన వారిని ఈశావాస్యాదివాక్యముల నేర్పి సకలసంశయముల నెడ బాపి పరమాస్తికులుగా నొనర్పవచ్చును.

ప్రపంచఖ్యాతిఁజెందిన స్వర్గీయ కవీంద్రరవీంద్రుని తండ్రి దేవేంద్రనాథ ఠాకూరుగారి సంశయము లన్నింటి నీమంత్రమే తీర్పఁగలిగినది. ప్రపంచఖ్యాతినందిన "సాధన" యను రవీంద్ర కృతి యీ మంత్రాశయమే. వేదము విశ్వవిద్యాకోశము. (Encyclopodeia) మానవోత్పత్తికి ముఖ్యసాధనములగు జ్ఞాన, కర్మ, ఉపాసన, విజ్ఞానములు ఋగ్యజుస్సామాథర్వములను నామములతో ప్రకటించఁబడెను. కనుక వానిని అక్షరశః అనుస రించియే మానవసమాజము సర్వాంగీణోన్నతిని గాంచఁగలదు. ఈవేదములను గూర్చి వైశేషికమునం దొకచోట "బుద్ధిపూర్వా వాక్యకృతిర్వేదే" వేదవాక్యరచన బుద్ధిపూర్వకముగా నున్న దని చెప్పబడినది. కావున నీవిషయము నింతటితో విరమించి సృష్టిరచనను గూర్చి వేదములం దెట్లు చెప్పబడినదో విచా రింతము.

# వేదములు - సృష్టి

ఓం సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్
స భూమిగ్ం సర్వతస్పృత్వాత్యతిష్ఠ ద్దశాఙ్గులమ్. ౧

యజు. అ. ౩౧.

"సహస్ర మన అనంతమని యర్థము. కాన సహస్రశీర్షుఁ డనఁగా అనంతశిరములు గలవాఁడు. సర్వాంతర్యామి, వ్యాపకుఁడు నగుటచే ప్రాణుల శిరస్సులన్నియు నాతనిలోనే యున్నవి. మఱియు శిరస్సు జ్ఞానమున కుపమానము. గాన నీశ్వరుఁ డనంత జ్ఞానమయుఁడనికూడ తాత్పర్యము. సహస్రపాదుఁ డనగా అనంతక్రియాశక్తి గలవాఁడని యర్థము. ఏలయన, పాదశబ్దము క్రియావాచకము - సూచకము - నై యున్నది. సహస్రాక్షుఁ డనగా అనంతనేత్రములు గలవాఁడని యర్థము. అశ్నుతే విషయాన్ ఇతి అక్షిః = సమస్తవిషయముల జ్ఞానమును పొందునుగాన నక్షి యందురు. ఇట్లు సహస్రాక్షశబ్దము అనంత విషయ జ్ఞాతయని చెప్పుచున్నది. వైదిక శబ్దశాస్త్రము నెఱుంగని కొందఱు పండితులు తమ భావములను బట్టి యీ మంత్రమును ప్రమాణముగా చూపెట్టి, దేవున కాకార మారోపించ ప్రయత్నించి పరిహాసపాత్రు లగుచుందురు. ఏలయన, వేయితలలు గలవానికి ౨ వేలనేత్రములు, ౨ వేల కాళ్ళు ఉండవలయునుగదా! వేదశబ్దములన్నియు, యౌగికములు. వేదములందు బుద్ధిపూర్వకముగానే వాక్యరచన చేయఁబడినదను నీ రెండుసిద్ధాంతములకు విరుద్ధముగాని యర్థమునే యిచట చేసితిమి.

ఒకపనిని ప్రారంభించకపూర్వము శిరస్సే ప్రధాన సహాయముగాగల మనస్సుద్వారా ఆలోచింతుము. కావున నీశ్వరుని యనంతజ్ఞానమయశక్తిని సహస్రశీర్షశబ్దము ప్రకటించుచున్నది. సృష్టియందు నియమపూర్వకమైనట్టియు, ప్రయోజనకరమైనట్టియు రచన యెందులకు జరుగుచున్నది? అను ప్రశ్నకు సృష్టికర్త అనంతజ్ఞానమయుడగుటచే నట్లు జరుగుచున్నదని సహస్రశీర్షశబ్దము సమాధాన మొసగుచున్నది. ఇటులనే సహస్రాక్షశబ్దము ఈశ్వరునికంటె భిన్నముగా ఆత్మ, ప్రకృతి యను రెండు అనాది పదార్థము లున్నవని నిర్దేశించుచున్నది. ఏలయన నేత్రము తన్ను తాను చూడజాలదుగదా! తనకంటె భిన్నవస్తువుండిననే కదా నేత్రముయొక్క ప్రయోజనము! ఈశ్వరునియొక్క అనంతజ్ఞానమును క్రియాశక్తిని బోధపఱచుటయే ఈమంత్రముయొక్క ముఖ్యాశయముగాన సాకారవాదమునకు తావు లేకుండునట్లు ఇతరాంగములను వర్ణించక పాదములతోనే సరిపెట్టబడినది. పాద మన్నిస్థానములకు దీసికొని వెళ్ళి ఆయావస్తువులతో సంప్రాప్తి మొనర్చును. గాన అటులనే ఈశ్వరు డనంతపాదములు గలవాడనగా సర్వాంతర్యామియై సర్వవ్యాపకుడై సర్వపదార్థములను విషయములను తెలిసికొనగలుగుచున్నాడని బోధపడుచున్నది.

ఇక నీ యధ్యాయమున ప్రధానత వహించిన పురుషశబ్దమునుగూర్చి విచారింతము. లోక మనుకొనునట్లు పురుషశబ్దమిచట మానవజాతికి చెందదు. యాస్కాచార్యులు నిరుక్తమున దీనినెట్లు నిర్వచించెనో చూడుడు "పురుషః పురిషాదః

పురిశయః పూరయతేర్వా" (నిరు. అ. ౨. ఖం. 3. సూ. ౧.) ఇందుఁగల పూరయతేర్వా శబ్దమునకు వ్యాఖ్యానము చేయుచు దుర్గాచార్యుఁ డిట్లు వ్రాసెను. "పూర్ణమనేన పురుషేణ సర్వగతత్వాత్ జగదితి పురుషః" అనగా సర్వత్రప్రపూర్ణుఁడై యుండి సర్వవ్యాపకుడై యున్నాడు. గావున పురుషుఁ డనఁబడుచున్నాఁడు.

సః = ఆపరమాత్మ, భూమిం = భూమిని, సర్వతః = అన్నివైపులనుండి, స్పృత్వా = వ్యాప్తుడై, అత్యతిష్ఠత్ = ఉల్లంఘించి యున్నాడు. అటులనే, దశాంగులమ్ = జీవాత్మనుకూడ.

అఫలాతూను ( Plato ) మొదలుకొని తత్త్వవేత్తలందఱు నేఁటివఱకును సర్వవ్యాపకుఁడు, అనంతజ్ఞాని, అనంత క్రియాశక్తిసంపన్నుఁ డీ విశ్వమును సృష్టించెనని నుడువుచున్నారు. యూరోపీయ విద్వాంసు లెందఱో విశ్వవ్యాపకశక్తిని గుర్తించఁజాలకపోయిరి. వేదముల వెన్నంటి నడచుచున్న ఉపనిషత్తులు "స్వాభావిక జ్ఞానబలక్రియాచ" యని ఈ జ్ఞానబలక్రియలన్నియు నాతనికి స్వాభావికములని నుడువుచున్నవి. వైజ్ఞానికులీ వేదరహస్యము నెఱుఁగనివారై గతికి కారణమును వెదకుచున్నారు. గాని మన స్వంతోషమును బడయఁజాలక పోవుచున్నారు.

ఓం పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభావ్యం.
ఉతామృతత్వ స్యేశానో యదన్నేనాతిరోహతి "౨"

అర్థ: - పురుషఃఏవ = పరమేశ్వరుడే, ఇదంసర్వం = ఈసమస్తమైన, యద్భూతం యచ్చభావ్యం = జరిగిన, జరుగుచున్న,

జరుగఁబోవు సమస్తమునకు, ఉతఅమృతత్వస్య=మఱియు మోక్షమునకు, ఈశానః=అధిపతియై యున్నాఁడు. యత్ అన్నేన=ఆతఁడు, (అన్నమునకు హేతువగుటచే భూమిగూడ నన్నవాచ్యమే) పృథివి మొదలగువాని నన్నింటిని, అతి రోహతి=ఉల్లంఘించి యున్నాడు.

ఇందు సృష్టి, స్థితి,లయము లన్నియు పరమాత్మయొక్క నిత్యసామర్థ్యముచే జరుగుచున్నవని చెప్పఁబడెను. విశ్వరచన యేయుద్దేశముతో జరుగుచున్నదని ప్రశ్నించిన హెర్బర్టుస్పెన్సరు చెప్పఁజాలడు. కాని యీమంత్రమున భూత వర్తమాన భవిష్య త్కాలములందును విశ్వసృష్టి కధిపతియైన పరమాత్మయే మోక్షమున కధిపతియని చెప్పఁబడినది. అనఁగా సృష్టిరచనా ప్రయోజనము జీవుల మోక్షసుఖము వఱకని బోధపడుచున్నది. మఱియు నీశ్వరుఁడనంతుఁడనియు నీమంత్రము బోధించు చున్నది.

ఓం. ఏతావానస్య మహిమాతో జ్యాయాగ్ంశ్చ పూరుషః
పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి ॥3॥

అర్థ:-ఏతావాన్ = ఇంతప్రపంచము, అస్యమహిమా= ఇతని మహిమయైయున్నది.అతః జ్యాయాన్ చ పూరుషః=అతను దీనికంటె నతిశయుఁడై పరిపూర్ణుఁడై విలసిల్లుచున్నాడు. విశ్వా భూతాని= పృథివ్యాది చరాచరము లన్నియు, అస్యపాదః=ఇత నికి పాదమై (1/4)యున్నవి. దివి= స్వప్రకాశస్వరూపము అమృతం అస్య=నాశరహితమగు నీతని, త్రిపాత్ = (మిగతా) 3/4 వంతు మహిమయై యున్నది.

ఈ చరాచర ప్రపంచమంతయు నతనిలో ౧/౪ వంతు. ఇంకను నాశనము కానటువంటి ౩/౪వంతులు స్వప్రకాశ స్వరూపమునందే యున్నవి. అయినను ఆతని నేకదేశత్వమాపాదింపఁజాలదు. ఏలయన ఆ 3 పాదముల ప్రపంచమునుకూడ మించియే యున్నాఁడు. ఆతని వ్యాపకత్వ మనంతము. అవలామూడుపాదములు నాశరహితమై స్వప్రకాశ స్వరూపముగా స్థిరముగా నున్నవని వర్ణింపఁబడెనుగదా!

ఓం. త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః, పాదోఽస్యేహాభవత్పునః,
తతో విష్వఙ్ వ్యక్రామ త్సాశనానశనే అభి ॥౪॥

అర్థ:- పురుషః=వ్యాపకుడు, త్రిపాద్ ఊర్ధ్వః=త్రిపాద జగత్తునకు పరమై, ఉదేత్ =ఉదయించుచున్నాడు. ఇహ అస్య పాదః పునః అభవత్ = ఇచ్చట నితనిపాదము (౧/౪) మాటి మాటికి నుద్భవించుచున్నది. తతః సాశనానశనే=తినువారిని తిననివారిని, అభి=అందఱిని, చరాచర ప్రపంచమంతటిని విష్వఙ్ వ్యక్రామత = వివిధ ప్రకారము గతిమంతుఁడగుచు వ్యాప్తుడగుచున్నాఁడు.

పూర్వమంత్రమునం దీశ్వరుఁడు త్రిపాదముల మించినవాఁడై, నాశరహిత మహిమా స్వరూపమై, స్వప్రకాశమున నున్నవాఁడని చెప్పఁబడెను. ఈ చరాచర ప్రపంచ మంతయు నొకపాదమై సారెసారెకు పుట్టుచున్నదని చెప్పెను. గొప్ప గొప్ప విద్వాంసులందఱు జ్యోతిశ్శాస్త్రపఠనముచే నసంఖ్యాక చంద్రులు: ఎన్నియో తారాగణము లాది లోకలోకాంతరములున్నవని చెప్పుదురు. కావున వాని వైశాల్యాదులను వీక్షించు

నిచో జ్యోతిషాదిశాస్త్రముల తత్త్వమెఱుంగనిచో నీశ్వరుని యనంతశక్తిమహిమలు బోధపడఁజాలవు. విశ్వమంతయు, నీశ్వరునియెదుట నొక పాదమువలె నున్నదనియు తక్కిన మూఁడు పాదము లాతని నాశరహిత మహిమయై యున్నదనియు మంత్రము చెప్పుచున్నది. మఱియునీశ్వరుని అనంతవ్యాపకత్వము నీమంత్రము బోధించుచున్నది.

ఓం తతోవిరాడజాయత, విరాజో అధిపూరుషః ॥

సజాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మథోపురః ॥౫॥

అర్థ —తతః = అతనినుండి, విరాట్ = ఉదయించుచున్న తేజస్సు, అజాయత = పుట్టెను, విరాజః = ఆఉదీయమాన తేజస్సునుండి, అధపూరుషః = ప్రధాన తేజము లేక సూర్యుఁడు, అజాయత = పుట్టెను. సః = ఆ ప్రధాన తేజము, జాతః, అత్యరిచ్యత = పుట్టివేఱయ్యెను, పశ్చాత్ = అనంతరము, భూమిం = భూమిని, అథో = వెనుక, పురః = నివాసయోగ్యమైన స్థానములను, (ఉత్పన్నము జేసెను.)

పాశ్చాత్య విద్వాంసు లెందఱో క్రైస్తవులవలె క్షణములోనే సృష్టిజరగినదని స్వీకరించనివారై క్రియవాదు లగుచున్నారు. అట్టి క్రమవాదులలో డార్విన్ ఒకఁడు. ఈమంత్రమునఁగల "పశ్చాత్" శబ్దము సృష్టిరచనయందలి క్రమవాదమును మిక్కిలి స్పష్టముగ బలపఱచుచున్నది. సమష్టినుండి వ్యష్టిసృష్టి జరుగు క్రమము నేమంత్రమునఁ గలదో దానినే హార్బర్టుస్పెన్సరు వర్ణించెను.

ఓం తస్మాద్యజ్ఞాత్సర్వహుతః సమ్భృతం పృషదాజ్యం ।
పశూంస్తాంశ్చక్రే వాయవ్యానారణ్యాన్గ్రామ్యాంశ్చయే ॥౮॥

అర్థ:—తస్మాత్, యజ్ఞాత్ = ఆ సృష్టికర్త - యోజకుని వలన, సర్వహుతః = సర్వులకు గ్రహణయోగ్యునివలననే సంభృతం, పృషత్, ఆజ్యమ్ = బాగుగా ధారణమొనర్చు (పేయ) ఖాద్యపదార్థములన్ని సృష్టించబడెను. వాయవ్యాన్, ఆరణ్యాన్, గ్రామ్యాన్ చయే = వాయు,జల,ఆరణ్యగ్రామాదుల నాధారముజేసికొని బ్రతుకుజీవు లేవియున్నవో, తాన్ పశూన్ = ఆయా పశువుల నన్నిటిని సృజించెను.

భూమి, సముద్రాదులను సృజించినతరువాత నందఱు గ్రహించుటకు యోగ్యుడైన యాపరమాత్మ రసప్రధానము లైన ఆహారపదార్థములను రచించెను. మఱియు వానితోపాటు అగ్నివర్థకములును, ఆయువును పెంపొందజేయునట్టివియునగు స్నిహాయుక్త సమస్త పౌష్టికపదార్థములను నిర్మించెను. వివిధ ప్రాణికోటిని సృష్టించకపూర్వమే వానివాని కనువగు భోగ్య పదార్థములనుకూడ సృజించెను.

జల, వాయు స్థాన విశేషముల ననుసరించి పుట్టు స్థూల సూక్ష్మ ప్రాణులన్నింటి రచన మిక్కిలి యుత్తమముగా వర్ణించ బడెను. అన్ని ప్రాణులకును పశుశబ్దమొక్కటే ప్రయోగించ బడెను. చ. శబ్దము జలచరప్రాణులను సూచించుచున్నది. స్థల జంతువులలో స్వభావము ననుసరించి భేదములను తెలియ జేసెను. కొన్నిజంతువులు పెంచుట కలవిగానివై, క్రూరస్వభా వము గలవై గ్రామాదులకు దూరముగా నుండువానిని ఆరణ్య

ములనియు, మృదుస్వభావము గలిగి మానవుల కుపయుక్త ములై పెంపుడు జాతికి చెందిన వానిని గ్రామ్యములనియు వక్కాణించెను.

ఓం తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచః సామాని జజ్ఞిరే।
ఛన్దాగ్ంసి జజ్ఞిరే తస్మాద్యజుస్తస్మా దజాయత ॥2॥

అర్థ:—తస్మాత్. యజ్ఞాత్ = ఆయోాజకుడు, సర్వ హుతః = సర్వులచే గ్రహించుటకు యోగ్యుడు, నగువాని నుండియే, ఋచః = ఋగ్వేదము, సామాని = సామవేదము, జజ్ఞిరే = ప్రకాశితమయ్యెను. ఛందాంసి = అధర్వవేదము, జజ్ఞిరే=ప్రకాశితమయ్యెను. తస్మాత్ =ఆతనినుండియే, యజుః అజాయత=యజుర్వేదము ప్రకటితమయ్యెను.

సాముద్రికశాస్త్రజ్ఞులు మస్తిష్కమునందు విభాగము లను చెప్పుచున్నట్లులే శబ్దమయజ్ఞాన మను వేదమును పర మాత్మ నాలుగు భాగములుగా విభజించెను. శిరస్సుముందు భాగము (మస్తకము) జ్ఞాన కాండను, మధ్యనున్నతభాగము ఉపా సనాకాండను, పృష్ఠభాగము కర్మకాండను బోధించుచున్నవి. ఈ ఔటి కలియకవలన కలుగు జ్ఞానము విజ్ఞానమనఁబడును. సూల దృష్టితో జ్ఞాన మెన్నిభాగములుగా విభజించుటకు వీలుకలదో ఈశ్వరుఁడే భాగించెను. పూర్ణోన్నతికి సాధనములు వాస్తవముగా జ్ఞానకర్మ,ఉపాసన,విజ్ఞానములే. మానవులభాష,జ్ఞానములయొక్క పుట్టుకరహస్యమిందుచక్కగా వర్ణించఁబడెను. ఒకేసమయమున నలుగురుఋషులకీ నాలుగు వేదముల జ్ఞానము కలిగినట్లు బోధపడు చున్నది. భారతభూషణ జగదీశ చంద్రబోసునకు,ఇటలీ నివాసి.

యగు మార్కొ-నీగార్లకొకేసమయమున భిన్నభిన్న దేశములలో తీగె లేకుండ విద్యుత్తుచేత ఆకాశమార్గముద్వారా, దూతవలె పనిచేయించవచ్చునని స్ఫురించెను. Russel Wallace కు, డార్విను కును నొకేసమయమున క్రమబద్ధ సృష్టిజరుగుట యుక్తమను సిద్ధాంతము స్ఫురించెను. కావున జ్ఞానకర్మాది విషయములను బట్టి ఋగ్వేదము ముందు, తరువాత యజుర్వేదము పుట్టినవను టకు వీలులేదు. అమెరికా యూరోపు మొదలగు దేశములలో జ్ఞాన కర్మ విజ్ఞానములున్నను సామవేద మచటలేదు. అనగా ఉపాసనా రహస్య మచటి వారికి తెలియదు. గాన వారికింకను మనశ్శాంతి లభించలేదు. మానవజాతి యుండఁగా వేదము లోపించదు. గాని మానవజాతి నశించిపోయినపిమ్మట నీజ్ఞానము, ఈశ్వరజ్ఞానములోను, వేదశబ్దములుఆకాశమను మహా గ్రామఫోనులో నిమిడియుండును. వేద మీశ్వరీయజ్ఞానమగుటచే నీశ్వరునివలెనదియు ననాదియు ననంతమునై యున్నది.

కేవల మడవిజాతిగా తలంచఁబడు మానవజాతుల భాషల యందును, అసభ్యులుగా తలంచఁబడుచు కొన్నిదీవులలో నివ సించువారి భాషలలోను వైదికశబ్దములు వికృత రూపముగా కనఁబడుచున్నవి. ఆదీవులన్నియు కొన్నివందల సంవత్సరముల నుండి నాగరక దేశములతో సంబంధములేకుండ నున్నప్పటికి నంతకుపూర్వము ఘనిష్ఠ సంబంధముండియున్నట్లు వారియం దున్న అవశిష్టసభ్యత, భాష మొదలైనవి స్పష్టపఱచుచున్నవి. విద్యా విశారదుడు మౌనముగనుండియే తన మనోగత భావము లను శబ్దములను వీణె మొదలగు వాద్యములద్వారా బహిర్గత మొనర్చుచుండును.

ఈ యనుభవమును మనమునం దిడుకొనియే మహర్షి దయానంద ఋగ్వేదాది భాష్యభూమికయందు సర్వాంతర్యామి యగుటచే నాయాఋషుల మనములందు నుండెను, గాన మానసిక సంకల్పవికల్పములవలె నక్షరోత్పత్తికి కంఠతాల్వాద్యవయవములతో నవసరము లేకుండఁగనే వారివారి మనస్సులందు శబ్దమయ జ్ఞానమును బ్రకాశపఱచెననియు, తదనంతర మాయాఋషులు ప్రచారమొనర్చి పుస్తకాకారముగా నిర్మాణ మొనర్చిరని యుక్తి ప్రమాణములకు భిన్నము గాకుండ చక్కఁగా వివరించి యుండెను.

ఆసమయమునం దాయాఋషులకు కలిగిన యానందమునకు మేరయుండదని యనుకొనెదము. ఏలయన, వేదము ఛందోబద్ధము గనే రచింపఁబడెనని యందలి ఛందశ్శబ్దము నిరూపించుచున్నది. "ఛది ఆహ్లాదనే" యను ధాతువునుండి ఛందశ్శబ్దము పుట్టు చున్నది. సులభముగా, ఆనందముగా కంఠస్థ మొనర్చుటకు పద్యము లెంతయో అనుకూలముగా నుండును. ఆయాఋషులు సమాధిస్థులగుచున్నపు డాయా మంత్రముల యర్థములను తెలిసి కొనుచుండెడివారు, తదనంతర మితర మానవులకు నుపదేశించు చుండెడివారు. కావున నిప్పుడుకూడ పూర్వమువలెనే సర్వ జనులకు జాతి మత భేదము లేకుండ వేదాధ్యయన మేలచేయ కూడదు? అట్టి పుణ్యకాలము తిరిగి శీఘ్రముగా రావలయునని పరమాత్మను ప్రార్థించుచున్నాము.

వేదములయం దచ్చటచ్చట వాయ్వాది పదార్థములను సంబోధించినట్లు గోచరమగును. అది కవితకొక గమనము.

అంతయు నొకే శైలిగా నున్నచో నంతగా రాణించదు. అలంకారాది భేదములతో విషయభేద ముండును. కావ్యమును రసవంతముగా నొనర్చుటకై ఇంగ్లండు రాజకవియగు టెన్నిసన్ తన కావ్యములందు నద్యాదులు సంభాషించుచున్నట్లు వర్ణించెను. కవిత్వముయొక్క యీ శైలిని తెలిసికొనిన వారికి వైదిక శైలి ఆశ్చర్యమును కలుగఁజేయఁ జాలదు. మానవజన్మను గూర్చి యింతవఱకు స్పష్టముగా చెప్పియుండక పోయినను "బహుమతులు పంచిపెట్టితిమని" యన్నంతమాత్రమున వినువారు త్రిర్ణులైన యోగ్యులకే బహుమతులీయఁబడెనని తలంచుచున్నారుగదా! అటులనే వేదోపదేశములతోపాటు మానవుల పుట్టుకకూడనని తలంచవలయును. ఇదియునుంగాక పై మంత్రమున పశుశబ్ద మన్నిప్రాణుల కుపయోగించఁబడినది. గాన "గ్రామ్యాః పశవః" లో మానవులనుగూడ గ్రహించవచ్చును.

త్రికాలములయందును పరివర్తనముఁజెందనిదే సత్యము-వేదములు, వేదార్థములును సత్యములే. ఎప్పుడైన నగ్ని శీతముగా నుండునని తలంచి, తరువాత నుష్ణముగా నుండునని తెలిసికొనినచో మొదటిది సత్యజ్ఞానమనఁబడ జాలదు. ఏలయన నగ్ని సదా యుష్ణముగనే యుండునుగదా! ఇటులనే వేదార్థము లపరివర్తనీయములు. వేదార్థము నెఱుంగఁగోరుచో సాంగోపాంగముగా చదువవలయును. ఏలయన, వేదము సర్వవిద్యలకు మూలము. యోగికమై వేదశబ్దములు యౌగికములనియు, వేదరచన బుద్ధిపూర్వక కృతియని తెలిసికొనవలయును. అట్లు

గానిచో వేదములయందున్న సత్యవిద్యల నెవ్వరును తెలిసి కొనజాలరు.

ఓం తస్మా దశ్వా అజాయంత, యే కే చోభయాదతః
గావోహజజ్ఞిరే తస్మాత్తస్మా జ్జాతా అజావయః. ౮

అర్థము —తస్మాత్, అశ్వా, అజాయంత = అతని నుండి యశ్వములు జనించెను. యే. కే. ఉభయాదతః = క్రింద మీదపండ్లుగల పశువులు, గావః = గోవులు, హాజజ్ఞిరే = నిశ్చయముగా సృష్టించబడెను. తస్మాత్ అజావయః జాతా = అతనినుండియే మేకలు, గొఱ్ఱెలు, పుట్టెను.

డార్విను జీబ్రావంటి పశువునుండి గుఱ్ఱము, గాడిద, పుట్టినట్లు చెప్పెను. (Professor Ridgeway) ప్రొఫె. రిజీవే యనేక సంవత్సరములను సంధాన మొనర్చి డార్విను వాదమును ఖండించెను. ఈ మంత్రమును క్రింద పైని పండుగల గుఱ్ఱము మొదలగువాటిని, మేకలను, గొఱ్ఱెలను పరమేశ్వరుఁడే పుట్టించెనని చెప్పెను. కావున డార్విను కల్పితవాదము స్పష్టముగా ఖండితమగుచున్నది. మానవజీవితమునకు గుఱ్ఱము, మేక: గొఱ్ఱె, గోవు ముఖ్యాధారములు. గాన విశేషించి వాని నీమంత్రము పేర్కొనెను.

గుఱ్ఱము, గాడిద, ఒకేజాతికి చెందినవికావు. అవి వేఱు వేఱు స్వతంత్రజాతులు. కావుననే యీమంత్రము గుఱ్ఱము పేరుచెప్పియు "ఉభయాదతః" యని చెప్పెను. ఈ రెంటి కలియికచే నొక క్రొత్తజాతిని నడిపించ నడుముకట్టిన ధీరులు తుద

కోడిపోయి ఈమంత్రముయొక్క సత్యోపదేశమునే ఆశ్రయించిరి.

జీబ్రా, కోఁతియును స్వతంత్రజాతులే. ఏలయన నవియునుభయాదతములు. కావున కోఁతి, మానవుఁడు నొకటికావు.

ఓం తం యజ్ఞంబర్హిషి ప్రౌక్షన్ పురుషం జాత మగ్రతః
తేనదేవా అయజన్త సాధ్యా ఋషయశ్చయే ॥౯॥

అర్థ:— యేదేవాః = విద్వాంసులు, సాధ్యాః = యోగాభ్యాసులు, ఋషయః = మంత్రద్రష్టలు, చ = మఱియు, యమ్, అగ్రతః జాతమ్ = మొదటినుండియు ప్రసిద్ధుడైన, యజ్ఞం, పురుషం = పూజ్యవ్యాపకేశ్వరుని, బర్హిషి = హృదయములలో, ప్రౌక్షన్ = ధరించుచు, తఏవ = ఆఋషులే, తేన = వానితో, తమ్ = అతనిని, అయజంత = పూజించిరి.

౭ వ మంత్రమున వేదప్రకాశాంతర్గతములోనే పరమ యోగుల ఉత్పత్తి సూచించఁబడెను. ఈమంత్రమునందు విశేషించి బహువచనము ద్వారా దేవసాధ్య ఋషికోటికి జెందిన మానవుల యుత్పత్తి నిర్దేశించబడెను. ౮ వ మంత్రమున "ఉభయాదతః" యని వానరములలోని పెక్కుజాతులు సూచించఁబడెను. పశువులు కేవలము భోగయోనులు. మానవులు కర్మ, భోగయోనులు, గాన ప్రత్యేకించి యీ మంత్రమున పేర్కొనఁబడిరి. ఈ విధముగా నీ మంత్రమువలన మానవులు స్వతంత్రజాతిగా పుట్టిరనియు, వేదోపదేశము పొందిన నలుగురు ఋషులేగాక అనేకులును, దేవసాధ్యకోటికి చెందినవారును పుట్టిరనియు సిద్ధాంతిత మగుచున్నది.

ఓం యత్పురుషం వ్యదధుః. కతిధా వ్యకల్పయన్.
ముఖం కిమస్యాసీత్కిం బాహూ కి మూరూపాదా ఉచ్యేతే.

అర్థ - యత్, పురుషమ్ కతిధా=పురుషు డెన్నివిధము లుగా, వ్యకల్పయన్, వ్యదధుః=కల్పన చేయబడెను? చేయబ డుచున్నాడు? వాఖ్యానించబడెను? అస్యముఖమ్, కిం ఆసీత్ = ఆతని ముఖమేమై యుండెను? కింబాహూ=బాహువు లేవి? కి మూరూ=ఊరువు లేవి? పాదా ఉచ్యేతే=ఏవి పాదములుగా చెప్పబడుచున్నవి?

పూర్వమంత్రమున దేవసాధ్యఋషి కోటికి చెందినవారు పుట్టిరని చెప్పుటచే వారితరువాత వారికి గలుగు సంతానము ఒకే యోగ్యతగలిగి యుందురా? లేక భేదముండునా? భేద మున్నచో; నాజాతి సుఖముగా నుండుటకై యాభిన్నస్వభావుల కర్తవ్య మేమై యుండవలయును? అనుప్రశ్న యుదయించు చున్నది. మంత్రమునందే స్వయముగ పూర్వమంత్రవర్ణిత ఈశ్వరీయ మానవసమూహముయొక్క ముఖము, బాహువులు, ఊరువులు, పాదము లెవ్వి? యని ప్రశ్నించబడెను. పూర్వ మంత్రమున దేవసాధ్య ఋషిశబ్దములచే భిన్నభిన్న ప్రకృతి గల మానవులు సృజింపఁ బడిరని స్పష్టమగు చున్నది. కావున నీమంత్రమునం దిట్లు ప్రశ్నించఁబడెను. ఇందుపయోగించఁబడిన "వ్యకల్పయన్, ఉచ్యేతే" శబ్దములు అలంకారకల్పనను సూచించుచున్నవి. గాన నలంకార కల్పి తాంగములు నిజమైన యంగములు కాఁజాలవని యెఱుంగ వలయును. కావున నీశ్వరుఁడు సాకారుఁడని యూహించుట

శాస్త్రీయము కాఁజాలదు. ఏలయన నీ వేదమే అ. ౪౦. ౮ వ మంత్రమున "సపర్యగాచ్ఛుక్రమకాయ... ..." యని ఈశ్వరుడు శరీరరహితుఁడని చెప్పెను. ఈశ్వరుడు సాకారుఁడని తలంచువారీ రెండు ప్రశ్నలకు సంతోషజనకమైన సమాధానమీయఁజాలరు. (౧) సర్వవ్యాపకుఁడు సాకారుఁడెట్లు కాగలుగును ? (౨) ఈశ్వరీయ జ్ఞానమగు వేదమం దొకచోట నతని నకాయుఁడని చెప్పి, యింకొకచోట సాకారుఁడని చెప్పఁబడునా? అట్లుగానిచో నీ పురుషసూక్తమందలి ముఖాద్యంగములు కల్పనగాక మఱేమగును ? అలంకారభాషలో మన మొకని సింహమనినంత మాత్రమున నతడు సింహమై తోకగలిగిన వాఁడగునా ? కావున నాలంకారికకల్పనామాత్రముచే నీశ్వరుఁడు సాకారుఁ డెన్నటికిని కాఁజాలఁడు.

ఓం బ్రాహ్మణోఽస్యముఖమాసీ ద్బాహూరాజన్యఃకృతః ।
ఊరూతదస్యయద్వైశ్యఃపద్భ్యాగ్ంశూద్రోఅజాయత ॥౧౧॥

అర్థ:—అస్యముఖంబ్రాహ్మణః ఆసీత్ = అతని ముఖము బ్రాహ్మణులైరి. బాహూరాజన్యఃకృతః = బాహువులుగా క్షత్రియులు చేయఁబడిరి. తద్, అస్య = ఆ, ఇతని, ఊరూ = ఊరువులు యద్వైశ్యః = వైశ్యులైరి. పద్భ్యాంశూద్రఃఅజాయత = పాదములనుండి శూద్రులు ప్రకటితులైరి.

వైదికశబ్దములు యౌగికములు గాన బ్రాహ్మణాదిశబ్దార్థములనుసూక్ష్మముగా విచారించవలయును. రాజన్యుఁడన క్షత్రియుఁడు. క్షతము గాయమునుండి రక్షించువాఁడే క్షత్రియుఁ

డని లోకప్రసిద్ధి. (రఘు_౨-౮౩) "విశప్రవేశనే" యను ధాతు వునుండి వైశ్యశబ్దము పుట్టెను. కృషి వ్యాపారాది కర్మలందును తద్ద్వారా సమస్తదేశములలోను ప్రవేశించుచుండును. గాన వైశ్యుఁ డనబడుచున్నాడు. "శుచశోకే" యను ధాతువునుండి శూద్రశబ్దము జనించుచున్నది. శోకించువాఁడు శూద్రుఁడని తాత్పర్యము. పూర్వ మంత్రమున ప్రశ్నించఁబడిన ప్రశ్నలకు మానవ సమాజమునకు ముఖము బ్రాహ్మణుఁడు, బాహువులు క్షత్రియులు, ఊరువులు వైశ్యులు, పాదములు శూద్రులని ప్రత్యుత్తర మీయఁబడెను.

ఒకయూరిలో కొందఱు మనుష్యులుండిరి. వారిలో నెవ రి కే స్థాన మొసఁగవలయు? నను ప్రశ్నవచ్చిన, వైదికశబ్దములు యౌగికములని యెఱిఁగినవాఁడు తగిన సమాధాన మీయఁ గలడు. బ్రహ్మ= వేదము లేక శుద్ధచైతన్య స్వరూపుని, చదువు లేక యెఱుగువానిని బ్రాహ్మణుఁడనవలయును. అట్టివా రందఱు శరీరమున ముఖ మే స్థానమును పొందియున్నదో దానిని పొంద వలయును. ఆ ప్రజలలో దొంగలనుండి, శత్రువులనుండి కాపా డువారు కొందఱుందురు. వారు బాహువులతో సమానులు. కృషి గోరక్షణ వ్యాపారాదులందు నిపుణులగు వారిని గాంచి వైశ్యులుగా తలంచి ఊరువులకిచ్చు స్థానమివ్వబడును.

తఱచు మానవసమాజములో నీ మువ్వురు తప్ప తక్కిన వారు సదా తామున్న పరిస్థితికి సంతోష పడఁజాలక దుఃఖించు చుండెదరు. వారు శ్రమజీవులగుటచే పాదతుల్యులు. కావుననే వైదిక సంధ్యయందు "తపఃపునాతు పాదయోః" యనియు నింకొకచోట "తపసే శూద్ర" మ్మనియును చెప్పఁబడినది.

శరీరమును సమాజముగాను అంగములను సభ్యులుగాను భావించ వలయును. ఈమంత్రము (౧) యోగ్యతా పరీక్షణమును (౨) సంఘటనమును (౩) భాగపద్ధతిని (Division of Labour) (౪) సహయోగమును (Co-operation) (౫) సమష్టిహాని యున్నతులందు వ్యష్టిహాని యున్నతులున్నవని తలంచ వలయునని యుపదేశించుచున్నది. సమాజ శాస్త్రలేఖకు లందఱు సామాజిక వ్యవస్థకై శరీరమును పోల్చివ్రాసిరి.

యూరోపీయులు 'నోరుగలవానిదే రాజ్య' మని తలంచుచుండెదరుగాని యీ మంత్రము చిన్నపెద్ద యంగములన్నింటిని ఉపమానముగా చూపెట్టి మానవసమాజమునం దందఱకు సమానగౌరవప్రతిపత్తు లున్నవని తెలియఁబఱచుచున్నది.

వర్ణము పుట్టుకతో వచ్చెడిదికాదు. గుణకర్మ స్వభావము వలన నేర్పడెను. ఒకఁడు నాటకమున పాత్రధరించి బ్రాహ్మణునివలె నటించవచ్చును. అంతమాత్రమున నాతఁడు బ్రాహ్మణుఁడు కాఁజాలడని స్వభావశబ్దము చెప్పుచున్నది. ఈవర్ణ విభజన గృహస్థాశ్రమ ప్రవేశ సమయమున సమాజమో, విద్యాపరిషత్తో, రాజ్యాధికారులో చేయుచుండెడువారు. నేటికిని పాశ్చాత్యులుకూడ మన చాతుర్వర్ణ్య పద్ధతుల ననుసరించియే ప్రజాసమూహమును నాలుగు తెగలుగా విభజించుటకు ప్రయత్నించుచున్నారు. అందు ప్యారిసుడాక్టరు జాసెక్ బర్టిలాగారొకరు నేడు భారతవర్షమున సుమారు ౬ కోట్ల ప్రజలు ఆచార వ్యవహారములందు పరిశుద్ధముగ నున్నను, అస్పృశ్యులని దూరముగ నుంచఁబడుచున్నారు. వారందఱు శూద్రవర్ణమునకు

జెందెదరు. మానవుని శరీరమున శూద్రుడైన పాదము అంటు కొనియేయుండ నీ తెగను దూరముగా నుంచుట వివేకముగల కార్యము కాదని యీ మంత్రభావము నెఱిగినవారికి తప్పక గోచరించును.

శరీరమున జ్ఞానేంద్రియములు శిరస్సునం దేకీభవించి యున్నవి. వానివలన విషయములను గ్రహించి ముఖ మాజ్ఞాపించినపుడు బాహువు మున్నగు నితరేంద్రియములు కర్మ యందుఁ బ్రవేశించుచున్నవి. కావున బ్రాహ్మణుని కార్యము జ్ఞానము, వాణి యని విదితమగుచున్నది. శరీరమున కేమాత్రము బాధకలిగినను తన్నివారణకై బాహువులు ప్రవృత్తము లగుచున్నటులే; మానవసమాజపు కష్టదుఃఖములను నివారించువాఁడు క్షత్రియుఁ డనఁబడుచున్నాఁడు. శరీరమునఁగల ముఖాద్యంగములలో నైక్యములేనియెడల సుఖ మేమాత్రమును కలుగఁజాలదు. అటులనే చాతుర్వర్ణ్యము కలసిమెలసి యుండ వలయును.

శరీరమునకు శిరస్సు నాయకుఁడు. మానవసమాజమునకు బ్రాహ్మణుఁడు నాయకుఁడు. కావున నతఁ డతిబాధ్యత గల వాఁడై మెలఁగవలసి యుండును. శరీరాంగములతో వర్ణములు పోల్చఁబడెను. గాన నందు శాసక శాసిత భావము లుండవని స్పష్టమగుచున్నది. వర్ణములందు సేవాభావ ప్రేరితులై పనులు చేయఁబడుచుండును. కావున నిందు శాసక శాసిత భావము లెటులుండఁగలుగును?

కొందఱు పండితులు వర్ణమన రంగని తలంచి బ్రాహ్మణుఁడు శ్వేతవర్ణము గలవాఁడని నిర్ణయించిరి. కాని వర్ణమన స్వీకరణ * గృహస్థాశ్రమమున బ్రవేశించునపుడు వారి వారి గుణకర్మ స్వభావముల ననుసరించి ఒక్కొక్కవృత్తి వరించఁ బడుచుండెడిది. కావున శ్వేతాది వర్ణముల కల్పన నిర్మూల మగుచున్నది. వైదికవర్ణవ్యవస్థనుగూర్చి సవిస్తరముగ తెలిసి కొనుటకుగాను మా గ్రంథమండలిలో వెలువడు "జాతి నిర్ణయ" మను బృహద్గ్రంథముకొఱకు నిరీక్షింతురుగాక! అందు శ్రుతి స్మృతీతిహాసాది ప్రమాణములచే నపూర్వముగా వివరించఁబడును.

వైదికసృష్టి సంక్షేపముగా నింతవఱకు వర్ణింపఁబడెను. ఎప్పటికైనను సత్యమే జయమొందును. గాన వైదిక సిద్ధాంతములే సార్వభౌమికము లగును.

## హార్బర్టుస్పెన్సరు - సృష్టిక్రమము.

ఎఫ్. హావర్డుకాలిన్సు "యాన్ ఎపుటోమ్ ఆఫ్ ది సింథటిక్ ఫిలాసఫీ" * యను తన గ్రంథమున హార్బర్టు స్పెన్సరుగారి గ్రంథముల సారాంశము నుదహరించుచు సృష్టి, స్థితి, లయములను వైదికసిద్ధాంతానుసారమే నిశ్చయించెను.

* "వర్ణోవృణోతేః" అను నిరుక్త ప్రతిపాదిత వ్యుత్పత్తి ననుసరించి వర్ణశబ్దార్థము "వ్రియంతే గుణకర్మాదిభి రితివర్ణాః" | గుణకర్మాదుల ననుసరించి వర్ణించబడున వేవిగలవో యవియే వర్ణములు.

* ఈ గ్రంథమునకు హార్బర్టుస్పెన్సరుగారే భూమిక వ్రాసిరి.

౨వ పరిచ్ఛేదమునం దాతఁడు ఉత్పత్తి, ప్రళయ లక్షణములను గూర్చి యిట్లు వివరించెను. "పదార్థ మెచట నెప్పుడు ఉత్పత్తిదశయందుండునో అప్పు డచట భౌతికాంగములు దాని యందు సంయుక్తమగుచుండును. మఱియు గతికూడ దానికి విశేషముగా కలుగుచుండును. అథవా యేదైన పదార్థమగుచున్నపుడు దానిని చేయుటకై రెండు వస్తువు లధికముగా కావలసియుండును.

౧. భౌతిక సామగ్రి.

౨. ఆ సామగ్రిని నిర్మాణము చేయఁగల గతి లేక శక్తి. తదనంతర మిట్లు చెప్పెను. ప్రళయావస్థలో గతి తన కారణమున లయము కాసాగును. గతి తక్కువయగుటచే జడ పదార్థము లధికముగా క్షీణింపసాగును."

౩వ పరిచ్ఛేదమున ఉత్పత్తిని విశేషముగా వర్ణించుచు దాని లక్షణములను స్పష్టపఱచెను. సామాన్యోత్పత్తితోపాటు ఏదైన నొక పిండముయొక్క యితర భాగములలో గౌణోత్పత్తి యగుచో దానిని విశేషోత్పత్తి యని తలంచవలయును.

౪వ పరిచ్ఛేదమున విశ్వముయొక్క సమష్టిరూపము నుండి వ్యష్టిరూపము యొక్క ఉత్పత్తివఱకు వివరించెను. మఱియు దాని కుదాహరణములుగా విశ్వమున లభించుచున్న వానిని లెక్కించుచు నక్షత్రముల రాసుల ఉత్పత్తివ్యవస్థను; గ్రహమండలి, పృథివి, వనస్పతులయొక్క ఉత్పత్త్యవస్థలను; పశువుల శరీర రచనలను; మానసికనియమములను; సమాజసంఘటనలను చక్కగా వివరించెను.

దీనిని చదివి పురుషసూక్తమును పఠించినవా రందఱు చకితులగుచున్నారు. పురుషసూక్తమునం దున్న విరాట్ రచన, సూర్యచంద్రాది గ్రహముల నిర్మాణము, వనస్పతి, పశ్వాదుల యుత్పత్తి వర్ణన, మానసికోన్నతి నియమములు, మానవసమాజ వ్యవస్థకుఁ జెందిన బ్రాహ్మణాదిక చతుర్భాగములు మున్నగు విషయములను హార్బర్టుస్పెన్సరు తన ఈ లేఖయం దపూర్ణముగా వివరించినటుల గోచరించుచున్నది. ఏలయన హార్బర్టుస్పెన్సరుగారి యీ లేఖయందు పురుషసూక్తమునందు చెప్పఁబడిన ఆది అమైథున సృష్టి, ఆదిశబ్దమయ జ్ఞానప్రకాశ మానవమాత్రున కొకే మార్గమగు ముక్తిధామపు వర్ణన మున్నగు విషయములయొక్క వాసనకూడ లేదు. బ్రాహ్మణులను పురుషసూక్తభక్తులని యుపహాసముచేయుచున్నవా రిపుడు హార్బర్టుస్పెన్సరుయొక్క ఈవాక్యములను విచారించుచో నపూర్వమైన యాదరముతో పురుషసూక్తమువైపున కాకర్షితులగుదురు. ఏలయన పురుషసూక్తమున సారగర్భితరీతిగా పూర్ణరూపమును దాల్చినవిషయము లన్నియు తెలుచుగా హార్బర్టుస్పెన్సరుయొక్క ఫిలాసఫీకి ఆధారస్తంభము లగుచున్నవి. కాని యీ ఫిలాసఫీకి ఇంకను పై 3 త్రుటులవలన పూర్ణమనఁబడఁజాలకున్నది.

౧౨. వ పరిచ్ఛేదమున స్పెన్సరు ఉత్పత్తికి తరువాత శక్తులయొక్క సమస్థితికారణమున స్థితి (యవస్థ) ప్రాప్తమగుచున్నదని నిరూపించెను.

ఉత్పత్తికి దరువాత స్థితి యవసరమను నీసిద్ధాంతము నింకను భారతీయులు మఱువలేదు. వేదములు, ఆర్షగ్రంథము లీసిద్ధాంతములతో నిండి నిబిడీకృతమై యున్నవి.

౧౩. వ పరిచ్ఛేదమున స్పెన్సరు ఉత్పత్తి కంతిమసీమ యగు ప్రళయమును వర్ణించుచు ప్రళయ నియమము విశ్వవర్తి యనియు, గతిమంతమగు ప్రతిజడపదార్థ మీనియమమువలననే విశ్రాంతదశకు చేరుచున్నదనియు స్పష్టపఱచెను. సజీవశరీరుల దశలో నానియమమును మృత్యువనుచున్నారు. సూర్య, చంద్ర, నక్షత్ర, పృథివ్యాదుల దశలో నా నియమమే ప్రళయ మనబడుచున్నది. ఆర్షగ్రంథములు పృథివియొక్క ఆయువు నియతమని విశ్వసించుచున్నవను టందఱకుం దెలియును. దానిని కల్ప మనుచున్నారు. ఈ కల్పభావ మిప్పటికిని పాశ్చాత్యపండితులకు తెలియలేదు. ఇచట "రూపాంతరముల చక్ర మీ విధముగా పూర్ణమగుచున్న"దని చెప్పి యనుభవము చేసికొని రనుకొందము.

౧౪. వ పరిచ్ఛేదమున ఉత్పత్తి, ప్రళయచక్రము కేవలము విశ్వవ్యాపకమగుటయేగాక నిత్యమైయున్నదని నిర్ణయించిరి. ఈ సత్యసనాతనసిద్ధాంతముచే ఆదిసృష్టిలోని ఆర్యప్రజలు వేదముద్వారా తెలిసికొనియుండిరి. దీనినే ఆర్షగ్రంథములు మండన మొనర్చుచున్నవి. అహో! పురుషసూక్తముయొక్క "అభవత్పునః" పురుషఏవేదగ్ంసర్వం యద్భూతం యచ్చ భావ్యమ్" అను శబ్దము లెంత యుత్తమరూపముగా నీ మర్మము కథనముచేయుచున్నవి ?

"కొందఱీపృథివి, సూర్యాదులెపుడు నిర్మాణమయ్యెనో తెలియదనియు,నీప్రపంచ మిపుడున్నటులే పూర్వముండెననియు, సదాయిటులే యుండుననియును, మఱికొంద ఱీ భూమి సూర్యాదులు నిర్మించబడెననియు, నిపుడున్నవిగాని ప్రళయముజెంది తిరిగి యెన్నటికిని పుట్టవనియు నుడువుచుందురు. ఈయిరు తెగల వారిని స్పెన్సరుగారియుపర్యుక్త లేఖ (వ్రాత.) మేలుకొలువును. అనఁగా అనాదికాలమునుండి యనంతకాలమువఱకు నుత్పత్తి, స్థితి, ప్రళయ మను చక్రము నడుచుచుండును. దీని కాద్యంతములు లేవు. ఇదినిత్యము, విశ్వవ్యాపకమునై యున్నది. ఈ నియమమే సర్వత్ర పనిచేయుచుండెను."

వేదాది శాస్త్రవేత్తలు హార్బర్టుస్పెన్సరు కూడ వేద మర్మములను దెలిసికొనగలిగెనని యనక మానరుగదా !

# పరిణామవాదము యొక్క పుట్టుక

పరిణామవాదమును బాగుగా విమర్శించినపిమ్మట నింత దుర్బలవాదమెందులకు జనించెను? పెద్దపెద్దవిద్వాంసులు దీని నేలయామోదించిరి? దానినిగూర్చి గొప్పగొప్ప గ్రంథము లెందులకు వ్రాయఁబడెను? ఇంచుమించుగా విశ్వవిద్యాలయము లన్నిటియందు దాశిక్షయే ఏల కఱపఁబడుచున్నది? మున్నగు ప్రశ్నలనేకములు సముద్రతరంగములవలె పైబడి వచ్చుచుండ వచ్చును. నిజమే. ఇంతనిరాధారమైన వాదమునకింత విస్తృతస్థాన మెట్లు లభించగలిగె? నని విభ్రాంతి జెందెదము. కావున నీవాదపు పుట్టుకనుగూర్చి యించుక విచారింతము.

వైదికాదర్శము, శిక్షాదీక్షలు సన్నగిలిన కొలందియు ప్రజలలో సోమరితనము, స్వార్థపరత్వము ప్రబలసాగెను. సోమరులుస్వార్థసిద్ధికై అనేకమాయోపాయములుపన్నసాగిరి. ఇప్పుడు కూడ ప్రజలలోవ్యాపించియున్న యశాంతికి ప్రబలమైనకారణము ఛలకపటములే గదా! మధ్యయుగమున విద్యా విజ్ఞాన ప్రచార ములు పూర్తిగా అడుగంటెను. మొదటినుండియు పరముఖాపేక్ష యై యున్న యూరోపుస్థితి మిక్కిలి శోచనీయ దశకు వచ్చెను. ఒకవంక అంధవిశ్వాసములకు పుట్టినిల్లైన బైబిలుసామ్రాజ్యము సాధారణప్రజల హృదయములపై బాగుగా నాటుకొనిపోయెను. ఇంకొకవైపున పోపులు తమనిరంకుశాధికారమును ప్రయోగించి ప్రజలలో కొంచెము తలపైకెత్తు ధీరులను, విద్వాంసులను బరి మార్చ నారంభించిరి.

క్రీస్తు శిలువపై నెక్కించఁబడినపుడు " Ch. father forgive them for they know not what they are doing" అనియెను. కాని యాతని శిష్యులు, అనుయాయులు, సహన, శీల, శాంతి గుణములను గోల్పోయి ఆత్మబల శూన్యులయిరి. పవిత్రమైన స్వచ్ఛమైన ఆస్తికత్వమును తెలిసికొనఁ జాలక పోవుటచే పాపములు క్షమించఁబడగలవను దురహంకారముతో క్రిందుమీదుగానక ప్రవర్తింపసాగిరి. అంధ విశ్వాసులలో మొదటివారగుటచే సమస్తవిషయములకు విద్యావిజ్ఞానములకు విరుద్ధముగానుండు తల తోఁకలేని గాధలతో నిండియున్న బైబిలునే స్వతః ప్రమాణముగా నెంచసాగిరి.

పరిమితిలేని దీవిశ్వము. సంసారముపరిమితిగలదనిన ఈశ్వర శక్తికి ప్రతికూలించునని చెప్పినంతమాత్రమున బ్రూనోమహాశయుని క్రీ. శ. ౧౬౦౦ ఫిబ్రవరి ౧౯ వ తేదీ ఉదయమున బ్రతికియుండఁగనే చితిపైఁబెట్టి రోము నగరమునచిత్రవధఁజేసిరి.

పైడ్వా యూనివర్సిటీ గణితశాస్త్రాధ్యాపకుఁడును ( Selescope ) దూరదర్శకయంత్రమును కనిపెట్టినట్టి మహాత్ముఁ గెలీలియోకు క్రీ. శ. ౧౬౧౦జనవరిలో యావజ్జీవకారాగారశిక్ష విధించిరి. అతని తప్పిదము కేవలము బైబిలుసిద్ధాంతమునకు వ్యతిరేకముగా భూమిగుండ్రముగానుండి తిరుగుచున్నదని చెప్పుటయే.

క్రీ. శ. ౧౯౪౫ లో విజ్ఞాననిధియైన హైపేశియా యను స్త్రీని ఉపన్యాస మిచ్చుచుండఁగనే వేదికపైనుండి దిగలాగి చిత్రవధఁగావించిరి.

౭౮౪ లో సాల్సుబర్గులో Viregilius (విరిజిలియస్) అను నతఁడుండెడివాఁడు. అతఁడు (Anipodes) పాతాళ దేశమున్న దని చెప్పినందులకు శిక్షితుఁడయ్యెను.

౧౩ వ శతాబ్దమున (Frair Bacon) అను రసాయన శాస్త్రనిర్మాణ కర్తను, సైతానుతో సంబంధముగల వాఁడని జైలునం దుంచిరి.

అరబ్బు దేశీయుఁడైన "అవరీయు" డను వైద్యుఁడు క్రైస్తవుఁడై యూరోపులో నుండసాగెను. మందుల మహిమచే నాతడు ప్రజలచే బహిష్కరించఁబడెను. ప్రజ లాతని దగ్గఱకు రావెఱచు చుండెడివారు. వేయేల క్రీ. శ. ౧౭౦౦ వఱకు యూరప్పులో దెబ్బతగిలితే కత్తికే మందు వేయుచుండెఁడు వారు.

ప్రప్రథమమున పాశ్చాత్య దేశములలో ఆల్జెబరా ప్రచార మొనర్చిన జర్వర్డుయొక్క బుద్ధిచాతుర్యమున కచ్చెరు వంది సైతానుతో సంబంధముగల వాఁడని ప్రజ లాతని దగ్గ ఱకు వచ్చుటకు భయపడు చుండెడివారు.

ఒకప్పుడు బైబిలు వ్రాయఁబడి ప్రాన్సులో ౫౦౦ క్రౌనులకు విక్రయించఁబడు చుండెడిది. Dr Faust యను జర్మనీయుఁడు మొట్టమొదట బైబిలు నచ్చువేయించి ౬౦ క్రౌనులకు విక్రయించెను. పుస్తకము లన్నింటియొక్క సమానాకృతి, లిపులను గాంచి ప్రజలు భయభీతులై పోలీసులకు తెలియఁజేయఁగా పోలీసువా రాతని యింటిని సోదాచేసి యెఱ్ఱసిరాను గాంచి

రక్తమని భ్రమపడి డాక్టరుగారిని ప్రారిసు జైలునకంపిరి. ఇంతియగాక సాంప్రదాయ దృష్టులతోకూడ ననేక ఖూనీలు జరిగియుండెను.

కేవలము అష్టమహేనరీ యిరువుర క్యాథలిక్కు రాణులను, ౧౨ మంది రాజులను, నవాబులను( Duky and earls) ఒక క్యాథలిక్ ప్రధానమహంతును, ౨౦ బిషప్పులను, ౫ వందల మహంతులను, ౭ వేలు ఇతరులను చంపించెనని చెప్పియుండెను.

క్రీ. శ. ౧౫౮౩ - ౧౬౦౩ మధ్యలో ౨౩౨ క్యాథలిక పాదరీలును కొన్నివేల స్త్రీపురుష బాలబాలికలును మిక్కిలి క్రూరముగా వధించఁబడిరి.

మహారాణి మేరీ ౪౩ గురుప్రొటెస్టంటు బిషప్పులను, ౨౮౦ మంది యితరులను నిలువున కాల్పించెను.

క్రీ. శ. ౧౬౪౧లో ఐర్లండులోనే యొకపోపు ఆజ్ఞవలన ౨ లక్షల ప్రొటెస్టెంట్లు చిత్రవధఁగావించబడిరి.

ఈవిధముగా లెక్కలేని దురాచారములు. అత్యాచారములు, స్వార్థులచే మతము, దేవుఁడు అని అడ్డుపెట్టుకొనఁబడి నిరాటంకముగా సాగించబడినవి. తుదకు వానిని నిరోధించుటత్యంతావసరమై యున్నదిగాన నెమ్మది నెమ్మదిగా విజ్ఞానవేత్తలు, స్వార్థపరుల నిరోధించసాగిరి.

నెప్ట్యులర్ థ్యూరీని కనిపెట్టినట్టియు, ప్రసిద్ధ దేశతత్వవేత్తయు నైన లాప్లాసు తనగ్రంథమున దేవుని పేరెత్తకపోవుటయేగాక బైబిలు దేవుని సృష్టిరచనను ఖండించెను.

జర్మనీదేశపు తత్త్వవేత్తయైన నిట్చేగారును ఎలుగెత్తి " There escists no God in the world and if there beany; we must abolish him altogether యని మిగుల ధైర్యముగ చాటించెను.

తదనంతరము క్రీ. శ. ౧౯౦౦ లో ప్రొఫెసర్, హైకల్ తన Riddle of the universe యను గ్రంథమున దేవుఁడున్నాఁడను విషయమునకే పూర్తిగా స్వస్తిచెప్పెను.

ప్రఖ్యాతిజెందిన వార్థలోటు అను విద్వాంసుఁడు క్రీ. శ. ౧౯౦౧ జనవరి ౧౧ వ తేదీని ప్యారిసుపట్టణమున The day of Religion has passed away. It must now be replaced by science " ధర్మపురోజులు పోయెను. దానిస్థానము విజ్ఞానమున కీయవలయున "ని యనెను.

( Cristian Evidence ) క్రిస్టియన్ ఎవిడెన్సు సొసైటీ యిట్లు ప్రశ్నించెను.

ప్రశ్న — " Do you think that science negatives the ideas of a personal God as thought by jesus Crist?"

యేసుద్వారా ప్రతిపాదిత ఈశ్వరవాదమును విజ్ఞానము ఖండించుచున్నదని మీరు తలంచుచున్నారా ?

దీనికి ప్రత్యుత్తరపూర్వకముగా మిస్టరు C. S. మిడిల్‌మిస్. F. R. S. C. I. E. గా రిట్లు నుడివిరి. Yes, Such anthropomorphism is childish.

" అవును మానవునిబోలు ఇటువంటి ఈశ్వరుని కల్పన కేవలబాలిశమువంటిది. అదెన్నటికిని మాన్యము కాఁజాలదు. "

ప్రొఫెసర్, జె. బి. కోహన్ F. R. S D. Sc. L. L. D.F. C. S.గారు I think it does, assuring the personal God to have human attributes, " P( 85)

"క్రీస్తుయొక్క మానవగుణములతోఁగూడిన యీశ్వర వినియిక కల్పనను విజ్ఞానము ఖండించుచున్నదని నే నెఱుగుదు నని జవా బొసగిరి."

"డాక్టరు ఆల్ఫ్రెడ్ రైఫ్ F. R. Sc. D. D. Sc. Ph. D. గారుకూడ క్రైస్తవ ప్రార్థనామందిరములలోనియీశ్వరకల్పనను విజ్ఞానము ఖండించుచున్న దనెను."

ఈ విధముగా వైజ్ఞానికు లందఱు బైబులును, బైబిలులోని సాకారేశ్వరవాదమును నిరోధించుటకు ప్రబలప్రయత్నము లొనర్చిరని స్పష్టమగుచున్నది.

ఇట్లు బహుతీవ్రముగా నాస్తికాందోళన పెంపొంద సాగెను. ఆరోజులలో బ్రతికియుండఁగనే విజ్ఞానవేత్తలు ఘోర నరకబాధల ననుభవించిరిగదా! వాని కన్నింటికి మూలము స్వార్థపరత్వమే. కనుక నానాఁటి స్వార్థపరులగు యూరోపీయ క్రైస్తవసమూహమునకు తగినప్రతీకార మిదియే. ఈ విధముగా విజ్ఞానవేత్తల యాధిక్యము వృద్ధిపొందినకొలది గుళ్లలోని బిషప్పులు, పాదరీలుసహితము క్రీస్తు కన్యయగు మరియకు పుట్టలేదనియు, చనిపోయిన మూఁడుదినములకు లేచెననెడుమాట శుద్ధాబద్ధమనియు నగారామీఁద దెబ్బవేసి చెప్పుచున్నారు. ఇఁక మనబోఁటివారు బైబిలును గౌరవించి కన్య మరియకు

పుట్టినందువలననే క్రీస్తుకు గొప్పతనమీయవలసిన యగత్య మేమియుండును ? మరియు క్రీస్తు నెటుల కనినది మా "క్రీస్తు జననము" అను గ్రంథమును చూచిన స్పష్టముగ తెలియ గలదు.

వైదికసభ్యత తత్సిద్ధాంతములు యూరోపులో లేవు మఱియు నాయా విద్వాంసులకు వైదికసాహిత్యముం జూచు భాగ్యము లభించలేదు. గనుక ఏోఘ్రల నెదిరించుటయే ముఖ్యా శయముగా బెట్టుకొని వారటు పరిణామవాదన యను నొక పంథాను లేవదీసి బలపఱచప్రయత్నించిరి. సత్యమే స్థిరముగా నుండునుగాని, అసత్య మెట్లు నిల్వబడగలదు ? కావున నూతన కల్పనాసృష్టి యగు పరిణామవాదము కూడ తిరోహితము కాసాగెను.

# అసంభావ్యకల్పనలకాధారము

పాఠకమహాశయులారా! ఇంతవఱకు చదివినవారు పరిణామవాదము కేవలము కల్పనాసృష్టియను సత్యమును స్వీకరించుటకు వెనుదీయరని మా తలంపు - ఐనను మమత, అజ్ఞానము, పక్షపాతము వేళ్ళుపాతుకొనియున్న సరసు లనేకులు నివ్వెఱపడుచు "గోముఖవ్యాఘ్రములైన పాపులను, విద్యావిజ్ఞాన రహితమైన బైబిలును, ఎదిరించుటకు విజ్ఞానవాదులు నడుముకట్టి యుండిన నుండవచ్చును. కాని అత్యాచారమునకు ప్రతికారమొనర్చుటయే ముఖ్యకర్తవ్యమగుచో నింకను ననేక పంథలను త్రొక్కఁగలుగుదురే ? అటులొనర్పక విద్వాంసులీవాదమును బలపఱచుచున్నారనిన నందు తప్పక సత్యముండితీఱవలయును. విమర్శకు లద్దానిని గ్రహించఁజాలక పోవచ్చును. నిజముగా విమర్శకులు చూపిన బలహీన పరిణామవాదమును పెద్ద పెద్ద తలలు తలపడి నిలువబెట్టుచున్నవనిన మాకు నాశ్చర్యముగా నున్నదని" యనెదరు.

మానవుఁడు తన కల్పనలను, తన పూర్వసాహిత్యమును, అనుభవమును, శిక్షాదీక్షుల నాధారముగాఁ జేసికొనియే క్రొత్తభావములకు దోహదమీయ ప్రయత్నించును. స్వప్నములు సైతము తాను చూచిన, వినిన, చదివిన ఘటనలమీఁద నాధారపడియుండును. అవి క్రమముతప్పి రావచ్చును. కాన అసంభవములుగా తోఁచుచుండవచ్చును. వాస్తవముగా వాని యన్నింటి సంస్కారములు మనస్సుపై శేషించి సమయము దొరకినపు డవి

నమ్మకమునకు వీలుగానంతగా ఆశ్చర్యమును గొలుపునట్లుగా క్రమ రహితములును, అసంభవములు నగు ఘటనలుగా స్వప్నమునం దగపడుచుండును.

సత్యమనగా సర్వకాల సర్వావస్థలయందు సమస్తదేశ ములలో నిరాటంకముగా స్థిరముగా నుండునది. త్రికాలాబాధిత మగు సత్యము పరివర్తనా రహితము. మార్పునకు స్థానమున్నంత వఱకు సత్యమనుటకు వీలుకాదు. మార్పుచెందు పదార్థములను, భావములను సత్యములని భావించుటగాని. అట్టివి మార్పు చెందుటగాంచి 'సత్యాలు నిత్యాలుగావని' చెప్పుకొనుటగాని యవివేక మనందగును. సత్యమెప్పుడైనను రూపాంతర మొందు చుండెనన 'అసత్యములును,అజ్ఞానములునైన కొంత మసాళాతో' పుటము వేయబడినపుడే అట్లు సంభవించుచున్నది. *

సాధారణముగా ప్రపంచమునందలి మతములన్నియు యమ నియమముల నన్నింటిని నను నచ లేకుండఁగనే స్వీకరించు చున్నవి. స్వీకరించును.మానవసాహిత్యమున మొట్ట మొదట వీని శిక్షనొసఁగినది వైదిక సభ్యతయే. వైదికసభ్యతయం దవినేటికిని నిర్మలముగానున్నవి. సత్యము, అహింస, అస్తేయము, బ్రహ్మ చర్యము, అపరిగ్రహ మని యమ మైదువిధములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము,

* సత్యశబ్దార్థమిది కనుకనే సత్యమనగా ఏమియో తెలిసికొనుటకై భట్టమోక్షముల్లరు వేలకొలది పుటలుగల గ్రంథములను తిరుగవేసి గ్రహించు కొనఁజాలక పోయెనట. సంస్కృతములో దీని వ్యుత్పత్తి తెలిసికొనిన తర్వాత సర్వసందేహములు నివృత్తములగుటచే సత్యశబ్దదాసుఁడయ్యెను.

ఈ ౯ నియమములు. వీనిని సర్వమతములవారేకగ్రీవముగా స్వీకరింతురు. కాని కొన్నిమతములు పరస్పర ప్రాణఘాతకులుగా ప్రవర్తించుచున్నవి కదా ! సిద్ధాంత మొక్కటేయైనను ప్రతీకారభావ మెటనుండి వచ్చుచున్నదో ఆలోచించుఁడు.

ప్రపంచమునందున్న మతములలో హిందూ, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయాది మతములు విశాలకాయము గలిగి యున్నవి. వైదికసభ్యతయొక్క రూపాంతరమే హిందూమతము. ఇది శుద్ధవైదిక సభ్యతకు మిక్కిలి చేరువలోనున్నది. తక్కిన వానిలో నీమూలసిద్ధాంతములున్నను ఒక్కొక్కవ్యక్తికి గౌరవ మియ్యబడియున్నది. యమ నియమములను వారిమతములనుండి తొలఁగించినను భిన్నమేమియు కలుగనంత యాధిక్యము వారి ప్రత్యేకవ్యక్తి కియ్యబడెను. పంచఁబడుటచే వేరైపోవుట కాధారమగు నాయావ్యక్తులను అనఁగా క్రీస్తు, మహమ్మదు, బుద్ధులనుతొలగించిన నాయామతముల యస్తిత్వమే యుండదు. వైదికమత మటులొక పురుషునిపై నాధారపడి యుండలేదు. కాన రామకృష్ణాదుల చరిత్రలు లోపించినను వైదికమతమున కేమాత్రము భిన్నతకలుగఁజాలదు. యమ నియమములే దీనికి ప్రాణము. అవిపోయినచో నిది నిర్జీవము.

పాఠకులారా ! సత్యమెట్లసత్యముచే నాచ్ఛాదితమై కాలాంతరమున నెట్లు రూపాంతరమునొంది విస్తరించెనో గమనించుఁడు. ఇపు డాయసత్యములను మనము రూపుమాపఁజాలము గదా !

ఇటులనే పరిణామవాదమునందును కొంచెము సత్యము లేకపోలేదు. దాని నచ్చటచ్చట పేర్కొనియే యుంటిమి. పరిణామవాదులైన నాస్తికులయొక్క నవీనకల్పిత ప్రపంచమునకుగూడ నాధారము లేకపోలేదు. న్యాయైక బుద్ధితో విచారించినచో నే బైబిలును రూపుమాప ప్రయత్నించిరో, ఆ బైబిలే వారికిమూల మని బోధపడక మానదు.

వైదిక సాహిత్యమునకు మూలమగు వేదమందు సమస్త విజ్ఞానము ఉపదేశించఁబడినది. బైబిలునం దట్లుగాదు. బైబిలునందు వర్ణించఁబడిన దేవుఁడు మానవాకారముగలిగి పరిమిత శక్తిగలవాఁడై మనవలెనే లోభ క్రోధ కామ మోహాదులు గలిగి అజ్ఞానావృతుఁడై యుండెను. కావుననే తనచే రచించబడిన ఆదాము, హవ్వలను జ్ఞానవృక్షపు పండ్లను తినవలదని విధించెను. ఐకమత్యముతోఁ గూడియున్న ప్రజలలో భాషలను వేఱుచేసి చెదఱగొట్టెను. భక్తులను పరీక్షించఁగోరి పసిబిడ్డలను బలిగా గోరెను. పాపపరిహారార్థముపేర వేలకొలది సెలపెయ్యలను, కోడిదూడలను, బలిగా గోరెను. పొరుగువానిని నీవలెనే ప్రేమించుమని బోధించుచు నితరులను మీచేతికొప్పగించిన వెంటనే వారిని హతమొనర్చుమని ప్రేరేపించి హితీయులు, కనీయులు మొదలగు పన్నెండు వంశీయులను హతమొనరింపఁజేసెను. ఇశ్రాయేలీయుల దేవుఁడనని చెప్పుకొనుచు వారిమేలు కోరుచున్నటుల వారిని ఐగుప్తు దేశము నుండి బయలుదేఱదీసి సీనాయి యరణ్యములో ననేకవిధములుగా శపించి కోపించి వారి వందలను మట్టిపాలు చేసెను.

విజ్ఞానవాదు లధికముగా క్రైస్తవమతములో పుట్టి పెరిగిరి. అప్రయత్నపూర్వకముగా వారికి బైబిలు విషయములు తోఁచుచుండెడివి. బైబిలునందు బట్టలుకట్టుకొనుట, నిప్పు, నీరు నుపయోగించుకొనుట యెఱుంగని ఆదాము, హవ్వలతో సృష్టి ప్రారంభమయ్యెను. క్రమక్రమముగా వా రభివృద్ధిపొంది నాయకుఁడు, న్యాయాధిపతి, రాజులు అని సంఘనియమములలోనికి వచ్చిరి. రాతికత్తులతో సున్నతిచేసికొనిన ఇశ్రాయేలీయులు వెండి, బంగారములతో తమదేవునకు గుళ్ళుగోపురములు కట్టుకొను సభ్యతకు వచ్చిరి. చూచిన పొరుగువానిని చంపుజాతి దయాదాక్షిణ్యముల నలవఱచుకొనెను. కోడలిని, కూతును, సోదరిని, తల్లిని, పశువులను, పురుషులను సంగమించుజాతి వివాహము - భార్య, భర్త యను నియమమునకు వచ్చెను. * గనుక విజ్ఞానవాదులు బైబిలులోని యీవిజ్ఞాన క్రమోన్నతినే ఆధారముగాఁ జేసికొని యింతగా పరిణామవాదమును పోషించుకొనిరి. పాపము వారికి బాహ్యప్రపంచములో సంపర్కమున్నది ఒక్క బైబిలుతోనేగదా! తల తోఁక లేని బైబిలుకథలను నమ్మి యింత వివేకహీనమైన పరిణామ వాదనను లేవఁదీసిరి. వారికి శుద్ధమైన వైదికసాహిత్య సంపర్కమున్నచో నెంతయో లోకోపకారమొనర్చి యుండెడివారు.

---

* ఇత్యాది విషయములన్నియు నధికముగ తెలిసికొనఁగోరువారు "మా గ్రంథమండలినుండి వెలువడు దేవదూతదర్పణ"మను గ్రంథమును చూడుఁడు.

# మహాత్మా
# నారాయణ స్వామిజీ పరిణామవాదము

మానవుని స్వాభావికజ్ఞానము పశువులకంటె తక్కువ. గోవు మొదలగువాని దూడలు స్వాభావికముగ నీఁదుట నెరుంగును. కాని మానవుఁడు నేర్చుకొనకుండమాత్ర మీఁదజాలఁడు. మానవుఁడు నైమిత్తికజ్ఞానమును పొందుటకు, పొందినదానిని వృద్ధిజేసికొనుటకును యోగ్యతగలవాఁడు. ఇదియే మానవునియందున్న విశేషము. ఈ నైమిత్తికజ్ఞానమే మానవుని భిత్తిని పైకి లేపుచున్నది. ఈ యోగ్యతాభావమే సాధారణముగా పశువులయొక్క ఉన్నతికి అడ్డు తగులుచున్నది.

## స్వాభావిక జ్ఞానము - నైమిత్తిక జ్ఞానము

స్వాభావికజ్ఞానము జన్మసిద్ధము. ఇతరులనుండి పొందఁబడునది నైమిత్తికజ్ఞానము. నేఁడది తల్లి, తండ్రి, అధ్యాపకవర్గముద్వారా పొందఁబడు చున్నది. కాని ఆదిసృష్టిలో ప్రపంచమునకు మొదటి వంశమనఁబడిన అమైథున సృష్టిలో జనించిన కారణమున దాని కేదైన శిక్షనొసఁగి నైమిత్తికజ్ఞానమును కలుగఁజేయువాఁడు (తల్లి - దండ్రి లేక గురువు.) లేనపుడు దాని కాజ్ఞాన మేవిధముగా లభ్యమయ్యెను? ఈ ప్రశ్నకు సమాధానము లభింపజాలక పోవుటవలననే ఈశ్వరీయ జ్ఞాన ప్రాప్తియొక్క కల్పన చేయఁబడుచున్నది. ఈ కల్పనయొక్క సంకే

తము "సఏష పూర్వేషామపి గురుః కాలే నానవచ్ఛేదాత్ "*
అను నీ యోగదర్శన సూత్రమున చేయఁబడెను.

### ఋ షు లు ద్వి వి ధ ము

దేవ్యఋషి, శ్రుతఋషి యని ఋషులు రెండువిధములు. వేదము ప్రకాశితమైనవారు దేవ్యఋషులు. వారు అగ్ని, వాయు, ఆదిత్య, అంగిరసులు. దేవ్యఋషుల వలనను, తమకు పూర్వపు శ్రుతవిషయముల నుండియు, శిక్షనుపొంది ఋషు లగుచున్నవారు శ్రుతఋషులు. ఈ ద్వివిధఋషులు పూర్వ, నూతన ఋషులనికూడ ననఁబడుచున్నారు. ఎట్లన—

అగ్నిః పూర్వేభిర్ ఋషిభి రీడ్యో నూతనైరుత
స దేవాం ఏహావక్షతి ॥ ఋగ్వే. ౧. ౧. ౨.

అనఁగా నాయగ్ని, ఈశ్వరుడు, పూర్వ (దేవ్య) నూతన (శ్రుత) అను ద్వివిధఋషులు స్తుతించుటకు యోగ్యుడు. దేవ్యఋషులయొక్క ప్రాదుర్భావము సృష్ట్యాదియం దొక్క పర్యాయము మాత్రమే జరుగును. వారు మాటి మాటికిని పుట్టరు. కాని శ్రుతఋషులు మాటిమాటికి పుట్టుచుందురు. కావుననే వేదమున మానవులు శ్రుతఋషియోగ్య పుత్రులు జనించుటకు ప్రార్థనచేయు విధానము చెప్పబడియున్నది.

సుబ్రహ్మాణం దేవవన్తం వృతంతమురూం
గంభీరం పృథువుధ్నమిన్ద్ర

శ్రుతఋషి మ్రుగమభి మాతిషాహ
మస్మభ్యం చిత్రం వృషణంరయిన్దాః.

ఋగ్వే ౧౦-౪౭-౩.

"హేఇంద్ర! మాకు వేదప్రేమ, దైవభక్తి గలిగినట్టియు, నుదారుడైనట్టియు, విశాలహృదయము గలిగినట్టియు, గంభీరమైనట్టియు, వ్యాపించిన యశముగలిగినట్టియు, తేజస్వియైనట్టియు, (ఇంద్రియరూప) శత్రువుల నణచునట్టియు, విచిత్రశక్తిశాలియైనట్టియు, శ్రుతఋషి పుత్రునొసగుము."

యోగసూత్రమున చెప్పబడిన "పూర్వేషామ్" శబ్దముయొక్క అర్థము దేవ్యఋషులనియే. మఱియు నీ దేవ్యఋషులకును, ఈశ్వరుడే గురువని చెప్పబడినది. జగత్తు ప్రారంభమున జ్ఞాన (నైమిత్తిక)ము ఈశ్వరునిద్వారా లభించెను. ఈ సిద్ధాంతము సృష్ట్యాదినుండియు, డార్విను వఱకు సర్వసమ్మతిగా విశ్వసించబడి వచ్చుచుండెను. ఈ సిద్ధాంతము సర్వసమ్మత మగుటలో డార్విను తన పరిణామవాదముద్వారా ఆపత్తిని కలుగజేసెను దానివివరణ మీ విధముగనున్నది.

## పరిణామవాదము.

మానవుడు యోనిపరివర్తనము ద్వారా పశువునుండి మానవుడయ్యెనని డార్విను శిక్షగఱపెను. అతడు యోనిపరిణామక్రమము నీ విధముగా తెలియజేసెను.

౧. మొదట నొక కోష్ఠముగల అమీబా మొదలగు జంతువులు పుట్టెను.

౨. తదనంతరము ఆదిమమత్స్యము.

౩. ఆ తరువాత శ్వాసనాళములు గలమత్స్యములు.

౪. ఆ తరువాత సరీసృపములు=కప్ప మొదలగు జలచర జంతువులు.

౫. ఆ తరువాత స్తన్యజంతువులు.

౬. ఆ తరువాత అండజ స్తన్య జంతువులు.

౭. ఆ తరువాత పిండజ=అజరాయుజ స్తన్య జంతువులు.

౮. ఆ తరువాత జరాయుజ స్తన్య జంతువులు.

౯. ఆ తరువాత కింపురుషులు,=కోఁతి, అడవిమనిషి, పలుచని ముక్కుగల అడవిమనుష్యులలో మొదట తోఁకగల కుక్కుటాకారములు, తరువాత తోఁకలేని వానరాకారములు. తరువాత వానరాకారపుటడవి మనుష్యులలో నింతవఱకు తెలిసికొనఁబడని యేదో లుప్తశాఖనుండి మూఁగమనుష్యులు, తదనంతరము తుద కీమాట్లాడు మనుష్యులు జనించిరి. డార్విను ఈ యోనిపరిణామముతోఁపాటు మానసిక పరిణామ (mental evolution) కల్పనను గూడ చేయుచు మానవునకు నే నిమిత్త పురుషునితోఁడను నవసరములేకుండఁగనే స్వతః క్రమక్రమముగా జ్ఞానము వృద్ధి యగుచున్నదని ప్రకటించెను.

పరిణామవాదమునఁ గల యాక్షేపణలు.

౧ – ఒకపరిణామ వాదియగు ప్రాణి శాస్త్రజ్ఞుని మతానుసారము ఉద్భిజ్జములు మొదలుకొని మానవయోనివఱకు చేరు-

టకు ౬౭ లక్షల యోనులు కడచెను. కాని యీ ౬౭ లక్షల యోనుల వివరణ మొసఁగి వానిలో యోనిపరిణామమును ఋజువుపఱచుటయేగాక వాని నామములను తెలియఁజేయుట కూడ నసంభవమే.

సుప్రసిద్ధ జర్మను ప్రాణిశాస్త్రజ్ఞుఁడైన అర్నెస్టు హైకల్ ఒకచోట నీవిధముగా వ్రాసెను.

"చేప మొదలుకొని మానవుఁడగువఱకు కనీసము ౫౩ లక్షల ౭౫ వేల యోనులు కడచెను. ఈసంఖ్య ఇంత (౫౩ లక్షల) కంటె ౧౦ రెట్లు అధికముగా నుండుటయు సంభవము కావచ్చును." *

పురాణములలో మొత్తము ౮౪ లక్షల యోనులు చెప్పబడియున్నవి, వానివివరణ మొకచోట నీవిధముగ నున్నది.

| | | | |
|---|---|---|---|
| స్థావర | యోనులు | ౩౦ | లక్షలు |
| జలచర | " | ౯ | " |
| కృమి | " | ౧౧ | " |
| పక్షి | " | ౧౦ | " |
| పశు | " | ౨౦ | " |
| మనుష్య | " | ౪ | " |
| | మొత్తము | ౮౪ | లక్షలు. |

స్థావర యోనులను విడనాడిన జలచరములు మొదలు మానవునివఱకు పురాణముల ననుసరించి ౫౪ లక్షల యోను

* Last link by Ernest Haeckel with notes by Dr. H. Gada.

లున్నవి. కాని హైకల్ వందలకొలది సం॥ లకు తరువాత వాటిని కేవలము ౨౩ ౫/౪ లక్షలని అంచనావేసెను. ఇటుల క్రమశః జ్ఞానముయొక్క హ్రాసము విశ్వసించబడుట స్పష్టమగుచుండ దీనిని జ్ఞానవికాసమని చెప్పుటకెట్లు వీలగును? మఱల నీ ౨౩ ౩/౪ లక్షల యోనుల వివరణ మొసఁగుటలో హైకల్ ఈసంఖ్య దీనికంటె ౧౦ రెట్లు అధికముగ నుండవచ్చునని చెప్పి తన యసమర్థతను ప్రకటించెను. స్వల్పముగా కొన్ని స్తన్య జంతువుల వివరణమాత్ర మొసఁగి యుండెను. వీనిలోకూడ నిప్పటికిని లుప్త జంతువులు అజ్ఞేయముగానున్నను యోనిపరిణామమును ప్రమాణితముగ విశ్వసించుట దుస్సాహసమే గాని మఱొకటి కాఁజాలదు.

౨. ఇంతవఱకు వందలకొలది యోనిరూపములోఁ పుట్టుకతోనేఁ గ్రుడ్డిగనే పుట్టుచున్నవి. ఇవి పరిణామమొందులకుఁజెందుట లేదో విదితమగుటలేదు, పశువులేగాక యనేక ద్వీపములలో నేటివఱకు మానవభక్షక మానవు లగుపడుచున్నారు. వీరి జ్ఞానము క్రమప్రవృద్ధము గాకుండుటకు కారణమేమి?

౩. పరిణామ వాదములను బలపఱచుటకై మానవుని గర్భావస్థకూడ నీవాదమునే బలపఱచుచున్నదని పలికెదరు. గర్భముయొక్క ప్రారంభిక మాసములలో నాగర్భముయొక్క రూపము, ఆయాజంతువులతో కలియుచున్నది. వానినుండి యున్నతినొంది యోనిపరిణామముద్వారా మానవుఁడగుచున్నాఁడని చెప్పఁబడుచున్నది. తుదిమాసములలో దానియందు మానవత్వచిహ్నములు ప్రకటిత మగుచున్నవని కూడ నుడివెదరు. కాని

ఈవిషయ మిప్పటి నూతన పరిశోధనలవలన సరియైనదని సిద్ధాంత మగుటలేదు.

"థియాసఫికల్ పాత్"లో డాక్టరుబూత్ జాన్సు చెప్పిన దానిని ప్రమాణముగ నుదహరించుచు సి. జె. రియాన్ గారిట్లు వ్రాసిరి.

"మానవగర్భము కోతిగర్భముతో దాదాపుగా తుది మాసముల్వరకు తెలిసికొనఁబడఁజాలదను నీహైకల్ వాదము అశుద్ధము, అసత్యము, త్యాజ్యమునై యున్నది. మానవునికంటె క్రిందిజాతులలో నగపడని మానవుని పాదములు, పాదముల యొక్క ఒక మాంసకండరముతోఁ గూడ కొన్ని ఆవశ్యకాంగ ములు మానవునకు గర్భములోనే యథాసంభవముగా ప్రారంభమునందే ప్రకటమగుచున్నవి. మానవరూపము నాలుగుకాళ్లు గల జంతువులు మొదలగువాని యోనులనుండి కడచి యేర్పడు చున్నయెడల నవి, ఆ అవయవములు తప్పక గర్భాంతములోనే ప్రకటితము కావలసి యుండునుగదా!"

డాక్టరుబూత్, జాన్సు, రియానుల భావములు వారి వాక్యములలోనే తెలిసికొన తగినవి. కావున నీయిరువురివాక్యము లీక్రింద నుదాహరించుచున్నాము. బూత్ జాన్సు తన లేఖలో నీ విషయమును స్పష్టముగ వివరించెను. "మానవయోని, పరిణామమువలన నేర్పడలేదు. కాని మానవయోని వీని యన్నింటి కంటె భిన్నముగ. స్వతంత్రముగ నున్నది. * రజోవీర్యముల

---

* Dr. Wood Jones (The problem of man's Ancestry P. 33) "we are left with the unavoidable impression that

సంయోగమువలన పదిమాసములలో మానవరూప మేర్పడు చుండ నది లక్షలకొలంది సంవత్సరములలో నేర్పడెనని చెప్పుట యీశ్వరశక్తి నవమానించుటయేగాని వేఱొండుకాదు.

౪. ఈ పరిణామవాదము ప్రత్యక్షవిరుద్ధము అవైజ్ఞానికమునై యున్నది. ప్రపంచమునం దొక సార్వత్రిక నియమము కనఁబడుచున్నది. పుట్టినదెల్ల గిట్టుచున్నది. వృద్ధి నొందుచున్న ప్రతిదియు తుదకు తగ్గిపోవుచున్నది. సూర్యునివేడి ప్రవృద్ధమై యిపుడు తగ్గుచున్నది. మానవుఁడు పుట్టి యువకుఁడై వృద్ధుడై తుదకు మరణించుచున్నాఁడు. వృక్షముల యవస్థకూడ నింతియే.

---

the search for his ancestors must be pushed a very long way back ... .... .... It becomes impossible to picture man as being desacended from any form at all like the recent monkeys. .... .... .... or from their fossil representatives .... .... .... He must have started an independent line of his own long before the anthropoid apes and the monkeys developed those specializations which shaped their definite evolutionary destinies."

Referring to Wood Jone's above view Mr. C. J. Ryan writes in the "Theosophical path" He proves that Haeckals teaching that a human embryo cannot be distinguished from that of monkeys until very late developments is wrong and must be abandoned, by showing that certain essentially human characters such as the human walking foot with a leg muscle found in none of the lower animals, are visible in the human embryo at the earliest possible time and not late in the formation as they would be if man had passed these - the anthropoidal and quadrupadal stages. (Vedic Magn. may 1926 P. 143.)

ఏ వస్తువైనను పెరుగుటయేగాని తఱుగుట లేదనుట యెచ్చ టను గానఁబడుటలేదు. కావున వికాసముతోపాటు నష్టముకూడ తప్పక యుండవలయును. కాని డార్వినుయొక్క పరిణామవాద మొంటిచక్రముగల బండి. నష్టములేని వికాసము. కావుననే స్వీకర్తవ్యము గాకున్నది.

౫. క్రమజ్ఞానవృద్ధి సిద్ధాంతము సర్వథా నిరాధారము. క్లిష్టకల్పన మాత్రమైయున్నది. ఈ విషయ మనేకపర్యాయము లనేకవ్యక్తులద్వారా పరీక్షించఁబడెను. అందఱకు నొకేఫలితము లభించెను. పరీక్షించినవారి నామము లివి.

౧. అసురబానాపాల్ లేయార్డు ( Layard ), రాలిన్సన్ ( Rowlinson ) ఈ అన్వేషకు లిరువురు నైనవా, బేబిలోను, ( అసీరియా ) యొక్క పురాతన ( పాడుపడిన ) గ్రామములను త్రవ్వించి ఇటుకలపై వ్రాయబడిన గ్రంథాలయములను కను గొనిరి. ఆ గ్రంథములవలన బానాపాలుచేసిన పరీక్షలయొక్క కథ తెలిసెను. పురాణములయం దీబానాపాలునే బాణాసురునిగా వ్రాసిరి. ఇతఁ డీదేశముపై దండెత్తి పరాజితుఁ డయ్యెను.

౨. యూనాన్ రాజా సేమిటెకల్.

౩. రెండవ ఫ్రెడరిక్ ( Fredrick the second )

౪. నాల్గవ జేమ్సు ( Jaames the 4th of Scotland )

౫. అక్బరు

ఈ రాజుల రాజ్యకాలములందు విద్వాంసు లనేకులు ౧౦ – ౧౨ మంది, అక్బరు ౩౦ మంది చిన్నచిన్న నవజాత శిశువుల నద్దాలగృహములందుంచి వారిపోషణకై దాదు

లనుంచి, "మీరు పిల్లల కాహారపానీయము లొసఁగి సర్వవిధ ములవారిని పోషించవలయును. కాని వారి కేవిధమైన శిక్ష నొసఁగుటగాని, వారియెదుట మాటలాడుటగాని జరుగరా"దని శాసించిరి. ఆ దాదులు నటులనే చేసిరి. ఈ విధముగా పోషణ పొందుచు వారు పెద్దవారైనపుడు పరీక్షించఁగా వారందఱును చెవిటివారుగను, మూఁగవారుగను తేలిరి*

కావున శిక్షపొందకుండఁగనే స్వయముగా నెవనికైనను జ్ఞానము కలుగ గలిగినయెడల నీబాలురకు కూడ మాటలాడుట మున్నగునవి స్వయముగా వచ్చియే యుండునుగదా! వారు చెవిటివారు మూగవారునై పోవుటవలన స్వయముగా జ్ఞానమను నది జనించి అభివృద్ధి నొందజాలదనియే స్పష్టముగా ఋజువగు చున్నది.

౫. ఇపుడు వైజ్ఞానికములు గూడ క్రమముగా జ్ఞానాభి వృద్ధియగు నను సిద్ధాంతమును నిరసించ మొదలిడిరి.

(అ) సర్. ఓలివర్ లాజ్ క్రమముగా జ్ఞాన మభివృద్ధి నొందుననుసిద్ధాంతము నిరసించుచు ఆసిద్ధాంతము నమ్మువారి నీవిధముగా ప్రశ్నించుచుండెను.

మహాత్మ్యకళ (Fine Arts) మొదలగునవి శిక్షను పొంద కుండ నెట్లు ప్రాదుర్భావమయ్యెను?" బాల్‌ఫోర్ (Balfour) అను మఱియొక విద్వాంసుడు లాజ్ యొక్క యీప్రశ్నను సమర్థిం చెను. (Life and Matter by Sir Oliver Lodge P. 143)

---

* చూడుడు. Transactions of the Victoria Institute Vol 15 P. 336

(అ) పరిణామ వాదులలో నొకడైన డాక్టర్ వాల్లెస్ క్రిమముగా జ్ఞానము వృద్ధియగు ననెడు సిద్ధాంతము విడనాడి యొకచోట నీ విధముగా వ్రాసెను. "ఏవిచారములు వేద ఋక్కులవలన ప్రకటమగుచున్నవో, యేవి ఉపపన్న భాషలో ప్రకటమయ్యెనో వాని లేఖకులు ఉత్తమోత్తమ శిక్షకుల కంటెను, మన మిల్టన్, టెనిసన్‌ల కంటెను తక్కువవారు కారు" డాక్టర్ వాలెస్‌గారి వాక్యములివి.

" We must admit that the mind which conceived and expressed appropriate language, such ideas, as are everywhere apparent in these vadic hymns, could not have been in any way inferior to those of the best of our religious teachers and poets to our Milton's and our Tennyson's " Social environment and moral progress by Dr. Wallace. P. 14

(ఇ) డాక్టరు వాలెస్ మిశ్రి (యీజిప్టు) మెసపొటేమియాల యొక్క పురాతన కళలను, లేఖలను, విచారించుచు వానినికూడ నిప్పటి ఉత్తమోత్తమ కళలకంటె తక్కువైనవి కావని నిర్ణయించెను. మఱియు నిత డిటువంటివే మఱికొన్ని యితర విషయములను విచారించుచు క్రిమముగా జ్ఞానము వృద్ధి పొందుననుదాని కెవ్విధమైన ప్రమాణములు లేవని చెప్పెను.

There is therefore no proof continuously increasing intellectual power. P. 8-26.

(ఈ) గైల్డర్ మహాశయు డొకచో నీవిధముగా వ్రాసెను:-

It follows from this that the average ability of the Athenian race is on the lowest possible estimate. Very nearly two grades higher than our own that is, about as much as our own race is about that of the African Negro (Heredity Genevis by Galton P. 331.)

అనగా యూనానాను (గ్రీసుదేశీయు) ల మధ్య యోగ్యత నెంత కనీసమైనదిగా నంచనావేసినను అది మన సభ్యతకంత కంటె రెండురెట్లుపైగ నుండును. అనగా సామాన్యముగ మన జాతి ఆఫ్రికా అనాగరికజాతులకంటె నెంత పైనున్నదో యూనానాను జాతి అంత పై నున్నదని భావము.

(ఉ) ప్రొఫెసర్ గోల్డుస్మిత్ యొక్క ఒకగ్రంథము (The Laws of life) ను సమాలోచనచేయుచు "కే" (W. E. Key) మహాశయుడు "గుడ్ హెల్తు" నం దిట్లు వ్రాసెను.

Before considering the meaning of evolution it neither eliminates God, nor does it teach that monkeys are the ancestors of Man. (Vedic mag. scpt 1923)

"పరిణామ వాదమున కర్థము తెలిసికొనుటకు ముందు ఈ వాదము ఈశ్వరుఁడు లేఁడని చెప్పుటలేదు. మఱియు దీని శిక్ష మానవుడు కోతినుండి పుట్టెననుటయును కాదు." అని హృదయాంకిత మొనర్చుకొనవలయును.

(ఊ) పేరీ తన గ్రంథమునందును *ఇడ్వార్డు కార్పెంటరు § తన గ్రంథములోను, డాక్టర్ వాలెస్, ప్రొఫె. "కే" ల యొక్క అభిప్రాయములను సమర్థించిరి.

* The Children of the sun by Perry.
§ The Art of creation by Edward Carpenter P. 105.

(ఋ) పరిణామవాదబ్రహ్మయైన డార్విన్ కూడ నిరీశ్వర వాదికాడు. అతడు తాను యోనిసంబంధమునుగూర్చి వ్రాసిన గ్రంథముయొక్క మొదటి సంస్కరణమునం దొకచో నిట్లు వ్రాసెను.

"I should infer from analogy that probably all the organic beings have descended from some one premordial form into which life was first breathed."

కాని అదే పుస్తకపు ద్వితీయ సంస్కరణయందు తన యుపర్యుక్తవాక్యములను సంస్కరించి యిట్లు వ్రాసెను.

"There is grandeur in this view of life having been originally breathed by the Creator into a few forms or in to one" —Origin of species by Charles Darwin.

ఈ సంశోధిత వాక్యములలో జీవము నూదు నీశ్వరుని వర్ణించి డార్విన్ తా నీశ్వరాస్తిత్వమును ఒప్పుకొనినట్లు స్పష్టముగ ప్రకటించెను.

టిండల్ తన బెల్‌ఫాస్టు ఉపన్యాసమున 'డార్విన్ మొదటి సంస్కరణమున ప్రయుక్తపరచిన "ఆదిమయోని" Premordial form) శబ్దములను అత డే (డార్విన్) యాధారముతో కల్పించె? నని యాక్షేపించెను. (Lectures and Essays by Tyndall P. 30)

కావున పై ప్రమాణములను బట్టి పరిణామవాద సిద్ధాంతము తప్పులతోను, కొఱతలతోను నిండి యున్నదనుట కేమాత్రమును సందియము లేదు. ఈ వాదపు సిద్ధాంతములు రెండు మిక్కిలి నాపత్తిజనకములై యున్నవి.

౧. ఒకయోనినుండి మరియొకయోని జనించుట.

౨. క్రమముగా జ్ఞానవృద్ధి (Mental Evolution)

వైజ్ఞానికులుగూడ నధికముగ నిప్పుడీ వాదమునకు వ్యతిరేకులైరి అగుచుండిరి. కావున డార్విన్ ఈశ్వరీయజ్ఞాన (వేదముల) ప్రాప్తియొక్క సిద్ధాంతమునకు తనపరిణామ వాదాన్వేషణవలన నే యేబాధలను కల్గించుటకు యత్నించెనో ఆయా యత్నము లన్నియు నిష్ఫలములయ్యెను.

డార్విన్ మహాశయుని ఉత్క్రాంతివాదమునకు వ్యతిరేక ముగా గొప్పగొప్ప యూరోపు విద్వాంసులు తెలియజేసిన సూక్ష్మవిచారములయొక్క నమూనాల నింతకుపూర్వము తెలియ జేసియే యుంటిమి. ఇంతియగాక నీశ్రేణికి చెందిన కార్లైల్ (Carlyle) కార్పెంటర్ (Carpenter) డ్యూక్ అఫ్ అర్గాయిల్, జోహన్ జిరార్డ్, ఆదమ్‌సెజ్విక్ బ్లేంచ్చర్డ్, వాఇగెండ్, వుల్ఫ్, హామాన్, వాన్‌హార్డ్‌మెన్, మున్నగు సుప్రసిద్ధ నామము లనేక మిచ్చట నుదహరించుచున్నాము.

భారతవర్షమునం దిపుడు మహర్షి స్వామి దయానంద సరస్వతిగారు భారతీయ విద్వాంసులలో మొదటి వారై యుండిరి. వీరు తమప్రచారమున హరిద్వారమునకు దగ్గఱగనున్న రుకడీలో పండిత ఉమరావుసింగు మొదలగు ననేక ఇంగ్లీషు పండి తులయొక్క సంశయములను దీర్చి వారి యెదుటనే డార్విన్ మతము బహుచక్కగా ఖండించిరి.

వీరికి తరువాత మహాత్మా శ్రీ పండిత గురుదత్తజీ ఎం.ఏ. (సైన్సు ప్రొఫెసర్. గవర్నమెంటు కాలేజీ లాహోరు) గారు ఈశావాస్యోపనిషత్తుకు వ్యాఖ్యచేయుచు డార్విన్ సిద్ధాంతమును, పాశ్చాత్య నాస్తికత్వమును ఇంగ్లీషులో బాగుగా ఖండించెను. దానినే యిచట నుదహరించుచున్నాము.

"Many are the victims of Ignorance and direful are the forms it assumes. One of them is what may, for want of a better name, be called scientific atheism. This is a belief in the omnipotence of atoms. The externally-minded scientific man, whose mind is replete with conceptions of matter and motion, with dynamical and mechanical explanations, ever true to his instinct of never believing anything except on the testimony of his senses, begins the task of of crude analysis. He dissects organised structures, nerves, muscles and tissues, and re dissects, but throughout all the labirinths of the brain, all the complicated network of veins and arteries, he finds no trace of an intelligent God all is motion or matter in motion. He begins his physiological researches and ends in chemical and nervous action everywhere again he leaves the organic department of nature, and analyses and decomposes, and again analyses and decomposes each solid and liquid and gas, now in a crucible, then in a retort, now by means of beat, and then by means of electricity, here with re-agents, and there with reactions, but rests everywhere with atoms, their affirmities and valencies, but nowhere with God. One of the positive evidence of direct observation, and from the infallible platform of personal experience, with his head raised in the proud majesty of knowledge, and his spine straightened with the nervous energy of natural

forces, he bids farewell, a last farewell to the barbaric dogma of a belief in the existence of an intelligent all-pervading, all-moving principle. His belief in the potency of atoms is boundless. They are unanalysable, undecomposable, simple nomads, uncreated eternal in their existence endowed (not by anything else, but naturally through necessity of existence) with inconceivable notions In the vast chaotic operation of these atomic forces, specific atoms met through accident and selection, united together, assumed a temporary organisation, exhibiting signs of breathing conscious life. This germ of life, on account of wholly unexpected and incomprehensible circumstances, under favorable conditions, (favorable through chance or selection) propagated itself and multiplied. Great was the struggle for existence then raging. Many fortunately organised beings were, in the course of this struggle, again hurled back into the atomic chaos whence they sprung. This is extinction. But some fortnnate organizations (fortunate, not through merit or desert, nor through design, but fortunate somehow) survived this diresome catastrophe, and prospered. Their organization modified and developed new organs, and remodified and redeveloped, till man appeared on the stage. Now man, this man, the product of fortuitous combination of atoms, with his heated brain, exudes entirely unsupported doctrines of Immortality and Providence. Can a sensible man believe such dogmas? Vain are thy efforts, O theologian ! to construct an edifice of religion on the foundation of sand. Human race, as a race, may for long ages to come, survive, but individual man shall only go back to the vile dust from whence he sprung.

Such is scientific atheism all is uncertain and unreliable. Life is but an accidental spark produced by the friction of mighty wheels, the blind whirling motion of which constitutes the phenomena of the universe. There is no hope of futurity, no consolation for oppressed virtue or disappointed justice, here-after. A natural result of which is that the worshipper of omnipotent atoms, dashed headlong into a sea of unrighteonsness and immorality, tramples all justice without a pang, suppresses all virtue without a sigh, and over the wreck of all that is noble and elevating in human nature builds his philosophy of desperatism. He is desperate in his actions, desperate in his feelings. Or perchance his is a philosophy of resignation. Desperate or resigned, there are the signs of brutal violence to human nobility rendered, and as is the case of all violence rendered to human nature, the subject is agitated, disturbed, listless, meloncholy, petrified or simply unconscious of himself. Miserable, though, is this extreme form of scientific atheism there is softened form of it, however, which is compatible with a certain and a very high degree of morality. For there is in the scientific atheist, a strong belief at least, in the unchangeable, and immutable laws of nature or of the order of Nature. He is not superstitious. On the world of effects, at least, he is a master. Miserable and disturbed as his life of the interior may be, his external life is, no doubt, a complete success."

"అనేకులు అవిద్యకు వశులైయున్నారు. దీని (ఈఅవిద్యా) స్వరూపములు మిక్కిలి భయంకరములు. వాటిలో నొకస్వరూపమునకు నుత్తమనామ మొసగజాలక పోవుటచే నవిద్యాభిమానమయునాస్తికత్వ మనగలుగుచున్నాము.

# భారతీయులు - పరిణామవాదము

ఇక మన దేశపరిస్థితులనుగూర్చి యాలోచింతము. ప్రపంచ మున విద్యావిహీనదేశ మిదియే. అందరును విద్యనభ్యసింప సౌకర్యములు అందుబాటులో లేవు. సమర్థతగలవారికి, సౌకర్య ములు గలవారికి విద్యయం దభిలాష లేదు. ప్రారంభికవిద్య అందఱకు నందుబాటులో నున్నను పిల్లలను ౧౪-౧౫ సం॥లు వచ్చువఱకు స్వేచ్ఛగా తిరుగనిచ్చుచు జ్ఞానసంపాదనకు ముఖ్య మైన వారి యీ యమూల్య సమయమును మనము గుర్తించఁ జాలక పోవుచుంటిమి. ఏ సభ్యత, ఏ యాచారము సంతానమున కలవాటుపడుచున్నదో, నేర్చుకొనుచున్నదో, గమనింపఁజాలని దంపతులెందఱో కలరు. అవనతికి కారణమైన సోమరితనము, విషయలోలత్వము మితిమీఱి సంఘమున బాదుకొని పోయెను. విద్య నభ్యసించువారును, ఉద్యోగదృష్టితోనే యున్నారు. పారమార్థిక మిసుమంతయును లేదు. బీదవానికి, భాగ్యవంతు నకు నేయుంబవలు ధనము ధనమని యొకటేచింత. కావుననే చదువుచున్నయువకుని గాంచి ముందుగనే "మీకేయుద్యోగము ఎంతజీతములో దొరకఁగలుగునని" ప్రశ్నించుచున్నారు. స్వాతం త్ర్యాభిలాషులమయ్యును నౌకరీ చేయుటకై తహతహలాడు చున్నాము. త్యాగబుద్ధితో మన విద్యావిజ్ఞానములను సాధారణ ప్రజల కుపకరించునట్లు ప్రయత్నింపఁ దలపెట్టఁజాలకున్నారము.

మన పరిస్థితు లట్లున్నవి. ఇక శిక్షణపద్ధతి యెట్లున్నదో విచారింతము. నేటి శిక్షణాపద్ధతిని సూచించి యమలులో బెట్టిన లార్డుమెకాలే "భారతీయు లీ శిక్షనభ్యసించి, శారీరికముగా భార

తీయులై నప్పటికిని మానసికముగా యూరోపు భక్తులయ్యెదరు. అప్పుడుగాని మనరాజ్యము, మనశాసనము, భారతదేశమున స్థిరముగా నుండఁజాలదు''అని యనెను. కావుననే దూరదృష్టితో విమర్శన చేయజాలని శిక్షితులు నేఁడు నిస్సంకోచబుద్ధితో క్రోతి నుండి మానవుఁడు వచ్చెననియు, ఆర్యు లనువా రెచటినుండియో వచ్చి హిందూదేశమునఁ బ్రవేశించి యిచటనున్న ఆటవికుల నోడించిరనియు, వారిలో ద్రావిడులు ముఖ్యులనియు, ఆది హిందువులనియు, వేదములు గొఱ్ఱకాపరుల గీతములనియు, మన పూర్వులకు విద్యా, విజ్ఞానములు లేశమాత్రము లేవనియు, సదా మనము విదేశీయుల పరిపాలనము క్రిందనే యుంటి మనియు, నిట్లనేకవిధముల భావించుచున్నారు. ఈవిధముగా మన దృష్టిలో సమస్తవిధముల విదేశీయులు సభ్యులుగా, మేటి వారుగా, పూజనీయులుగా, విశ్వసనీయులుగాఁగనఁబడు చున్నారు. మన యీమూఢాంధ విశ్వాసమయ కార్యములు మనయున్నతి నెంతగా నరికట్టుచున్నవో విచారించఁ జాలకున్నారము.

ప్రతివాఁడును తాను చిన్నప్పటినుండియు నేర్చుకొనిన దానినే చెప్పఁగలుగును. ఉగ్గుపాలతోనే యార్యులు, ఆర్యేతరులు, ద్రావిడులు అను విషమభావములు బాలురకోమలహృదయములపై ముద్ర వేయఁబడుచున్నవి. పాఠశాలలో బ్రవేశించగనే పవిత్రమైన ఆదర్శయుతమైనరామకృష్ణాదుల చరిత్రలను వికృత మొనర్చి నిరుపయోగశిక్ష గఱపఁబడుచున్నది. సదసద్వివేక మునకై చదువవలయునని చెప్పెడువారి సంతతి, నేఁడు నీతినియమములు భక్ష్యాభక్ష్యవిచారణ లేనిదై పోవుచున్నది. వీరిలోఁ

కొందఱు సాంగోపాంగముగా వేదాధ్యయనమవసరమని యెఱిఁగి యుండియు, నే యింగ్లీషులోనో వేదాధ్యయన మొనర్చి విషయమును బాగుగా తెలిసికొనకుండఁగనే చిలుకపలుకలవలె నశ్లీల అసంభవ విషయములను వేదములపేరఁ జెప్ప సాహసించుచున్నారు. ఆత్మ, స్వసభ్యత, స్వదేశాభిమానములు గలిగియున్న పండితు లనేకులు స్వయంకృషి యొనర్చి యీ కుటిల నీతిని విమర్శించి సత్యసిద్ధాంతములను వెల్లడించిరి, వెల్లడి చేయుచున్నారు. నవీనశిక్షితుల దృష్టిలో వారిపరిశ్రమ నిష్ఫలముగాఁ గనఁబడవచ్చును. కారణమేమన, "పాలుత్రాగు పిల్లివలె" లేక శత్రువులు వెంటఁబడినపుడు "తల నిసుకలోదూర్చి నిశ్చింతమగునుష్ట్రపక్షివలె" వారందఱును మావలెనే ప్రపంచమున్నదని భావించుచున్నారు. నిజమే "కామిల రోగికి జగమంతయుఁ బచ్చగనే' యగపడునుగదా !

మనదేశమున విద్యాధికులై దేశవిదేశములందు ప్రఖ్యాతి గాంచినవా రనేకులు జీవించియే యున్నారు. వారంద ఱాస్తికులై డార్విను వాదమును నిరసించియున్నారు. మహాత్మాగాంధిగారి మాటలను వేఱొకచోట వివరించియే యుంటిమి. ఇంటర్నేషనల్ ఆర్యలీగుకు చాలకాలము అధ్యక్షులుగా నుండిన వారును, మేధావులును, ఆధ్యాత్మిక క్షేత్రమున సాటిలేనిదగు ఆర్యసాహిత్యమునం దనేకములయిన యుద్గ్రంథముల రచియించిన వారును, చతుర్థాశ్రమములో నుండి పదియవపడిలో నున్నను యువకునికంటె నమితోత్సాహముతో భాగ్యనగర ఆర్యసత్యాగ్రహసమరమున ప్రథమసర్వాధికారిగాఁ బనిచేసిన మహాత్మా

నారాయణస్వామిగారి లేఖలలోని కొంతభాగమునుకూడ నుద హరించి యున్నాము. కీ. శే. శ్రీ రవీంద్రనాథ ఠాగూరుగారు నోబుల్ పురస్కారము పొందఁగలిగిన "సాధన" యను గ్రంథము కేవలము ఈశావాస్యోపనిషత్తులోని ప్రథమ మంత్రాశయ వర్ణనమైయున్నది.

అర్ధశిక్షితులును, పరప్రత్యయనేయ బుద్ధులు నగు వనే కులు విజ్ఞానవాదులు దేవుఁడు లేఁడని చెప్పుచున్నారనుచు, భారత ప్రాచీన సభ్యతావ్యవహారములను నిందించుచు, పరిహాసించుచు పొట్టబోసికొనుచున్నారు. 'గోత్రదాటున కలవాటుపడియున్న' భారతీయ యువకులెందరో ఆ వైపునకుఁ బరువులెత్తుచున్నారు. అందును దేశహితముగోరి వర్గవాదమును మంటఁగలిపి ప్రాచీన వర్ణవ్యవస్థకు వికృతమును, అసంపూర్ణమునగు సోషలిజము లేక కమ్యూనిజమును దేశమునఁ బ్రవేశపెట్టగోరు యువకులుగూడ విచక్షణావిహీనులై పాల్గొనుట మిక్కిలి శోచనీయము. ఒక వైపున సోషలిజంపేర మానవత్వమును స్థాపించుటకు ప్రాణధన ముల నర్పించ సమకట్టియు, దూరదృష్టి రహితులై, రెండవ వైపున "నోరుకలవాని దేరాజ్యమను" డార్విను రాక్షసవాదమునకు మెఱుగుపెట్టుటకై శతవిధముల ప్రయత్నములొనర్చుచున్నారు. మతమంతాంతరములతోఁ దలప్రాణము తోఁకకువచ్చియున్న భారతీయులందు నింకొకమతమును గ్రంథములనువ్రాసిస్థాపించు చున్నారు. వారి యీచర్యలు హిందూమహాసముద్రీయ వైషమ్య ములకంటె మించినవగుటకు కారణములు కాఁగలుగుచున్నవి.

పాప మూ యువకుల దృష్టిలో సమత్వ ప్రచారమునకై ఆస్తికవాదము అడ్డు తగులుచుండవచ్చును. ఆస్తిక నిజస్వరూపమును తెలిసికొనుటకు వారియందు పురుషార్థముకూడ లేకుండియుండవచ్చును. విజ్ఞానమున ప్రపంచఖ్యాతి వడసిన నోబుల్ పురస్కారమును ప్రపంచ బహుమతిని బడసిన శ్రీ.సి.వి. రామన్ గారు తమ దేశీయులని వారికి జ్ఞప్తి యుండకపోవచ్చును. లేనిచో నంత విజ్ఞానవాది ఆస్తికాభిప్రాయముల నుపదేశించుచుండ విజ్ఞానవాదులు దేవుఁడు లేఁడని యనుచున్నారని తలఁచుట వివేకమా? సభ్యజాతివారమని విఱ్ఱవీఁగు పాశ్చాత్యుల విశ్వవిద్యాలయములలో శిక్షఁ గఱపఁగలిగిన మేటిధీశాలియగు సర్ శ్రీ రాధాకృష్ణగారిని వారి యుద్గ్రంథముల నెఱిగియుండకపోవచ్చును. ఎఱిఁగియున్న ఆస్తిక విశ్వాసమును పోగొట్టుకొను మందమతు లుండబోరని గట్టిగా చెప్పగలుగుచున్నారము.

పాశ్చాత్యదేశములు తెలియరాని కాలమునుండి అజ్ఞానావిద్యాంధకారములందు మునిఁగియున్నవి. ప్రాచీన కాలమున భారతవర్షము ప్రపంచగురువై యుండెను. ఏసుక్రీస్తు మనదేశమువచ్చి కాశీమొదలగు స్థానములందు శిక్షనుపొందెను. జ్యోతిష, గణితాది సచ్ఛాస్త్రము లన్నిటిని మనదేశమునుండియే యితరదేశములన్నియు గ్రహించినట్లు ప్రబల ప్రమాణములు లభించుచున్నవి. ఆంగ్లేయు లీదేశమునం దడుగిడు నప్పుటికి సున్నితమైన వస్త్రములను వారుచూచి యెఱుఁగరని చరిత్ర చెప్పుచున్నది. దీర్ఘకాలమునుండియు నా దేశములు త్రివిధ దుఃఖములందు మునింగియుండెను. కావున భౌతికోన్నతి వైపు

నకేదృష్టినిగుడ్చుట పురుషార్థమని తలంచుటచేతనే నేటిప్రపంచ యుద్ధమునకు కారణ మయ్యెను. వెలుఁగును గాంచఁగోరిన వారిలో ననేకవాదములు పుట్టిగిట్టెను. అదేమిచిత్రమోకాని పాశ్చాత్యానుకరణ మొనర్చు మనదేశీయులగు యువకులు పాశ్చాత్యదేశములందు పుట్టి రూపుమాసిన మాయనున్న వాదములను కనీస మొక యర్థశతాబ్దమైనను గడచిన తరువాతనే గ్రహించ ప్రయత్నించెదరు. అందఱు నెంగిలిచేసి చవిచూచి వదలినదానిని స్వీకరించుట బానిసలకు పరమప్రసాదము కాదా! నకలుచేయుట, అనుకరణమొనర్చుట బుద్ధిమంతులకార్యము కాదని మహర్షి దయానంద, బ్రహ్మ సామాజికులను విమర్శించుచు వక్కాణించిరి.

ఒక దేశము, జాతిజీవనము కలదని ఋజువగుటకు నాజాతి దేశ ప్రాచీన సభ్యతను, విశేషత్వమును నిలువఁబెట్టుకొనగలది కావలయును. మన భారతీయులం దిది నానాఁటికి క్షీణించు చున్నది. మొగలుల సామ్రాజ్యకాలమున క్రైస్తవమత ప్రచారపు క్రొత్తరోజులలో నెందరో తమ ప్రాణములైనను నర్పించిరిగాని శిఖా యజ్ఞోపవీతములను మాత్రము త్యజించ సంకల్పించఁజాలక పోయిరి. కాని అట్టివారి సంతానమగు నేటి భారతీయులు అప్రయత్న పూర్వకముగా నితరులప్రేరణ లేకుండఁగనే శిఖాయజ్ఞోపవీతముల విడనాడి సభ్యులమనియు, శిక్షితుల మనియు విఱ్ఱవీఁగుటలో పురుషార్థమున్నదని భావించుచున్నారు గదా!

ఇట్టి పరిస్థితులలో భారతీయులు పరిణామవాదమును బల
పఱచుచున్నా రనఁగా నాశ్చర్యపడుటయే విచిత్రము. మనలో
నంధవిశ్వాసములు, పరులయందు పరమవిశ్వాసము లుండుటచే
పరిణామవాదవృక్షముకూడ కొన్ని పిల్లవేళ్ళు వేసుకొనగలిగి
నది. కనుకనే మనలో యుద్ధము రాకపోయినచో నీసరికి ప్రాణము
పోయు రహస్యమును వైజ్ఞానికులు కనిపెట్టఁ గలిగెడువారే
యనిచెప్పుచు నోడలు పొంగిపోవ చిందులు త్రొక్కువారు
లేకపోలేదు.

నేఁటి కైనను ఆస్తికులందఱు సమ్మిళితులై ప్రేమపూర్వ
కముగా పురుషార్థ పరులగుచో భారతదేశమునందేమి (?) ప్రపం
చమునుండియే ఆస్తికేతరవాదము లన్నింటిని క్షణములో
క్షీణింపజేయగలరు. సూర్యోదయమైన పిమ్మట తమము తల
యెత్తి చూడగలదా ? ధర్మాత్ములయిన యాస్తికులందఱు
సార్వజనిక శాంతిహిత భద్రతలకు భంగము కలుగఁజేయుటకు
కారణభూతు లగుచున్న యుద్రిక్త యువక సంఘమునకు
సద్బుద్ధి నొసగుటకు పరమేశ్వరుని ప్రార్థించెదరుగాక !

దేవుని పేరగాని, మతము పేరగాని స్వార్థపరులు కొన్ని
మోసకృత్యము లొనర్చుచున్నారు. సమాజమునం దధికముగా
పెరిగిపోయిన దురాచారములు నిర్మూలమగుటకు దేవుఁడు,
మతము నశించిపోవలెనని కొందఱందురు. కాని శాంతముగా
విచారించినచో నత్యాచార మోసకృత్యములు నాశము కావ
లయుననియే అందఱు కోరుచున్నారని ప్రతీత మగుచున్నది.
అయిననుమానవులలోజరుగు క్రూరకృటచర్యలన్నియుస్వార్థము

తోనో, ఈర్ష్యతోనో జరుగుచున్నవిగాని కేవలము దేవుని లేక మతము ప్రేరణమీాద జరుగుటలేదు. కావున ముఖ్యముగా వారియం దున్నటువంటిస్వార్థము, ఈర్ష్య, సోమరితనము మున్నగు దుర్గుణములను రూపుమాప ప్రయత్నించవలయునుగాని, "రోగ మొకటియైన మం దొకటి వేయందగునా?" అందు ప్రయోజన మేమియుండును ?

త్యాగ, ధర్మబుద్ధులు లేనిచో చేతికి లభించిన సంపత్తి స్థిరముగ నుండగలదా ? నిజమైన యాస్తికవాదమగు వైదిక సిద్ధాంతములు ప్రచారమునం దున్నంతవఱకు సృష్ట్యాదినుండి మహాభారత యుద్ధకాలమువఱకు కల్పనాతీతమగు సమాజ సంఘటన ముండియుండెను. ఇంత దీర్ఘకాలము ఏకచ్ఛత్రాధి పత్యముగా రాజ్యమేలిన వంశము ప్రపంచమునం దేదియును లేదు. వైదికధర్మ ప్రచారమువలననే మత మతాంతరములు నశించిపోయి మానవ సౌఖ్యమునకు స్థిరమైనమార్గము లేర్పడఁ గలవు. ఈ కార్య మిపు డార్యసమాజము చేయుచున్నది. దేశ స్వాతంత్ర్యమునకై ఆర్యసమాజ ప్రవర్తకు దయానంద మహర్షి యేమి తలంచియుండెనో, యేమి చేసియుండెనో, యేమి యుప దేశించియుండెనో "రాష్ట్రవాది దయానంద" యను గ్రంథరాజ మున విపులముగా విశదీకరించబడును.

## వైదిక సృష్టికాలము

ఇప్పటికి సృష్టిజరిగి యెంతకాలమైన ? దను ప్రశ్న విద్వాం సుల నాకర్షించుచున్నది. ప్రారంభమునందు కొందఱు తమ

పూర్వసంస్కారములకు లోనై బైబిలునందు చెప్పఁబడిన తరములను దృష్టియం దిడుకొని ౬ - ౧౦ వేల వఱకు బోయిరి. ఆగ్రంథములను జదివిన యేతద్దేశీయ విద్వాంసులుకూడ దానినే బలపఱుప ప్రయత్నించిరి. కాని రానురాను బైబిలు ప్రపంచమునకు దూరులైన వైజ్ఞానికులు కాలమును పొడిగించిరి. Kneen నీఁ అను విద్వాంసుఁ డొకపర్యాయము Science and invention అను అమెరికా మాసపత్రికయందు age of earth అను లేఖను వ్రాయుచు భూమి పుట్టి కనీసము ౭౨ లక్షల సం॥ లయ్యెనని నిర్ణయించెను. భూమిలోపల మంటిపొఱలు, నూనె, బొగ్గుగనులు దీనికి ప్రమాణములు. కొండలు కొద్దికొద్దిగా పెరుఁగుచు నింతగా నభివృద్ధి చెందుటకు లక్షల సంవత్సరములు పట్టియుండుటలో నాశ్చర్యముండదని వైజ్ఞానికులు చెప్పుచున్నారు. ఇట్లు చెప్పు ప్రొఫెసరు 'లాయు'లను విద్వాంసుని క్రైస్తవులు బాగుగా బాధించిరికూడ. సముద్రమునందలి సోడియమును చూచి భూగర్భశాస్త్రజ్ఞులయిన ప్రొఫెసరు 'జోలీ'గారు భూమిమీఁద జీవముపుట్టి ౯౦ కోట్ల సంవత్సరములైనదని చెప్పిరి. ౧౯౩౧ సం. జులై ౨౦వ తారీఖున అలహాబాదునుండి వెలువడిన 'లీడరు' అను ఆంగ్ల దైనిక పత్రికయందు వాట్సన్ డేవిస్ అను లేఖకుఁడు "నేషనల్ రిసర్చికౌన్సిలు వైజ్ఞానికులను భూమి ఆయువును కనుఁగొనుమని నియోగించఁగా వారు పరిశ్రమతో కరేలియా (రష్యా) లోని కొంచెము 'యురానినియ'మును పరిశోధన జేసి ఆధాతువునకు ౧౮౫ కోట్ల, ౨౦ లక్షల సం. లుండునని యు

నంతకుపూర్వము భూమిపుట్టి ౧౫ కోట్ల సం. లు కానిచో నానాంటికా ధాతువు పుట్టి యుండదనిరి." అని వ్రాసెను.

Fames Jeans గారు తన విశ్వరూపమను గ్రంథమున ఒకటౌన్సు యూరోనియమును పరీక్ష జేసి భూమిపుట్టి రెండువందల కోట్ల సంవత్సరము లయ్యెనని నిరూపించిరి.

సృష్ట్యాదినుండియు నార్యులు తమ నిత్యకృత్యమగు సంధ్య యందును, శుభకార్యములందును దేశ, కాల, దిక్కులను సంకల్పముపేర సంకీర్తన మొనర్చుచు వచ్చుచున్నారు. దీని వలన భూగోళాదిశాస్త్రములందు వారికున్నటువంటిపరిజ్ఞానము మిక్కిలి చక్కగా బోధపడుచున్నది. ఇప్పటికి సృష్టిజరిగి ౧౯,౭౨౯౪౯౦౫౫సంవత్సరములుగతించెను.సూర్యసిద్ధాంతాది జ్యోతిషగ్రంథము లీవిషయమును విపులముగా విశదీకరించు చున్నవి. ఘడియ విఘడియలతో సహా కాలమును సృష్టినుండి లెక్కించియుండిరి. వేదమంత్రములందు సృష్టి ౪౩౨ కోట్ల సంవత్సరము లుండునని బోధించఁబడినది. ఈ కాలమును వేయి భాగములుగా విభజించి ఒక్కొక్కదానికి మహాయుగమనియు లేక చతుర్యుగమనియు పేరిడిరి. దీనినే ౧౪ మన్వంతరములుగా గూడ విభజించి పేరు లిడియుండిరి. ఒక్కొక్క మన్వంతరమున ౭౧ చతుర్యుగము లుండును. మన్వంతరములచివర కృతయుగ తుల్యసంధి యుండును. అటులనే సృష్ట్యాదియందు కూడ నుండును. ఇపుడు ౭ వదగు వైవస్వత మన్వంతరము జరుగు చున్నది. దీనిని గణితము వేసిన నిట్లు వచ్చును.

| | | |
|---|---|---|
| ఒకచతుర్యుగమున | | ౪౩,౨౦,౦౦౦ |
| ౭౧చతుర్యుగముల (మన్వంతరము) లో | | |
| ౪౩,౨౦,౦౦౦×౭౧ | = | ౩౦౬౭౨౦౦౦౦ |
| గడచిన ౬ మన్వంతరములలో | | |
| (౬×౩౦౬౭౨౦౦౦౦) | = | ౧౮౪౦౩౨౦౦౦౦ |
| సృష్ట్యాదిసంధితో సహా గడచినసంధులు ౭ | | |
| (౭×౧౭౨౮౦౦౦) | = | ౧౨౦౯౬౦౦౦ |
| వర్తమానమన్వంతరమున గతించిన ౨౭ | | |
| చతుర్యుగములు (౨౭×౪౩౨౦౦౦౦) | = | ౧౧౬౬౪౦౦౦౦ |
| జరుగుచున్నచతుర్యుగమున గడచిన | | |
| కృతయుగము | = | ౧౭౨౮౦౦౦ |
| త్రేతాయుగము | = | ౧౨౯౬౦౦౦ |
| ద్వాపరయుగము | = | ౮౬౪౦౦౦ |
| కలియుగగతాబ్దములు | = | ౫౦౪౩ |
| మొత్తము | | ౧౯౭౨౯౪౯౦౪౩ |

మన వైదికుల సంకల్పము పైనఁ జెప్పినవారితో నేకీభవించుచున్నది. వైజ్ఞానికుల ప్రపంచ మెల్లప్పుడు నూహాపోహములతో నిండియుండి వేలు లక్షలు సం॥లలో నా యా గ్రహముల యాయువును నిర్ణయించుచువచ్చినది. విజ్ఞానముయొక్క స్థితిగతులను పరిశీలించిన, నింతవఱకు వా రొకస్థిరనిర్ణయమునకు వచ్చినటుల గోచరమగుటలేదు. గాన భవిష్యత్తులో నింక నెన్ని వేలము లీ సృష్ట్యాయువునకు వేయించెదరో తెలియదు. ఐనను

త్రికాలాబాధితములగు వైదికసిద్ధాంతములందు మార్పు రాఁజాలదు. ఇదిమాత్రము ఘటికావిఘటికలతోసహా సృష్టికాలమును పొరపాటులేకుండ బోధించుచుండును.

## దేవుఁడు

ఆత్మ పరమాత్మలను గూర్చి ప్రత్యేక గ్రంథములను వ్రాయఁదలంచినను ఇందు కొంత వ్రాయవలసి వచ్చుచున్నది. "తీగె లాగిన పొదంతా కదలు" నన్నట్లు ఆత్మపరమాత్మలలో దేనిని కదలించినను రెండవదికూడ బయటపడును. దానితో పాటు వానివాని గుణకర్మ స్వభావములు, పూర్వ పునర్జన్మలు, మోక్షము మున్నగునవికూడ వచ్చును. ఇందు దేనిని గూర్చి వివరించఁ దలపెట్టినను అన్నిటి నెత్తుకొనినచో నది సమగ్రము కాఁజాలదు. అయినను అత్యంత సంక్షేపముగా వ్రాయఁబడు నీ యంశములను కడుశ్రద్ధతోఁ దిలకింతురుగాక ! యని విన్నవించుచున్నారము.

పరమాత్మ స్వయంభువుగాన మనవలె నతనికి తల్లిదండ్రు లుండిరనియు, నామకరణమొనర్చి యుండవచ్చుననియు భావింప వీలులేదు. ఏలయన నతఁడనంతుఁడు. అతని నామములన్నియు యౌగికములు. కావున దేవుడను శబ్దమును దీసికొనియుండెనా? లేదా? యని తర్కించుకొనుటయు సమంజసము కాఁజాలదు. పవిత్రములైన ఆస్తికభావములు సర్వవ్యాపకములై యున్నపుడు నిరాకారుడును, సర్వసృష్టికి మూలకారణము నగు పరమాత్మయే యుపాసింపఁ బడుచుండెడువాఁడు. రానురాను

విద్యా విజ్ఞానములు క్షీణించిపోఁగా సోమరితనము వృద్ధియై మోక్ష మను ప్రియమైన వస్తువును అంగళ్ళలోఁబెట్టి కారు చౌకగా విక్రయించసాగిరి. అప్పుడా మూలకారణము అవతార పురుషునిగానెంచి రామ, కృష్ణాది లౌకిక నామధేయునిగా తయారు చేయబడెను. భారతీయ సభ్యతను దెలియఁజేయు నితిహాసములందున్న యీ సత్యసిద్ధాంతముల నారయఁజాలక పర ప్రత్యయనేయ బుద్ధులగు కొందఱు పండితమ్మన్యులు "దేవుని మొదట ఒకరూపముగా భావించి రాళ్ళరప్పల్ని పూజించు కుంటూ వస్తూవున్న సంఘము నానాటికి మారుకుంటూ ఒక్కఁడే దేవుడు, సర్వవ్యాప్తి తుదకు నామరూపాలులేని సత్యస్వరూపుడుగా తేలిపోయాడు. ఇప్పుడు మేముచెప్పేది ఆ కొంచెంగూడ ఏమిలేదని చెప్పటమే ఇది క్రమపరిణామమే. "మరియువాడిని" ఆశాస్త్ర కూడ నామరూపాలు లేకుండా చేయాలని మేమంటు న్నామని" నిజపరిశోధనాఫలితమన్నట్లుగా విఱ్ఱవీగుచు, చెప్పుచు, వ్రాయుచున్నారు. ఎఱుగని విషయముల నెఱిఁగి యున్నట్లు నటించుట, బోధించుట, స్వపరవంచనతో కూడినపని. ఆధ్యాత్మికము పేర నీ శాస్త్రము విభజింపఁబడి యుండెను. ఆయా శాస్త్రముఁ జదువని పశ్చాత్యాంధుల కేవరేమి చెప్పఁగలరు ? ఇటువంటి వారినుద్దేశించియే భర్తృహరి "తెలిసియుఁ దెలియని నరుఁదెల్ప బ్రహ్మదేవుని వశమే" యని చెప్పియుండెను. వైద్య, న్యాయ, గణిత, శరీరశాస్త్రాది వివిధ శాస్త్రములలో నెవఁ డేయే శాస్త్రముల నభ్యసించియుండునో, అత డాయా శాస్త్రము లలోనే చర్చించ నర్హుడు. గాని అన్యథా రొమువర్ధ్బ పండితులందు పరిహాస పాత్రుఁడగును.

కారణములేని కార్య ముండదు. కారణము త్రివిధములు. (౧) నిమిత్తకారణము. (౨) ఉపాదాన కారణము. (3) సాధారణ కారణము. నిమిత్తకారణము స్వయముగా కార్యరూపమును దాల్చక రెండవదానియందు పరివర్తనముఁ దీసికొనివచ్చును. కుండలుచేయుటలో కుమ్మరి నిమిత్తకారణము. ఉపాదానకారణము స్వయముగా కార్యరూపముగా పరిణమించఁజాలదు. కాని నిమిత్తకారణముచే వివిధరూపముల నొందుచుండును. కుండలుచేయుటలో మన్ను ఉపాదానకారణము. ఉపాదానకారణమం దుండు గుణములు కార్యమునకు సంక్రమించును. కావున నిట్లు కార్యకారణ భావములతో నీసృష్టి కంతకు నొక నిమిత్తకారణము తప్పక యుండితీఱవలయును. ఉండియున్నదని విచారశీలురగు ప్రతివాని దృష్టియందును స్థిరపడుచున్నది.

సృష్టి నియమపూర్వకముగా విజ్ఞానయుక్తముగా నున్నదని స్పష్టపడుచున్నది గాన, సృష్టికర్త విజ్ఞానవంతుడనియు నియమకర్తయనియు సర్వజ్ఞుడనియు బోధపడుచున్నది.

సృష్టి యనంతమైనదని నేఁటి విజ్ఞానము వేనోళ్ళ చాటుచున్నది. ఈ యనంతసృష్టిని రచియించు సర్వశక్తిమంతుడగు నా పరమాత్మ- అనంతుఁడనియు, సర్వవ్యాపకుఁడనియు గోచరించుచున్నది. ప్రళయమున పరమాణువులుగా కారణరూపమునందున్న ప్రకృతిని వశపఱచుకొని కార్యరూపముగాఁ దీసికొనివచ్చు పరమాత్మ సూక్ష్మాతిసూక్ష్ముఁడై యుండకపోవునెడల

సృష్టి జరుగనేరదని బోధపడుచున్నది. కాన పరమాత్మ సర్వాంతర్యామి యని తెల్లమగుచున్నది.

సృష్టియందు చరాచరము లన్నింటిలో సృష్టి (పుట్టుక) స్థితి (నిర్ణీతవృద్ధి) లయ (నాశన) ములు జరుగుచున్నవి. ఈ నియమములను దీర్ఘముగా విచారించినచో నొక సర్వశక్తిమంతమగు శక్తిద్వారా యీపనులన్నియు జరుగుచున్నవని తెలియుచున్నది. నియమములు నియమకర్తను సూచించును. కదా!

మానవులకు స్వాభావిక భాష యనునది యొకటి లేదు, అక్బరు మొదలగు రాజు లనేకులు పసిబిడ్డలను మానవసంపర్కము లేకుండ పెంచి పరీక్షించి చూచిరి. కాని వారే శబ్దమునుకూడ (మానవునిబోలు) చేయజాలకపోయిరి. ఇప్పుడును తోడేళ్లతో పెంచఁబడిన శిశువు లనేకులు పట్టుకొనబడినవారు మూగవారుగనే కనిపించుచున్నారు. నేర్చుకొననిదే విద్య యెవనికిని వచ్చుట లేదు. గనుక దీర్ఘముగా నాలోచించినచో నాది సృష్టియందు మానవులకు భాషాజ్ఞాన మొసంగిన మహాశక్తి యొకటియుండి తీరవలయు నని స్పష్టపడకమానదు. దీనినే దృష్టియం దిడుకొని పతంజలిమహర్షి తన యోగశాస్త్రమున "స పూర్వేషామపి గురుః, కాలేనానవచ్ఛేదాత్" అని వ్రాసెను. కావున నాతనిని 'సర్వవిద్యాప్రదాత' గురువని యనుచున్నారు.

సర్వాంతర్యామియు, సర్వ వ్యాపకుఁడును, సృష్టి స్థితి లయము లను కార్యము లొనర్చుచు రేయుంబవలు పని చేయుచుండ నొకనిమిష మెవరికైనను కనఁబడి యుండకూడదా! యని

విస్మితులై నాస్తికులు ప్రశ్నింతురు. ప్రశ్నయెంతయో సబబుగా నున్నదనుటలో సందియ మేమాత్రమును లేదు. అతనిని దెలిసికొన దలచిన ప్రతివాడును ఆతనిని సాక్షాత్కరింపఁ జేసికొనఁగలడు. తెలిసికొనుటకు బుద్ధి, వివేకము, జిజ్ఞాస యుండుట ముఖ్యము. అవి లేనివాఁ డడుగడుగున గోతిలోనే పడును. పాపమిట్టి యనుభవములేని విద్యాంసులు కంటికి కగుపడని వస్తువు అభావకోటిలోని దనియే నమ్మి యిట్లు మోటుప్రశ్నలు వేయుచు నుండెదరు. వీరి డాంబికమును గాంచి జాలిపడవలసి వచ్చుచున్నది. నిత్యము మనము ఆకలి, తలనొప్పి, జ్వరము మొదలగు వానిచే పీడింపబడుచునే యున్నాము. కాని యవి దృగ్గోచరమగుట లేదుగదా ! అంతమాత్రమున నవిలేవని భావించ వలసినదేనా ? ఈమధ్య "ఒకనాస్తిక యువక విద్యార్థి వేడివేడి రక్తముప్పొంగుచుండ నిజమేనోయి ! దేవుఁడుంటే కనఁబడ వద్దా? యెవరైనా చూచినారా? యేది చూపించుమని ధీమాగా అడుసవాలు చేసినాఁడు. వెంటనేయొక ఆస్తికబాలుఁడు లేచి గభేలున నొక్కగుద్దు గుద్దెను. నాస్తికు డయ్యో చచ్చితినని యనెను. అంతట నేదీ నొప్పి? నాకండ్ల కగపడ దేమి ? చూపుమనుచు వ్యంగ్యముతో పరహాసించుచు ఆస్తికబాలుడు, "దేవుడుంటే కండ్లకగపడఁడేమిటంటే" ఇలాగేయుండుననెను."

ప్రోటోప్లాజ (చేతనరస) ము కనఁబడుచున్నదా ? నిత్యజీవనములో ముఖ్యమైన వాయువును కండ్లతోఁ గాంచుచున్నామా ? మానవోన్నత దర్శకమగు శబ్దము కంటిచే గ్రహింపఁబడుచున్నదా ? ఆత్మతృప్తికరమగు భోజనపు రుచిని

గ్రహించువది కన్నా? నిజముగా "గ్రొత్త బిచ్చగానికి పొద్దు తెలియదన్న" లోకోక్తిని వీరు సార్థక పఱచుచున్నారు. కావుననే యిట్టి కుంటిప్రశ్నలు.

అదియునుంగాక కంటికొక వస్తువు కనఁబడక పోవుటకు మూఁడు కారణములున్నవి. ౧—అత్యంత సమీపము. కంటియందలి కాటుక కండ్లకగపడకపోవుట అత్యంతసమీప మగుట వలననే కదా! పుస్తకమును ముక్కునకానించి చదువగలమా? ఎందుకని? అత్యంత సమీపమగుటచే కనఁబడనందువలన చదువలేము. ఈశ్వరుఁడు సర్వాంతర్యామియై యత్యంత సమీపమున నుండుటచే గనఁబడఁజాలఁడు, ౨ – అతిదూరమునందున్న వస్తువును నేత్రము చూడఁజాలదు. ఐనను ఈశ్వరుఁడు సర్వవ్యాపకుఁడై సర్వత్ర నిండియుండెను గాన దగ్గఱ దూరము అనక మధ్యస్థ ప్రదేశమునందైనను జూడఁబడ వలయునుగదా! అను సందేహమునకును తావులేదు. కారణమేమన సూక్ష్మాతి సూక్ష్ముఁడగుటచే నట్లును గనఁబడుట యసంభవమే. మఱియు ప్రత్యక్షమగుచున్న దానిని గ్రహింప (చూడ)జాలక పోవుటకు నజ్ఞానము మూఁడవ కారణమగుచున్నది. "వెనుకటి కొకఁడు మేకపిల్లను చంకంబెట్టుకొని మేడలన్నియు వెదకినాఁడట! ఇప్పుడును చెవిలో కలము బెట్టుకొని ఇల్లంతయు వెదకు వ్రాయసకాండ్రెందరో కలరు" ఇట్లెందుకు జరుగును? అజ్ఞానకారణము చేతనేగదా! కావున నీశ్వర సాక్షాత్కారమందు నజ్ఞాన మొక యడ్డకట్టగా నున్నది. దానిని పాఱఁదోలుటకు ప్రయత్నించినచో దప్పక ఈశ్వరసాక్షాత్కారము జరుగఁగలదు.

నిత్యము ప్రతిజీవికిని సమానముగా లభించు అవశ్యం భావ్యములగు జన్మమరణములను జూచుచునే యున్నారము. వికలాంగులుగా పుట్టువారికి వారివారి పూర్వజన్మ కర్మల ననుసరించి జన్మ యొసంగఁబడినదని అట్లా సగున్యాయకారియే యీశ్వరుఁడనియు వివేకశీలురు గమనించఁదగును.

మరణమనిన ప్రతిజీవికిని భయము కలుగుచున్నది. అవ యవములన్నియు పటుత్వ హీనములై బ్రతుకుభారముగాదోఁచు వానికిఁగూడ జావనిన భయమేకదా ! ఇట్టి పరిస్థితులలో తానభి లషించని చావెట్లు లభించుచున్నది ? మనకర్మల ననుసరించి యాయువు చనిపోయిన తరువాత ననుభవింప, శేషించిన కర్మ ఫలితము ననుభవింపఁజేయుటకై ఆత్మను ఈశరీరమునుండి వేఱుచేసి వేఱొక శరీరమునఁజేర్చుచున్నాఁడా పరమేశ్వరుడు. ఒకప్పు డొక ఆంగ్ల విద్వాంసునకు దేవుఁడు లేఁడను పిచ్చిపట్టి ప్రతిచోట God is no where అని సైనుబోర్డు తగిలించెను. తుదకు తన నోటను పీఁఫుమీఁదనుగూడ ముద్రవేయించు కొనెను. మరణకాల మాసన్నమయ్యెను. పూలరంగనివలె సుఖ ముగాఁ గాలముగడపిన దొరగారికి ప్రాణము తడఁబడసాగెను. మంచముపట్టెను. అట్టి పరిస్థితులలో నొక కుఱ్ఱవాఁడచటకు వచ్చెను. క్రొత్తగా నింగ్లీషునేర్చుకొను చుండుటచేఁ గాబోలు; నాకుఱ్ఱఁడు కనఁబడిన సైనుబోర్డు లన్నింటిని చదివి వేయుచుండెను. అతనికి శబ్దజ్ఞానము సరిగా లేనందున God is no where అనుటకు బదులు God is no wre e అని యనెను. మరణోన్ముఖుఁడైన దొరగారికీ వాక్యములు సూటిగా బాడుచు

కొనెను. కాని పాపమేమి చేయగలడు? అంత్యకాలమున తన వివశదశకును, మూర్ఖత్వమునకును, విలపించుచు నటులనే పరలోకగతుడయ్యెను.

దేవుని సాక్షాత్కారము పొందదలచిన ప్రతివాని హృదయమునను రోజున కెన్ని పర్యాయములో దేవుడు సాక్షాత్కరించు చుండును. కాని పాప పుణ్య విచారణచేయజాలని మానవరూప పశువులు గ్రహింపజాలరని ఆస్తిక శిఖామణు లను చుందురు. దొంగతనము, వ్యభిచారము మొదలగు దుష్కార్యములు చేయునపుడు హృదయమున జనించు దడ, లజ్జ, భయము, దేవునిద్వారా నిరోధింపబడుటకై జరుగు సూచనలనియు, సత్కార్యారంభములం దుత్సాహముకూడ నిటులనే దైవ ప్రేరణయనియు వారనెదరు.

ఈ తీరున భగవంతుని సాక్షాత్కరింప జేసికొనగలిగి యుండ నింకను ప్రత్యక్షము కావలయునని మొండిపట్టు పట్టు నహమ్మన్యులకేమి ప్రత్యుత్తర మీయవలయునో కదా? ఇట్టి వంటి యొక ప్రశ్నకు మహర్షి దయానంద ఋక్కులి చక్కగా సత్యార్థప్రకాశమున సమాధాన మొసగి యుండెను. జిజ్ఞాసువుల కత్యంతోప యుక్తముగా నుండునని భావించి దానినిట నుదహరించు చున్నారము.

ప్రశ్న:- మీరు ఈశ్వరుడున్నాడని చెప్పుచున్నారు. గాన నతడున్నాడని యెట్లు సిద్ధాంతపరచ గలరు?

ఉత్తరము:- ప్రత్యక్షాది ప్రమాణములన్నింటిచేతను.

ప్ర.- ఈశ్వరునియందు ప్రత్యక్షాది ప్రమాణము లెన్నటికిని ఘటింపబడ జాలవు.

ఉత్త:-

ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞాన మవ్యపదేశ్య
మవ్యభిచారి వ్యవసాయాత్మకం ప్రత్యక్షమ్.

న్యాయదర్శ. అ. ౧. సూ. ౪.

"శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణ మనస్సులకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, సుఖ, దుఃఖ సత్యాఽసత్యాది విషయములతో సంబంధము కలుగుటవలన, నేజ్ఞానముత్పన్నమగుచున్నదో, అది ప్రత్యక్షము. కాని యది భ్రమరహితమై యుండవలయును. మనము బాగుగా విచారించినచో నింద్రియములతోను, మనస్సుతోను, గుణములు ప్రత్యక్ష మగుచున్నవే కాని గుణికాదు. త్వచాది నాలుగింద్రియములచే స్పర్శ, రూప, రస, గంధముల జ్ఞానము కలుగుటవలన గుణియగు పృథివి ఆత్మతోఁగూడిన మనస్సునకుఁ బ్రత్యక్షమగుచున్నది. అటులనే యీ ప్రత్యక్ష సృష్టియందలి రచనా విశేషము మొదలగు జ్ఞానాది గుణములు ప్రత్యక్షమగుట వలనఁ బరమేశ్వరుఁడు ప్రత్యక్షమగుచున్నాఁడు. ఆత్మ మనస్సును, మనస్సు ఇంద్రియములను ఏదేని విషయమందుఁగూర్చి నడుపునపుడును ; దొంగతనము మొదలగు చెడుపనులనుగాని, పరోపకారాది మంచి కార్యములను గాని, చేయుటకు నేక్షణమందు ప్రారంభము చేయునో, ఆక్షణమున జీవునియొక్క యిచ్ఛాజ్ఞానాదులు ఆ వాంఛిత విషయములందు బ్రవేశించును. అప్పుడాత్మతో

చెడుపనులు చేయుటయందు భయమును, శంకయు, లజ్జయు, మంచిపనులు చేయుటయందు నిర్భయమును, నిశ్శంకయును, ఆనందోత్సాహములును పుట్టుచున్నవి. అవి జీవాత్మనుండి కలుగునవి కావు. పరమాత్మనుండియే కలుగును. జీవాత్మ శుద్ధుఁడై పరమాత్మయొక్క విచారమున తత్పరుఁడైనపు డాతనికి నాసమయమునందే (ఆత్మపరమాత్మలి) రువురును ప్రత్యక్షమగుచున్నారు. పరమేశ్వరుఁడే ప్రత్యక్షమగునపుడు అనుమానాదులచేఁ బరమేశ్వరునియొక్క జ్ఞానముకలుగుటయందు సందేహమేమి? కార్యమునుగాంచి కారణ మనుమానించఁ బడును గదా!"
(సత్యా. ప్ర. స ౭. ము)

ప్రతివృక్షము, పుట్ట, ఆకు, అలము ఆపరమాత్మనే కీర్తించుచు నతని గుణగాన మొనర్చుచు నతని యస్తిత్వమునే ఋజువు చేయుచున్నవి. పరిణామవాదులగు నాస్తికులకీ గాఢమైన హెచ్చరిక నిచ్చుటకే కాఁబోలు, యజుర్వేదము "ఉదుత్యం జాతవేదసం, దేవంవహన్తి కేతవః" అని చెప్పుచున్నది. ఇనన్నియు నిశ్చయముగా నా పరమాత్మనే సూచించు కేతువు (పతాకము) లట.

వైజ్ఞానికులపేర దేవుఁడు లేఁడని దుష్ప్రచారముచేయు విద్యాధికులును గలరు. వారిని వెంటాడు అర్ధశిక్షితులు, నల్పశిక్షితులు నగు యువకు లనేకులు గలరు. గాన కొందఱు వైజ్ఞానికుల వాక్యముల నిచట నుదహరించుట యవసరమని ప్రతీతమగుచున్నప్పటికిని గ్రంథవిస్తర భీతిచే నిచట నుదహరించ జాలక పోవుచున్నందులకు పాఠకులు మన్నింతురుగాక.

# ఆత్మ

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి శ్రుత్వా ప్యేనం వేద నచైవకశ్చిత్॥

ఆత్మతత్త్వ జ్ఞానవిశారదులు ఆత్మనుగూర్చి చెప్పుచున్న పుడు కొందఱాశ్చర్య చకితులై కండ్లు తెఱచుకొని చూచు చుందురు. కొందఱద్దానిని ఆశ్చర్యముగా ముచ్చటించుకొందురు. మరికొందఱాశ్చర్యాన్వితులై వినుచుందురు. ఇంత కీపరతత్త్వ మును వినియుండగూడ దెలిసికొనఁజాలనివారు కొందఱుందురు.

ఆత్మనుగూర్చి పలువురు పలువిధములుగాఁ దమతమ బుద్ధుల ననుసరించి నిర్ణయించుకొనుచు వచ్చిరి. కాని యవి యన్నియు వారి స్వసిద్ధాంతములుగనే యున్నవి. సర్వమాన్య ములు గాఁజాలకపోయెను. కావున నట్టి యవైదిక వాదముల విచారించి చూచినచో నుత్తరోత్తర వాదములు పూర్వపూర్వ వాదములను ఖండించుచున్నట్లు స్పష్టమగును. ఈవిషయమును గూర్చి సదానందులు తన "వేదాంతసార" మను గ్రంథము యొక్క ౧౯వ ఖండమున నిట్లు వివరించిరి.

అతి ప్రాకృతులు:- "ఆత్మావై జాయతేపుత్రః" అను వాక్యము నాధారముఁజేసికొని తనవలె పుత్రుని ప్రేమించు చుండుటచే పుత్రుఁడు బలిసినను, చిక్కినను, తానేబలిసినటుల, చిక్కినటుల భావించు చుండుటచే పుత్రుఁడే ఆత్మయని వచించెదరఁట.

చార్వాకులు:— ఉపనిషత్తులలోని "సవా ఏషపురుషో అన్నరసమయః" అను వాక్యము ననుసరించి కాలుచున్న యింటి యందు స్వపుత్రాదుల పరిత్యజించి తాము మాత్రమే బయటికి వచ్చుచున్నారు గాన పుత్రుఁడాత్మగాడనియు; నేను స్థూలుఁడను, కృశుఁడను అను అనుభవముల వలన స్థూలశరీరమే ఆత్మయని నుడివెదరట.

అపర చార్వాకులు:— ఇంద్రియముల యభావమున శరీర చలన మభావమగుటచేతను, నేను గుడ్డిని, చెవిటిని, అను ప్రయోగానుభవములవలన స్థూలశరీర మాత్మ కాఁజాలదు, కావున ఇంద్రియము లాత్మయని పలికెదరఁట.

మరికొందఱు చార్వాకులు:— ప్రాణాభావమున నింద్రియములు నిరుపయోగము లగుచున్నవి. అప్పుడు నేనాఁకలిఁగొంటిని. దాహము గొంటిని. అని యనుచున్నాముగాన ప్రాణమే ఆత్మయని నిర్వచింతురఁట.

అన్యచార్వాకులు :— "ప్రాణాదులు స్తంభించినను నేను సంకల్పవంతుఁడను ; వికల్పవంతుడను," అను నిత్యానుభవముల వలన ప్రాణము ఆత్మకాజాఁలదు. కాని సంకల్ప వికల్పముల నొనర్చు మనస్సే ఆత్మయని సిద్ధాంతీకరించెదరు.

బౌద్ధులు:— కర్త లేనిచో కరణము లశక్తములు గాన నేను కర్తను, భోక్తను, అను నిత్యాది వాక్యముల యనుభవముచే బుద్ధియే ఆత్మయని నొక్కిచెప్పుదురఁట.

ఇక తార్కికులలో కొందఱు :— బుద్ధ్యాదులు అజ్ఞాన సమయమున లయమగుచుండుట కనఁబడుటచేతను, నేనజ్ఞుఁడను,

అజ్ఞానినను ప్రయుక్తవాక్యానుభవములచే నజ్ఞానమే ఆత్మ కావలయునని వాదింతురు.

సుషుప్త్యవస్థయందు ప్రకాశము, అప్రకాశము, రెండు నుండుటవలన నేను నన్నునెంతుగఁజాలక పోతిని. మైమరచి నిద్రపోతిని అనువాక్యములను ప్రయోగించుచున్నాము. గాన అజ్ఞానోపహాత చైతన్యమే ఆత్మయని, యింకొకరనుచున్నారు.

కాని బౌద్ధులలో నింకొకరు "అసత్ ఏవ ఇదం అగ్రే ఆసీత్" ను నుపనిషద్వాక్యము నాధారముఁ జేసికొని సుషుప్తిలో సర్వమభావముగ నుండును. నేను లేకుంటినని యనుచున్నాము. గాన శూన్యమే ఆత్మయని నిర్వచించెదరు.

సదానందులు:—౨౦వ ఖండమునం దీవాదములనన్నింటిని పూర్వపక్షు మొనర్చుచు స్థూలమును, చక్షువును, మనస్సును గాక చిన్మాత్రమైన ఆత్మ; శరీరాదులకంటె భిన్నమైనదని నిరూపించెను.

జడ, చేతనములను మనము ప్రత్యక్షముగాఁ జూచుచునే యున్నాము. నేను, నాశరీరము, నాతల యని వ్యవహరించుచు దేహముకంటె వేఱగు నొకవస్తువును నిరూపించుకొనుచునే యున్నారము. పంచభూతాత్మకమైన శరీరమున చైతన్యశక్తి యైన యీయాత్మ మరణానంతరమున స్పష్టముగా బుజువగు చున్నది. ఇదియును పంచభూతసమ్మేళనముచేఁ బుట్టినదగుచో మరణమేల తటస్థించును?

ఇంతియకాక "ఆత్మ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలందు శరీరముకంటె భిన్నమైనదిగ ప్రకటితమగుచుండ భిన్నముకాదని

వాదించువారి నిగ్రహమునకు మేరయుండజాలదు. ఆత్మతత్త్వ వేత్తలీ శరీరమును పంచకోశములుగా విభజించిరి. పంచకోశ వివేచనవలనను, ఆత్మ బోధపడగలుగుచున్నది.

"ఒకటి:- "అన్నమయకోశము." ఇదిత్వక్కు మొదలు కొని అస్థిపర్యంతము పృథివీమయసముదాయము.

౨:- "ప్రాణమయకోశము. "అనగా లోపలినుండి వెలికి బోవుప్రాణము వెలుపలినుండి లోపలికిబోవు "అపానము" నాభిస్థానమునందుండి శరీరమంతటకు రసమును లభింపఁజేయు "సమానము"కంఠమునందుండి అన్నపానముల నీడ్చుకొనిపోవుచు బలపరాక్రమములను గలుగజేయు "ఉదానము" జీవుఁడు శరీర మంతట చేష్టాది కర్మలొనర్చు "వ్యానము" అను నీపంచప్రాణ ములతోఁ గూడినది.

3- "మనోమయకోశము" దీనియందు మనస్సుతో సహంకారమును, వాక్పాణి పాద పాయూపస్థము లను పంచ కర్మేంద్రియములును గలవు.

౪:- "విజ్ఞానమయకోశము." దీనియందుజీవుఁడు జ్ఞానాది వ్యవహారములనుగావించు బుద్ధియు, చిత్తమును శ్రోత్ర. త్వక్,చక్షుర్, జిహ్వా, ఘ్రాణములనుపంచజ్ఞానేంద్రియములును గలవు.

౫:- "ఆనందమయకోశము," దీనియందుఁ బ్రీతి ప్రస న్నత, మొక్కువ, తక్కువ, యానందములునుగలవు. ఆధారము కారణరూపప్రకృతి. ఇవి పంచకోశములనఁబడును. వీనిచేతనే

జీవుఁడు సమస్తవిధములగు కర్మోపాసనాది జ్ఞానాది వ్యవహార ములను జేయును. అవస్థలుమూఁడు. ౧-జాగ్రదవస్థ. ౨-స్వప్నా వస్థ. ౩ సుషుప్త్యవస్థ. శరీరములుమూడు. ౧-శనంబడుస్థూల శరీరము. ౨-పంచప్రాణములు. పంచజ్ఞానేంద్రియములు, పంచ సూక్ష్మభూతములు, మనస్సు, బుద్ధియనుసీ౧౭ తత్త్వములతోఁగూడి నదిసూక్ష్మశరీరము. ఈసూక్ష్మశరీరము జన్మమరణాదుల యం దునుజీవునితో నుండును. ఇది రెండువిధములు. ౧:- భౌతికము. అనగా సూక్ష్మభూతములయొక్క అంశములచేఁ జేయంబడినది. ౨:- స్వాభావికము అనగా జీవునియొక్క స్వాభావిక గుణ రూపమై యున్నది. ఈ శరీరము ముక్తియందు నుండును. దీనితోడనే జీవుఁడు ముక్తియందు సుఖమనుభవించును. ౩-వది కారణశరీరము. దీనియందు జీవుఁడు సుషుప్తియను గాఢనిద్రను బొందును. ఇదిప్రకృతి రూపమగుటచే సర్వత్ర విభువై జీవు లందఱికి నొక్కటిగా నున్నది. ౪-వది తురీయ శరీరమనబడును. దీనియందు సమాధిచే పరమాత్మయొక్క ఆనందస్వరూపమున జీవులు మగ్నులగుదురు. ఈ సమాధి సంస్కారజన్య శుద్ధశరీర ముయొక్క పరాక్రమమే. ముక్తియందును దగిన సహకారియై యుండును. ఈ సమస్త కోశములనుండియు, అవస్థలనుండియు, జీవుఁడు వేఱై యున్నాఁడు. అవస్థలనుండి జీవుఁడు వేఱుగా నున్నాఁడనుట సర్వులకుం దెలియును. ఏలయన—మరణించి నపుడు జీవుఁడు వెడలిపోయెనని అందఱును చెప్పెదరు. కావున జీవుఁడే అన్నింటికిం బ్రేరకుఁడును, అన్నింటిని ధరించువాఁడును, సాక్షియు, కర్తయు, భోక్తయు, ననంబడును. ఎవండైనను, జీవుఁడుకర్తయు, భోక్తయు గాఁడనినచో నట్టివాఁడు అజ్ఞానియు

వివేకము లేనివాఁడునని యెఱుంగవలయును. ఏలయన, జీవుఁడు లేనియెడల నీసమస్త జడపదార్థములకును సుఖదుఃఖముల యొక్క అనుభవముగాని, పాపపుణ్యకర్తృత్వముగాని, కలుగం జాలదు. కాని వీని సంబంధముచే జీవుఁడు పాపపుణ్యముల కర్తయు, సుఖదుఃఖముల భోక్తయు నగుచున్నాఁడు. ఇంద్రియ ములకుఁ దమతమ అర్థములతోను, మనస్సునకు ఇంద్రియ ములతోను, ఆత్మకు మనస్సుతోను, సంబంధముకలిగి అది ప్రాణ ములను ప్రేరేపించి మంచిచెడ్డ కర్మలయందుఁ బెట్టినపుడే బహి ర్ముఖమగును. అప్పుడే లోపలినుండి, మంచి కార్యములం దానందమును, ఉత్సాహమును, నిర్భయత్వమును, చెడు కార్య ములందు భయమును, శంకయు, లజ్జయు, నుత్పన్నములగును. అది అంతర్యామియగు పరమాత్మచేఁ గలుగుశిక్ష. ఈ శిక్ష కనుకూలముగ వర్తించువాఁడే ముక్తిజన్య సుఖములను పొందును: దీనికి విపరీతముగ వర్తించువాఁడు బంధజన్య దుఃఖము లనుభవించును.

( సత్యా. ప్ర. స. ౯. ము. )

Modern science and modern thought యను గ్రంథ మును వ్రాసిన ( Samual Laing ) సేమ్యుల్ లైంగు జీవాత్మ విష యమున మాకు పూర్ణజ్ఞానములేదని విశ్వసించి యుండెను. హార్బర్టుస్పెన్సరు విశ్వమును శాసించు శక్తియొకటి గలదని యొప్పుకొనెను. అయినను యూరోపులో నాస్తికత్వ మధిక ముగా నున్నది. తదనుకరణమొనర్చు ననేకులు జీవేశ్వరుల యొక్క కల్పితసిద్ధాంతములతో ప్రాచీనమహర్షుల శాస్త్ర

గ్రంథములన్నియు నిండియున్నవనియు, వారు శరీరములనుకోసి వర్తమానమున పాశ్చాత్యులు చేయుచున్నటుల నన్వేషించి యుండలేదనియుఁ బరిహాసించుచున్నారు. యూరోపు అమెరికా విద్వాంసులు శల్యవిద్యలో ప్రస్తుతము మనకంటె నాశ్చర్యకరమైన యున్నతిని బడసియున్నా రనుటలో సందియము లేదు. కాని ప్రాచీనఋషులు సుశ్రుతాదుల కాలమునం దిటువంటి యున్నతావస్థయందే యుండిరి. కనుక నానాడే ప్రాచీన ఋషులు శరీరములోని పంచకోశములను తెలియంజేసిరి. నేఁడు ప్రాణిశాస్త్రజ్ఞుఁడైన 'కీటు' మహాశయుఁడు కప్ప, కుందేలు, సర్పము, మున్నగు ననేక ప్రాణులను ఛేదనభేదన మొనర్చి వీటియందును నీ క్రింది వస్తువు లగపడుచున్నవని వ్రాసెను.

౧. Colon or Body Cavity.
౨. Alimentary Canal.
౩. Vascular system.
౪. Respiratory system.
౫. Excretory system
౬. Nervous System.
౭. Sense Organs.
౮. Reproductory system.
౯. Development.
౧౦. Locomotion.

తుదకు పరిపరీక్షణ ప్రయోగములవలన ప్రాణి మూర్ఛపోయిన తర్వాత దాని హృదయాంగము కొన్నినిముషములవఱకు – అప్పుడప్పుడు కొన్ని గంటలవఱకు స్పందించుచున్నటుల ఋజువైనది. క్లోరోఫారమిచ్చిన తర్వాత కప్ప హృదయము ౫ దేసి గంటలవఱకు కొట్టుకొనుచుండుట గాంచఁబడెను. మానవునకు మత్తుమందు పెట్టినతర్వాత జ్ఞానతంతువులు మూర్ఛపోయినను హృదయము మాత్రము మందగతితో నడచుచునే

యుండును. కావున జీవాత్మకు విశేషసంబంధము హృదయము తోనున్నదని రుజువగుచున్నది. ఈ విషయమే యజుర్వేదమునం దీవిధముగా వర్ణించబడినది.

హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మేమనః శివసంకల్ప మస్తు యు ౩౪ అ ౬.

ఈ దేశమున ఋషులు ఛేదన భేదన క్రియలు చేయు చున్నప్పుడే ఈమంత్రాశయమును గ్రహించి పంచకోశములను విడఁదీయఁ గలిగియుండిరి. శరీరమున పంచకోశము లున్నవని చెప్పుటయేగాక జీవమునకు నివాసము హృదయమని (యజుః ౩౪. ౬.) కూడ నిర్వచించి యుండిరి.

ఇంతకుపూర్వము వివరించబడిన "పంచకోశ" వర్ణన ప్రాణి శాస్త్రముయొక్క ఛేదన భేదన ప్రయోగములవలన నుపలబ్ధమైన జ్ఞానమునకు రెండవరూపమై యున్నది. ఉదా.—ఒకగది యందు నూఱు దానిమ్మకాయ లుంచఁబడియుండెను. ఒకఁడు దానిమ్మకాయలను ౨౦ చొప్పున ౫ వరుసలుగా గదిలో నుంచు చున్నాఁడు. ఇంకొకఁడు పదేసిచొప్పున పోగులుపెట్టి వాటిని పదివరుసలు చేయుచున్నాఁడు. మొదటివాఁడు వాటిని ౫ భాగ ములుగ విభజించెను. రెండవవాఁడు ౧౦ భాగములుగ విభ జించెను. రెండును సత్యములే. కాని వాటినుంచిన క్రమములు మాత్రము వేఱువేఱుగానున్నవి.

ఇటులనే ఇప్పటిపాశ్చాత్యపండితులు శరీరమును యుక్తి పూర్వకముగాకోసి పై పదిసంఖ్యలో దానిని విభక్తముచేయు చుండఁగా ప్రాచీనమహర్షులువానిని పంచకోశములుగాసరిపెట్టిరి.

౧— Colon (కోలన్) భోజనవాహినీ నాళమునకు సహచరనాళము.

౨—Alimentary canal (ఎలిమెంటరీ కెనాల్) భోజన వాహినీనాళము.

3—Development (డెవలప్‌మెంటు) అంతరీయ శరీర వృద్ధి.

౪— Locomotion (లోకోమోషన్) గతిసంబంధ భాగము.

ఈ పైనాలుగుభాగములను బుద్ధు లొక్క అన్నమయ కోశమున సమావేశపఱచియున్నారు.

౫—రిస్పాయిరేటరీసిస్టమ్ = శ్వాసక్రియావిభాగము.

౬—వైస్కులర్ సిస్టమ్ = శరీరమంతటికి రసమునుపంపు రక్తవాహినీభాగము. కావునన ౫-౬ భాగములు "ప్రాణమయకోశమున" సమావేశమగుచున్నవి.

౭—Nervous System (నర్వస్‌సిస్టమ్) స్నాయు విభాగము.

ఇది యజుర్వేదముయొక్క అధ్యా-౩౫-౭ వమంత్రమున శకపిండమునగ చెప్పబడది. మనస్సువలకు సుఖదుఃఖములను చేర్పుట కిదియే సాధనము.

౮—Reproductory System (రిప్రొడక్టరీసిస్టమ్) జననేంద్రియసంబంధభాగము. ఇది కర్మేంద్రియభాగమగుట వలనను మరియు,

౯. (Excretory System) (ఎక్స్క్రిటరీ సిస్టమ్) మలమూత్రత్యాగభాగములు. వీటికి నుపస్థేంద్రియాదులతో సంబంధ ముండుటవలనను, ఈ ౭, ౮, ౯ భాగములు మనోమయకోశమున సమావేశమగుచున్నవి.

౧౦ — Sense organs (Intelligence సెన్సుఆర్గన్సు) జ్ఞానేంద్రియములు. ఈ ౧౦వభాగము "విజ్ఞానమయకోశమున" సమావేశమగుచున్నది. వీలయిన, నిందు శ్రోత్ర, నాసికాదులు వచ్చుచున్నవి.

౧౧—Hibernation (హాఇబర్నేషన్) గాఢనిద్ర. ఇది ఆనందమయకోశమున సమావేశమగుచున్నది. వీలయిన, నిందు సుఖదుఃఖములు తెలిసికొనంబడజాలవు.

వైశేషికదర్శనమునకు ప్రశస్తపాదభాష్యమగు ప్రశస్త భాష్యమునందు మిక్కిలి తేటతెల్లముగా నుపమానములద్వారా ఆత్మయొక్క అస్తిత్వపృథక్త్వములు నిరూపించఁబడియున్నవి.

ఆత్మత్వాభిసంబంధా దాత్మా తస్య సౌక్ష్మ్యా దప్రత్య క్షత్వే సతి కరణైః శబ్దా ద్యుపలబ్ధ్యనుమితైః శ్రోత్రాదిభిః సమధిగమః క్రియతే.

"ఆత్మ అతిసూక్ష్మమగుటవలనఁ బ్రత్యక్షము కాకుండఁగా శబ్దము మున్నగు గుణముల నాకరములయిన శ్రోత్రము మున్నగు నింద్రియములచే పొందబడుచున్నది."

వాస్యాదీనాం కరణానాం కర్తృప్రయోజ్యత్వదర్శనాత్ శబ్దాదిషు ప్రసిద్ధ్యా చ ప్రసాధకోఽనుమీయతే.

"కొడలి మొదలగు కరణములను కర్తృప్రయోగములుగా గాంచుచుండుటచేతను, శబ్దాదులందు ప్రసిద్ధియగుటచేతను, అనగా కార్యములగు శబ్దాదుల కాశ్రిత మావశ్యకమగుటచే ప్రసాధకు డనుమానించబడుచున్నాడు."

న శరీరేంద్రియమనసా మజ్ఞత్వాత్ న శరీరస్య చైతన్యం ఘటాదివ ద్భూతకార్యత్వాత్ మృతే చాసమ్భవాత్

"శరీరేంద్రియ మనములు అజ్ఞములగుటచే నాత్మ కాఁజాలవు. ఘటాదులవలె భూత(పంచభూతముల) కార్యమగుటచేతను, మృతుడైన తరువాత నసంభవమగుటచేతను చైతన్యము శరీరము కాఁజాలదు."

నేన్ద్రియాణాం కరణత్వాత్ ఉపహతేషు విషయాసాన్నిధ్యే చానుస్మృతిదర్శనాత్

"అనుభవస్మరణాదులయం దేదైన నొకటి యుపహతమైనప్పుడు, విషయములు అసాన్నిధ్యములైనప్పుడు స్మృతి నశించుటచే అనుభవము కాజాలకున్నందున, కరణములగుటచేతను, ఇంద్రియము లాత్మ కానేరవు."

నాపి మనసః కరణాన్తరానపేక్షిత్వే యుగప దాలోచనస్మృతిప్రసఙ్గాత్, స్వయంకరణభావాచ్చ"

"కరణాంతరము లనపేక్షితమైనప్పుడు ఒకేపర్యాయము ఆలోచనస్మృతి ప్రసంగమగుట చేతను, అనగా కర్తవలె నేక

కాలమునం దనేక కార్యములు చేయజాలమిచేతను, ఏలయన నది స్వయముగ కరణమగుటచేతను,మనస్సు ఆత్మ కాజాలదు.”

పరిశేషా దాత్మకార్యత్వాత్ తేనాత్మా సమధిగమ్యతే.

“ఇట్లు పరిశేషించి ఆత్మ కార్యత్వ మగుటచే నాత్మ సమధిగమ మగుచున్నది.”

“శరీర సమవాయినీభ్యాం చ హితాహితప్రాప్తి పరిహార యోగ్యాభ్యాం ప్రవృత్తినివృత్తిభ్యాం రథకర్మణా సారథివత్ ప్రయత్నవాన్ విగ్రహ స్యాధిష్ఠాతాఽ నుమీయతే”

“శరీరావయవములద్వారా హితాహితముల ప్రాప్తి పరిహార యోగ్యములందు ప్రవృత్తినివృత్తుల నొనర్చుటను బట్టి రథకర్మయందు సారథివలె ప్రయత్నవంతుడును, విగ్రహాధిష్ఠాతయునగు నాత్మ అనుమానించ బడుచున్నాడు.”

ప్రాణాదిభిశ్చేతి కథం? శరీరపరిగృహీతే వాయౌ వికృతకర్మదర్శనాద్భస్త్రాధ్మాపయితేవ”

“ప్రాణాదుల వలనను అనుమానించ బడుచున్నాడు. అది యెట్లనగా? — శరీర గృహీతవాయువునందు వికృత దర్శనము (క్రిందికి, మీదికి ప్రక్కలకు నడచుట) కనుపించు చున్నది గాన తోలుతిత్తి నూదువానివలె;”

నిమేషోన్మేషకర్మణా నియతేన దారుయంత్రప్రయోక్తేవ.

“నిమేషోన్మేషకర్మమునకు నియమముగా దారుయంత్ర ప్రయోక్త వలె;”

దేహస్య వృద్ధి క్షత భగ్న సంరోహణాది నిమిత్తత్వాత్ గృహపతిరివ.

"దేహవృద్ధి క్షతభగ్న సంరోహణాది నిమిత్తముల వలన గృహపతివలె;

అభిమతవిషయ గ్రాహకకరణ సమ్బన్ధనిమిత్తేన మనః కర్మణా గృహకోణేషు పేలక ప్రేరక ఇవ దారకః.

"అభిమత విషయ గ్రాహకమైన కరణముతో సంబంధ నిమిత్తమగు మనస్సుయొక్క కర్మద్వారా ఇంటిమూలలో - గోలీ - గోలీలు ఆడుకొను పిల్లవానివలె;

నయన విషయాలోచనానన్తరం రసానుస్మృతిక్రమేణ రసనవిక్రియాదర్శనా దనేక గవాక్షాన్తర్గత ప్రేక్షకవ దుభయ దర్శీ కశ్చి దేకో విజ్ఞాయతే.

"నయనవిషయములగు పదార్థముల గాంచినపిదప రసానుస్మృతిక్రమమునను సరించి రసన (జిహ్వ) విక్రియాదర్శన ముచే ననేక గవాక్షాన్తర్గత ప్రేక్షకునివలె నుభయదర్శియగు నొకానొకటి విజ్ఞమగుచున్నది"

సుఖ దుఃఖేచ్ఛా ద్వేషప్రియత్నైశ్చ గుణై ర్గుణ్యను మీయతే

"సుఖ దుఃఖ ఇచ్ఛా ద్వేషప్రయత్నము లనుగుణములు ద్వారా గుణ్యి మనుమానించబడుచున్నది"

తే చ న శరీరేంద్రియగుణాః. కస్మాత్? అహంకారే ణైకవాక్యతాభావాత్ ప్రదేశవృత్తిత్వా దయావద్ద్రవ్యభావి

త్వాత్ బాహ్యేన్ద్రియా ప్రత్యక్షత్వాచ్చ తథాఽహం శబ్దే నాపి పృథివ్యాది శబ్దవ్యతిరేకాదితి.

"అవి శరీరేంద్రియగుణములు కాజాలవు. ఏలయన అహంకారముతో నేకవాక్యత్వ ముండఁజాలఁ బోవుటచేతను, ఏకప్రదేశవృత్తిత్వ మగుటచేతను, యావద్ద్రవ్యభావిత్వము కానందునను, బాహ్యేంద్రియములకు ప్రత్యక్షము కానందువలనను, అహంశబ్దముచేత పృథివ్యాదిశబ్దములకు వ్యతిరేక మగుటచేతను, ప్రత్యేకించి యవి ఆత్మగుణములు"

తస్య గుణాః బుద్ధి సుఖ దుఃఖేచ్ఛా ద్వేషప్రయత్న ధర్మాధర్మ సంస్కార సంఖ్యాపరిమాణ పృథక్త్వ సంయోగ విభాగాః॥ ౧౮॥

"బుద్ధి, సుఖ, దుఃఖ, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, ధర్మ, అధర్మ, సంస్కార, సంఖ్య, పరిమాణ, పృథక్త్వ, సంయోగ, విభాగ" అను నీ ౧౮ ఆత్మగుణములు.

ఆత్మ లిఙ్గాధికారే బుద్ధ్యాదయః ప్రయత్నాన్తాః సిద్ధాః ధర్మాధర్మావాత్మాన్తర గుణా నామకరణత్వ వచనాత్ సంస్కారః స్మృత్యుత్పత్తౌ కారణవచనాత్ వ్యవస్థావచనాత్ సఙ్ఖ్యా పృథక్త్వ మప్యతఏవ తథాచాత్మేతి వచనాత్ పరమ మహాత్పరిమాణమ్. సన్నికర్షజత్వాత్ సుఖాదీనాం సంయోగః॥ తద్వినాశకత్వా ద్విభాగ ఇతి॥

"ఆత్మలింగాధికారమందు బుద్ధ్యాది ప్రయత్నాంతము వఱకు సిద్ధించబడినవి. శేషించిన గుణము లిచట వ్యాఖ్యానించబడినవి. విజ్ఞులగు పాఠకమహాశయు లూహించెదరుగాక!

కణాదమహర్షి తన వైశేషిక దర్శనమం దాత్మ ప్రత్యక్షమునకై యిచ్చిన హేతువులు పండితపామరు లందఱకు తెలియునటులున్నవి. విచారశీలు రెన్నియో అల్పసందేహము లున్న నీ మూలమును మనన మొనర్చుకొ్లెంది తీర్చుకొనఁ గలుగుదురు. గ్రంథవిస్తర భీతిచే నీ ప్రకరణములను పెంచఁ జాలకపోయినందులకు విచారమును వెలిబుచ్చుచున్నారము. కాని పాఠకులు, అభిమానులు మా యీకార్యమునకు చేదోడు వాదోడైై ప్రోత్సాహ మొసఁగుచో నచిరకాలములోనే ఆత్మను గూర్చి సంపూర్తిగా నింకొకభాగమును వ్రాయ సంకల్పించి యుంటిమని తెలియపఱచుట కానందించుచున్నారము. కావున జిజ్ఞాసువుల కిందు కనఁబడు సందేహములను దెలియజేసి మమ్ము కృతకృత్యులనుగాఁ జేయుదురుగాక!

# పునర్జన్మ

జీవాత్మ యీజన్మకు పూర్వ మింకొక శరీరమును ధరించి యుండెనని ప్రపంచకర్మలన్నియు ఋజువుచేయుచున్నవి. ఇందుల కుదాహరణము సాధారణ ఘటనలైన జీవన్మరణములే. ప్రప్రథమమున మృత్యువునుగూర్చి విచారించినచో తత్పూర్వపు జన్మ సిద్ధించును. ఇందులకు దృష్టాంతము మరణమనిన ప్రాణులన్నియు భీతిల్లుటయే. ఈ జన్మలో మరణానుభవమును పొందియుండక పోయినను, పూర్వజన్మయం దనుభవించి యుండుటవలననే ప్రతివానికి మరణమనిన భయము కలుగుచున్నదని మిక్కిలి స్పష్టముగా ఋజువగుచున్నది. మృత్యువును గూర్చి గమనించవలసిన రెండవవిషయము:- ఒకఁడు పసితనము నందును, మఱొకఁడువృద్ధాప్యమునందును మరణించుచున్నారు. మరణమందఱకును సమానముగా కలుగుటలేదు. ప్రపంచమున కారణములేని కార్యమెద్దియును జరుగుటలేదు. గనుక పూర్వజన్మకర్మల ననుసరించి జాత్యాయుర్భోగములు నిర్ణయించఁబడెనని తలంచవలసి వచ్చుచున్నది. జీవికాధారములను బట్టియు పూర్వజన్మయున్నదని తేటతెల్లమగుచున్నది. జీవనములలో మన మత్యంతవిషమావస్థను గాంచుచున్నారము. నానావిధ జన్మలు, పశుపక్షికీటాదులు, ఒకేజాతియం దవస్థాంతరభేదములు కలుగుచున్నవి. ఒకఁడు కడుబీదవానియింటియందును,ఒకఁడుమహారాజు గృహమునందును పుట్టుచున్నారు. యోగ్యతలయందు కూడ మిక్కిలి తారతమ్యము కనఁబడుచున్నది. ఒకతండ్రికి జనించిన యిరువురుపుత్త్రులకు ఒకేశిక్ష, ఒకేదీక్ష యొసఁగఁబడి సమాన-

పోషణ జరుగుచున్నప్పటికిని తుదకు భిన్నపరిణామ మేర్పడుచు న్నది. ఒకఁడు మహామూర్ఖుఁడుగాను, ఒకఁడు విద్వాంసుఁడుగాను నగుచున్నాఁడు. ఇంతియగాక కొందఱు పుట్టిన కొలఁదిసంవత్స రములకే మంచిసంగీతమును పాడుచుందురు. ఒక కవిని లేక గాయకుని ప్రశంసించుచు He is a born poet or a born genius or a born musician అని లోకు లనెదరు. ఇచ్చట జన్మ Born అనగా పూర్వజన్మ. పూర్వజన్మయందు సంపాదించిన యోగ్యతయొక్క ఆధారముతోనే యీజన్మలో నతఁ డతి శీఘ్ర ముగా విశేషయోగ్యతను పొందఁగలిగెనని తాత్పర్యము.

సాధారణముగా మనమందఱు మెఱిఁగిన విషయ మింకొ కటి కలదు. ఒకానొక అపరిచితవ్యక్తిని జూచిన తత్క్షణమే ఈర్ష్యాక్రోధములు జనించును. ఇంకొక అపరిచితవ్యక్తిని జూచిన సహజముగా ప్రేమాంకురము జనించును. Love at first sight and prejudice at first sight ఇత్యాదులన్నియు పూర్వజన్మ యందలి సంఘర్షణను తెలియజేయుచున్నవి.

ఒకఁ డాకారమునందు పురుషుఁడే, కాని చేష్టలందు, భావ ములందు స్త్రీవత్తు ప్రవర్తించుచుండును. ఇటులనే స్త్రీరూపము నందును పురుషహావభావములు వ్యక్తమగుచుండును. మఱియు నిదేవిధముగా భారతీయున కాంగ్లదేశమనిన ప్రీతియు, విదేశజు నకు నార్యావర్తమనినఁ బ్రేమకలుగుటయు చూచుచునే యున్నారము. ఇట్టి విషమావస్థలన్నియు పూర్వజన్మను సిద్ధ మొనర్చుచున్నవి.

## పూర్వజన్మ యెందుకు జ్ఞాపక ముండుటలేదు?

పూర్వజన్మను ఋజువుచేయవలయుననినచో నది జ్ఞాపక ముండకపోవుటయేగొప్పచిక్కు. వాస్తవముగా నొకానొకవస్తువు స్మృతిపథమునం దుండక పోయినయెడల దాని యస్తిత్వము లేనట్లు భావించవలసినదేనా? అట్లనుటకు వీలులేదు. పూర్వజన్మవఱ కెందుకు? ఈ జన్మలోనే మన కెన్నియో విషయములు పూర్తిగా జ్ఞాపకమునం దుండుటలేదు. కాని మనము వానియన్నింటి విషయమున సందేహించుచున్నామా? చిన్న చిన్నపిల్ల లనేకు లిపుడు విశేషావస్థలయందు తమ తమ పూర్వజన్మలనుగూర్చి చెప్పుచున్నట్లు వార్తాపత్రికలయందు చదువుచునే యున్నాముగదా! అదియుంగాక పూర్వజన్మ జ్ఞాపకముండక పోవుటకు పరమాత్మయొక్క అసీమకృపయే కారణము. యోనిపరివర్తనము ఆత్మసంస్కరణ కొఱకే జరుగుచున్నది. కువాసనలను కుసంస్కారములను ఆత్మనుండి దూరపరచుట మిక్కిలి కఠినమైనపని. ఇప్పటి శాసనావిధాన మీవాసలను తొలగించి బాగుచేయుట కేమాత్రమును పనికివచ్చుటలేదు. దొంగతనము చేయువాఁడు చట్టప్రకారము శిక్షితుడై జైలుకు పంపబడుచున్నాడు. అతఁడా విధముగా మాటి మాటికి జైలుకు పంపఁబడి మిక్కిలి గట్టిదొంగగా తయారగుచున్నాఁడేగాని అసలు దొంగతనమనునది యతని మస్తిష్కమునుండి దూరమగుటలేదు. అతడు జైలునందునుదానిని పూర్తిగా మఱువనిచో నా యలవాటు నశించఁజాలదు. పూర్వజన్మ జ్ఞాపక ముండకపోవుటచే మన కింకొక లాభముకూడ కలదు. ఈ జన్మయందలి తగ

వులనే మనము తీర్చుకొనజాలక పోవుచున్నారము. కనుక నిక వెనుకటి జన్మవిషయముల గుర్తుండియున్నచో వానికై యెంత యాపత్తి సంభవించునోగదా! ఒకడొకని యింటియందుజన్మించె ననుకొందము. అతనికి వెనుకటిజన్మలో నింకొకడు లక్షరూపా యలు బాకీయుండెనని తెలిసి యున్నచో నతఁ డాతనితో పోట్లాడఁడా? ఇటులనే యాలుబిడ్డల కొఱకుకూడ తగవులాడ వచ్చును. తఱచు చిన్నతనములో పూర్వజన్మమాటలు జ్ఞాపక మున్నప్పటికిని వానియందు పోట్లాడెడుశక్తి యుండుట లేదు. వాస్తవముగా మనకిది యొక మేలేకదా! అథవా ఏ యోగికో తెలిసియున్నను నతనియందు విరాగ, సంతోష, వివేకాదు లుండుటచే నతఁడు సాంసారిక పదార్థములకై తగవులాడుట కిచ్ఛగించఁడు.

## పరిణామవాదము - పూర్వజన్మ

యోనులన్నింటియందు నొకతారతమ్యము గలదని పరి ణామవాదులు తమ పరిశోధనలచే సిద్ధపఱచిరి. పరిణామ వాదము ననుసరించి బల్లి మొదలగునవి పరివర్తనముఁ జెందుచు పెద్ద పెద్ద పశువులై కోఁతిగా మారెననియు, కోఁతియే ఉన్నతి నొంది మనుష్యుఁడయ్యెననియు సిద్ధాంతము. పరిణామ వాదు లీ ప్రాణులన్నింటియొక్క నిర్మాణావస్థను, పరిశీలించి యం దొకవిధమైన సమానత్వమును కనుగొన వాటిశరీర నిర్మాణావశ్యకత ననుసరించి భేదమునుకూడ తెలిసికొనఁగలిగిరి. ప్రతికూల పరిస్థితియే పరిణామసాధనముగా నెంచబడినది. struggle for Existence leads[ to evolution అసలు వారి.

పరిశీలనవలన వాస్తవిక పరిణామము జీవునకు వానికర్మల ననుసరించి భిన్నభిన్న శరీరము లొసగఁబడెనని కాని, లేక జీవుఁడు నివసించుటకు వివిధతరగతులు గల యీ శరీరము లియ్యబడెనని కాని నిర్ణయము కావలసి యున్నది. ఈ ప్రపంచమునం దింజనీయరు కట్టెడు గృహములకు సామాన్య చిత్రపట మొకటి ముందుగా తయారుచేయఁబడును. అవసరమునుబట్టి అందు తిరిగి మార్పులు చేయుచుండును. ఇటులనే ప్రాణులన్నింటికిని శరీరమను సామాన్యసాధనమును ఈశ్వరుఁడొసఁగి అవసరముల ననుసరించి విశేషయోనుల భేదములను కల్పించెను. యోనిపరివర్తనము ఉన్నతినొంది బాగుపడుటకు సాధనమని రూఢియగుచున్నది. ప్రతికూలపరిస్థితి లేనిచో పరిణామము కలుగఁజాలదు. గాన దుఃఖమెందు కను సమస్యయు పరిష్కృత మగుచున్నది. ఈ ప్రపంచమును నిర్మించువాఁడు దయావంతుఁ డైనచో, పాలించువానికి దయయనునది యున్నయెడల జన్మమరణముల లంకె యెందుకుండును? కొట్లాట, తిట్లాట, పోట్లాట, అశాంతి మున్నగునవి యెందులకుండుచున్నవి? అని పరిణామవాదులగు నాస్తికుల యాక్షేపము. కాని యీ విధముగా నాక్షేపించువారు దుఃఖ ముండఁబట్టియే సుఖమునకు గౌరవము కలుగుచున్నదను విషయమును మఱచిపోవుచున్నారు. కండ్లులేనివానిని చూచుటవలననే కండ్లయొక్క యుపయోగము ప్రతీత మగుచున్నది. మృత్యువువలననే జీవనముయొక్క మూల్యము వృద్ధియగుచున్నది. ఉన్నతికి ప్రతికూల పరిస్థితి అత్యంతావశ్యకమై యున్నది. ఉన్నతిసాధనము లీయకుండఁగను, కర్మఫలితములను

ముట్టచెప్పకుండగ నున్నచో దేవుని కఠినత్వమని యనుకొన వచ్చును. జీవుఁడు కర్మచేయుటయందు స్వతంత్రుఁడు. ఫలిత మనుభవించుటయందు పరతంత్రుఁడు. వానివాని కర్మఫలితముల ననుభవించుట కొఱకే భిన్నభిన్న శరీరములను యోనులను సృష్టించెను. ప్రాకృతిక పరిణామముతో సంబంధ మున్నంతవఱకు పరిణామవాదము ఆవాగమనసిద్ధాంతమును బాగుగా పోషించు చున్నది. పాశ్చాత్య వైజ్ఞానికు లీపునర్జన్మయొక్క సృష్టిసిద్ధాంతము నెఱుగక పోవుటవలననే యిట్టిభ్రమలో పడిరి.

## పూర్వజన్మ విశ్వాసమువలన క్రియాత్మకలాభములు

దీని నొప్పుకొనినను నొప్పుకొనకపోయినను క్రియాత్మకజీవనమం దెట్టిధమైన ప్రభావము పడజాలదని యీసిద్ధాంతముయొక్క మాహాత్మ్యమును త్రోసివేయుటకు వీలులేదు. వాస్తవముగా మనజీవితమును సఫలీకృత మొనర్చుటకు దీనిపై — పూర్వజన్మపై — విశ్వాసముంచుట అత్యంతావశ్యకమైయున్నది. ఇందువలన కలుగులాభము లెవ్వియన?

(౧) దీనిపై విశ్వాసముంచుటవలన మృత్యుభయము దూరమగుచున్నది. ఏలయన పూర్వజన్మపై విశ్వాస ముంచు వాడు హాని లేక శరీరపరివర్తనముపై కేవలము మానవుఁడు జీర్ణములగు వస్త్రములు పరిత్యజించి నూతనవస్త్రము లేవిధముగా పరిగ్రహించునో అదేవిధముగా జీవుఁడు శిథిలములైన దేహములను వదలి నూతనములగు నితరశరీరములను ధరించునని తలంచును. గీతకూడ నిట్లే బోధించుచున్నది.

శ్లో॥వాసాంసి జీర్ణాని యథావిహాయ నవానిగృహ్ణాతినరోఽపరాణి
తథాశరీరాణి విహాయ జీర్ణా న్యన్యానిసంయాతి నవానిదేహీ॥
గీత. అ. ౨. ౨౨

(౨) మనల నధికముగా మృత్యుభయము పిటికిపంద లనుగా జేయుచున్నది. కావున పూర్వజన్మసిద్ధాంతముపై విశ్వాసముండి మృత్యుభయమే లేనియెడల పిరికితన మెచటనుండి వచ్చును? ఈవిషయమును సీజరు రోమనులలోని గోలనుజాతిని గూర్చి వ్రాయుచు నీవిధముగా వ్రాసెను. Caesar says about "Gaul 'They were brave because they believed in trans migration. "ఆవాగమన సిద్ధాంతముపై విశ్వాసముంచుటవలననే అజాతివీరులుగా నుండగలిగిరని నుడివెను."

Gibbon says about Dasians. To the strength and fierceness of barbarians they added a content for life which was derived from a warm pursuasion of the immorality and transmingration of soul.

"గిబ్బను; డేసియను మటియొక రోమనుజాతినిగురించి ఇతిహాసము వ్రాయుచు" "ఆత్మయొక్క నాశరహిత పునర్జన్మలపై విశ్వాసముంచుటయే వారి బల, పరిశ్రమలకు ముఖ్యకారణము"ని నుడివిరి.

(౩) సార్వజనిక ప్రేమకుకూడ నీ సిద్ధాంతమే ఆధారము. మనము ప్రేమించవలసినచో వాస్తవముగా ఈసిద్ధాంతము వలననే మనయందు ప్రేమభావ మంకురించగలుగుచున్నది.

"ఆత్మవత్సర్వభూతేషు" అను నీ వేదవాక్యము ఈ సిద్ధాంతమువలననే సఫలీకృత మగుచున్నది. పశువులయందును,

వనస్పతులయందును, మన ఆత్మవంటి యాత్మ యొకటి యున్న దనుభావము మనహృదయములందు జనించుచో మన మెన్నటి కిని వానిపై నత్యాచారము లొనర్చుటకు సాహసించలేము. కాని సంకుచితభావము మనహృదయమునందు జనించినచో నీ సిద్ధాంతముపై విశ్వాస ముంచజాలము. ఇప్పటికిని పశువులయందును స్త్రీలయందును,తమఆత్మవంటి యాత్మ యొకటి యున్నదను సిద్ధాంతము నొప్పుకొననివారు యూరప్పులో కొందఱున్నారు.

(౮) ఈ సిద్ధాంతముపై విశ్వాస ముంచినచో మాంస భక్షణ నిషేధముకూడ జరుగఁగలదు. ఎటువంటిమూర్ఖుడైనను, నరమాంసముఁ దిననొల్లడు. ఏలయన నతడు వారియందు సమానత్వమును పొందుచున్నాఁడు. పశువులు మనకంటె భిన్న మని తలంచినపుడే మనయందు మాంసభక్షణ విచారము పుట్టుచున్నది.

There sprang up in Empedocles from the belief in transmigration of soul a dislike to flesh as food. Calcutta revised Vol. IXII a 97.

కలకత్తారివ్యూ ౬౨ వ భాగముయొక్క ౯౭ వ పుటలో ఎంపీడొక్లీజునిగురించి యీవిధముగ వ్రాయబడియున్నది. "ఆ వాగమన సిద్ధాంతము ననుసరించియే అతనికి మాంసభక్షణ మునిన నేవగింపు జనించినది."

ఫ్రాన్సుదేశపు సుప్రసిద్ధతత్వవేత్త (Voltaire) వాల్టేర్ ఆవాగమనముపై విశ్వాసము భారతవర్షమునందలి భౌగోళిక, ఋతువుల యాధారముపై నున్నదని ఋజువుచేయుచు

నీ విధముగా నుదహరించిరి. (౧) India is hot భారతవర్షము ఉష్ణదేశము. (౨) Therefore meat eating is injurious. కావున మాంసభక్షణ హానికరము. (౩) Thus prohibited. కనుక నిషేధించబడెను. (౪) This created an affinity between man and animals కావున మానవులయందును. పశువులయందును సమానత్వము నెలకొల్పబడినది. (౫) This created an idea that the soul of man also takes birth in animals. కావుననే మానవునియందున్నటువంటి ఆత్మ పశువులయందును గలదను భావము జనించెను.

పరిణామవాదు లేది యూహించినను తలక్రిందుగనే యూహించెదరనుట కీ వాక్యములు ప్రబలప్రమాణములు. వాస్తవికవిషయ మేమన - ఆసిద్ధాంతానుసారమును వైదికశిక్ష ననుసరించియు మాంసభక్షణము నిషిద్ధమై యుండెను. కాని వాల్టెర్ (Voltaire) ఒకదాని కింకొకటి తలఁచెను.

## సదాచారమునందు సహాయము దొరకుచున్నది

(౫) పునర్జన్మ భయపాపకర్మ లొనర్చుటలో నధిక బాధాకరము. పాపమునుండి తప్పించుకొనఁగలమను భావము మనయందు జనించనిచో పాపము చేయవలయు ననెడు తలంపు కలుగనే కలుగదు. అత్యంత భోగవాదము ప్రచలితమైనప్డే పునర్జన్మయందు విశ్వాసము లేకుండ పోవును. అథవా:—ఈసిద్ధాంతముపై వాస్తవిక లేక క్రియాత్మక విశ్వాస ముండువఱకు భోగవాదము మర్యాద నతిక్రమించఁ జాలదు. దీనికి రెండు సుప్రసిద్ధోదాహరణములు గలవు. వామమార్గము ప్రచలితమై యున్నపుడు ఆత్మ అనిత్యమనియు, నది శరీరముతో పాటు భస్మీభూతమగుననియు విశ్వసించుచుండెడివారు. కావుననే వారి యందు పాపవాసనలు నిరంకుశపరిపూర్ణములై మెలఁగినవి. ఇప్పటి పాశ్చాత్య ప్రకృతివాదుల స్థితికూడ నిదియే. సదాచారముకొఱకు దండనావిధాన మత్యంతావశ్యకము. అందు పునర్జన్మ అత్యుత్తమమైన దండనావిధానము.

(౬) మన కీజన్మలో చేసికొనిన సత్కర్మల ఫలితము లభించకుండ పోయినను ముందుజన్మలో మన కవి తప్పక ఫలించి తీఱు ననెడు విశ్వాసము, ఆశ కలుగును. అందువలన సత్కర్మల నాచరించుట యందు ఉత్సాహహీనులము గాము.

(౭) దీనివలన నాత్మహత్యకూడ నాపఁబడఁగలదు. జీవన సంగ్రామమునందు తటస్థించు దుఃఖములనుండి విముక్తి పొందవలయు ననెడు భావముతోనేగదా ఆత్మహత్యలు జరుగుచుండుట. కాని ఆత్మహత్య చేసికొనువానికి

మన మీఁద దుఃఖరూపముగా ననుభవించుచున్నామో ఆకర్మఫలి
తమును మఱియొక జన్మయందైనను తప్పక అనుభవించి తీఱ
వలసి వచ్చుననెడు దృఢధారణ యున్నచో నాత్మహత్యచేసి
కొనవలయు ననెడు కోరిక మనస్సులోనైనను పుట్టదుగదా?
ఈ సిద్ధాంతముపై వ్యావహారికరూపముగా విశ్వాసములేని
దేశములలో నాత్మహత్యలసంఖ్య అత్యధికముగా నున్నది.

(౮) మానసికశాంతి లభించుచున్నది. మనమొక
లక్ష్యము నుంచుకొని శక్తి వంచన లేకుండ పనిచేసిన యెడల
సఫలీకృతులము కాఁజాలనపుడు మనయందు పెద్ద నిరాశ జనించి
దుఃఖితుల మగుదుము. ఒకవేళ సంతోషము లభించుచో మన
పూర్వజన్మ కర్మఫలితమువలననే యెంత పాటుపడినను పని నెర
వేరలేదని యనుకొనుటవలననే గదా! లభించకలుగునది. బంధు
మిత్రుల మరణసమయములందు సంతోషమును కల్గించుటకుకూడ
నిదియే సర్వోత్తమమైన యుపాయము, సిద్ధాంతమునై యున్నది.

(౯) దీనివలన ఆస్తికత్వమునందు సత్యమైన విశ్వాసము
కలుగును. ఈశ్వరుని న్యాయప్రియత్వము, దయ, దీనివలననే
బాగుగా ప్రకటిత మగుచున్నవి. ప్రపంచమందలి వైషమ్యము
లకుఁ గూడ నిదియే సరియైన సమాధానము చెప్పఁగలుగుచున్నది.
చేతన జగత్తునందు న్యాయమొనర్చుట, ఫలప్రదానము సేయుట,
కర్మల ననుసరించి వానివాని వ్యవస్థల నేర్పాటు చేయుట
మున్నగునవన్నియు దేవుని స్వాభావిక గుణకర్మలు. ఈ చక్ర
మున దేవునిసత్తా బాగుగా ఋజువగుచున్నది.

(౧౦) పరోపకార మొనర్చుటకుఁగూడ నుత్సాహము
పుట్టుచున్నది. దీనియాధారము మీఁదనే మన ఆచరణములను

బాగుచేసికొనుటయే కాక పరోపకారము చేయవలయు ననెడు భావముకూడ పుట్టుచున్నది. ప్రతిప్రాణిని తనవలెనే తలంచుచో మానసికప్రేమ లుత్పన్న మగుటయే కాక యితరులకు మేలు చేయుటకుఁగూడ సంసిద్ధుల మగుదుము.

(౧౧) ప్రపంచపు పాపవాసనల ప్రవేశసమస్య కూడ తేలిపోవును. ఇపుడు విచారశీలు లందఱకును (Evil) పాపము ప్రపంచమునం దెచటనుండివచ్చిన? దనునదియే అత్యంతావశ్యకమైన ప్రశ్నమై యున్నది.

కొందఱిపాపపు టుత్తరదాయిత్వమును ఈశ్వరునిపై రుద్దుటకు వెఱచుచు సైతాను, మాయ, అను స్వతంత్రశక్తి నొకదాని నెలకొల్పుచు నీసుఖదుఃఖసమస్యను వర్తమానజన్మతోనే తేల్చ ప్రయత్నించు చున్నారు. పాపము వారికి వర్తమాన సుఖదుఃఖముల కేదియు ప్రత్యక్షకారణము కనఁబడక పోవుటచే నీచెడుగంతయు దేవునివలన కాదుకాదు, ఇంకొకశక్తి ద్వారా కలుగుచున్నదని చెప్ప సాహసించుచున్నారు. వాస్తవిక కారణము ప్రత్యక్షముగాఁ గనఁబడకుండ సుఖదుఃఖముల ననుభవించుచున్నారన నవి పూర్వజన్మముయొక్క యవశిష్ట కుత్సిత కర్మల ఫలితమని పునర్జన్మ వాదము స్పష్టపఱచుచున్నది.

ఈ పునర్జన్మను గుఱించి యింక నధికముగ వివరించు టావశ్యకమని ప్రతీత మగుచుండినను గ్రంథవిస్తర భీతిచేఁగాక రాబోవు 'ఆత్మ' యను గ్రంథమునం దశేషముగా వర్ణించ నుంటిమి. గాన నింతటితోనే విరమించుచుంటిమి.

# పర్యాలోచనము

విజ్ఞపాఠక మహాశయులారా! గ్రంథము నింతవఱకు పరిశీలించియే యుంటిరి. గ్రంథవిస్తరభీతిచే విషయమును పర్యాలోచన మొనర్చుచు నుపసంహరించుచున్నాగము. శ్రద్ధతో దీనిగూఢం దిలకించి స్వాత్మప్రియ సిద్ధాంతమును జేపట్టి తత్ప్రచారమునకై కడంగెదరుగాక! సందేహము లున్నయెడల వ్రాతపూర్వకముగాం దెలియంజేసిన యథాశక్తి సమాధాన మీయ ప్రయత్నింతుము.

కారణములేని కార్యమెద్దియును జరుగజాలదని పరిణామవాదులగు నాస్తికులు తమ తమ గ్రంథములందు నిరూపించి యుండిరి. ఈ ప్రపంచమునకు నెవ్యులా (అగ్నిమయపిండము) లనబడు వస్తువెద్దియో మూలకారణమని భౌతికవాదులు తమ యసమర్థతను మరుఁగుపఱచ ప్రయత్నించిరి. కాని యా నెవ్యులాలకు కారణముండెనా? లేదా? అని ప్రశ్నించుచో స్వయముగా పుట్టినవనిన ప్రాగభావముచే గోచరించుటయే గాక కారణము లేకుండగనే పుట్టినవని కార్యము స్వీకరించఁ జాలనిదిగా నున్నది. అవి యటులనే కారణరూపములుగా వచ్చుచున్నవనినచో నెప్పటినుండి వచ్చుచున్న? వని మరల సవాలు చేసినపుడు, అనంత అనాదికాలమునుండి యని యందురా? ఐతే అంత అనాదికాలమునుండి పరిణామము జెందలేక వీ రూహించుచున్నట్లు కొన్ని వందల, కోట్ల సంవత్సరములనుండి మాత్రమే యెందుకు పరిణమించుచున్నదను కఠినపరీక్ష నెదుర్కొనుచున్నది. కావున గొప్ప గొప్ప వైజ్ఞానికుల కీది

యుందోచక విజ్ఞానము How ఏలాగు? అను ప్రశ్నకు సమాధా నమే గాని Why ఎందుకు? అను దానికి సమాధానము కాజా లదని నొక్కి చెప్పుచున్నారు. విశ్వరూపాది గ్రంథములందు జేమ్సు, జీన్సు వంటి బ్రహ్మాండ పారదృశ్వుల మతానుసారము ఖగోళ పిండములన్నియు దమ తమ శక్తిని గోల్పోవుచున్న వనియు, నెప్పటికైనను ప్రళయము తప్పక తటస్థించునపియు నిరూపించc బడినది. పరిణామవాద వృద్ధి లయ ముఖమెందుకు బట్టునో భౌతికవాదులు హేతూదాహరణ ప్రమాణములతో సర్వతంత్ర సిద్ధాంతమును నిర్ణయించc గలుగుదురా? ఆత్మ పరమాత్మల నొప్పుకొన నంతవఱకును వైజ్ఞానికులు చెప్పెడి దానిలో మహాలోపము లనేకము లుండితీఱును. ఆత్మవాదులు కానంతవఱకు నెందు? కనెడి యగాధ ఖాతకము చుట్టుముట్టి నను "ముందుచూచిన గోయి, వెనుకచూచిన నూయి" యన్న టుల గోచరించును. ఎవcడైన సాహసికుcడు లంఘింప సమకట్టి నను దరిజేరcజాలcడు. పైకి ఆగోతులను పూడ్చినటుల నటిం చును. కాని యీ అనంత కాలములో నా గోతులను పూడ్వ బోయి యెందఱు పూడ్చిపెట్టబడిరో అనూహ్యము కదా! కావుననే భర్తృహరికూడ

"భోగానభుక్తాః వయమేవభుక్తాః"

అని మిక్కిలి చక్కగా లక్షించి యుండెను.

ఆస్తికులు క్రమవికాసమును స్వీకరించెదరు. సృష్టి స్థితి లయములకు కర్త యొకcడుండి యనంతములగు నిత్యమైన జీవుల యుద్ధరణకై క్షేత్రమును కల్పించి సహాయ భూతు డగుచున్నా

డని చెప్పెదరు. ఆతని నియామకమునం దనాదులైన ప్రకృతి జీవాత్మలు ప్రవర్తిల్లుచున్నవి. వానిగుణకర్మ స్వభావములకు భేదముగాని, బలవంతముగాని చేయక సంసార సాగరమును తరింపజేయు సత్యోత్తమ పద్ధతు లవలంబింపఁబడి యున్నవి. కనుక ఈశ్వర, జీవ, ప్రకృతు లనాదులనియు, వానిగుణములు,కర్మయు, ననాదినుండియు నవినాభావ (సమవాయ) సంబంధముతో నున్నవనియు, తదనుసారముగా సృష్టి, ప్రళయము ప్రవాహరూపములుగ న నాదులనియు, జవాబుచెప్పి అనాశ్రియ - అనవస్థా దోషములను నిరాకరించెదరు.

పరిణామవాదులగు నాస్తికులు - "రెండుజాతుల కలయికచే మూఁడవ క్రొత్తజాతి పుట్టును. ఇటులనే ప్రపంచమునందలి జాతులన్నియు వికసించినవని" విశేష సంస్కారములచే మార్పుచెందిన లేక చేయబడిన గుణమో, రూపమో, కలిగిన వృక్షాదుల నుదహరించి స్వసిద్ధాంత పోషణకై భగీరథ ప్రయత్నము లొనర్చెదరు.

ఆస్తికులగు వైదికులు వేదశాస్త్రరీత్యా "సమాన ప్రసవాత్మికాజాతి" యను న్యాయశాస్త్ర సూత్రానుసారము సమాన ప్రసూతి ప్రతిపత్తులు కలవే జాతిశబ్దార్థము లైనవనియు, సంతతి శబ్దమే బాగుగా వృద్ధిని ఎడ తెగని సంబంధము నుత్పన్నము చేయునదని సూచించు చున్నదనియు, ఈ నియమము ననుసరించి హో, ఎస్కిమో, సేమిటక్, నీగ్రో, మంగోలియన్, ఆర్యన్, ద్రావిడియన్, అనిమానవులలో కల్పించఁబడిన జాతులన్నియు, మిథ్యాజన్యములని, చెప్పుచు మానవులందరు నొకేజాతివారనియు

ప్రపంచ సంఘటనకై పాటు పడవలయుననియు ప్రచారమొన
ర్చెదరు. విశేష సంస్కారములచే నాయాజాతులందు విశేష పరి
వర్తన మొందిన నొందవచ్చును గాని బీజమే మాఱిపోదని
యు, రెండుజాతుల కలయికచే పుట్టు జాతి సంతతి రహితమై
ఒకేతరములోనే నశించిపోవుననియు, నూతన జాతిగా పరిణమింప
దనియు నందుకుదాహరణముగా కంచరగాడిద, మ్యూజియము
లలోని పులి, సింహములనుచూపెట్టుదురు. మఱియు వంధ్యా
త్వము ప్రపంచమునందలి భిన్నజాతులను రుజువుచేయుటకు ప్రి
బల ప్రమాణమనియు నుడివెదరు. వృక్షములలోగూడ నంటు
మొక్కలకు కాయుగింజలు నాటిన తల్లిచెట్టు గుణములబ్బక
పూర్వమంటుగట్టిన చెట్టుయొక్క గుణములేయబ్బుచున్నవికదా!
లూథర్ బర్బ్యాంక్ కూడ నెక్కుడు మార్పులకుఁదీసికొని రాబ
డిన వృక్షసంతతి తల్లిదండ్రులకంటె, తాత ముత్తాతల గుణము
లను బొందుచున్నదని వ్రాసి యుండెను గదా!

పరిణామవాదు లగు నాస్తికులు ప్రతివస్తువును చేసిన
వాఁడు ఎవఁడో యొకఁడుండుచున్నాఁడు. కాఁబట్టి అట్లే ప్రపం
చానికి కూడా ఎవఁడో ఒకఁడు కారణముఉండాలి, అని తార్కిక
సిద్ధాంతము, అయితే ఆ సూత్రమే ఆ దేముఁడికి కూడా కారణము
చూపించవలసి వచ్చును. ఆ ప్రకారము ఎంతలెక్క బోయినను
దానికి అంతములేదు. "చెట్టుముందా, విత్తుముందా" అన్నట్లు
అని ఆస్తికులను నిరుత్తరులుగా నొనర్చివేసితిమని గర్వించుచు
పరిహాసించెదరు.

తర్కమును గౌరవించు ఆస్తికులు నిర్భీతితో — కార్య
కారణములలో నొకదానినిబట్టి రెండవది యనుమానింపఁబడు

చుండును. ఆస్తిక నాస్తికులందఱు నీ నియమములను స్వీక
రించియే ముందడు గిడుచున్నారు. ఏదైననొక కార్యమునుండి
రెండవకార్యము పుట్టిన పుట్టవచ్చును. ఆ నూతన కార్యమున
కది కారణము కావచ్చును అంతమాత్రము చేత మొదటిదాని
కార్యత్వము నశించి సదాకారణరూపముగా నుండదని గ్రహించ
వలయును. ఒక మొద్దు యొక్క కార్యము బల్ల కావచ్చును.
ఆ బల్ల బీరువా కార్యముగా మారవచ్చును. అంతమాత్రము
చేత కారణము లేకుండ కార్యమగునని భావించుట సత్యసిద్ధాం
తము కాఁజాలదు. ఒకే వస్తువు కార్యకారణములు అనగా
కార్యరూపముగానున్న దానికి కారణ మదియే కాఁజాలదు
కారణమన కార్యమునకు ముందుండునది. మూలకారణమునకు
కారణ ముండనేరదు. సూర్యుని చూపించుటకు కాగడా కావ
లసి యుండునా? రూపగ్రాహియగు కన్నును చూచుకొనుటకు
మనము వేఱొకకన్ను కావలయు ననుచున్నామా? కావున
తర్కము ననుసరించి కార్యకారణ భావములతో భగవంతుఁడు
నిర్ణయింపఁబడు "చున్నాఁడు. ఇక చెట్టుముందా? విత్తుముందా?
యను సమస్య" ఆస్తికులకంటె నాస్తికులనే యెక్కువగా పీడిం
చును. ఎట్లన - మనము పూర్వమునుండియు నాయా బీజముల
కా యా మొక్కలు పుట్టుట ప్రత్యక్షముగాఁ గాంచుచునే
యున్నారము. కాని యేదిముందు? అను ప్రశ్నకు ప్రత్యుత్త
రము వారేమిచ్చెదరు? ఎప్పుడో అజ్ఞాతకాలమున వేఱువేఱు
జాతులనుండి వేఱువేఱు వృక్షములు పుట్టెనని జవాబొసఁగి
ఆత్మను శాంతపఱచు కొనుటకు ప్రయత్నించెదరా? అట్టు లని
నను ఆ మూలభిన్న జాతులకుకూడ నేదిముందు? అను ప్రశ్న

అంటుకొనును. ఈ విధముగ వారి నీ సమస్య ఊపిరాడనీయదు. కావుననే జిత్తులమారులగు నాస్తికులు కార్యకారణ సంబంధమైన ప్రశ్నయే తప్పని తమ ముప్పును వారించుకొన దుస్సాహస మొనర్చెదరు. వారి యీ యజ్ఞానమునకై యాస్తికులు చింతిల్లుచు కార్యకారణ దృష్టితో గూడ నేదిముందు? అను ప్రశ్న నిరుత్తరమైనది. కాజాలదు. విత్తును బీజమందురు. బీజము, కారణము పర్యాయవాచక శబ్దములుగాన బీజమే, (విత్తే) ముందని కుంటువోని ధైర్యముతో నెలుంగెత్తి చాటెదరు.

నాస్తికులు "మానవుఁడు సర్వోత్తమ ప్రాణియైనను క్రమశిక్షణ నొంది యితర పశుపక్ష్యాదులనుండి శబ్దాక్షరముల గ్రహించి భాషను పుట్టించుకొనెనని" తడవుగాన కుండగనే చెప్పెదగు.

కాని ఆస్తికు లటులనక "నేర్పుకొననిచో భాషయబ్బదను" ననుభవపూర్వక తర్కముపై నాధారపడి మానవజాతికి నాదిమనుష్యులకు నీశ్వరీయజ్ఞానము లభించినదనియు, దాని నుండి సమస్తవిద్యలును వ్యాపింప జేసిరనియు, ఘంటాపథముగాఁ జాటెదరు. మఱియు పశుపక్ష్యాదులనుండి యుత్తమ సభ్యతా చిహ్నమని చెప్పబడు భాషను గ్రహించిన మానవుని శ్రేష్ఠత్వ మెంతపాటిదనియు, పశుపక్ష్యాదులలో మానవుని వలె స్ఫుటాక్షరముల నేవి పలుకుచున్న? దనియు వీరు వాని నుండి నేర్చుకొనిన నవియెచటనుండి నేర్చుకొని యుండె? ననియు ప్రశ్నింతురు.

నాస్తికులయిన భౌతికవాదులు, ఏక దేశీయులును, అల్పజ్ఞులునగు కొందఱివ్యక్తుల యాజ్ఞలను సర్వసమ్మతమని భావించి వానికి లోఁబడి యుండవలెననెదరు.

ఆస్తికులు సర్వజ్ఞుఁడును, సర్వవ్యాపకుఁడును, తన కార్యములన్నిటిని దానే చక్కఁబెట్టుకొనఁగలుగు సర్వశక్తిమంతుఁడు నగు నతని యధీనముఁదుండ వలయునని "వయం ప్రజాపతేః ప్రజా అభూమ" యను వైదిక ప్రార్థనను స్మరించుచుందురు.

ప్రాణులన్నింటికిని కష్టసుఖములు, జన్మమరణ దుఃఖము లొక్కటే యగుచుండ తద్వ్యతిరిక్తముగా కేవల మొకమానవుని విలాసమయ జీవిత నిమిత్త మితర ప్రాణులు లెక్కలోనివి గావని నాస్తికులనెదరు.

సర్వప్రాణులలో జ్ఞానము కలిగి మానవుఁడు శ్రేష్ఠుఁడనఁబడుచు బాధ్యతవహించి యున్నాఁడనియు, నాతఁడు కేవలము తన సమాజ స్వార్థములనే కాక సర్వప్రాణులకు హిత మొనర్చ వలయుననియు ఆస్తికుడు చెప్పును.

ప్రపంచమానవుల సుఖములకు: ఉన్నతావనతులకు' నొక్క రాజులేక రాజ్యతంత్రము బాధ్యతవహించ వలయునని నాస్తికులు పరముఖాపేక్షితు లయ్యెదరు.

రాజు, రాజ్యతంత్రము ప్రజలచే నిర్మింప బడునదిగాన ప్రజలు నిష్కల్మష హృదయులై పరోపకారులై యుండవల యుననియు, దీనికి సర్వగుణసంపన్నుఁడు న్యాయకారియునగు పరమాత్మ ఆదర్శముగాన నతనిని స్మరించవలయు ననియు,

పటులొనర్చిన నెన్నటికిని లోటురాకుండ ప్రవర్తించగల సూత్రోపాయములు స్ఫురించగల వనియు పురుషార్థపరులగుటకు ఆస్తికులు ప్రయత్నించెదరు.

పరిణామవాదులగు నాస్తికులు సృష్టిని పరిశీలించి పరిణామ క్రమమును అనుభవము చేసికొని మానవోన్నతికి సక్రమమార్గములను పొందగలుగుదుమని, యిప్పటి రాజకీయ పరిస్థితులను దృష్టిపథమునం దుంచుకొని యుపదేశింప సమకట్టెదరు.

కాని పరిణామవాదమును పరిశీలించిన వైదికాస్తికులు పరిణామ వాదమున "నోరుగలవానిదే రాజ్యమనియు, బలముగల వానిదే జీవనమనియు, బలహీనునకు బ్రతుకుం దెరువులేదనియు" తెలియుచున్నది. గాన మానవోన్నతికి నే విధముగను సహాయపడ జాలదని నుడివెదరు. వాస్తవముగా దానిని రాక్షస వాదమని చెప్పవలయును. అట్టి వాదమును దృష్టియం దిడుకొని మానవసంఘ మెవ్విధముగను రాజకీయోన్నతిని బడయఁజాలదని నుడువుచు సుప్రసిద్ధ రాజకీయ వేత్తయగు పండిత జవహారులాలు గారి వాక్యములలో నీ వాదముయొక్క దుష్పరిణామము నీ విధముగ నుదహరింతురు.

"ఈ సిద్ధాంతమువలన వారి యుచ్చత్వమున కొక గొప్ప ప్రమాణము లభించెనని వారికి గట్టి విశ్వాసము కలిగెను. జీవన సంఘర్షణమున వారందఱికంటెను మిక్కిలి యోగ్యులని ఋజువయ్యెను. గాన శేషించి యీ విధముగా ప్రాకృతికపు టెన్నిక వలన ( Natural Selection ) పైకివచ్చి శాసకవర్గమై పోయెను.

ఒకవర్గము రెండవవర్గముపై, ఒకజాతి రెండవజాతిపై ప్రభుత్వమును పొందు పక్షమునం దిదియొక ప్రమాణ మైపోయెను. సామ్రాజ్యవాదులు శ్వేతజాతులు అందరికంటె శ్రేష్ఠులను నధికారమున కిది యంతిమ ప్రమాణమై పోయెను. పాశ్చాత్త్యు లనేకులు వారితరులమీఁద నెంత బలమును అధికారమును చూపుదురో, ఎంత నిర్దయులై మెలంగెదరో అంత యధికముగా మానవరూపమునందు వారి వెలయుగౌరవము నభివృద్ధినొందునని తలంచసాగిరి.”

పరిణామ వాదులగు నాస్తిక రాజకీయవేత్తలు:— కొందఱు దేవుఁడను నెపముతో విద్యావిజ్ఞానములేని ప్రజానీకమును మోసపుచ్చి, వట్టపగలే బహిరంగముగా దోఁచుకొనుచు మానవ సంఘమును అధోగతి పాలుచేయు చున్నారు. గాన సంఘమునందున్న అంధవిశ్వాసముల కాకరమైన దేవుని, మతమును, నిర్మూల మొనర్చినచో మానవ సమాజమునకు విముక్తి, మోక్షము లేదని తహాతహా లాడుచు పండ్లు పటపట కొఱుకుచు బల్లలు పగులఁగొట్టెదరు.

కాని వైదికాస్తికులగు రాజకీయ వేత్తలు తమ సహాయోగుల తత్తఱపాటునకు, అదూరదర్శిత్వమునకు నగుచుచు ప్రేమతో, “నిజమే విద్యావిజ్ఞానముల యభావముచే స్వార్థులగు దోఁపిడికాండ్రు సమయానుకూలముగా ‘ఒక్క దేవుఁడు’ మతముఅను పేరుతోనే కాక రాజకీయ రంగముల పేరుతో కూడ దోఁచుకొనుటకు వెనుకంజ వేయరు. అట్లు జరుగుచునే యున్నది. కావున ప్రజల శోచనీయ పరిస్థితిని బాగుచేయ వలయుననిన వారికి విద్యా విజ్ఞానాదుల బోధించి నిజమైన దేవుని,

అస్తికత్వమును, మతమును, స్వబుద్ధితో కనుగొని వ్యవహరించెడు వారిగా నొనర్చుట బుద్ధిమంతుని కర్తవ్యముగాని అట్లుగాక మొదటనే "రోగ మొకటియైన మందొకటి వేయదలంచుట" వేయుట వివేకము కాజాలదని" శాంత వచనములతో హెచ్చరించు చుందురు.

పరిణామవాదులగు నాస్తికులు స్థూలముగా చూడగలిగిన సామ్యధర్మముల నాధారముగా జేసికొని తమ మనః కల్పిత వాటికను పోషించుకొనుటకై ముందడుగు వేయుదురు. అందు ప్రతిఘటించ తరముగాని లోపములున్నను వారి స్వసిద్ధాంతవ్యామోహము లుచ్ఛృంఖలములని సరిపెట్టుకొనుటలోనే తృప్తి యని బోధించును. నిజమే. కాకిపిల్ల కాకికి ముద్దుగాకపోయిన మరెవరికి ముద్దు ?

ఆస్తికులు సాధర్మ్యము సకలవస్తువుల కుండవచ్చును గాని అందువాని వ్యక్తిత్వమును దెలియజేయు వైధర్మ్యము లున్నవని నుడివెదరు. వానిని పవిత్రబుద్ధియే గ్రహించకలుగును. కనుక సాధర్మ్యాధిక్యముచే వైధర్మ్యమును పాటించకుండుట వివేకము కాజాలదనియు, ఉన్నతికి మహానిరోధమనియు నొక్కి చెప్పెదురు. వేదముల కుపాంగముగా నెంచబడిన వైశేషిక దర్శనము సాధర్మ్య వైధర్మ్యములను తెలిసికొనిన మోక్షసిద్ధిని బడయగలుగుదురని చెప్పుచున్నది.

"ధర్మవిశేషప్రసూతా ద్ద్రవ్య గుణ కర్మసామాన్యవిశేష సమవాయానాం పదార్థానాం సాధర్మ్య వైధర్మ్యాభ్యాం తత్వజ్ఞానా న్నిశ్శ్రేయసమ్. వై. శే. అ. ౧. ఆ. ౧. సూ. ౪॥

నాస్తికులు హేతు - తర్కవాదముల నాక్షేపించెదరు. కాని నైయాయికసూక్ష్మ వీక్షణములతో హేత్వాభాసముల నుదాహరింప నడుములు బిగింతురు.

తర్కము నెదిరింప సమకట్టినివాదములు కుంటివాదములనియు, ఈశ్వర రచనయగు సృష్టిని తెలిసికొనఁగోరిన ఈశ్వరీయ జ్ఞానమగు వేదమే సర్వతంత్ర గ్రంథము కావలయుననియు "బుద్ధిపూర్వా వాక్యకృతిర్వేదే" యని తత్త్వజ్ఞులు నిర్ణయించిరి. కాన నసంభవ, అభూత, కల్పనలకు వేదములందు తావులేదనియు, వేదములను పరమప్రమాణముగా నెంచిన మనువు "యస్తర్కేణానుసంధత్తే సధర్మం వేద నేతరః" అని నుడివెను గాన తర్కమువలన అనుసంధానమొనర్చువారే ధర్మవేత్తలు కాఁగలరనియు, నితరులు కాఁజాలరనియు, తర్కనిర్ణీత సిద్ధాంతముల కగ్రస్థాన మిచ్చుటకు ఆస్తికులు వెనుకాడరు. కావుననే తర్కశాస్త్రము వేదముల కుపాంగముగా నెంచఁబడినది.

పరిణామ వాదులగు నాస్తికులు ప్రాణుల దీర్ఘకాలపు జీవిత సంఘర్షణములో నవసరానుకూలముగా నూతనావయవ సృష్టియు, నిరుపయోగమును, అనవసరమునైన యంగములు విలీనములైనవని సృష్టిలోని తారతమ్యములను సమన్వయ మొనర్చుకొనుటకు భగీరథ ప్రయత్నము లొనర్చెదరు.

ఆస్తికులీ తారతమ్యములను, ౮౪ లక్షల యోనుల భేదములను వానివాని పూర్వజన్మలయం దనుభవింపక శేషించియున్న వివిధకర్మల ఫలితముల ననుభవించుటకు వేఱువేఱు సాధనము (శరీరము) ల న్యాయకారి యగు పరమాత్మ

